# సూచీపత్రము.

# విజ్ఞాపనము.



హిందువుల యాచారవ్యవహారములను నిర్ణయించెడి గ్రంథములు స్మృతులని పిలువబడుచుండును. మనుస్మృతి, యాజ్ఞ్యవల్క్యస్మృతి, కాత్యాయనస్మృతి, నారదస్మృతి, బృహస్పతిస్మృతి, పరాశరస్మృతి, వ్యాసస్మృతి, వశిష్ఠస్మృతి, శంఖస్మృతి, అత్రిస్మృతి, వృద్ధగౌతమస్మృతి, విష్ణుస్మృతి, హారీతస్మృతి, ఔశనస్మృతి, ఆంగీరసస్మృతి, యమస్మృతి, లిఖితస్మృతి, దక్షస్మృతి, శాతాతపస్మృతి, సంవర్తస్మృతి, ఆపస్తంబసూత్రములు, గౌతమధర్మసూత్రములు మొదలుగా ముప్పదియారువరకు స్మృతులిప్పుడు ప్రచారములో నున్నట్లు కన్పట్టుచున్నది.

సామాన్యముగా స్మృతులు ఆచారకాండము, ప్రాయశ్చిత్తకాండము, వ్యవహారకాండము, అని మూడుభాగములుగానుండును. మానవుడు జన్మించినది మొదలు ఆమరణాంతమును దంతధావనము మొదలుగ యజ్ఞయాగాదులవరకును అనుదినమును చేయవలసిన కర్మలనుగూర్చి ఆచారకాండమును ఆకర్మలు యథావిధిగ చేయకపోయినచో దానికి విధించినప్రాయశ్చిత్తమునుగూర్చి ప్రాయశ్చిత్తకాండమును చెప్పుచుండును. దేశకాలపాత్రములననుసరించి, ఇందుకొన్ని యిప్పుడు అనుపయోగముగను అనర్థముగను గాన్పించినను మొత్తముమీద దేహమనోదార్ఢ్యములను సమకూర్చి మానవుల యభివృద్ధికి దోడ్పాటుగానుండుటకే ఈస్మృతులు రచింపబడినవని వాటిని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించినవారికి గోచరింపకపోదు ఆచారప్రాయశ్చిత్తకాండములతో మన కీగ్రంథమున ప్రసక్తిలేదు. స్మృతులయందలి వ్యవహారకాండముతో ఈగ్రంథమున కెక్కువగు సంబంధమున్నది.

వ్యవహారకాండమునందు దండనీతి, అభియోగవిచారణాక్రమము, ఆస్తిపరివర్తనము, ఆధిక్యనిర్ణయము (తనఖా), వివాహానిర్ణయము, దత్తస్వీకారము, ఋణములు, దాయభాగము, వారసత్వము, ఆస్తి స్వామ్యము, ఆస్తిసంక్రమణము, మొదలగు ననేకాంశములు ఉదాహరింపబడియున్నవి. ప్రస్తుతకాలమున దండనీతి, అభియోగవిచారణ క్రమము, ఆస్తిపరివర్తనము, మున్నగు కొన్నివిషయములు పూర్వ కాలపు ధర్మశాస్త్రములననుసరించి అమలు జరుగుటలేదు. వాటిస్థానమున ఇండియన్ పీనల్ కోడ్డు, క్రిమినల్ ప్రొసీజరుకోడ్డు, సివిల్ ప్రొసీజరుకోడ్డు, ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు, మొదలగు శాసనములు ప్రవేశపెట్టబడి, వాటిననుసరించి వ్యవహారములు నిర్వర్తింపబడుచున్నవి. వివాహము, దత్తస్వీకారము, దాయభాగము, వారసత్వము, ఆస్తిస్వామ్యము, స్త్రీధనము, జీవనాంశము ఆస్తివిభాగము, ఋణములు మొదలగు కొన్నివిషయములుమాత్రము స్మృతులననుసరించియే యిప్పుడును నడుపబడుచున్నవి.

ప్రతిహిందువునకును, వీటితో సంబంధించినంతవరకు స్మృతులతోడను దేశకాలపరిస్థితులనుబట్టి అంగీకరింపబడిన పూర్వులతోడను, ఆచారములతోడను, ప్రస్తుతకాలమున న్యాయస్థానములయందు గావింపబడియెడి తీర్పులతోడను సంబంధముండకతప్పదు.

పైన వివరింపబడినస్మృతులకు విజ్ఞానేశ్వరుడు, కుల్లూకభట్టు, హారదత్తుడు, జీమూతవాహనుడు, నందపండితుడు మొదలుగా పండితులనేకులు అనేకవ్యాఖ్యానములను రచియించియున్నారు. అవి, మితాక్షరి, దాయభాగము, సరస్వతీవిలాసము, స్మృతిచంద్రిక, దత్తకచంద్రిక, దత్తకమీమాంస, వివాదరత్నాకరము, వీరమిత్రోదయము, వివాదచింతామణి మున్నగుపేరులతో విరాజిల్లుచున్నవి.

ఈ స్మృతులును, వ్యాఖ్యానములును సంస్కృతభాషలో నున్నవి. వీటికి ఆంగ్లేయభాషలో భాషాంతరీకరణములున్నవి. ప్రస్తుత న్యాయస్థానములందలి తీర్పులన్నియు నాంగ్లేయభాషలోనే ప్రకటితములగుచున్నవి. స్మృతులయందలి సారమును క్రోడీకరించి, న్యాయస్థానములయందలి తీర్పులయొక్క సారాంశములను జేర్చి "హిందూలా" యనుపేరుతో, మెయిన్, సర్కారుశాస్త్రి, ముల్లా, మొదలగుపండితులు ఆంగ్లేయభాషలో గ్రంథములను రచియించి ప్రకటించియున్నారు. సంస్కృతభాష యిప్పుడభివృద్ధిలో లేకుండుటవలనను ఆంగ్లేయభాష ప్రచారములో నున్నను జనసామాన్యమైనభాష కాకపోవుటచేతను మాతృభాషలో "హిందూలా" యొక్క యవసరము చాల కలదు.

హిందూలాను మాతృభాషలో ప్రకటింపవలయునని చాల దినములనుండి తలపోయుచుంటిని. కాని కారణాంతరములచే నింతదనుక నకార్యము సాధ్యపడినది కాదు. ఇప్పుడు ప్రథమభాగముగ నీ "సమష్టికుటుంబము" అను గ్రంథమును బ్రకటించితిని. "సమష్టికుటుంబముతో సంబంధించిన 'లా' ను సాధ్యమయినంతవరకు వివరముగ నిందు వ్రాసియున్నాడను. స్మృతులయొక్కయు, వ్యాఖ్యాతలయొక్కయు అభిప్రాయములను సంస్కృతభాషలో నుదాహరించి వాటికి తెలుగుఅర్థములను వ్రాసితిని అనేక హిందూలాగ్రంథములను బరిశీలించి, ప్రీవికౌన్సిలువారియొక్కయు, హైకోర్టు లన్నిటియొక్కయు తీర్పులను చదివి వాటియందలిసారము నిందుచేర్చి, అవి యేతీర్పులలోనున్నదియు ఏ లా రిపోర్టులలో ప్రకటింపబడినదియు, అడుగుభాగములయందు గ్రంథసంఖ్య, పుటసంఖ్యలతో గూడ, నుదాహరించితిని. స్మృతులలోను, వ్యాఖ్యానములలోను న్యాయస్థానములలోను భిన్నాభిప్రాయములున్నప్పుడు వాటినిగూర్చి చర్చించి

యున్నాడను. న్యాయశాస్త్రముతో సంబంధించిన మూలసూత్రము
లను వివరముగా తెలుపుచు సాధ్యమయినంతవరకు అవసరవిషయ
ములను విడువకుండ సులభమైనయాంధ్ర భాషలో అందరకును సుబో
ధకమగునట్లు ఈగ్రంథమును రచించితిని. నాయుద్దేశ మెంతవరకు సఫ
లీకృతమైనదో తెలుపగలవారలు పాఠకమహాశయులు.

"హిందూలా"తో సంబంధించిన దత్తస్వీకారము, వారస
త్వము, జీవనాంశము మొదలగు భాగములనుకూడ క్రమక్రమముగా
కొలందికాలములోనే ప్రకటింప ప్రయత్నించుచున్నాడను. నాయత్న
మును కొనసాగునట్లు చేయుభారము ఆంధ్రలోకముపైనున్నది.

మేధావులును, రాజకార్యపారీణులును, దేశీయనాయకులు
నగు మహాశయులు సమయమువచ్చినప్పుడెల్ల కంఠోక్తిగా జెప్పుచు
వచ్చిన, "మాతృభాష యభివృద్ధిచెందినగాని, దేశ మభివృద్ధిచెందదు" దను
వాక్యమును సర్వదా స్మరించుచు, నాయోపికకొలందిని మాతృభాషా
సేవసేయవలయునను ప్రయత్నముతో, 2-3 నవలలను వ్రాసియున్నా
డను. గణితశాస్త్రమందలి యొక భాగమును నవీనపద్ధతులపై "రేఖా
గణితము" అనుపేరుతో ప్రకటించితిని. ఆక్టులలో మదరాసులోకల్
బోర్డు ఆక్టును, మదరాసుసహకారసంఘశాసనమును వ్యాఖ్యానము
లతో ప్రకటించియున్నాడను. న్యాయశాస్త్రములను ప్రకటింపవల
యునను తలంపుతో నిప్పుడీ "సమష్టికుటుంబము"ను ప్రచురించినా
డను. స్థానికస్వపరిపాలనావిషయములను తెలుపుటకై "లోకలుబోర్డు"
అనుమాసపత్రికను నడపుచు నందు రాజకీయశాస్త్రమునందలిమూల
సూత్రములతో గూడ ప్రభుత్వవిధానమును వివరముగా మాతృభా
షలో తెలుపుటకై "రాజ్యాంగిపద్ధతి" యనుపేర వ్యాసములను
వ్రాయుచు వాటి నొకగ్రంథముగా జేయయత్నించుచున్నాడను.

మాతృభాషాసేవ సేయవలయుననునాసక్తితో ధనవ్యయము నకును శ్రమకును ఓర్చి పనిచేయుచున్న నాయుద్యమమునకు తమతమ శక్తికొలఁదిని సాహాయ్యమొనర్ప నాంధ్రలోకమును వేవిధములఁ బ్రార్థించుచున్నాఁడను. వారు నాయందభిమానాదరములఁ జూపి ప్రోత్సహింతురేని, వివిధశాస్త్రములయందలి విషయముల నింకను గ్రంథ రూపమున వెదజల్లయత్నించెదనని విన్నవించుకొనుచున్నాఁడను.

ఈగ్రంథమును రచించుటకై తమ న్యాయశాస్త్రగ్రంథభాండారమును యథేచ్ఛగ నుపయోగపరచుకొనుటకై దయతో ననుగ్రహించిన కపిలేశ్వరపురాది సంస్థానాధిపతులగు మ. రా. రా. శ్రీ Z. A. శ్రీబలుసు బుచ్చిసర్వారాయుడుగారి కెంతయుఁ గృతజ్ఞుఁడనై యున్నాఁడను.

విషయము సులభముగా బోధపడవలయు ననుతలంపుతో వ్యాకరణనియమములను పాటింపక వాడుకలోనున్న యన్యభాషాపదములను యథేచ్ఛగా నుపయోగించినందులకు పండితలోకము నన్ను మన్నింతురుగాక !

కపిలేశ్వరపురము<br>
తూర్పుగోదావరిజిల్లా<br>
1933 సం॥ అక్టోబరు 10 తేదీ

చాగంటి శేషయ్య,<br>
గ్రంథకర్త.

## ఈ గ్రంథమున వచ్చు సంకేతాక్షరముల వివరణము.

అ=అలహాబాదు
అ. హై=అలహాబాదు హైకోర్టు
ఇం. కే=ఇండియన్ కేసెస్
బొ=బొడు (ఛీఫ్ కోర్టు)
బొ. వీ. నో=బొడు వీక్లీ నోట్సు
క=కలకత్తా (హైకోర్టు)
క. లా. జ=కలకత్తా లా జర్నలు
క. లా. రి=కలకత్తా లా రిపోర్టరు
క. వీ. నో=కలకత్తా వీక్లీనోట్సు
గా. హిం. కో=గారుగారి హిందూ కోడ్డు
నా=నాంగపూరు (జుడిషియల్ కమీషనరుకోర్టు)
పం. రి=పంజాబు రిపోర్టరు
పా=పాట్నా (హైకోర్టు)
పా. లా. జ=పాట్నా లా జర్నలు
పా. లా. టి=పాట్నా లా టైమ్సు
ఫు. బెం=ఫుల్ బెంచి
ప్రి. కౌ=ప్రీవికౌన్సిలు
బెం. లా. రి=బెంగాల్ లా రిపోర్టరు
బొం=బొంబాయి (హైకోర్టు)
బొం. హై. రి=బొంబాయి హైకోర్టు రిపోర్టరు
భ. హిం. లా=భట్టాచార్యుల హిందూ లా
మ=మదరాసు (హైకోర్టు)
మ. లా. జ=మదరాసు లా జర్నలు

మ. లా. ట=మదరాసు లా టైమ్సు
మ. వీ. నో=మదరాసు వీక్లీనోట్సు
మ. హై. రి=మదరాసు హైకోర్టు రిపోర్టరు
మూ. ఇం. అ=మూర్సు ఇండియన్ అప్పీలు
రం=రంగూన్ (హైకోర్టు)
లా=లాహోరు (హైకోర్టు)
లా. లా. జ=లాహోరు లా జర్నలు
లా. వీ=లా వీక్లీ (మద్రాసు)
వీ. రి=వీక్లీ రిపోర్టరు
స. హిం. లా=సర్కారుశాస్త్రిగారి హిందూ లా
సె=సెక్షను
సిం=సింధు (జుడిషియల్ కమీషనరుకోర్టు)
33 మ 377=ఇండియన్ లా రిపోర్టరులోని 33 వ మదరాసు వాల్యూమ్‌లో 377 వ పేజి.
1929 పా. 353=ఆల్ ఇండియా రిపోర్టరులోని 1929 వ సంవత్సరము పాట్నా తీర్పులలో 353 వ పేజి.
137. ఇం. కే. (అ) 785=ఇండియన్ కేసెస్ 137 వాల్యూంలోని 785 వ పేజీలోని అలహాబాదు హైకోర్టు తీర్పు.
ఇట్లే అన్ని తీర్పులను గమనింపవలయును.

నోటు:—ఇచ్చట చెప్పబడని సంకేతాక్షరములకు, ప్రయోగింపబడిన తావునందలి సందర్భమును బట్టి యర్థమును గ్రహింపవలయును.

# విషయసూచిక.

## మొదటిప్రకరణము.

## సమష్టికుటుంబనిరూపణము.

---

## రెండవప్రకరణము.

## సమష్టికుటుంబాస్తినిరూపణము.

(Co-parcenary Property of Joint family property.)

పేరా. పేజీ.



---

## మూడవప్రకరణము.

## స్వార్జితము.

## నాల్గవ ప్రకరణము.

### సమష్టికుటుంబమెంబర్లకుండుహక్కులు—బాధ్యతలు.



## ఐదవ ప్రకరణము.

### సమష్టికుటుంబ వ్యవహారనిర్వహణము.

---

## ఆఱవప్రకరణము.

## వినియోగములు.

| పేరా. | | పేజీ. |
|---|---|---|

---

## ఏడవప్రకరణము.

### ఋణములు.

## ఎనిమిదవప్రకరణము.

## విభాగము.

## తొమ్మిదవ ప్రకరణము.

### దివాలా.

## పదియవప్రకరణము.

### సంసృష్టి (Re-union.)



సమాప్తము.

---

శ్రీరామచంద్ర.

# హిందూలా



ప్రథమభాగము.

## సమష్టి కుటుంబము.

### మొదటి ప్రకరణము.

సమష్టికుటుంబనిరూపణము.

సమష్టికుటుంబ మని యీగ్రంథమున వాడబడియెడిశబ్దమును ఇంగ్లీషుభాషలో జాయంటు ఫ్యామిలీ (Joint Family) అనియందురు.

పీఠిక. సమష్టికుటుంబమనినతోడనే, హిందూదేశన్యాయశాస్త్ర పరిచయము కలవారి కొకవిధమైన యర్థము స్ఫురించు చుండును. సమష్టికుటుంబమెంబర్లు, వారికుండుహక్కులు, బాధ్యతలు, మొదలగువిషయములు వారిహృదయములకు తట్టుచుండును. ఈసమష్టికుటుంబసాంప్రదాయము, హిందూదేశమునందు దక్క మఱి యేదేశమునందును నీవిధముగా గాన్పింపదు. అందువలన నీవిషయమునుగూర్చి తెలిసికొనవలయుననినచో, హిందువులధర్మశాస్త్రములు, వారియాచారములు, వారిసాంప్రదాయములు తెలిసికొనవలసియుండును. సమష్టికుటుంబముతో సంబంధించిన ధర్మశాస్త్ర విషయములు, ఆచారములు, ప్రస్తుతకాలమునందమలుజరుగుచున్న పద్ధతులు, ప్రధానన్యాయస్థానములయందలి తీర్పులతోగూడ సాధ్యమైనంతవరకు వివరముగా తెలుపుటయే ఈగ్రంథముయొక్క ప్రధానోద్దేశము.

2. సమష్టికుటుంబమును గూర్చి యాలోచించుటకుముందు, హిందూ కుటుంబ మన నేమియో తెలిసికొనుటయావశ్యకము.

హిందూ కుటుంబము.

1. కూటస్థుఁడు (మూలపురుషుడు).
2. కూటస్థుని కుమాళ్ళు, మనుమలు, మునిమనుమలు మొదలగు పురుషసంతతి.
3. శాస్త్రీయమైనదత్తస్వీకారముచే కుటుంబములోనికి చేరినపురుషులు.
4. పై మూడుతరగతులపురుషులయొక్క భార్యలు, వివాహముకాని కుమార్తెలు, కుటుంబములో చని పోయినవారిభార్యలు, కూటస్థుని తల్లి.

వీరందఱును కలిసి హిందూకుటుంబముగా నెన్నబడుదురు అయితే, ఒకమూలపురుషునకు, ఇరువురు, ముగ్గురు, నలుగురు, ఈవిధముగా పెక్కురు కుమారులుండి, అందొక్కొక్కనికి మరల కుమాళ్లు, మనుమలు, మునిమనుమ లున్నప్పుడు, ఆశాఖ కాతడు మూలపురుషుడుగా భావింపబడుచున్నాడు. హిందూకుటుంబమనినప్పుడు, అందిట్టి శాఖోపశాఖాకుటుంబములు కొన్ని చేరియుండవచ్చును. అయినను ఇదియంతయును ఏకకుటుంబముగానే భావింపబడును(1). అట్టి కుటుంబ మందలి మెంబర్ల సంఖ్యకుగాని, కూటస్థునకు తరువాతవారి తరములసంఖ్యకుగాని, ఒకరికొకరికుండుసంబంధముయొక్క దూరమునకు గాని, మితము లేదు(2). వివాహమయినకుమార్తెలు, వివాహమయినది మొదలు తమజనకకుటుంబమునుండి విడిపోయి భర్త కుటుంబమున మెంబర్లుగా నెన్నబడుదురు(3).

(1) 25 మ 149. (2) మెయిన్ హిందూలా.
(3) 1 మ 69 (81); 18 క 642 (646)

సమష్టి కుటుంబము.

3. పైన చెప్పబడిన హిందూకుటుంబము, భోజనమునందును, దేవతాపూజయందును, ఆస్తియొక్క యనుభవమునందును, కలసి యేకముగా నుండెనేని, అది సమష్టికుటుంబముగా నెన్నబడును(1). కారణాంతరములచే భోజనమును దేవతాపూజయును వేరువేరుగా చేయబడుచున్నను, అంత మాత్రముచే ఆకుటుంబము, వ్యష్టికుటుంబముగా భావింపబడదు(2). కాని ఆస్తివిషయమునమాత్రము కలసి యుండుట, సమష్టికుటుంబమునకు ప్రధానలక్షణము. అయితే ఆస్తినిబట్టి సమష్టికుటుంబమేర్పడదు. సమష్టికుటుంబము 1)జన్మమువలనను, 2)రక్తసంబంధమువలనను నేర్పడును. ఆస్తి ఆసమష్టికుటుంబమునకు చేరి, సమష్టికుటుంబాస్తి యనిపించుకొనును(3). హిందూకుటుంబ మెంబర్లలో నేపురుషుడైనను కుటుంబముయొక్క అప్పు ఆస్తులలో తన భాగమును విభజించుకొని విడిపోయెనేని, అప్పటినుండియును అతడును, అతని శాఖోపశాఖాకుటుంబమును వ్యష్టికుటుంబముగా నెంచబడి మిగిలినది మాత్రమే సమష్టికుటుంబముగా నెన్నబడును(4).

సమష్టికుటుంబ శబ్దనిర్వచనము.

4. పైన చెప్పబడిన సమష్టికుటుంబమునకును, ఈగ్రంథమున నిక చెప్పబోవు సమష్టికుటుంబమునకును వ్యత్యాసమున్నది. ఈభేదమును పాఠకులు జాగ్రత్తగా గమనింపవలసియున్నది. పైనవివరింపబడినకుటుంబములోనుండి యేర్పడి కుటుంబముయొక్క అప్పుఆస్తులయందు ధర్మశాస్త్రనిర్దిష్టములైనహక్కుబాధ్యతలను కలిగియుండునట్టి యొకచిన్నసంఘమును సమష్టికుటుంబ మని యీగ్రంథమున నికముందు చెప్పబడుచుండును. ఈ చిన్నసంఘమునకు ఇంగ్లీషుభాషలో Coparcenary

(1). 1 మ 69 (81); (2) 81 క (పి). కా) 262; (3) 93 ఇం. కే (మ) 662.
(4). 2E. మ. 149

అనియును, ఆసంఘమునందలిమెంబర్లకు Coparceners అనియును పేరు. న్యాయస్థానములును, న్యాయవాదులును, ప్రజలునుగూడ సామాన్యముగా Joint Family, Coparcenary శబ్దములను పర్యాయపదములుగా వాడుచు ఈరెండింటికిని గూడ తెలుగుపదము చెప్పవలసివచ్చినప్పుడు సమష్టికుటుంబమునిగాని, అవిభక్తకుటుంబమని గాని చెప్పుచున్నారు. కావున నీగ్రంథమునం దీశబ్దము లీయర్థమునందే ఉపయోగింపబడును. 2-3 పేరాలలో చెప్పబడినకుటుంబమెంబర్లలో ఎవరెవరిని విడచివైచి, ఎవరెవరినిచేర్చినచో నీసమష్టికుటుంబ సంఘమేర్పడునో యోచింపవలసియున్నది. సమష్టికుటుంబమనునది ధర్మశాస్త్రనియమముల ననుసరించి రక్తసంబంధములనుబట్టి యేర్పడునదియే కాని, కొందరుమనుష్యులు కలసి సమష్టికుటుంబముగా నుండుదమని యనుకొని దస్తావేజు వ్రాసికొనినను అది చెల్లనేరదు. అది సమష్టికుటుంబము కానేరదు(1).

కొందరుస్త్రీలు కలసియున్నను అదిసమష్టికుటుంబము కాదు(2). భార్యాభర్తలు జాయింటుగా ఆస్తి సంపాదించినపుడు, అది సమష్టికుటుంబాస్తి కాజాలదు. (3) మాతామహుడును దౌహిత్రుడును కలసియున్నను వారు సమష్టికుటుంబమెంబర్లు కానేరరు(4). సమష్టికుటుంబము ఒకమూలపురుషుని కలిగి యుండవలయును. అనగా, సమష్టికుటుంబమెంబర్లు, వెనుకకు వెళ్ళిచూచినచో ఒకమూల పురుషునిసంతతిలోనివారై యుండవలయును.

---

(1). 25. మ. 149; 8 మూ. ఇం. అ 400 (420); 132 ఇం. కే. (రం) 817.

(2) 119 ఇం. కే. (బొ) 872

(3) 88 ఇం. కే. (మ) 532

(4) 1925 అ. 775

5. నాల్గవ పేరాలో చెప్పబడిన సమష్టికుటుంబసంఘమెంబర్లెవరు? అని ప్రశ్నించినప్పుడు, దానికి క్లుప్తముగా సమాధానము చెప్పవలయునన్నచో, సమష్టికుటుంబాస్తిని విభజించుకొనుట కెవరు హక్కుకలిగియుందురో వారే సమష్టికుటుంబమెంబర్లు అని సమాధానము చెప్పవలసియుండును. అయితే ఈసమాధానమునుబట్టి చూడగా పైన 3 వ పేరాలో చెప్పబడినసమష్టికుటుంబములో మెంబర్లుగానున్నను, కొందరికి సమష్టికుటుంబాస్తిలో భాగార్హతలేనట్లు స్పష్టమగుచున్నది. సమష్టికుటుంబమెంబర్లలో ఎవరెవరికి భాగార్హత, ఎందువలన, లేకపోవుచున్నదోయీాదిగువపేరాలలోవిమర్శింపబడును.

భాగార్హత కల వారే సమష్టికుటుంబమెంబర్లు.

6. హిందూకుటుంబమున స్త్రీలు మెంబర్లుగా నెన్నబడియున్నారు. కుటుంబముయొక్క అప్పుఆస్తులలో స్త్రీలకు గలసంబధమునుగూర్చి స్మృతికర్తలవాక్యము లీదిగువ నుదహరింపబడుచున్నవి

స్త్రీలవిషయమున స్మృతివచనములు

పితురూర్ధ్వం విభజతాం మాతాప్యంశం సమం హరేత్
భగిన్యశ్చ నిజాదంశా ద్దత్వాంశంతుం తురీయకమ్.

తండ్రిచనిపోయినపిమ్మట విభజించుకొనెడిపుత్రులతో సమభాగమును తల్లి పొందుచున్నది. తమతమఅంశములో నాలుగవవంతు అవివాహితసోదరీల కీయవలయును.

యదికుర్యా త్సమానంశా న్పత్న్యః కార్యాస్సమాంశకాః
నదత్తం స్త్రీధనం యాసాం భర్త్రావా శ్వశురేణవా.

తండ్రి తనకుమారులకు సమానముగా విభజించునప్పుడు తనభార్యకు, తనచేతగాని తన తండ్రిచేతగాని స్త్రీధన మీాయబడకయుండినచో కుమారులతో సమానముగా పంచిపెట్టవలయును.

యాజ్ఞవల్క్యస్మృతి.

దత్తేతు స్త్రీధనేర్ధాంశం వక్ష్యతి దత్తేత్వర్థం ప్రకల్పయేత్.
స్త్రీధనమిచ్చియున్నచో సగభాగ మీయవలయును.

మితాక్షరా.

పాకభాండంచ గృహేలంకారో భార్యయా...
అలంకారములును, గృహమందు పాకాద్యుపయుక్తములగు పాత్రలును భార్య కుద్ధారాంశములు.

ఆపస్తంబుడు.

తదభావేతు జననీ తనయాంశసమాంశినీ
సమాంశా మాతరస్తేషాం చతుర్థాంశాస్తు కన్యకాః.

బృహస్పతి.

హరంశ్చై ప్రతిపద్యేత్ విభజన్నాత్మజః పితా
సమాంశభాగినీ మాతా పుత్రాణాంస్యాన్మృతే పతౌ.

నారదుడు.

మాతరః పుత్రభాగానుసారాణి
భాగహారిణ్యః అనుదాతృదుహితరః.

విష్ణువు.

మాతాపి పితరిప్రేతే పుత్రతుల్యాంశభాగినీ
కన్యకానాం నాస్త్వదత్తారం చతుర్థోభాగఉచ్యతే
పుత్రాణాచ్చ త్రయోభాగాః సామ్యం స్వల్పధనేస్మృతమ్.

కాత్యాయనుడు.

కన్యాభ్యస్తు పితృద్రవ్యం దేయం వైవాహికం వసు.

దేవలుడు.

స్వేభ్యోంశేభ్యస్తు కన్యాభ్యః ప్రదద్యుర్భ్రాతరః పృథక్
స్వాత్స్వాదంశాచ్చతుర్భాగం పతితాస్స్యురదిత్సవం.

మనువు.

ఇవి మొదలుగా ననేకస్మృతులయందు, కొన్నిసందర్భములలో తల్లి కిని, కన్యకలగు సోదరీలకును, భాగము విధింపబడియున్నది. తమ భాగమును పంచియిమ్మని అడుగుటకు వారికధికారము లేదు. కాని, సోదరులూ, తండ్రి, తనయులు, పంచుకొనునప్పుడు, వారలకు భాగము నొసంగవలయునని ధర్మశాస్త్రములు నిర్ణయించుచున్నవి. ఆవిధముగా బొంబాయి, కలకత్తా, అలహాబాదు హైకోర్టులు, భాగముల నిప్పించుచు తీర్మానముల నొసంగియున్నారు(1).

ఆంధ్రదేశమున స్త్రీలకు భాగార్హతలేదు.

7. ఇట్లున్నను, స్మృతిచంద్రికకర్త, పైనవ్రాసిన స్మృతివచనములను విమర్శచేసి, స్త్రీలను పోషించుటకును, వారికికావలసిన వివాహాదివ్యయములను భరించుటకును, అవసరమగు ద్రవ్యమునకై విభాగకాలమున నేర్పాట్లుచేయుటావశ్యకమనిమాత్రమే యాస్మృతికర్తలయభిప్రాయమనియును, స్త్రీలకు భాగార్హత లేదనియును సిద్ధాంతీకరించెను(2). మదరాసురాజధానిలో, స్మృతిచంద్రికయందలియాచారములు ప్రధానములుగ పరిగణింపబడుచుండుటచే, మదరాసు హైకోర్టువారు సమష్టికుటుంబాస్తిలో స్త్రీలకు భాగార్హత లేదని నిర్ణయించియుండిరి(3). అందుచే, మదరాసురాష్ట్రములో, జీవనాంశ మేర్పరచుటకొరకు స్త్రీలను సమష్టికుటుంబమెంబర్లుగా నెంచుచుండినను, అప్పుఆస్తులతో సంబంధించినంతవరకు వారు సమష్టికుటుంబమెంబర్లుగా నెంచబడరు.

---

(1) 8 క 17; 27 క 77; 551; 32 క 234; 476; 31 బొం 54; 38 అ 83; 5 క 845; 17 బొం 271; 80 ఇం. కే (బొం) 468; 125 ఇం. కే. (అ) 762; 140 ఇం. కే (బొం) 736.

(2) స్మృతిచంద్రిక 4 వ ప్రకరణము.

(3) 6 మ 130; 8 మ 123; 25 మ 149; 28 మ 1.

కూటస్థునకు నాల్గవతరమువారు సమష్టికుటుంబమెంబర్లగుదురా?

8. కూటస్థుడు, అతనికుమాళ్లు, అతనిమనుమలు, అతని మునిమనుమలు, వీరు కలసియున్నంతవరకు సమష్టికుటుంబమెంబర్లుగా నెన్నబడుదురు. కాని కూటస్థుడు జీవించియుండగా ఆతనిమునిమనుమలకు (ప్రిపౌత్రులకు) తనయులు (వీరిని యినిమనుమలు లేక ప్రప్రపౌత్రులు అని వాడుదుము) కలిగిరేని వారు ఆసమష్టికుటుంబమున మెంబర్లుగా నెన్నబడరు. వీరు కూటస్థునకు నాల్గవతరమువా రగుచున్నారు. ఈక్రింది వంశవృక్షమును చూడుడు.




'క' యొక్క ఆస్థియందు 1, 2, 3 తరములవారికి జన్మముచేతనే హక్కు కలుగును. 'క' తో విభజించుకొనుటకు వారి కధికారము కలదు. 'క' జీవించియుండగా, ఝ కు ఆస్థియందు హక్కు లేదు. భాగమిమ్మని కోరుట కధికారము లేదు. ఇతనికి సమష్టికుటుంబాస్తియందు జన్మముచేత స్వత్వము (హక్కు) కలుగదు(1). ఇట్లు నాల్గవతరమువారికి ఆస్తియందు హక్కు కలుగకపోవుటకు కారణము

(1) మెయిన్ హిందూలా. 271 వ పేరా; గౌ. హిం. కో. 100 సె.

మనుస్మృతిననుసరించి కూటస్థునకు శ్రాద్ధాదికర్మలుచేయుట కీనాల్గవ తరమువారి కధికారము లేకపోవుటయే, యని మెయిన్ హిందూలాలో చెప్పబడియున్నది(1)

త్రయాణా ముదకం కార్యం త్రిషు పిండః ప్రవర్తతే।
చతుర్థ స్సంప్రదాతైషాం పంచమో నోపపద్యతే॥

మనుస్మృతి.

పిత్రాదులకు ముగ్గురకు నుదకపిండదానములు చేయవలయును. నాల్గవవాడు పిండోదకదానము లిచ్చువాడు. ఐదవవాని కేమియు సంబంధము లేదు. పితృపితామహప్రపితామహులకు మాత్రమే పిండోదకముల నిచ్చుచుండుటయు, వృద్ధపితామహున కిచ్చు నాచారము లేకుండుటయు, కర్మసంబంధమున్నవారంద రెరింగినదియే. కర్మాధికారము లేనివానికి ఆస్తియందు హక్కు ఉండదని యిందువలన తేలుచున్నది. కర్మాధికారము లేనివారికి ఆస్తియందు హక్కు ఉండునా? ఉండదా? అనువిషయమున పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఆయభిప్రాయముల నిట తెలిపి వానినిగూర్చి చర్చించుట, అప్రస్తుతమని విడువబడినది.

కొన్ని సందర్భములలో నాల్గవతరమువారు సమష్టికుటుంబ మెంబర్లగుదురు.

9. అయితే, 'క' జీవించియున్నంతవరకు మాత్రమే, ఝ కు హక్కు లేకుండ పోవుచున్నది. కాని 'క' చనిపోయినపిమ్మట, 'ఝ' మూడవతరములోనివాడై కర్మాధికారమును ఆస్తియందు హక్కును గూడ పొంది సమష్టికుటుంబమెంబరుగా నెన్నబడును. ఇట్లే, పై మెంబరు చనిపోయినతోడనే, నాల్గవతరమువారు, మూడుతరములలోనికి చేరి సమష్టికుటుంబమెంబర్లుగా నెన్నబడుదురు. ఎట్లనగా, 'క' చనిపోయినతోడనే, 'ఝ' మూడవతరములోనికి చేరి

(1) 271 వ పేరా.

నట్లే చ, మరణమునొందగనే, ఝ యొక్కకొడుకు మూడవతరము లోనికి చేరి సమష్టికుటుంబమెంబరగుచుండును. ఇట్లు జరుగుచున్నచో ఎన్నితరములైనను, కూటస్థునకు (క) ఇన్నియవతరమువారు అను లెక్కతో నిమిత్తములేకుండ సమష్టికుటుంబమెంబర్లుగనే ఎంచ బడుదురు(1).

కొన్నిసందర్భములలో, నాల్గవతరమువారు సమష్టికుటుంబమెంబర్లు కాజాలరు

**10.** కొన్నిసందర్భములయందు కూటస్థుడు చనిపోయినపిదప గూడ కూటస్థునకు నాల్గవతరమువారు ఆస్తియందు హక్కునుపొంద జాలరు. ఎట్లనగా, 'క' జీవించియుండగా చ, ఛ, జ లు చనిపోయి రేని, ఆసమష్టికుటుంబాస్తియందు ఝ కు హక్కుకలుగక, మిగిలినపురుషసంతతికి అనగా ట, ఠ, డ, త లకు మాత్రమే హక్కుకలుగుచున్నది. ఆసందర్భములో, ఝ, సమష్టికుటుంబమెంబరుగా నెంచబడడు. క, జీవించియున్నంతవరకు, ఝ, సమష్టికుటుంబమెం బరు కాకపోవుటవలనను, అతనిపితృపితామహప్రపితామహులు క, తో సమష్టిమెంబర్లయినను, వారదివఱకే చనిపోవుటవలన వారిహ క్కు సర్వైవరుషిప్పుద్వారా, జీవించియున్న సమష్టికుటుంబమెంబ ర్లలో లీనమగుటవలనను, ఆకుటుంబాస్తియందు ఝ, కు హక్కులే కుండపోవుచున్నది. ఆసందర్భములో, ఝ కును వానిసంతతికిని, ఎప్పు డును హక్కుకలుగదు(2). క, చనిపోవునప్పటికి, చ, ఛ, జ లలో ఎవరుజీవించియున్నను క, యొక్క అనంతరము, అట్లుజీవించియున్న వారికి హక్కుకలిగి, తన్మూలమున ఝ, కు కూడ హక్కుకలుగును.

(1) 10 బొం. హై. రి. 444; 6 మ. హై. రి. ; 8. క. లా. రి. 828; 9 మూ. ఇం అ. 66;

(2) 10 బొం. హై. రి. 444.

11. కుటుంబము సమష్టిగానున్నప్పుడు, కూటస్థుడు జీవించి యుండగా కూటస్థునకు తరువాత మూడుతరముల వారికి మాత్రమే సమష్టికుటుంబాస్తియందు హక్కు కలుగుననియు తరువాత తరములవారికి హక్కు కలిగి యుండదనియు, చెప్పెడిసూత్రమును పండిత గులాప్ చంద్ర సర్కారుశాస్త్రిగా రంగీకరించుటలేదు పితృపితామహార్జితమైనఆస్తియందు కుమాళ్ళకు జన్మము చేతనే హక్కు కలుగుచున్నప్పుడు, మూడవతరము వారికి సమష్టికుటుంబాస్తియందున్న హక్కులో వారికి కుమాళ్లయిన నాల్గవతరము వారికి మాత్రము జన్మముచేత ఏల హక్కు కలుగదు ? కూటస్థుడు జీవించి యున్నాడను కారణముచే నాల్గవతరము వారికి హక్కు లేకపోయినచో ఆతనిమరణమువలనమాత్ర మెట్లువచ్చును ? ఎవరికైనను, సమష్టికుటుంబమున మెంబరగుటకు హక్కు, జన్మముచేతకదా కలుగవలయును! నాల్గవతరము వారికి జన్మముచే హక్కు కలుగదుగాని కూటస్థునిమరణముచే కలుగునా ? పైనవ్రాసిన వంశవృక్షములో ఒక కుటుంబమునందు క, జ, ఠ, డ, ఝ లున్నారనుకొనుడు. అప్పుడు జ, తన భాగమును విభజించుకొనుటకు హక్కు కలిగి యున్నాడు. అప్పటి కుటుంబస్థితిననుసరించి క, యొక్క అనంతరమువరకును జ, జీవింపడేని, ఝ, అనువాడు, ఆ స్తిలో భాగమును పొందజాలడు. ఈవిషయము జ, యొక్క హృదయమునకు తట్టెనేని, తన పుత్రుని శుద్ధదరిద్రునిగా చేయుట కంగీకరించునా? వెంటనే తన భాగమును పంచుకొనకుండ నుండగలడా? హిందూధర్మశాస్త్రములు విభాగమువలన పితృదేవతలకు కర్మచేయువా రధికము కాగలరని తలంచుచున్నను, సాధ్యమైనంతవరకు కుటుంబము, సమష్టిగానుండుటకై తోడుపడుచుండును. కాని విభజించుకొనిననే తప్ప యొకనికి తీరని నష్టము వాటిల్లునట్టి ధర్మమును బోధించునవిగా నుండవు(1).

నాల్గవతరమువారి హక్కువిషయమున సర్కారు శాస్త్రిగారి యభిప్రాయము.

(1) 10 బొం. హై. రి 444

క, జీవించియుండగా, ఝ, సమష్టికుటుంబమెంబరు కాడను కారణముచే జ, తనకుమారుని యావలకు గెంటివేయవలయునా? లేక ఆకుమారునిజన్మముమూలమున కుటుంబమునుండి విడిపోవలయునా? అత డీరెంటును చేయజాలడు. ఈరెండిటిలో నేదేనియొక దానిని తప్పక చేయవలయునని స్మృతులు విధించునని చెప్పవలను పడదు అట్లు విధించువాక్యములు స్మృతులలో గానరావు. ఝ, కుటుంబములో కలసియుండి కుటుంబాస్తివలన పోషింపబడుచుండును. అతడు ఆర్జనపరుడయ్యేనేని, తానెప్పుడో హక్కుదారుడను కాకపోవుదునేమో అని తనయార్జనను తండ్రికీయక వేఱుగ నుంచుకొనునా? అట్లెన్నడును జరుగదు. దైవికముగ, అతని పితృపితామహప్రపితామహులు కూటస్థుడు జీవించియుండగా చనిపోయిరేని, తనచే సంపాదింపబడి కుటుంబాస్తిలో కలసిపోయిన ద్రవ్యమును వదలుకొని శుద్ధదరిద్రుడై కుటుంబములోనుండి యావలకుపోయి, ముష్టియెత్తుకొనుచు పితృపితామహప్రపితామహులకు కర్మచేయుచుండవలసినదా?

ఈయుక్తులనుబట్టి చూచినచో గులాప్‌చంద్రసర్కారుశాస్త్రిగారి యభిప్రాయము సరియైనదే యని తోపకమానదు. అయితే మనుస్మృతిలోని "త్రయాణాముదకం కార్యం" అనువాక్యములగతి యేమి? అని ప్రశ్నింపవచ్చును. మనువు ఆధర్మమును అపుత్రిధనాధికారిద్రవ్యవిషయమునుగూర్చి చెప్పునప్పుడు, విధించెననియును, ఇచ్చట అపుత్రధనాధికారియనగా కూటస్థుడు తనపుత్రులతో విభజించుకొని వేరుగానున్నప్పుడు అతనివాటాయాస్తికిని, వేరుగానుంచుకొనిన యాతని స్వార్జితపుటాస్తికిని, వారసులను నిర్ణయించునప్పుడు అట్టియాస్తియందు, జన్మముచేత నెవరికిని స్వత్వము లేదు కావున, ఆతనికి పుత్రపౌత్రప్రపౌత్రులు లేనప్పుడు ఆతనికి కర్మచేయుట కధికారము లేని

నాల్గవతరమువాడు, దానిని పొందజాలడనివిధించి, "అనంతరసపిం"డే త్యాది శ్లోకముచే సపిండులకాయాస్తి సంక్రమించునని చెప్పియున్నాడే కాని జన్మముచేత స్వత్వమును నిర్ణయించు సమష్టికుటుంబాస్తిని గూర్చి కాదని, ఆప్రశ్నకు సమాధానము.

మితాక్షరికి వ్యాఖ్యానముగ్రాసిన సుబోధినీకారుడు మొదలగు కొందరువ్యాఖ్యాతలు ఈతరములతో పనిలేదనియు, ఆకుటుంబమున పురుషసంతతిలో జన్మించుటచేత పురుషునకు హక్కుకలుగుననియు నభిప్రాయమిచ్చియున్నారు.

నాల్గవతరమువారివిషయమున మదరాసుహైకోర్టువారిఅభిప్రాయము.

12. మదరాసుహైకోర్టువారు పైనవ్రాసినవిషయములను ఒక కేసులో చక్కగా విమర్శించి, సర్కారుశాస్త్రిగారి యభిప్రాయముతో నేకీభవింపుచు, ఆకేసుతీర్మానమున కీవిషయ మవసరము కాకపోయినను, కూటస్థుడు జీవించియుండగా క్రింది మూడుతరములవారు చనిపోయినను, నాల్గవతరమువారు సమష్టికుటుంబమెంబర్లే యగుదురనియు, హిందూలా ననుసరించి వారికి సమస్తహక్కులు కలవనియును, తీర్మానించియున్నారు(1). అయితే ఆకేసులో నీవిషయమును విమర్శించుట కవసరము లేనిదే విమర్శించిరి కావునను, మరియొకపాయింటుమీద ఆకేసు తీర్మానింపబడినప్పుడు, ఈవిషయము పూర్తిగా విమర్శచేయబడి తీర్మానింపబడిన ట్లెంచరాదనియు, అందుచే నీతీర్పు బయిండుచేయదనియు నొకయాక్షేపణము రావచ్చును. ఎట్లయినను ఇంకొకసారి యీవిషయము సంపూర్ణ విమర్శచేయబడి తీర్మానింపబడిననేగాని ఇదమిత్థమని నిర్ణయింపవలనుపడదు. సాధారణముగా నిట్టికేసులు సంభవింపవు. అందుచేతనే యీవిషయమింతవరకును సంపూర్ణవిమర్శకు లోనుగాలేదు. మరల నెప్పుడైన నిట్టికేసువచ్చెనేని

(1). 23 మ. లా. జ. 79.

మదరాసుహైకోర్టువారి యభిప్రాయము గౌరవింపబడునని యూహింపవచ్చును.

13. హిందూకుటుంబమున జన్మించినను, అంగవైకల్యాదులచే కొందరుపురుషులు ఆస్తియందు హక్కును పొందజాలరు. భాగమిమ్మనికోరుటకు వారికిహక్కులేదు. ఈవిషయమున స్మృతివచనములివి.

నపుంసకుడు మొదలగువారు భాగానర్హులు.

"క్లీబోథపతిత స్తజ్జః పంగు రున్మత్తకో జడః
అంధో చికిత్స్యరోగాద్యా భర్తవ్యాస్స్యు ర్నిరంశకాః"
ఔరసక్షేత్రజా స్తేషాం నిర్దోషా భాగహారిణః
సుతాశ్చైషా ప్రభర్తవ్యా యావద్వై భర్తృసాత్కృతాః ॥
అపుత్రా యోషితశ్చైషాం భర్తవ్యా స్సాధువృత్తయః
నిర్వాస్యావ్యభిచారిణ్యః ప్రతికూలా స్తథైవచ॥

నపుంసకుడు, పతితుడు, వానికిపుట్టినవాడు, కుంటివాడు, పిచ్చివాడు, వెఱ్ఱివాడు, గ్రుడ్డివాడు, చికిత్సకశక్యములైనరోగములచే పీడింపబడువాడు, ఈమొదలైనవారు భాగమున కర్హులుకారు. అట్లు భాగమున కనర్హులైనవారియొక్క ఔరసక్షేత్రజపుత్రులు అట్టిదోషము కలవారుకానిచో భాగమునకర్హులు. భాగానర్హులపుత్రిక లెంతవరకు భర్తలుకలవారుకారో అంతవరకును పోషింపబడదగినవారు. అట్టి భాగానర్హులయొక్కపుత్రులు లేనిభార్యలు సాధువృత్తికలవారైనచో, పోషింపబడదగినవారు. వ్యభిచారిణులును ప్రతికూలులునైనచో వెడలగొట్టబడదగినవారు.

యాజ్ఞవల్క్యస్మృతి.

అనంశౌ క్లీబపతితౌ జాత్యంధబధిరౌ తథా
ఉన్మత్తజడమూకాశ్చ యేచకేచి న్నిరింద్రియాః
సర్వేషామపితు న్యాయ్యం దాతుంశక్యమనీషిణా

గ్రాసాచ్ఛాదన మత్యంతం పతితో హ్యాదదద్భవేత్
యద్యర్థితాతు దారైశ్చ క్లీబాదీనాం కథంచన
తేషాముత్పన్నతంతూనా మపత్యం దాయమర్హతి.

నపుంసకుడు, పతితుడు, జాత్యంధబధిరులు, ఉన్మత్తుడు, జడుడు, మూగవాడు, ఇంద్రియములేనివారు, వీరు భాగానర్హులు. వీరినందఱను అన్నవస్త్రములిచ్చి తక్కిన భాగస్థులు పోషింపవలయును. అట్లుపోషింపనివాడు పాపాత్ముడగును. వారలు కావలయుననికోరినచో, వివాహములు చేయవలయును. వీరికి కలిగినపుత్రులు భాగమున కర్హులు. ఇంద్రియములేనివారనగా కుణిపంగ్వాదులని కుల్లూకభట్టు వ్యాఖ్యానముచేసియున్నాడు. నపుంసకున[illegible] పుత్రు లెట్లుకల్గుదురని శంక రాగా క్షేత్రజులని సమాధానము చెప్ప[illegible]

మనుస్మృతి. [illegible]వ [illegible]ధ్యాయము.

పితృద్విట్పతితష్షండో యశ్చస్యాదౌపపాతికః
ఔరసాఅపి నైతేంశం లభేరన్ క్షేత్రజాఃకుతః

తండ్రితో ద్వేషించినవాడు, పతితుడు, నపుంసకుడు, ఉపపాతకములనుచేసినవాడు, ఔరసుడైనను భాగార్హుడుకాడు, ఇక క్షేత్రజుని మాట చెప్పనేల ?　　[illegible]నారదుడు.

మృతేపితరి నక్లీబకుష్ఠరున్మత్తజడాంధకాః।
పతితః పతితాపత్యం లింగీ దాయాంశభాగినః।
తేషాం పతితవర్జేభ్యో భక్తవస్త్రం ప్రదీయతే।
తత్సుతాః పితృదాయాంశం లభేరన్ దోషవర్జితాః

తండ్రి చనిపోవగా, నపుంసకుడు, కుష్ఠరోగి, ఉన్మత్తుడు, [illegible], గ్రుడ్డివాడు, పతితుడు, పతితతనయుడు, కుంటివాడు, వీరు [illegible]మందు భాగానర్హులు. ఇందు పతితునకుగాక మిగిలినవారికి అన్నవస్త్రము లీయవలయును. వారికుమాళ్ళు దోషవర్జితులైనచో తం[illegible] మును పొందుట కర్హులు.　　దేవలుడు.

అనంశా స్త్వాశ్రమాంతరగతాః.
ఆశ్రమాంతరమును బొందినవారు భాగానర్హులు.

వశిష్ఠుడు.

శాశ్వతబ్రహ్మచర్య వానప్రస్థాశ్రమములను స్వీకరించినవారివిష యము కలియుగమున వర్తింపదని బృహన్నారదీయమునందున్నది. కావున ఆశ్రమాంతరమనగా యత్యాశ్రమముమాత్రమే యనిగ్రహింపవలయును.

నపుంసకాదులకు భాగము లేకపోవుటకు కారణమేమి?

14. పైనచెప్పబడినదోషములుకలవారలకు భాగార్హతలేకపోవుటకు కారణమేమి? అనిప్రశ్నింపవచ్చును. ఈప్రశ్నకు సమాధానమును పలువురు పలువిధములుగా చెప్పుచున్నారు. అందుముఖ్యమైనవి నాలుగు.

1. వీరు పూర్వజన్మమందుచేసిన మహాపాపముచే నీజన్మమున నిట్టివారై జన్మించినారు. ఆపాపఫలము ననుభవించితీరవలయును. కావున వీరికి భాగార్హతలేదు.
2. వీరు తమపితృదేవతలకు శ్రాద్ధాదికర్మలు చేయుట కశక్తులు. కావున వీరికి భాగార్హతలేదు.
3. వీరికి భాగమిచ్చినను సరిగా వ్యవహరించుకొని ఆస్తిని కాపాడుకొనజాలరు. కావున వీరిని యావజ్జీవము పోషించి వీరికాదోషము తొలగిపోయినప్పుడును సంతానముకలిగినప్పుడును వారిభాగమును వారికిచ్చుటకేర్పరుపబడియున్నది. కావున వారికాదోషము పట్టియున్నంతవరకు భాగార్హతలేదు.
4. మనకు ధర్మశాస్త్రము లనుసరణీయములు. అందలిధర్మములు విజ్ఞానయుతులగు మహాత్ములచే నిర్ణయింపబడినవి. వానిలో, వీరలకు భాగానర్హత విధింపబడినది. కావున భాగార్హత లేదు.

ఇప్పటిహైకోర్టుతీర్పులలో న్యాయమూర్తులు ఎవరితీర్పున కనుకూలముగానుండువాదమును వారు గైకొనుచున్నారు(1).

**15.** యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యాన మొనర్చుచు విజ్ఞానేశ్వరు డిట్లు చెప్పియున్నాడు.

భాగానర్హతకు అంధత్వాదిదోషము లెప్పటినుండి యుండవలయును.

ఏతేషాం విభాగాత్ప్రాగేవ దోషప్రాప్తా
వనంశత్వం వేదితవ్యమ్-నపునర్విభక్తస్య-
విభాగోత్తరకాల మప్యౌషధాదీనాం దోష
నిర్హరణే భాగప్రాప్తి రస్త్యేవ.

పైనచెప్పబడినదోషములు వారలకు విభాగకాలమునకు ముందున్నయెడలమాత్రమే భాగానర్హత్వము సిద్ధించును. విభాగమైన పిదప నట్టిదోషములు సంభవించినను వారిభాగము తిరిగిపోజాలదు. విభాగమైనపిమ్మట ఔషధాదులచే వారిదోషము నివారణమయ్యేనేని, వారికి భాగప్రాప్తి కలదు. అనగా అదివరకు విభజించుకొనిన వారందరును తిరిగి యాతనికి భాగమీయవలయునని యర్థము.

మితాక్షరి.

భాగార్హత లేకపోవుటకు, పైనచెప్పబడినదోషములలో కొన్ని జన్మముతో నుండవలయును. కొన్నిజన్మముతోకూడ నుండనక్కరలేదు. పండితులైనగులాప్‌చంద్రసర్కారుశాస్త్రిగారు తమహిందూలాగ్రంథమునందు విభజించుకొనునాటికి పైనవివరించిన దోషములను కలిగియున్నవారు భాగార్హులుకారనియును, ఈసందర్భమున ఆదోషములు పుట్టుకతోగూడ నుండవలయునను విధి లేదనియును వ్రాసియు

(1) 55 ఇం. కే. 576 (588) 8 వ వాదము; 73 ఇం. కే. 279. 2 వ వాదము.

న్నారు. ఇతరులఆస్తి వారసత్వముచేత సంక్రమించునప్పుడు మాత్రమే పైనచెప్పబడినవాటిలో అంధత్వాదులు పుట్టుకతోగూడ నుండవలయునను నియమ మున్నది. కాని సమష్టికుటుంబాస్తి విభజించుకొనునప్పు డీనియమము లేదనియును, విభాగకాలమునాటి కాదోషములున్నచో వారు భాగార్హులు కారనియును వారియభిప్రాయము. ఈయభిప్రాయమునకాధారము మితాక్షరియని యుదాహరించినారు. కాని మితాక్షరియం దీభేదము నిరూపింపబడినట్లు కనబడదు. విభాగకాలమునకు ముందున్నయెడలమాత్రమే అట్టిదోషములకు భాగానర్హాత్వము సిద్ధించుననియును, విభజించుకొనినపిమ్మట అట్టిదోషములు కలిగినను వారిభాగముల కభ్యంతరము కలుగగూడదనియును, మితాక్షరియందున్నది. కాని ఆదోషము లెప్పటినుండి యుండవలయునో యెట్టిగానుండవలయునో నిరూపించియుండలేదు. మెయిన్, ముల్లా, మొదలగు హిందూలాగ్రంథకర్తలుకూడ యీభేదమును తమగ్రంథములలో సూచింపలేదు సరియేకదా ఈవిషయమున వారసత్వమునకుండువిధులే సమష్టికుటుంబాస్తివిభజనమునకును వర్తించునని చెప్పియున్నారు. ఏదోషములు జన్మముతో నుండవలయునో ఏవి జన్మముతో నుండనక్కరలేదో ఈదిగువ విమర్శింపబడును.

అంధత్వము.

**16.** సమష్టికుటుంబాస్తి విభాగవిషయమున సోదరులకువచ్చిన యొకకేసులో జాత్యంధునకు మాత్రమే భాగముండదనియును, కొంతకాలమైనపిదప శాశ్వతమైన అంధత్వమువచ్చినను భాగము లేకుండ పోవదనియును తీర్మానించియున్నారు(1).

(1) 45 క 17; 8 క 149.

హైకోర్టులన్నియును గూడ నదేవిధముగ తీర్మానించినవి(1). ఒక కేసులో మదరాసుహైకోర్టున్యాయమూర్తులగు సదాశివఅయ్యరు, నేపియరుగార్లుమాత్రము జాత్యంధునకైనను భాగములేకుండ చేయ రాదనియు, పైనసుదహరించిన స్మృతులు చిరకాలముక్రిందట రచింప బడినవనియు, అవి యిప్పుడమలులో లేక ప్రాతగిలిపోయినవనియు, కావున జాత్యంధునకు భాగముండుననియు, తీర్మానించినారు(2). కాని మదరాసుహైకోర్టులోనే, ఈవిషయము మరల ఫుల్ బెంచి యెదుటకు విచారణకురాబడి, న్యాయమూర్తులగు సదాశివఅయ్యరు, నేపియరుగార్ల తీర్మానము సరియైనదికాదనియును, ఏధర్మశాస్త్రమునైనను అమలులో లేదనిచెప్పుటకు అమలులోనుండనట్లు ప్రబలమైన సాక్ష్యమైననుండవలయును. లేదా ఏవ్యాఖ్యాతలైనను వ్రాసినకారికలైన నుండవలయును. కాని కాలమునుబట్టి న్యాయస్థానముల కక్రమమని తోచినంతమాత్రమున 'లా'ను మార్పు చేయరాదనియును, అపని శాసనసభలదనియును, జాత్యంధునకు భాగార్హత లేదనియును తీర్మానించిరి(3). కొన్నితరువాతతీర్పులలోకూడ సదాశివఅయ్యరు, నేపియరుగార్ల తీర్మానమునకు అనంగీకారమును వెలిబుచ్చినారు(4). కావున జాత్యంధుడైనచో భాగానర్హుడనియును, జన్మించినపిదప వచ్చిన యంధత్వము శాశ్వతమును చికిత్సలకు సాధ్యముకానిదియు నైనను అట్టివాడు భాగార్హుడేయనియు, నిర్ధారణ చేయతగియున్నది.

---

(1) 11. వీ. 8. 11; 14 బెం. లా. 8. 273; 1 బొం. 177; 1 బొం. 557; 42 ఇం. కే. (ప్రి. కౌ.) 819; 69 ఇం. కే. (మ) 313; 71 ఇం. కే. (నా) 565; 73 ఇ. కే. (279.)

(2) 43 మ 4.

(3) 45 మ 949.

(4) 71 ఇం. కే. 556. 63 ఇం. కే. 659. 65 ఇం. కే. (బొం) 216.

17. మూగ, చెవుడు ఈ రెండును కలసియున్నచో అవి పుట్టు కతోడనే యుండవలయును. అట్లున్నచో భాగమున కర్హులుకారు.

మూగ, చెవుడు.

జన్మముతో లేనిచో భాగమున కర్హులు. పుట్టుక తోడనే ప్రత్యేకముగా మూగతనముగాని, ప్రత్యేక ముగా చెవుడుగాని యున్నను భాగమున కర్హులుకారు(1).

మూగతనము జన్మముతో నుండనక్కర లేదనియును, మధ్య వచ్చినను అట్టివారికి భాగార్హత లేదనియును, కలకత్తా, బొంబాయి, హైకోర్టులు తీర్మానించినవి(2). ప్లేగు, జాడ్యమువలన మాటలాడుశక్తి నశించిపోయినకేసులోకూడ భాగమున కర్హతలేదని బొం. హై. వారు పై తీర్పులో వ్రాసియున్నారు.

18. అవయవహీనత్వమనగా కుంటితనము, ముక్కు లేకపో వుట, నాలుక లేకపోవుట. కుంటితనమనగా రెండుకాళ్లును లేకపో

అవయవ హీనత్వము.

వుట. ఈదోషము జన్మముతో నుండవలయును. అట్లున్నచో భాగమున కర్హుడుకాడు. లేనిచో భాగ మునకర్హుడు(3). కుంటితనము సంపూర్ణముగా నుండ వలయుననియు, లేనిచో భాగము పోజాలదనియు, కఱ్ఱల సాహాయ్య మున నడచుచున్నయెడల, అట్టివానికి భాగమున్నదనియు, పంజాబు చీఫ్‌కోర్టువారు తీర్మానించినారు(4).

---

(1) 4 బొం. హై. 8. 185; 65 ఇం. కే. (బొం) 216; 1 బొం. 177; 101 ఇం. కే. (నా) 650. 132 ఇం. కే. (పా) 866; 100 ఇం. కే. (బొం) 586.

(2) 18 క 827; 80 ఇం. కే. (బొం) 173.

(3) 26 మ 133; 22 పీ. 8. 348.

(4) 52 ఇం. కే. (పం) 919.

19. జడత్వము (Idiocy) ఇది జన్మముతోడనే ఉండవలయు నని వేరుగ చెప్పనక్కర లేదు జడత్వమనగా ప్రాపంచికజ్ఞానము, ఉచితానుచితజ్ఞానము, లేకపోవుట. ఈదోషము సంపూర్ణముగా నుండవలయును. కాని కొలదిగా నుండకూడదు. అనగా తనవ్యవహారములను తాను చేసికొనలేడనికాని, లోకములో ప్రజలకుండు సామాన్య జ్ఞానమునకు కొంచెము తక్కువ జ్ఞానము కలవాడనికాని, అతనియాస్తితో సంబంధించినవ్యవహారముల నింకొకరు చూచుచున్నారనికాని ఋజువుచేసిన చాలదు. సంపూర్ణజడునకుమాత్రమే భాగార్హత లేదు(1).

జడత్వము.

20. ఉన్మత్తుడనగా పిచ్చివాడు లేక వెఱ్ఱివాడు. ఈదోషము జన్మముతో నుండనక్కర లేదు. విభాగకాలమునాటికున్నచో అతనికి భాగార్హతలేదు. భాగమిమ్మనియడుగుట కాతనికి హక్కులేదు. ఇది కుదురునదియా? కుదరనిదియా? యను ప్రశ్నతో పనిలేదు(2). మధ్యకాలములో వచ్చినపిచ్చి అయినచో వానికి భాగముండుననియును, జన్మముతో కలిగినహక్కు, మధ్యకాలములో సంభవించినఉన్మత్తతచేత నశించిపోవదనియు కొన్ని తీర్పులున్నవి(3). కాని ప్రివికౌన్సిలువారును, ఈనడుమ సామా

ఉన్మత్తత.

(1) 1 సు. హై. రి. 214; 12 అ 530; 18 క 111; 73 ఇం. కే. (లా) 898 115 ఇం. కే. (జో) 197.

(2) 13 మా. ఇం. అ 519; 14 మా. ఇం. అ 176; 18 వీ. రి. 305; 9 బెంలా. రి 198; 5 అ 509; 10 క. 639; 32 ఇం. కే (అ) 127; 22 క 864; 8 క 149; 919; 8 క. లా జ. 369; 4. మ. లా. జ. 88. 78 ఇం. కే (బొం) 279; 55 ఇం. కే (మ) 576. ఇందులో ధర్మశాస్త్రవిమర్శన చక్కగా చేయబడినది. 68 ఇం. కే. 111.

(3) 1 బొం 177; 14 మ 279 (294); 28 అ 247; 22 క 864; 29 ఇం. కే. 42; 116 ఇం కే (నా) 668; 48 మ 464.

న్యముగా అన్ని హైకోర్టులును, ఉన్మత్తత జన్మముతో నుండనక్కర లేదనియే తీర్మానించుచున్నందున నదియే గమనింపఁదగియున్నది. కుటుంబవ్యాపారము చేసికొనలేనివాడనియు దుర్బలహృదయము కల వాడనియు, చెప్పినంతమాత్రమున పిచ్చివాడుగాపరిగణింపకూడదు(1)

పిచ్చివారలను, వారియాస్తిని సంరక్షించుటకు ఇండియాదొరతనము వారు చిరకాలముక్రిందట నుండి శాసనములను చేయుచు అందు సవరణలను చేయుచు రద్దుచేయుచు వచ్చిరి. ఇప్పుడు ఈవిషయమున 1912 వ సం॥ నె 4 రు ఆక్టు అమలులోనున్నది. ఆయాక్టుయొక్క 71 వసెక్షనులో, పిచ్చివారి యాస్తిని వశముచేసికొని వ్యవహరించుటకు మేనేజరునుగాని, రిసీవరునుగాని నియమింపవచ్చునని సివిలుకోర్టుల కధికారమొసంగబడినది. సమష్టికుటుంబ మెంబరులలో, ఒకడు పిచ్చివాడు అయినయెడల, అతనియాస్తికి కోర్టువారు మేనేజరునుగాని రిసీవరునుగాని నియమింపవచ్చునా ? యను విషయము వివాదాంశమై యున్నది. సమష్టికుటుంబాస్తిలో, పిచ్చివానికి భాగమే లేదని చెప్పుచుండగా నాతనికి ఆస్తియెక్కడిది ? పైనచెప్పబడిన సెక్షను, ప్రత్యేకముగా ఆస్తి కలిగియున్నవానినిగూర్చి చెప్పబడినదికాని, సమష్టికుటుంబమెంబరును గూర్చి చెప్పలేదని కొందరి యభిప్రాయము.

తండ్రికిగాని, జ్యేష్ఠసోదరునకుగాని, పిచ్చి యెత్తి తక్కిన మెంబర్లు, మైనర్లుగానున్నారనుకొనుడు. అప్పుడాయాస్తిని మరియొకరు వ్యవహరించుటకంటె కోర్టువారు వ్యవహరించుట మంచిదికదా. సమష్టికుటుంబమెంబరుకదాయని సదరుసెక్షనుప్రకారము కోర్టునకధికారము లేదని చెప్పినచో శాసనముయొక్క యుపయోగమే లేకుండ పోవును. ఇతరమెంబరులు, ఆస్తిని పాడుచేయుచున్నారని స్పష్ట

(1) 115 ఇం. కే. (మ్రా) 197.

ముగా రుజువైనప్పుడుమాత్రము పైనచెప్పబడిన సెక్షనుక్రింద సమష్టి కుటుంబాస్తిలోని యతనిభాగమునకు మేనేజరును నియమించుటకు కోర్టున కధికారము కలదని నాగపూరుకమిషనరు కోర్టువారు తీర్మానించియున్నారు(1). అయితే, ఆకోర్టువారు, సమష్టికుటుంబాస్తిలో, పిచ్చివానికి, భాగము కలదని యంగీకరించుతరగతిలోనివారైయున్నారు. సమష్టికుటుంబాస్తిలోని పిచ్చివానిభాగమునకు మేనేజరును నియమింపకూడదని పాట్నా, మదరాసుహైకోర్టులు తీర్మానించినవి(2). బొంబాయి కలకత్తా హైకోర్టులిదమిత్థమని నిర్ణయించలేదు(3). ఔడ్ చీఫ్‌కోర్టువారు నియమింపవచ్చునని తీర్మానించిరి(4).

ఎట్లయినను ఈవిషయమింకొకసారి, సంపూర్ణవిమర్శ చేయబడదగినదై యున్నది.

21 కుష్ఠరోగముగలవాడు భాగార్హుడుకాడను నియమమును దేవలుడుమాత్రమే చేసినట్లు కన్పట్టుచున్నది. తక్కినస్మృతికర్తలు నిషేధించినట్టి చికిత్సకు సాధ్యముకానిరోగములలో నిది చేరియుండవచ్చును. భాగానర్హుండగుటకు కుష్ఠరోగము పుట్టుకతోనుండనక్కరలేదు. కాని అది యసాధ్యమయినదియు, తీవ్రతమమైనదియునై యుండవలయును. సామాన్యమైనకుష్ఠు అయినచో భాగము లేకుండపోదు(5). ప్రజలతో

కుష్ఠరోగము.

(1) 116 ఇం. కే (నా) 663.

(2) 49 ఇం కే. (పా) 907; 17 ఇం. కే (మ)473.

(3) 19 బొం 309; 20 బొం 659; 6 క 539.

(4) 8 ఇం. కే 660.

(5) 5 బొం: హై. 8 145; 9 బెం. లా. 8 1149; 1 బొం 554; 19 మ 74; 22 క (ప్రి. కౌ) 843; 21 బొం 205; 26 మ 214; 18 ఇం. కే. 490 ; 19 ఇం కే (మ) 690; 4 క. లా. జ 823; 254 మ. లా. జ 251; 18 మ. లా. ట. 460;75 ఇం. కే (క) 474; 80 ఇం. కే. (ప్రి. కౌ) 198

కలసిమెలసి తిరుగుటకు వీలు లేనంతమాత్రమున భాగమునకర్హుఁడు కాకపోఁడు(1). భాగానర్హుఁడగుటకు కుష్ఠురోగమెట్టిదిగా నుండవలయునో అష్టాంగహృదయము, మాధవనిదానము, మొదలగు వైద్యగ్రంథముల సాహాయ్యమున నొకకేసులో మదరాసుహైకోర్టువారు నిర్ణయించియున్నారు. శరీరమున పురుగులుపడుట, చూచుట కేహ్యముగానుండుట, మొదలగు తీవ్రతమలక్షణములు కలవారుమాత్రమే భాగానర్హులని చెప్పబడినది(2). భాగానర్హుఁడని ఎవరు వాదించుచుందురో వారే భాగానర్హతకు తగినకుష్ఠరోగమున్నదని నిస్సందేహముగు నట్లుబుజావుచేయవలయును(3). తండ్రియాస్తి సంక్రమించినపిదప కుమారునకు కుష్ఠురోగము వచ్చెను. అంతమాత్రముచేత అతఁడా యాస్తిని వ్యవహరించుట కర్హుఁడుకాకపోఁడు. న్యాయమయినయవసరముకొరకాతఁడు చేసినపని యోగములు కుమారులను బయిండు చేయును. కాని కుష్ఠురోగి చేసినవికదాయని చెల్లకపోవు(4).

22. చికిత్సకసాధ్యములైన రోగముగలవారివిషయము. ఈరోగము చికిత్సకు సాధ్యము, ఇదియసాధ్యము, అని నిర్ణయించుట శక్యము కాదు. ఈవిషయమున వైద్యులు తరుచుగా భిన్నాభిప్రాయులగుచుందురు. కావున న్యాయస్థానము లీవిషయము నమలుజరుపకుండుట మంచిదని తీర్మానించియున్నారు(5).

చికిత్సకసాధ్యములైన యితరరోగములు.

(1) 80 ఇం. కే (ప్రి. కౌ) 193.

(2) 88 మ 250; 19 ఇం. కే. 690; 25 ఇం. కే 968.

(3) 19 మ 74; 75 ఇం. కే (క) 474; 27 క. వీ. నో. 959.

(4) 48 ఇం. కే (అ) 62.

(5) 12 బొం. హై. 819; 26 మ 188; 27 మ 591; 28 మ 250; 23 ఇం. కే. Mere tumour in the nasal cavity is not a disqualification 521;

23. పితృద్వేషి, భాగార్హుడుకాడని నారదుడుమాత్రమే విధించియున్నాడు. తండ్రి భగవంతునితో సమానుడు. కావున సర్వదా పూజనీయుడు. జీవించియుండగా తండ్రినికొట్టితిట్టినవాడును, చనిపోయినపిదప తండ్రికి శ్రాద్ధాదికర్మలను చేయనివాడును పితృహంతకునితో సమానుడని స్మృతులుచెప్పుచున్నవి. కాని ఈకాలమున న్యాయస్థానములు, పితృద్వేషిని భాగమునకనర్హునిగా గమనించుట లేదు. తండ్రితో విరోధముగానున్నంతమాత్రమున నతనికి సమష్టికుటుంబాస్తియందున్నహక్కు పోనేరదు. విరోధముచేత తండ్రితో వేరుగానున్నను, సమష్టికుటుంబద్రవ్యమునుండి పోషింపబడుచున్నంతవరకు కుమారుడు కుటుంబమునుండి విడిపోయెనని యెంచవీలు లేదు(1). నిజముగా తండ్రిని చంపినవానికిమాత్రము ఆస్తియందు భాగము లేదు. వానిభార్యకును వానికుమారునకునుకూడ లేదు. కాని వారు, కుటుంబద్రవ్యమునుండి పోషింపబడనర్హులు(2). అయితే పితృహత్యకుపూర్వ మాహంతకునకుకలిగినకుమారుడుకూడ భాగానర్హుడా ? యనునంశము విచారణీయము.

పితృద్వేషము.

24. హిందూమతమును విడచి ఇతరమతమును గైకొనినవారు పైనవివరించిన స్మృతులలోని "పతితులు" అనుపదములోజేరి పూర్వము భాగానర్హులుగా పరిగణింపబడెడివారు. కాని, 1850 వ సంవత్సరములో ఇండియాదొరతనమువారుచేసిన నె 21 రు ఆక్టుననుసరించి, యిప్పుడానిర్బంధము తొలగిపోయినది. ఎవరైనను మతాంతరమును గైకొనినంతమాత్రమున వారికి ఆస్తిగాని హక్కులుగాని పోనేరవు. మతాంతరమును

మతాంతరగ్రహణము. 1850 సం॥ నె 21 రు ఆక్టు.

(1) 25 ఇం. కే 480.

(2) 18 ఇం. కే 764.

గ్రహించినప్పటినుండియు నాతనికి హిందూలా వర్తింపదు. ఈయాక్టునకు పూర్వము, అన్యమతమును గ్రహించినవారి కీశాసనము రక్షణ యొసంగదు(1). అయితే, మతాంతరమును గైకొనినతోడనే అతనికిని తక్కినమెంబర్లకును ఉండుసంబంధమెట్టిది? ఎట్టిహక్కులను కలిగియుందురు? అనువిషయములు విచారణీయములు. సమష్టికుటుంబములోని యేమెంబరైనను, మతాంతరమును గైకొనినచో ఆతడు వెంటనే ఆకుటుంబములోనుండి విడిపోయినట్లెంచవలయును(2). అప్పటికుండు అప్పుఆస్తులయందుమాత్రమే అతనికి హక్కుబాధ్యతలు కలిగియుండును(3). మతాంతరుడైనపిదప, వానియెరుకను వానికివ్యతిరేకముగా పండ్రెండుసంవత్సరములు తక్కినమెంబర్లు కుటుంబాస్తిని అనుభవించుచుండిరేని ఆమతాంతరుడు వారివద్దనుండి తనభాగమును రాబట్టుకొనజాలడు(4). మతాంతరస్వీకరణమునాటికి, కుటుంబమునకుండు అప్పులకొరకు హిందూమతములోనున్న యాతనితండ్రి ఆమతాంతరునిభాగమును విక్రయింపకూడదు. కాని ఆరుణములలో మతాంతరుడు తన వంతునీయక తప్పదు(5). ఒకమెంబరు మతాంతరుడైనందువలన అతడుమాత్రమే విడిపోయినట్లెంచవలయును. మొత్తము కుటుంబమంతయును విడిపోయినట్లెంచవలయు నను నియమములేదు. తక్కినవారు కలిసియున్నట్లే యెంచవలయును. ఒకడు మతాంతరుడైన

(1) 1811 స. వీ. నో (ప్రి. కౌ.) 482; 78 ఇం. కే (పా) 749; 23 మ171.

(2) 9 మూ. ఇం. అ 195 (241); 25 అ 546 (578); 38 అ 356; 40 క 407; 14 ఇం. కే 480; 35 ఇం. కే 549; 6. లా. లా. జ. 84; 126 ఇం. కే (అ) 345.

(3) 10 అ 546; 38 అ 356.

(4) 18 అ 90; 35 క 961; 32 ఇం. కే 127.

(5) 22 మ 519; 24 మ 455; 18 మ. లా. జ 599.

పిదప మరిపదిసంవత్సరముల కికనొకడైనచో రెండవవాడు అంతవరకును తక్కినకుటుంబముతో కలిసియున్నట్లెంచబడి వానిహక్కులు అంతవరకును నిలిచియుండును(1). ప్రివికౌన్సిలువారొక కేసులో మతాంతరమును గ్రహించినవాడు, తనపూర్వపుమతమును విడిచిపెట్టినను తనపూర్వపు 'లా'ను విడిచిపెట్టకుండ దానినే యనుసరించుచుండ వచ్చునని యొకవాక్యము నుదాహరించియున్నారు(2). ఈవాక్యము నాధారముగా తీసికొని క్రిష్టియనుమతమును గైకొనినను హిందూలా ననుసరించి సర్వైవరుషిప్పు(3)ను కలిగియుందురని బొంబాయిహైకోర్టువారు తీర్మానించియున్నారు. 1850 సం॥ రం నె 21 రు ఆక్టులో "హిందువు, మతాంతరప్రవర్తకుడైనను, అతనిహక్కులు నశించిపోవు" అనిమాత్రమే వ్రాయబడియున్నది. కాని కొన్నిహక్కులుండుననియు, కొన్ని హక్కులుండవనియు, వ్రాయబడలేదు. కావున హిందూమతములో నున్న సమష్టిసోదరుడు చనిపోయినప్పుడు మొత్తపుటాస్థికి, యీమతాంతరుడు హక్కుదారుడగునని బొం. హై. వారి యభిప్రాయము(4). మొత్తము కుటుంబమంతయును మతాంతరమును గైకొని అందరును హిందూలా ననుసరించి తమతమ హక్కులను నిలుపుకొనియున్నయెడల, వారిలో నొకరు చనిపోయినప్పుడు తక్కినవారి కాయాస్తి సర్వైవరుషిప్పుద్వారా రావచ్చును. కాని ఒకమెంబరు మతాంతరమును గ్రహించి, మిగిలిన హిందువులతో తనహక్కులను నిలుపుకొని యుంచుకొనెదననిన నదిపొసగదు.

మతాంతరులగు కుటుంబమెంబర్ల హక్కులనుగూర్చి హైకోర్టులభిన్నాభిప్రాయములు.

(1) 40 క 407.

(2) 9 మూ. ఇం. అ 195 (241).

(3) సర్వైవరుషిప్పు, అనగేమియో 4 వ ప్రకరణమున చెప్పబడును.

(4) 19 బొం 680 (687); 23 బొం 539 (543); 31 బొం 25.

అతడు మతాంతరమును గైకొనినతోడనే తక్కినవారితో కలసి యుండు అభిప్రాయ మాతనికి లేదనియు, అందుచే విభాగమైనట్లెంచ వలయుననియు, ఆస్తి ఆనాడే విభజించుకొనకపోయినను అప్పటి నుండియును, కుటుంబసంబంధము లేనియితరులవలె భాగస్వాములు మాత్రమై యుందురనియు, మ. హై. వారి యభిప్రాయము(1). సమష్టికుటుంబాస్తిని మేనేజిమెంటుచేయుటకు కర్త కధికారము కలదు. ఆయధికారము హిందులా ననుసరించివచ్చినది. హిందూ కుటుంబము క్రిష్టియనులైనప్పుడు, హిందూలాప్రకారము, మేనేజరు నకుండుహక్కులు ఆక్రిష్టియనుకుటుంబమేనేజరున కుండవు(2). ఆ స్తిని విభజించుకొనుటకు హక్కులేకపోయినవానికి, అన్యమతస్వీకార మువలన క్రొత్తగా అట్టిహక్కు కలుగదు(3). అన్యమతమును గ్రహించినవాడును హిందూమతములోనున్నవారును తమలో నొకరుచని పోయినచో మొత్తమాస్తియంతయును మిగిలినవారికి వచ్చునట్లు యేర్పాటును చేసికొనిన చేసికొనవచ్చును(4).

25. 1850 సం॥ నెం 21 రు ఆక్టు, ఎవరికిని, అదివరకు లేని క్రొత్తహక్కులనీయదు. అదివరకున్నహక్కును పోకుండమాత్రమే అది కాపాడును. మహమ్మదీయమతమును గైకొనినతండ్రియాస్తి, హిందూమతములోనున్న కుమారునికు రానేరదు(5). పైనుదహ

(1) 10 మ 69; 1912 మ. వీ. నో. 386; 10 అ 546; 33 అ 356; 29 అ 487; 80 ఇం. కే 519; 35 ఇం. కే. 549; 126 ఇం. కే (అ) 345.

(2) 15 మ. లా. జ. 285.

(3) 64 ఇం కే (మ. ఫు. బెం.) 676.

(4) 1912 మ. వీ. నో 386; 9 మూ. ఇం. అ 195; 48 అ 525.

(5) 64 ఇం. కే (మ. ఫు. బెం.) 676; 68 ఇం. కే (మ) 667; 31. ఇం. కే 476.

రించిన యాక్టు ననుసరించి మతాంతరమును గ్రహించినవానికి మాత్రమే హక్కు యేర్పడునా? ఆతనిసంతతికికూడహక్కు ఉండునా? అని ప్రశ్నరాగా అ. హై. వారొకకేసులో నీవిధముగా తీర్మానించి నారు. క, చ అనువారిరువురు అన్నదమ్ములు. చ, మతాంతరుడైనాడు. మతాంతరుడైన పిమ్మట, అతనికి ట, యనుకుమారుడు కలిగినాడు. చ, ముందుగా చనిపోయినాడు. క, సంతతిలేకుండ తరువాతచనిపోయినాడు. క యొక్క ఆస్తి, ట, కు వచ్చునా? వచ్చునని తీర్మానించినారు(1). లాహోరు హైకోర్టువారొక కేసులో సదరుతీర్పును అంగీకరించినారు(2). కాని మద్రాసుహైకోర్టువారును ఔధ్ చీఫుకోర్టువారును దీనికివ్యతిరేకముగాతీర్మానించియున్నారు(3) హిందువైయుండి పిమ్మట మతాంతరమును గైకొనినచో సదరుఆక్టు రక్షణనొసంగును కాని వానిసంతతికి ఈయాక్టువర్తించునా? ట స్వమతమునందే యున్నాడుకాని అన్యమతమును స్వీకరింపలేదుకదా! వానికీయాక్టు ఎట్లువర్తించును? అను నంశములు విచారణీయములు. అలహాబాదు తీర్పును, అంగీకరింపక సదరుఆక్టు మతాంతరమును గైకొనినవారికిమాత్రమే వర్తించుననియు, వానిసంతతికి యీ ఆక్టు వర్తింపదనియు ప్రి. కౌ. వారు తీర్మానించిరి(4). ప్రివి కౌన్సిలువారి యీతీర్పుతో, అలహాబాదుతీర్పును దానిననుసరించిన యితర తీర్పులును రద్దు అయిపోయినవి. హిందువు మహమ్మదీయమతము

మతాంతరుని సంతతికి కూడ 1850 సం॥ సెం 21 రు ఆక్టు రక్షణనిచ్చునా?

(1) 11 అ 100.

(2). 55 ఇం, కే (లా). 420.

(3). 40 మ . 1118; 1927 మ 72; 107 ఇం. కే (ఔ) 690. 132 ఇం. కే (ఔ) 890.

(4) 128 ఇ. కే. (ప్రి. కౌ.) 268.

నవలంబించినచో వానిసంతతికి మహమ్మదీయ"లా" వర్తించును కాని హిందూ "లా" వర్తింపదు.

26. తనవర్ణమునువిడిచి యితరవర్ణముతో కలిసి వారియన్నమునుదినుట, ఇతరజాతిస్త్రీలను పెండ్లియాడుట, వారితో వ్యభిచరించుట, మొదలగునవి మహాదోషములుగా నెంచబడి వారిని కులభ్రష్టులుగా నెంచెదరు. వీరిని పతితులని స్మృతికర్త లెంచియున్నారు. వీరికికూడ పూర్వము భాగార్హత లేకుండెడిది. కాని, ఈదోషమును 1850 సం॥ న 21 ర ఆక్టు పరిహరించెనా? అను విషయము వివాదగ్రస్తమై యున్నది. మతాంతరమును గైకొనినవారలకే ఆశాసనము శరణ్యముగాని, హిందూమతములోనుండి దుర్నీతిపరులగుటచే వర్ణభ్రష్టులైనవారిని ఆశాసనము రక్షించదని పండిత గులాప్‌చంద్రసర్కారు శాస్త్రిగారు తమ హిందూలాలో యభిప్రాయము నొసంగియున్నారు. కొన్ని హైకోర్టులు, ఆశాసనమునందు కులభ్రష్టులైనవారికి (deprived of caste) కూడ హక్కుపోకుండునట్లు వ్రాయబడియున్నది. కావున, ఆయాక్టు కులభ్రష్టులకుకూడ వర్తించునని తీర్మానించినారు(1) ప్రివి కౌన్సిలువారు ఒక కేసులో, ఈవిషయమును ఆలోచించియు, నేమియును చెప్పక విడచివైచిరి(2). ఇక నొక కేసులో వర్ణభ్రష్టులకు, సదరు ఆక్టు వర్తించునని యభిప్రాయపడిరి(3). కొన్ని హైకోర్టులు, అశాసనములోవ్రాయబడినవాక్యములకు మతాంతరమును గైకొనుటచే వర్ణభ్రష్టులైనవారనియే యర్థము కాని, హిందూమతము నందుండి,

కులభ్రష్టులకు 1850 సం॥ న 21 ర ఆక్టు వర్తించునా?

(1) 5 మ. హై. 8. 477; 78 ఇం. కే. (పా) 749; 129 ఇం. కే (పా) 183; 40 ఇం. కే. (బొం) 78.

(2) 5 క 776.

(3) 10 ఇం. కే. (ప్రి. కౌ.) 477.

యకార్యకరణముచే కులభ్రష్టులైనవారని యర్థమురాదని తీర్మానించి నవి(1). ఈకడపటితీర్పులే యనుసరణీయములని తోచుచున్నది.

1858 సం॥ న 21 రు ఆక్టు రక్షణ నొసంగనిచో కులభ్రష్టులకు భాగార్హత లేదని స్పష్టమగుచున్నది. కాని కులభ్రష్టులనగా, నెట్టివారనువిషయము స్పష్టముగా లేదు. బ్రాహ్మణుడు, శూద్రస్త్రీని పెండ్లియాడినచో నది శాస్త్రసమ్మతమే యగును(2). కులభ్రష్టులను నిర్ణయించువిషయమున స్మృతులకాలమునకును ఈకాలమునకు జాలభేదమున్నది. విదేశగమనాదులవలన కులభ్రష్టులగుదురని పూర్వముండెడిది. ఇప్పుడది దోషముగా పరిగణింపబడుట లేదు. విధవావివాహమువలన వర్ణభ్రష్టత్వము సంభవింపకుండ 1856 వ సంవత్సరపు న 15 రు ఆక్టు కాపాడుచున్నది. ఏయేకార్యములు చేసినచో కులభ్రష్టులుగా పరిగణింపబడి భాగార్హత లేకుండ పోవునో స్పష్టము చేయు తీర్పులు కానరావు. అట్టి కేసులు వచ్చినప్పుడు ఆకేసుయొక్క సందర్భమును బట్టి, విచారణ చేసియీవిషయమును నిర్ధారణ చేయవలసియున్నది.

27. దాసీపుత్రులనగా కులాచారము ననుసరించి వివాహము కాకుండ, ఒకస్త్రీని ఉంచుకున్నయెడల, దానికి సంతానము కలిగనేని, వారు దాసీపుత్రు లనబడుదురు. వీరిని ఇంగ్లీషులో Illigimate sons అనియెదరు. ఈవిషయమును గూర్చిన స్మృతివచనములు విభాగప్రకరణమున వ్రాయబడును. దాసీశబ్దము (Slave)1843 సంవత్సరపుఆక్టుననుసరించి తొలగిపోయినదనియు అందుచే శూద్రులలో నైనను దాసీపుత్రులకు భాగార్హతగాని, వారసత్వముగాని లేదని కలకత్తా హైకోర్టువారు

దాసీపుత్రులు కుటుంబమెంబర్లగుదురా ?

(1) 28. మ. 171; 184 ఇం. కే. (క) 1272.

(2) 181 ఇం. కే. (బొం) 17.

ఒకప్పుడు తీర్మానించిరి(1). కాని 1921 సం॥లో ఫుల్ బెంచివారు, ఆతీర్పులను రద్దుచేసి శూద్రులలో దాసీపుత్రులవిషయమై తక్కిన హైకోర్టులతో నేకీభవించి, ఉంపుడుకత్తెకుమారులకు హక్కుకల దని తీర్మానించిరి(2). అయితే, ఆస్త్రీ, ప్రత్యేక మాపురుషుని యుంపుడుకత్తెయై యుండవలయును కాని, వ్యభిచారమువలన కలిగినసంతాన మీతరగతిలో చేరదు(3) తలిదండ్రు లిరువురును హిందువులైన గాని, వారి కిరువురకు గలిగినసంతానము హిందువులుకారు. అట్టి వారికి హిందూలావర్తింపదు. కావున హిందువునకు మహమ్మదీయ స్త్రీవలనగాని క్రిష్టియనుస్త్రీవలనగాని కలిగినకుమాళ్ళు హిందూలాననుసరించి దాసీపుత్రులు కాజాలరు అట్టివారు తల్లి యేమతమునకు చెందియుండునో, ఆమతమువారగుదురు. వారికి, హిందువులకుటుంబాస్తిలోనుండి పోషింపబడుహక్కుగాని, భాగార్హతగాని లేదు(4).

దాసీపుత్రుడగునా కాదా యనువిషయమున తగాదావచ్చినప్పుడు, ఇండియన్ యెవిడెన్సుఆక్టు 112 సెక్షనుప్రకారము భావన (Presumption) వర్తించదు. సాక్ష్యముచే, ఆయంశమును రుజువు. చేయవలసియుండును(5). ఉంపుడుకత్తె, అవివాహితయైయుండవలయునను నియమములేదు. ఒకరు వివాహమాడినస్త్రీని, ఇంకొకడు ఉంచుకొని, సంతానమును కనినయెడల, వారు దాసీపుత్రులుగానే పరిగణింపబడుదురు(6).

---

(1) 28 క 194, 1 క 1; 19 క 91.

(2) 68. ఇం. కే (క) 50.

(3) 132 ఇం. కే (పా) 35ర; 131 ఇం. కే (బొం) 888; 39. మ. (ఫు. బెం) 186; 41 మ. 44; 40 బొం. 369. 46 బొం. 1022.

(4) 27 మ 18; 64 ఇం. కే (లా) 892. 73 ఇం. కే (బొం) 412.

(5) 27 మ 32.

(6) 131 ఇం. కే. (బొం) 888.

ద్విజులకు (బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు) కలిగినదాసీపుత్రులను, కుటుంబాస్తిలోనుండి పోషింపవలసియున్నది. కాని వారికి భాగార్హతలేదు. వారు కుటుంబమెంబర్లుగా భావింపబడరు. శూద్రులలో మాత్రము కొన్నిపద్ధతులకు లోబడి, అట్టిసంతానమునకు భాగార్హతకలదు(1). శూద్రులలో దాసీపుత్రులు కుమారులువంటివారే యగుదురు. వారు, కొన్నివిషయములలో మాత్రము కుటుంబమెంబర్లుగానే యెన్నబడుదురు. వారికి తండ్రియాస్తిలోవచ్చెడి భాగము జీవనాంశము నిమిత్తమైనదిగా కాకుండ, కుమారుడుగా వచ్చెడిభాగముగానే యెంచబడవలయును. కాని తండ్రి ప్రత్యేకఆస్తి యేమియు లేకుండ, ఆతనిసోదరులు మొదలగువారితో సమష్టిగానుండి చనిపోయెనేని, ఆతనిదాసీపుత్రులకు అందుభాగమురాదు గాని, కుటుంబమెంబరువలె, అనగా వితంతువులు మొదలగువారివలె కుటుంబాస్తినుండి పోషింపబడుహక్కును కలిగియుందురు(2). దాసీపుత్రికలకు అనగా ఉంపుడుకత్తెయందు కలిగినకుమార్తెలకు భాగార్హత లేదు(3). ఉంపుడుకత్తెవితంతువైనను, అదివరకు వ్యభిచరించినదైనను, ఆరంభమున, నామెతోటిసంబంధము వ్యభిచారరీత్యా సంభవించినను, ఆమెకు కలిగినసంతతి ప్రత్యేకము తాను ఉంచుకొనిన

(1) 63. ఇం. కే. (క. పు. బెం.) 50; 22 అ. పి. కా. 191; 30. అ. 508; 7 మూ. ఇం. అ. 18; 1. బొం. 97; 7 మ. 407; 38 ఇం. కే. (మ) 858; 2 అ. 134; 6. అ.329; 12. మ. 72; 27. మ. 13; 78. ఇం. కే. (బొం) 412; 32. ఇం. కే. (బొం) 986; 4. బొం (పు. బెం) 37.

(2). 134. ఇం. కే. (పి. కా.) 1084; 49-మ. 116.

(3). 133 ఇం. కే. (అ) 792; 1921. బొం. 137.

పిమ్మట కలిగెనేని, వారు దాసీపుత్రులుగా భావింపబడి పైనచెప్పిన హక్కులు వచ్చును(1).

శూద్రులలో, దాసీపుత్రులకు, ఎంతభాగమువచ్చును? ఎప్పుడుభాగార్హతకలుగును? మొదలగు విషయములు విభాగప్రకరణమున చర్చింపబడును.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలో, ఉంపుడుకత్తెవలనకలిగిన దాసీపుత్రులకు భాగార్హతలేకపోయినను, తండ్రియాస్తిలోనుండి పోషింపబడవలయును. వారిజీవనాంశమునకు తండ్రియాస్తిపైని బాధ్యతకూడ ఉండును(2). జీవనాంశ మేరీతిగా నెంత యివ్వవలయునను విషయము "జీవనాంశము" అనుగ్రంథమున వివరింపబడును. తండ్రియును, దాసీపుత్రులును కలిసియున్నను, వారు సమష్టికుటుంబ మెంబర్లుకానేరరు. తనకుకలిగినదాసీపుత్రులను సమష్టికుటుంబ మెంబర్లుగా అంగీకరించుటకు తండ్రి కధికారము లేదు. కాని తండ్రి అనంతరము, ఆతని తాలూకు, దాసీపుత్రులకు సంక్రమించిన ఆస్తికి ఆదాసీపుత్రులు సమష్టికుటుంబమెంబర్లు అగుదురు(3). దాసీపుత్రులకు తండ్రియాస్తియందు, జన్మముచేత హక్కు కలుగదు(4). తండ్రిఅనంతరము, వివాహమాడినభార్యకుమారులును, దాసీపుత్రులును, సమష్టికుటుంబమెంబర్లుగా నెన్నబడుదురనియు, వారిలో వారికి సర్వైవరుషిప్పు ఉండుననియు, బొంబాయిహైకోర్టువారు తీర్మానించియున్నారు(5).

---

(1). 131 ఇం. కే. (బొం) 883.

(2). 128 ఇం. కే. (ప్రి. కౌ) 711; 5 ఇం. కే. (మ) 919; 8 మ 825; 32 క 479; 3. క 214; 12 మూ. ఇం. అ 203.

(3). 52. బొం. 300.

(4). 132 ఇం. కే (రం) 817.

(5). 4. బొం 37 పు. బెం; 137 ఇం. కే (బొం) 572.

28. యత్యాశ్రమ స్వీకారము, ద్విజులకుమాత్రమే స్మృతు లంగీకరించుచున్నవి. యత్యాశ్రమస్వీకారమనగా, ప్రాపంచికవిషయ పరిత్యాగము. సంపూర్ణ సన్యాసాశ్రమస్వీకారముచేసినవారికి, ఆస్తి యందు సంబంధము లేదు. వారు, సమష్టికుటుంబ మున మెంబర్లుగా నెన్నబడరు. ఆశ్రమస్వీకారము చేసినతోడనే, ఆస్తివిషయమున వారు చనిపోయి నట్లే యెంచబడి మిగిలినవారు హక్కుదారులగుదురు(1). కాని యది సంపూర్ణమైనదిగా నుండవలయును. కొన్నాళ్లు బైరాగులతో దిరిగి బైరాగియైనంతమాత్రమున నాతనికి భాగముపోదు(2). ఎనిమిది శ్రాద్ధములనుచేసి, తన శ్రాద్ధముకూడా చేసికొని ప్రాజాప త్యేష్టి, విరాజహోమము చేసి, హోమపాత్రలు కర్రవైనచో దహించి, లోహపువైనచో బ్రహ్మకిచ్చి నదీజలములయందు నిలు చుండి, ఆశ్రమస్వీకారసమయమున నుచ్చరింపవలసిన మంత్రము లను చదివినగాని, పూర్ణమైన సన్యాసము కానేరదు. అంతవరకును ఆస్తియం దాతనిహక్కుపోదు. కాషాయవస్త్రాదిధారణమాత్రమున సన్యాసికాడు(3). శూద్రులకు యత్యాశ్రమస్వీకారార్హత లేదు. కావున, సన్యాసాశ్రమమును స్వీకరించినను, శూద్రులకు భాగము పోజాలదు(4).

యత్యాశ్రమమును స్వీకరించినవారు.

---

(1). 1. మీ. ఠి. 209.

(2). 18 క. వీ. నో. 59; 10 మీ. ఠి. 172; 15. మీ. ఠి. 197.

(3). 40.ఇం. కే. (మ) 535; 2ఇం. కే (క) 385; 124 ఇం. కే. (అ) 761. ఆర్యసామాజమఁడు.

(4). 40 ఇం. కే (మ) 546 (551); 40 క. 545; 40 మ. 846; 39 బొం 168; 46 అ 616; 18 ఇం. కే 474; 43 ఇం. కే 167; 22 మ 302.

29. నపుంసకు లెప్పుడును భాగమున కనర్హులే. ఇది పుట్టుక తోడనే యుండవలయును. ప్రత్యేక మీవిషయముతో సంబంధించిన తీర్పులు కానరావు. కాని చాల తీర్పులయందు స్మృతుల నుదాహరించి, నపుంసకులకు భాగార్హత లేదని, తమ యంగీకారమును తెలుపుచునే యున్నారు.

నపుంసకులు

30. ఉపపాతకులు, భాగమున కనర్హులనువిషయ మిప్పుడమలులో లేదు. అనుదినమును, సంధ్యావందనము చేయనివాడు పతితుడని స్మృతులయందున్నది. పతితులకు భాగార్హత లేదుకదాయని, వారినికూడ నందులో జేర్చవలనుపడదు. ఉపపాతకులు కూడ నట్టితరగతిలోనివారు. కావున వారినిగూర్చి చర్చింపబని లేదు.

ఉపపాతకులు.

31. నిరింద్రియులని మనుస్మృతిలో చెప్పినశబ్దమునకు, కుంటివారు మొదలగువారని కుల్లూకభట్టు వ్యాఖ్యాన మొనర్చినారు. మితాక్షరిలో ''నిర్గతమింద్రియం యస్మాద్వ్యాధ్యాదినా సనిరింద్రియః'' రోగాదులచేత నింద్రియహానిని బొందినవారు నిరింద్రియులని వ్రాయబడియున్నది. మదరాసు హైకోర్టున్యాయమూర్తి సదాశివయ్యరుగారు నిరింద్రియశబ్దమునుగూర్చి విశేషవిచారణచేసి, నిరింద్రియులనగా స్త్రీలు, బలము లేనివారు- ఇవి మొదలుగాగల యర్థములు వేదమునందును, బోధాయనసూత్రమునందునున్నవని నిర్ధారణచేసియున్నారు. నిరింద్రియులని యెవరిని, భాగానర్హులుగా ప్రస్తుతమున యేన్యాయస్థానమును నిర్ధారణచేయుటలేదు. కావున నిక ఈవిషయమై విచారణచేయువలసినపని లేదు.

నిరింద్రియులు.

32. భాగానర్హులని నిర్దేశింపబడిన వారిదోషములు, పిమ్మట నివారణయయ్యేనేని వారికి తిరిగి భాగమీయవలయుననియు, వారి

పుత్రులు అట్టి దోషము లేనివారై రేని, వారికి భాగమీయవలయు
ననియు, మితాక్షరియందు విధింపబడినది.

దోషములుపోయి నపిదప, భాగము వచ్చునా?

"విభక్తేషు సుతోజాత స్సవర్ణాయాం విభాగభా
గిత్యనేన సమానన్యాయత్వాత్."

"విభాగోత్తరకాల మప్యౌషధాదీనాం దోషనిర్హార
ణే భాగప్రాప్తి రస్త్యేవ"

తండ్రియును కొడుకులును విభజించుకొనినపిమ్మట, తండ్రికి మరల సవర్ణజాతుడైనసుతుడు కలిగెనేని, యాతనికి భాగమెట్లిచ్చెదరో, అట్లే భాగానర్హుల పుత్రులకుగాని, భాగానర్హులకు దోషము పోయినపిమ్మటగాని, భాగ మీయవలయునని తాత్పర్యము.

''అపత్యం జడస్యభాగార్హమ్" గౌతములు.

తండ్రియును కుమాళ్ళును పంచుకొన్నప్పుడు తల్లి అస్పష్టగర్భవతియై యుండి విభాగమైనపిదప, కుమారుడు జన్మించెనేని, అదివరకు చేసికొనిన విభాగము రద్దుపడును. పిదప జన్మించినకుమారునకు భాగమిచ్చి మరల విభజించుకొనవలయును. విభాగకాలమునకు తల్లి గర్భవతిగానుండక మరికొంతకాలమునకు కుమారుడు జన్మించినయెడల, అప్పుడుకూడ మొదటివిభాగము రద్దుపడి, విభాగకాలమునాటికి కుటుంబమునకుండు ఆస్తియును, దానినిబట్టి పిమ్మట వృద్ధిపొందినదియుకూడ కలిపి అప్పటికినిల్చియున్నవారందఱును మరల విభజించుకొనవలయునని పూర్వముండెడిది. ఇప్పుడందించుకమార్పు జరిగినది. విభాగములో తండ్రి యేమియును మిగిల్చి యుంచుకొనక కుటుంబాస్తి అంతయును కుమాళ్లు పంచుకొనిరేని, తండ్రికి విభాగానంతరమెంతకాలమునకు మరల కొమారుడుజన్మించినను మొదటివిభాగము రద్దుఅయి పైనచెప్పినప్రకారము అమలుజరుగవలయును. తండ్రివిభాగములో తనకిందకొంతఆస్తిని నిలుపుకొనినయెడల, తరు

వాత కొంతకాలమునకు పుట్టినకుమారులు తండ్రివంతునకు వచ్చిన యావదాస్తిని పుచ్చుకొనుటకర్హులు. అంతేగాని, మొదటివిభాగము రద్దుకానేరదు. ఇవి ఇప్పుడు అమలులోనున్న విభాగధర్మములు.

అయితే భాగానర్హులు, వారిదోషములు ఔషధాదులవలన నివృత్తిఅయినపిమ్మట ఇందులో ఎట్టివారుగా గమనింపబడుదురు? విభాగకాలమునకు అస్పష్టగర్భవతియైనతల్లికి జన్మించినకుమారునివలె నా? తరువాత కొంతకాలమునకు జన్మించిన కుమారునివలెనా? భాగానర్హులకుమాళ్లు ఎట్టివారుగా గమనింపబడవలయును? దోష నివృత్తిగాని పుత్రోత్పత్తిగాని యెంతకాలమునకు కలుగునో తెలియ దుకదా! ఎంతకాలముగడచిపోయినను ఎందఱో యెంబర్లు భాగము లు విభజించుకొనిపోయినను, అవిఅన్నియును మరలకలిపి భాగింప వలయునా? తండ్రి తనవాటాకు కొంతవిభజించుకొని మిగిలినదిదోష రహితులైనకుమాళ్ళు విభజించుకొనినప్పుడు దోషసహితుడైనకుమా రుడు కొంతకాలమునకు మరల తనదోషమునుండి విముక్తుడయ్యేనేని, తండ్రిభాగములోమాత్రమే హక్కుదారుడగునా? లేక మొత్తము విభాగమంతయు రద్దుఅగునా? అనుననేకప్రశ్నలు బయలువెడలు చున్నవి. ఇట్టికేసులు అరుదుగావచ్చుచుండుటవలన ఈప్రశ్నలన్నిటికి సమాధానములు స్పష్టముగానున్నతీర్పులు గాన్పింపవు. బొంబాయి హైకోర్టువారు, ఒకసారిఆస్తియొకనికి సంక్రమించినపిదప అదితిరిగి పోనేరదను సూత్రమననుసరించి భాగానర్హునితండ్రి (కూటస్థుడు) చనిపోయినపిదప పైనచెప్పినదోషవిముక్తియైనను భాగానర్హునకు కుమారుడుకలిగినను, అతనికిభాగమురాదని తీర్మానించియున్నారు(1). మదరాసుహైకోర్టువారు బొంబాయిహైకోర్టువారికి వ్యతిరేకముగా

(1) 6 బొం 616; 32 బొం 455; 11 వీ. 8 11; 10 బొం. లా8. 559.

తీర్మానించియుండిరి(1). సమష్టికుటుంబముతో సంబంధించినంతవరకు మాత్రము ఆస్తిసంక్రమించినపిదప తిరిగి పోనేరదు అను సూత్రము అన్వయింపదు. సమష్టికుటుంబమెంబర్లలో ఒకడు చనిపోయెనేని, అతనిఆస్తి ఎవరికైనను సంక్రమించునని చెప్పకూడదు. కుటుంబములో అతనియాస్తియని చెప్పదగినదేదియు నుండదు. కుటుంబాస్తికి మిగిలియున్న మెంబర్లు హక్కుదారులగుచుందురు. క్రొత్తగా మరియొకడు జన్మించిన అతఁడును అందుచేరుచుండును. సమష్టికుటుంబద్రవ్యము నుండి జీవనాధారముకొఱకు భరణముగైకొనువారికికూడ సమష్టికుటుంబముతో ఒకవిధమగుసంబంధమున్నది అందుచే ఒకసారిహక్కుగాదఖలుపడినఆస్తి తిరిగిపోనేరదనుసూత్రము సమష్టికుటుంబమునకన్వయింపదు.

ఇద్దరు సమష్టిసోదరులలో ఒకడుచనిపోవుచు తనభార్యకు దత్తస్వీకారము చేసికొనుట కనుజ్ఞనిచ్చెను. అతడు చనిపోయినతోడనే ఆస్తియంతయును సోదరునివశమైనది. తరువాత కొంతకాలమునకు మొదటివానిభార్య దత్తస్వీకారము చేసికొనియెను. దత్తుడు తనపినతండ్రినితొలగించి అది అవిభాజ్యపుజమీందారియగుటచే జమీందారీనంతను స్వాధీనముచేసికొనుటకర్హుడని ప్రివికౌన్సిలువారు తీర్మానించిరి(2). క. చ. అనుసోదరులలో 'క' అనువానికి 'ట' అనుమాగవాడగుకొడుకు కలిగెను. క, ముందుచనిపోయెను. ఆస్తియంతయును 'చ' వశమైనది. పిమ్మట 'ట' కు 'త' అనుకుమారుడు కలిగెను. 'క' అనువానికికలిగిన సమష్టికుటుంబపుహక్కునకు మనుమడైన 'త'

(1) 9 మ. 64. ఈతీర్పు అప్రతిబంధదాయమునకేగాని సప్రతిబంధదాయమునకు వర్తించదు. 17 మ. 287.

(2) 1 మ 69.

హక్కుదారుడై 'చ' యొక్క పుత్రపౌత్రులతో సమష్టికుటుంబమెంబరగునని మదరాసుహైకోర్టువారు ప్రివికౌన్సిలు తీర్మానముననుసరించి తీర్పు నిచ్చియున్నారు(1). ఏకారణముచేతనైన 'త' కూడ భాగానర్హుడైనచో వానికొడుకు 'ప' అనువాడుకూడ అట్లే భాగానర్హుడు. 'ప' కూడ అట్లే భాగానర్హుడైనచో, అతనికుమారుడుమాత్రము 'క' అనువానికి, నాల్గవతరమువాడు కావునను, ట. త. ప. అనువారలు సమష్టికుటుంబమెంబర్లుకారు కావునను, 'చ' యొక్కవంశీయులతో పాలుగొనుట కర్హుడుకాడు(2). విభాగమైనపిదప భాగానర్హత సంభవించినచో అతనిప్రత్యేకవారసులకు సంక్రమించునుకాని, విభాగము రద్దుఅయి, మరలసమష్టికుటుంబములోనికి చేరదు.

33. భాగానర్హులనిచెప్పబడినవారును, వారిభార్యలును, వారి సంతతియును సమష్టికుటుంబముయొక్క ఆస్తినుండి పోషింపబడవలయును.

భాగానర్హులకు జీవనాంశము.

"కేవల మశనాచ్ఛాదనేన పోషణీయా భవేయుః.
అభరణా త్పాతిత్యదోషః" మితాక్షరా.
"గ్రాసాచ్ఛాదన మత్యంతం పతితోహ్యదద్భవేత్"
మనుస్మృతి.

అత్యంతం యావజ్జీవమిత్యర్థః. "జడక్లీబా భర్తవ్యా" గౌతముఁలు.

ఈ విషయమును గూర్చి "జీవనాంశము" అను గ్రంథమున విపులముగా వ్రాయబడును.

---

(1) 9 మ 64.

(2) 18 మూ, ఇం. ఆ. 519; 6 బెం. లా. రి 509; 2 బెం. లా. రి. 115.

34. స్మృతులలో విధింపబడకపోయినను, ప్రస్తుతకాలమున, సమష్టికుటుంబాస్తిలో హక్కునుపోగొట్టుకొనియెడి సమష్టికుటుంబ మెంబర్లు రెండుతరగతులవారున్నారు. (1) వ్యతిరేకభుక్తముచే హక్కుపోయినవారు. (2) హంతకులు.

వ్యతిరేకభుక్తము వలన సమష్టికుటుంబాస్తిలో హక్కుపోవునా?

వ్యతిరేకభుక్తమనగా సమష్టికుటుంబమెంబరులైనను సమష్టికుటుంబాస్తినిపండ్రెండు సంవత్సరములకు మించినకాలము, వారియెరుకను, వారికి వ్యతిరేకముగా తక్కినమెంబరులనుభవించుచుండిరేని, అది వ్యతిరేకభుక్తమనిపించుకొనును. సమష్టికుటుంబమెంబర్లలో ఒకడు ఆ స్తినిస్వాధీనమునందుంచుకొనియుండెనేని అది, అందరితరఫునను ఉంచుకొనియుండినట్లెంచవలయును(1). కాని తక్కినవారిని తొలగించినట్లెంచకూడదు. ఆ స్తిని అనుభవించుచున్నవాడు, తక్కినవారికి హక్కులేనట్లు, వారియెరుకమీద అనుభవించుచున్నప్పుడుమాత్రమే వ్యతిరేకభుక్తమగును. ఒకమెంబరు తనపేర కవులుకదపాలు వ్రాయించుకొనుచున్నంతమాత్రమున, శిస్తు వసూలు చేసికొనుచున్నంతమాత్రమున, వ్యతిరేకభుక్తమనిపించుకొనదు(2). వ్యతిరేకభుక్తము తనకు కలదనివాదించువారు, కుటుంబములోని ఇతరమెంబర్లను కుటుంబాస్తిభుక్తములోనుండి తప్పించినట్లు స్పష్టముగా రుజువుచేయవలయును. అట్లు రుజువుచేసిననేతప్ప, వ్యతిరేకభుక్తముకాజాలదు(3). పంచుకొనుటలో మరచిపోయిన ఒకభూమిని అనుభవించు

(1) 42 మ 481; 117 ఇం. కే (పా) 636; 64 ఇం. కే (అ) 471; 60 ఇం. కే (క) 298; 89 ఇం. కే (బొ) 498;

(2) 42 మ 481; 74 ఇం. కే (మ) 27; 65 ఇం. కే (బొ) 8;

(3) 51 ఇం. కే (క) 128; 64 ఇం. కే (అ) 471; 99 ఇం. కే. (మ) 158; 19 క. 253; 35 క 961.

6

చున్న మెంబరునకు అది వ్యతిరేకభుక్తము కాజాలదు(1). సమష్టికుటుంబాస్తిలో తనకు వాటాగాని, సంబంధముగాని లేదని, చెప్పుచు తనకు తెలియునట్లు యితరమెంబర్లు దానిని ప్రత్యేకముగా అనుభవించుచుండగా, ఏమియుచేయక పండ్రెండేండ్లూరకున్నవాడు, పండ్రెండుసంవత్సరములఅనంతరము, సమష్టికుటుంబాస్తిలో, భాగమునుగాని ఎట్టిహక్కునుగాని, పొందజాలడు(2). వానినిపోషింపవలసినబాధ్యత, తక్కినమెంబర్లకు లేదు. వ్యతిరేకభుక్తము పండ్రెండేండ్లు వరుసగాను, పబ్లికుగాను, హక్కుదారునకు స్పష్టముగా తెలిసియుండులాగునను ఉండవలయును(3).

వ్యతిరేకభుక్తముచే సమష్టికుటుంబాస్తిలో హక్కుపోగొట్టుకొనినవానిసంతతికి, మరల ఆయాస్తిలో హక్కుకలుగదు(4).

హిందూధర్మశాస్త్రములు కాలదోషము నెఱుంగవు. అందుచే వ్యతిరేకభుక్తవిషయమున వాటియందేమియు గానరాదు.

హంతకులకు సమష్టికుటుంబాస్తియందు హక్కుకలదా?

35. ఎవరినిగాని హత్యచేసినచో, ఆస్తియంతయునుగాని కొంతగాని, హంతకునకు వచ్చుసందర్భమున్నప్పుడు, ఆహంతకుడు, ఆయాస్తికిగాని, అందలిభాగమునకుగాని అర్హుడుకాడు. ఈనియమము స్మృతులనుండి వచ్చినదికాదు. స్మృతులలో ఈనియమము స్పష్టముగా వ్రాయబడియుండలేదు. పతితులు, మహాపాతకులు, ఉపపాతకులు, భాగానర్హులని స్మృతులుద్ఘోషించుచున్నమాట నిశ్చ

(1) 74 ఇం. కే (మ) 1018; 66 ఇం. కే (బొ) 461.

(2) 35 ఇం. కే 549; 3 క 228.

(3) 1 క. లా. రి. 269 (264); 47 క 274; 16 క. వీ. నో. 849; 21 క. లా. జ 258; 28 క. లా. జ 467; 29 క. లా. జ 241; 24 మ 441; 26 ఇం. కే 904; 25 ఇం. కే. 669; 58 ఇం. కే. 918; 25 బొం 662.

(4) 44 మ 181.

యము. కాని యీశబ్దములలో హంతకు లే కాకుండ సువర్ణాపహరణము మొదలగు దోషములు చేసిన వారుకూడ చేర్పబడియుండుటచే, న్యాయస్థానములు, హంతకుల నీశబ్దములలో జేర్చుట కంగీకరించుట లేదు. అయినను, పైనవివరించిన హంతకులకు ఆస్తి సంక్రమింపజాలదని అన్ని దేశములవారును అంగీకరించుటచేతను ప్రజాక్షేమముకొఱకును, న్యాయస్థానములు తీర్పుల నొసంగుచున్నవి(1). క్రిమినలు కోర్టువారు, హంతకుడు కాడని వదలివేసినను, ఆవిషయమును సివిలు కోర్టువారు విచారించి హత్యతో సంబంధమున్నదని స్థిరపరచినచో, అట్టివానికి వారసత్వమును లేకుండ చేయవలయునని, కుమారునిచంపినతల్లిని గూర్చిన కేసులో మ. హై. వారు తీర్మానించియున్నారు(2). కాని యిది న్యాయముకాదనియు, హిందూలాలో లేని యీవిషయమును క్రొత్తగా తెచ్చిపెట్టినారనియు, అయినను, క్రిమినల్ కోర్టు వారిచే శిక్షింపబడిన వారికే హక్కు లేదని చెప్పవలయును గాని, నేరస్థుడు కాడని వదలివేయబడిన వారిని మరల సివిల్ కోర్టులో విచారించుమని తీర్మానించుట న్యాయముగా లేదని మదరాసు లా జర్నలు పత్రికాధిపతు లభిప్రాయ మిచ్చియున్నారు(3). హంతకుడే కాకుండ, ఆతని సంతతికికూడ ఆయాస్తియందు హక్కు కలుగదనియు, అట్లు కానిచో ముసలివాడు తనకుమారునకు ఆస్తివచ్చునుకదాయని, ఆస్తివంతుని హత్య చేయతలపెట్టుననియు, తీర్పుల నిచ్చియున్నారు(4). కాని కుటుంబ

(1) 27 మ 591; 82 ఇం. కే. పి. కా. 966; 31 మ 1'0; 47 మ. లా. జ. 401; 67 ఇం. కే. (లా) 526; 45 బొం. 768=61 ఇం. కే. 294. 68 ఇం. కే (లా) 769.

(2) 27 మ 591.

(3) 15 మ. లా జ. 163.

(4) 67 ఇం. కే. 526;

ములో ఎవడో హంతకుడై నాడనుకారణముచే, ఆతనిసంతతికి హక్కు కలుగదని చెప్పుట న్యాయముగా లేదు. హత్యతోసంబంధము లేని వారికిని, ఈహత్యచేసినచో, నీయాస్తి తనసంబంధులకువచ్చునని హంతకునియుద్దేశము కానప్పుడును, ఆయాస్తి హంతకునిసంబంధులకు వచ్చుట కాటంకముండదు. ఒక కేసులో హత్య జరుగునప్పటికి, హంతకునికొడుకు మైనరుగా నుండెను. ఆమైనరుకు హత్యతో సంబంధము లేదు. మైనరుకు ఆస్తిని చెందచేయవలయుననను నుద్దేశముతో హంతకుడు హత్యచేయలేదు. ఇట్టిస్థితిలో హంతకునికొడుకైనను, మైనరునకు ఆస్తియందు హక్కుపోదని పంజాబు చీఫ్‌కోర్టువారు తీర్మానించియున్నారు(1) హంతకునకు లేక అతనిసంతతికి, వారసత్వమేదైన సంక్రమింపవలసివచ్చినప్పుడు, అది సంక్రమింపకపోవచ్చును. కాని సమష్టికుటుంబమెంబర్లలో నొకనిని హత్యచేసినను అతనిసమష్టిహక్కు పోజాలదని కొందరి యభిప్రాయము. సర్వైవరుషిప్పువలన తనకు మొత్తమాస్తియంతయును వచ్చునుకదాయని సోదరునిచంపినచో ఆతనిభాగము హంతకునకు రాజాలదని కొందరి యభిప్రాయము. వారసత్వమునకును సమష్టికుటుంబాస్తియందలి హక్కునకును ఈ విషయమున భేదములేదు. హత్యజరిగిననాడు, హంతకుడు, జీవించియుండకపోయినచో, చంపబడినవానియాస్తి యెట్లు, ఎవరికి సంక్రమింపవలయునో అట్లు సంక్రమింపవలయునని ప్రి. కౌ. వారి యభిప్రాయము(2).

(1) 52 ఇం. కే. 919.

(2) 82 ఇం. కే 966; 27 మ. 591.

36. సమష్టికుటుంబస్వరూపనిరూపణము చేయుట కీప్రకరణ ముద్దేశింపబడినది. ఈప్రకరణమందలి సారాంశ ములివి.

మొదటిప్రకరణ మునందలి సారాంశము.

1. రెండవపేరాలో తెలుపబడిన హిందూకుటుంబము, ఆస్తిని విభజించుకొనకుండ సమష్టిగా నుంచుకొన్నంతవరకు ఆకుటుం బము సమష్టికుటుంబ మనిపించుకొనును.

2. సమష్టికుటుంబముగానున్నవ్యక్తులలో (1) స్త్రీలు, (2) కూటస్థుడు జీవించి యున్నంతవరకు నాల్గవతరమువారు, (3) జాత్యంధులు, (4) మూగవారు, (5) చెవిటివారు, (6) అవ యవహీనులు, (7) జడులు, (8) ఉన్మత్తులు, (9) కుష్ఠరోగులు, (10) మతాంతరులు, (11) కులభ్రష్టులు, (12) యత్యాశ్ర మమును స్వీకరించినవారు, (13) నపుంసకులు, (14) వ్యతిరేక భుక్తమువలన హక్కును పోగొట్టుకొన్నవారు,(15) హంత కులు, వీరుతప్ప తక్కినవారు సమష్టికుటుంబమెంబర్లుగా నెన్న బడుదురు. వీరికి సమష్టికుటుంబాస్తిలో భాగార్హత లేదు.

3. అంధత్వాదిదోషములు నివృత్తిఅయినపిమ్మట, వారు భాగ మున కర్హులగుదురు. అట్లు నివృత్తికాకపోయినను, వారికి పురుషసంతానము కలిగెనేని వారికిసమష్టికుటుంబాస్తియందు భాగముండును. వారు సమష్టికుటుంబమెంబర్లుగా నెన్న బడుదురు.

4. దాసీపుత్రులు, వారిలోవారు సమష్టికుటుంబమెంబర్ల యినను, ఇతరులతో సమష్టికుటుంబమెంబర్లుకాజాలరు.

హిందూకుటుంబమునం దీచెప్పబడినమార్పులు గావింపబ డినచో సమష్టికుటుంబస్వరూప మేర్పడును.

37. ఈప్రకరణమును ముగించుటకుపూర్వ మికనొక్కవిషయ మునుగూర్చి చెప్పవలసియున్నది. న్యాయస్థానములందు దావాలను విమర్శించుటలో ఋజువుభారమెవరిది ? అను ప్రశ్న సామాన్యముగా వచ్చుచుండును. ఋజువు అక్కర లేకుండ న్యాయస్థానములు విచారణ నారంభించుటకుముందే కొన్ని విషయములు సత్యములని భావించుఆచారము కలదు. ఈభావననే ఇంగ్లీషులో Presumption అందురు. ఈభావనకు వ్యతిరేకముగా వాదించువారు వారివాదమును సాక్ష్యముచే ఋజువు చేయవలసియుండును. ఆసాక్ష్యమును న్యాయస్థానమువారు నమ్మినచో పైనచెప్పినభావన తొలగిపోవును. ఇట్టిభావనలు సమష్టికుటుంబవిషయమున ముఖ్యముగ మూడున్నవి.

భావన. Presumption

మొదటిది. హిందూకుటుంబము సమష్టికుటుంబ మని భావన.

రెండవది. సమష్టికుటుంబమెంబర్లస్వాధీనమందుండు ఆస్తి, సమష్టికుటుంబాస్తియని భావన.

మూడవది. కొంతఆస్తి విభాగమైనదని ఋజువుఅయినప్పుడును లేక ఉభయవాదులును అంగీకరించినప్పుడును, మొత్త మంతయును విభాగమైనదని భావన.

రెండవభావననుగూర్చి రెండవప్రకరణమునను మూడవభావననుగూర్చి విభాగప్రకరణమునను చర్చింపఁబడును.

సమష్టికుటుంబమా లేక వ్యష్టికుటుంబమా యని యేదావాలో నైన ప్రశ్నవచ్చినప్పుడు, యేఋజువును అక్కర లేకుండ నది సమష్టికుటుంబమని న్యాయస్థానములు భావింపవలయును. సమష్టికుటుంబము కాదనియు, వ్యష్టికుటుంబమనియు నెవరువాదించెదరో, వారా

విషయమును నిర్దిష్టముగా ఋజువుచేయవలయును(1). అయితే యే కుటుంబమునకు సమష్టికుటుంబాస్తి లేశమును ఉండదో, ఆకుటుంబము సమష్టికుటుంబ మనుభావన లేదు(2).

సమష్టికుటుంబ మనుభావన, తండ్రికుమాళ్ళకును సోదరులకును చాలబలముగానుండును(3). అన్నదమ్ములకుమాళ్ళకు కొంచెము తక్కువగా నుండును. అన్నదమ్ముల మనమలకు మఱింత తక్కువగా నుండును. ఇట్లే సంబంధము దూరమైనకొలఁదిని, ఆభావనాబలము తక్కువగుచుండును(4).

ఒకకుటుంబమున నల్గురుసోదరులుండిరి. వారికి కుటుంబాస్తి యేమియును లేదు. వారు వేరువేరుగా పనిపాటలు చేసికొనుచు సంపాదించుకొనుచుండిరి. వారిది సమష్టికుటుంబమను భావన లేదు. సమష్టికుటుంబ మని భావనచేయుటకు ముందుకొంతసమష్టి ఆస్తియుండవలయును.

ఒకసమష్టికుటుంబమునకు మొట్టమొదట నొకయిల్లుమాత్రముండెను. అంతకంటె వేఱుఆస్తి లేదు. ఆయింట్లో సోదరులు వేరువేరుగా భోజనముచేయుచు వేరువేరుగా వ్యవహరించుకొనుచుండిరి. ఈకేసులో సమష్టికుటుంబ మనుభావన లేదు(5).

---

(1) 12 మూ. ఇం. అ 523 (540); 9 మూ. ఇం. అ 66 (92); 4 మూ ఇం. అ. 137 (168); 11 మూ. ఇం. అ. 369; 22 క 85; 88 ఇం. కే. 385, ప్రి. కౌ.; 56 ఇం. కే. 806. ప్రి. కౌ; 126 ఇం. కే. (అ) 845; 121 ఇం. కే. (అ) 817; 121 ఇం. కే. (లా) 481; 106 ఇం. కే. 186; 109 ఇం. కే. (లా) 779.

(2) 86 ఇం. కే. (మ) 886; 96 ఇం. కే. (సా) 968.

(3) 128 ఇం. కే. (లా) 481; 111, ఇం. కే. (రం) 839; 68 ఇం. కే. 584;

(4) 10 బొం-హై-రి 444; 114 ఇం. కే. ప్రి. కౌ. 18; 119 ఇం. కే.ఔ. 872

(5) 19 ఇం. కే. (పం) 51; 3 ఇం. కే. 284.

సోదరు లొకప్పుడు సమష్టిగానుండిరని, యొప్పుకొనినప్పుడు గాని, ఋజువులయినప్పుడుగాని, వారు పిమ్మట వ్యష్టిఅయినారని స్పష్టముగా ఋజువుచేయువఱకును వారు సమష్టికుటుంబమెంబర్లనియే భావింపవలయును(1).

(1) 17 ఇం. కే. 296; 101 ఇం. కే. (మ) 249.

# రెండవ ప్రకరణము.

## సమష్టికుటుంబాస్తి నిరూపణము.

## (Co-parcenary Property or Joint family Property.)

**1.** సమష్టికుటుంబస్వరూపమును మొదటిప్రకరణమున నిరూపించియుంటిమి. ఈప్రకరణమున సమష్టికుటుంబాస్తి యొక్క నిరూపణము చేయబడును. సమష్టికుటుంబాస్తి మూడువిధములు.

సమష్టికుటుంబాస్తి మూడు విధములు.

(i) అప్రతిబంధదాయము (పూర్వార్జితము) ను, దాని వలన నభివృద్ధినొందినదియును.

(ii) సమష్టికుటుంబమెంబర్లు సమష్టిగా సంపాదించినది.

(iii) సమష్టికుటుంబమెంబర్లలో నెవరికైనను ప్రత్యేకముగా లభించినను, దానిని వేఱుగా నుంచుకొనక సమష్టికుటుంబాస్తిగా నుంచినది.

వివరణము—(i) స్వార్జితము, సమష్టికుటుంబాస్తి కానేరదు. స్వార్జితమనగా నెట్టిదియో, మూడవప్రకరణమున వివరముగా తెలుపబడును.

(ii) స్త్రీధనము సమష్టికుటుంబాస్తి కానేరదు. అనగా సమష్టికుటుంబమెంబర్లయొక్క భార్యలు, తల్లులు మొదలగు స్త్రీల యొక్క అలంకారములు, వారికి ఉండుకొనిన స్థిరాస్తి మొదలగు స్త్రీధనము సమష్టికుటుంబాస్తిలోనికి చేరదు. ఈవిషయము "స్త్రీధనము" అనుగ్రంథములో విపులముగా తెలుపబడును.

పైనవ్రాసిన మూడువిధములగు సమష్టికుటుంబాస్తులనుగూర్చి యీ దిగువ పేరాలలో విమర్శింపబడును.

2. అప్రతిబంధదాయమనగా నేమి?

అప్రతిబంధ దాయమన నేమి?

"దాయశబ్దేన యద్ధనం స్వామిసంబంధా దేవ
నిమిత్తా దన్యస్య స్వం భవతి తదుచ్యతే.
సచ ద్వివిధః. అప్రతిబంధ స్సప్రతిబంధశ్చేతి.
తత్ర పుత్రాణాం పౌత్రాణాంచ పుత్రత్వేన
పౌత్రత్వేనచ పితృధనం పితామహధనంచ
స్వంభవతీ త్యప్రతిబంధో దాయః.
పితృభ్రాత్రాదీనాం తత్పుత్రాభావే
స్వామ్యభావేచ స్వంభవతీతి పుత్రసద్భా
వస్వామిసద్భావశ్చప్రతిబంధ స్తదభావే
పితృత్వేన భ్రాతృత్వేనచ స్వంభవతీతి
సప్రతిబంధో దాయః. ఏవం తత్పుత్రా
దిష్వప్యూహనీయం."

మితాక్షరి.

ఏధనమునందు ధనాధికారితో దేహసంబంధముకలుగుటవలన నితరునకు స్వత్వము (హక్కు) కలుగుచున్నదో, ఆధనము దాయమని చెప్పబడును. "అప్రతిబంధము" "సప్రతిబంధము" అని దాయము రెండువిధములు. పితృపితామహార్జితమైన ధనమునందు పుత్రపౌత్రులకు పుత్రత్వపౌత్రత్వములచేతనే హక్కుకలుగుచున్నది. అట్టి ధనమునకు అప్రతిబంధమని పేరు. (పితృపితామహులు జీవించియున్నను ఎట్టిప్రతిబంధము లేకుండ పుత్రపౌత్రులకు వారిజన్మముచేతనే హక్కుకలుగును. కావున అట్టిదాయమునకు అప్రతిబంధమని పేరు.) ధనాధికారి పుత్రులులేకుండ చనిపోయెనేని, అతనియాస్తి తండ్రి, సోదరులు, మొదలగువారికి సంక్రమించినప్పుడు, ధనాధికారిగాని, అతనికొడుకులుగాని యున్నచో, ఆయాస్తికి ప్రతిబంధముండి వారు

లేకపోవుటచే, అప్రతిబంధముపోయి, పితృత్వభ్రాతృత్వముల చేత, వారికి ఆస్తియందు హక్కు కలుగుచున్నది. అట్టిధనమునకు సప్రతిబంధదాయమని పేరు. ఈవిధముగానే వారిపుత్రాదులవిషయమున కూడ నూహింపదగినది.

"భూర్యా పితామహోపాత్తా నిబంధో ద్రవ్యమేవవా,
తత్ర స్యాత్సదృశం సామ్యం పితుఃపుత్రస్య చైవహి"
యాజ్ఞ్యవల్క్యస్మృతి.

"పితామహునిచే సంపాదింపబడినభూమి, మిరాసి, ద్రవ్యము వీటియందు తండ్రికి కొమరునకు సమానహక్కు కలుగుచున్నది."

"లోకేచ పుత్రాదీనాం జన్మనైవ స్వత్వం ప్రసిద్ధతరం.
విభాగశబ్దశ్చ బహుస్వామికధనవిషయోలోకప్రసిద్ధః.
నాన్యదీయవిషయో నప్రహీణవిషయః.
తథోత్పత్త్యైవార్థస్వామిత్వంలభతేత్యాచార్యగౌతమవచనాచ్చ"
మితాక్షరి.

లోకమునందు పుత్రాదులకు హక్కు జన్మముచేతనే కలుగుట ప్రసిద్ధమై యున్నది. అనేకులకు హక్కుకలిగిన ద్రవ్యమును వారివారిభాగములప్రకారము పంచుకొనుటకే విభాగమని ప్రసిద్ధిగాని ఒకనిద్రవ్యమును, హక్కులేని మఱియొకడు తీసికొనుటకుగాని, మృతుడైనవాని ద్రవ్యమును ఇంకొకడు పొందుటకుగాని, విభాగమనిపేరు లేదు. జన్మముచేతనే పుత్రపౌత్రాదులకు హక్కుకలుగునని గౌతమువచనము కూడకలదు.

ఈపైవాక్యములవలన పుత్రపౌత్రాదివంశానుక్రమముగా వచ్చుదాయము అప్రతిబంధమనియు, దానియందు పుత్రపౌత్రప్రపౌత్రులకు జన్మముచేతనే హక్కుకలుగుననియు, వంశానుక్రమముగారాక, సోదరులు, వారిపుత్రపౌత్రులు, పినతాత, పెదతాత, పినతండ్రి,

పెదతండ్రి మొదలగువారిలో నెవరికైనను పురుషసంతానము లేక పోవుటచేత, వారసత్వముమూలమున నితరులకు సంక్రమించుదాయము, సప్రతిబంధమనియు, ఆయాస్తి యెవనికిసంక్రమించునో వానికది స్వార్జితమై దానియం దాతనిపుత్రపౌత్రులకు జన్మముచేత హక్కు కలుగదనియు, స్పష్టమగుచున్నది.

అప్రతిబంధదాయ మెవనిహస్తమున నుండునో, వానికి దానియందు సంపూర్ణాధికారము లేక యాతనిపుత్రపౌత్రాదులకు జన్మముచేతనే హక్కు కలిగి, వారియనుమతినిరోధములకు లోనగుచు వారితో సమష్టిగా ననుభవపుహక్కు కలిగియుండును.

సప్రతిబంధదాయ మెవనిహస్తమునపడునో, వానికి దానియందు సంపూర్ణాధికారముకలిగి, పుత్రపౌత్రాదుల కందు జన్మముచే హక్కు కలుగక, వారియనుమతినిరోధములతో ప్రసక్తి లేకుండ ననుభవించుహక్కు కలిగియుండును.

అప్రతిబంధదాయమునకు unobstructed heritage అనియు, సప్రతిబంధదాయమునకు obstructed heritage అనియు నింగ్లీషుభాషలో ననుచున్నారు. ఈభాషాంతరీకరణ మంతచక్కగా లేదు. కాని వాడుకలోనున్న పదములగుటచే వాటినే గ్రహించుట మంచిది.

3. అప్రతిబంధదాయమును పూర్వార్జితమని ఆంధ్రదేశమున వాడుచున్నారు. దీనినే పైనవ్రాసినవిధముగా మితాక్షరిలో 'పితృధనం' 'పితామహధనం' అని వాడబడినది. పితామహధనమునకు 'పైతామహం' అని మితాక్షరిలో పర్యాయపదముగా నుపయోగించియున్నారు. పైతామహమనగా పితామహునిచేసంపాదింపబడినది లేక పితామహసంబంధమైనది యని యర్థము.

పూర్వార్జితము.

పితామహశబ్దము సామాన్యముగా తండ్రితండ్రియందు మాత్రమే వర్తించుచున్నను, ఇచ్చట బహువచనముచేసి తండ్రితండ్రి, తండ్రితాత మొదలగు పితృవంశీయులని యర్థము చెప్పతగియున్నది. సర్వలోకపితయగు బ్రహ్మనుకూడ పితామహుడనియే వాడుచున్నాము. పితామహశబ్దమునకు, ఒకయుపసర్గనుచేర్చి, సామాన్యముగా తండ్రితాతకు ప్రపితామహుడనియు, తాతతాతకు వృద్ధప్రపితామహుడనియు, తాతముత్తాతకు అతివృద్ధప్రపితామహుడనియు, అతనితండ్రికి అత్యంతవృద్ధప్రపితామహుడనియు పిలుచుచుందురు. ఉపసర్గలను దీసివేసినచో నందఱును పితామహులే యగుదురు. కావున నిట పితామహశబ్దమునకు పితృవంశీయులగు పూర్వులని యర్థము(1).

పైతామహమునకు ఇంగ్లీషులో ancestral property అని సామాన్యముగా చెప్పుచుందురు. కాని యది సరియైన భాషాంతరీకరణమువలె కన్పట్టదు. ఆంధ్రదేశములో వాడుకలోనున్న "పూర్వార్జితపుటాస్థి" అనుశబ్దమునకు ancestral property అనుశబ్దము సరియైనది కావచ్చును. కాని తండ్రితండ్రితాలూకు ఆస్థిని చెప్పవలసివచ్చినపుడు grand-father's property అనియును, పైనవ్రాసినవిధముగ పితృవంశీయులధనమని చెప్పవలసివచ్చినప్పుడు Peternal ascendants' property అనియును చెప్పవలసియుండును(2). లేదా grand peternal property అనియైనను చెప్పవలసియుండును(3). కాని దీనికంతకును ఆంధ్రదేశమున పూర్వార్జితమనియే వాడుక కలదు. కావున నికముం దీగ్రంథమున పూర్వార్జితమనియే వాడబడును.

(1) స. హిం. లా.

(2) 48 ఇం. కే. 870 పాట్నా.

(3) 187 ఇం. కే (బొ) 814.

4. పూర్వార్జితమనుశబ్దమునందు 'అప్రతిబంధదాయము' మాత్రమే గోచరించుటలేదు. కాలముచేత పూర్వులయినవారి యందరియాస్తియునుకూడ నిందు చేరినట్లనుమానము కలుగుచున్నది. కాని పూర్వార్జితమనుశబ్దమును పితృపితామహప్రపితామహాదులగు పితృవంశీయుల యాస్తియందుమాత్రమే రూఢిచేయవలసియున్నది. అదిమాత్రమే సమష్టికుటుంబాస్తియగును. దానియందు పుత్రపౌత్రప్రపౌత్రులకు జన్మముచేతనే హక్కుకలుగును. ఈయాస్తియందు పుత్రపౌత్రప్రపౌత్రులకుదక్క మఱియెవ్వరికిని జన్మముచేత హక్కుకలుగదు. ఒకనికి పూర్వార్జితము సంక్రమించినప్పుడు, అతనికి పుత్రపౌత్రప్రపౌత్రులు లేకపోయినచో, నాయాస్తి నాతడు సంపూర్ణహక్కుతో ననుభవించుటకును, తనయిచ్ఛవచ్చినరీతిని వినియోగించుటకును అధికారము కలిగియుండును(1). పూర్వార్జితమునకును స్వార్జితమునకును ఒక గొప్ప భేదమున్నది. పూర్వార్జితమునందు కుమారుడుకలిగినతోడనే తండ్రియొక్కహక్కు సంకుచితమగుచున్నది. స్వార్జితమునందు సర్వదా సంపూర్ణమైనహక్కుఉండును(2).

పూర్వార్జితశబ్దముయొక్క రూఢ్యర్థము.

5. పితృసోదరులు, వారిపురుషసంతతి, పితామహసోదరులు, ప్రపితామహసోదరులు మొదలగు సపిండులకును, సమానోదకులకును బంధువులకును సంతతిలేకపోవుటచేత, వారియాస్తి వారసులకు సంక్రమించినప్పుడు కాలపరిమితినిబట్టి చనిపోయినవారు పూర్వులైనను, వారసులకు అది పూర్వార్జితము కానేరదు. అది సప్రతిబంధదాయమగుటచే ఎవరికి

వారసత్వముచే వచ్చినఆస్తి పూర్వార్జితమా?

(1). 10. బొం. 528; 11. బెం. లా. రి. 397; 33. అ. 283; 11. అ. 19 17. అ. 456. ప్రి. కౌ.

(2). 128. ఇం. కే. 628.

సంక్రమించునో, వారిప్రత్యేకపు టా స్తియై వారికి స్వాతంత్ర్యముతో ననుభవించుటకు హక్కు కలిగియుండును. దానియందు మృతశేషత్వ ధర్మము వర్తింపదు(1). జన్మముచేత పుత్రపౌత్రాదుల కందుహక్కు కలుగదు. అట్టిఆస్తి సంక్రమించినవారు దానినివినియోగము చేయక చనిపోయినచో, వారియనంతరము పుత్రపౌత్రాదుల కది పూర్వార్జిత మగును. వృద్ధప్రపితామహునిఆస్తిగాని అంతకుపూర్వపుపితృవంశీయు నిఆస్తిగాని ప్రత్యక్షముగా (direct) సంక్రమించినప్పు డదికూడ సప్రతిబంధదాయమేయై దానియందు సంక్రమించినవానికి సంపూర్ణా ధికారముకలిగి అది యాతనిప్రత్యేకపుటాస్తిగా నెంచబడును.

మాతామహార్జితము పూర్వార్జితమా ?

6. మాతామహార్జితము దౌహిత్రులకు పూర్వార్జితమగునా? లేక వారి ప్రత్యేకపు టాస్తియగునా ? యనువిషయ మింకను సరిగా నిర్ధారణము కాలేదు. పైనవ్రాసిన 4-5 పేరాలలోని విషయములనుబట్టి చూచినచో, మాతామహుడు కాలముచేత పూర్వుడేయైనను, ఆతనియాస్తి సప్రతి బంధదాయము కావున హిందూలాయందు వాడబడి యెడి ప్రత్యేకార్థముగల పూర్వార్జితము కాదని స్పష్టమగుచున్నది. కాని యీవిషయమున, హైకోర్టులు భిన్నాభిప్రాయము లొసంగినవి. పూర్వార్జితమున కుండవలసిన ముఖ్యలక్షణములు నాలుగు.

i. మృతశేషత్వ ధర్మము వర్తించుట.

ii. పుత్రపౌత్రప్రపౌత్రులకు జన్మముచే హక్కు కలుగుట.

iii. పుత్రపౌత్రాదులకు వారి యిష్టమువచ్చినప్పుడు విభజించుకొనుటకు హక్కు కలిగియుండుట.

---

(1). 4. మా. ఇం. అ. 137; 26. బొం. 445. మృతశేషత్వధర్మము=Law of Survivership దీనినిగూర్చి నాల్గవప్రకరణమున చెప్పబడును. 66. ఇం. కే. (పా) 945; 56. ఇం. కే. (బొ) 745; 13. లా. 491; 83. ఇం. కే. (అ)782.

iv. పితృపితామహాదులు అవసరములేకుండ చేసిన వినియోగములనాటంకపర్చుటకు పుత్రాదులకు హక్కు కలిగియుండుట.

న్యాయస్థానము లీవిషయమున నేమియభిప్రాయముల నిచ్చియున్నారో పరిశీలింతము.

శివగిరికేసులో మద్రాసుహైకోర్టువారు, మాతామహార్జితము, హిందూలాలో ప్రత్యేకమైన అర్థమునిచ్చునట్టి పూర్వార్జితములో చేరకపోయినను, అది దౌహిత్రునకు సంక్రమించినప్పు డాతనిపుత్రులు, పితృపితామహార్జితమువలె తండ్రితో విభజించుకొనుటకు హక్కుకలది కాకపోయినను, అంతమాత్రముచే నితరవిషయములలో నది దౌహిత్రునకు స్వార్జితము కాజాలదనియు, నందుచే నాతడుచేసిన వినియోగములనుగూర్చి యాటంకపర్చుట కాతనిపుత్రుల కధికారముండుననియు, తీర్మానించినారు(1).

ఈ కేసు ప్రివికౌన్సిలునకు అప్పీలు చేయబడినప్పుడు, మాతామహునియాస్తి దౌహిత్రునకు స్వార్జితము కాదన్నంతవరకు తాము హైకోర్టుతో నేకీభవించుచున్నామనియు, నాతడు చేసిన వినియోగముల నాక్షేపించుట కాతనిపుత్రుల కధికారమున్నదా లేదా యను విషయమున తామిప్పుడేమియు నభిప్రాయ మొసంగమనియు, (రెండవపార్టీవా రీకేసునందు వాదముచేయక యేకపార్టీ అయినారు) మరియొకసారి యిట్టికేసు వచ్చినప్పుడు చెప్పెదమనియు చెప్పుచు కేసును వేఱొకపాయింటుమీద తీర్మానించినారు(2).

మాతామహునకొకకుమార్తెవలన కలిగిన నిరువురు దౌహిత్రులకు ఆస్తి సంక్రమించిన పిదప నందొకడు చనిపోవగా, నాతనిభాగము మృతశేషత్వధర్మముచే మిగిలిన సోదరునకు సంక్రమించునా?

(1). 8. మ. 370; 9. మ. 188.

(2). 6. మ. 1. (16)

లేక చనిపోయినవాని భార్యకు సంక్రమించునా? యని యొకకేసులో ప్రశ్నరాగా, నట మృతశేషత్వధర్మము వర్తింపదనియు, కాని వారిరువురును, ఆయాస్తి తమకు సంక్రమించినపిదప దానిని సమష్టి కుటుంబాస్తిగా అమలుజరిపినందువలన మృతశేషత్వధర్మము వర్తించుననియు మద్రాసు హైకోర్టువారు తీర్మానించినారు(1).

కలకత్తా హైకోర్టువారుకూడ నిట్టికేసులోనే సోదరులైన దౌహిత్రులకు మృతశేషత్వధర్మము వర్తింపదనియు, అప్రతిబంధదాయమందును, సంసృష్టిమూలమున మరల సమష్టియైన యాస్తియందును తప్ప మఱియెచ్చటను మృతశేషత్వధర్మము వర్తింపదని చెప్పుచు, చనిపోయిన యొకదౌహిత్రుని భాగము నాతనిభార్యకిప్పించి సోదరునకు హక్కులేదని తీర్మానించినారు(2).

ఈతీర్పు ననుసరించుచు జగ్గంపేటకేసులో, మదరాసు హైకోర్టువారుకూడ నదేవిధముగ తీర్మానించియున్నారు(3). జగ్గంపేట కేసు ప్రి వి కౌన్సిలునకు అప్పీలునకు వెళ్లగా వారు హైకోర్టుతీర్పు రద్దు చేయుచు, ఆస్తినిసోదరుని పరముజేసి, పైనవ్రాసిన కలకత్తా హైకోర్టుతీర్పును 19. మ. 70 లోని తీర్పును కూడ సరియైనదికాదని తీర్పు యిచ్చినారు(4). ఆ ప్రి వి కౌన్సిలువారి తీర్పులోని ముఖ్యాంశములివి.

i. మాతామహుడు పూర్వుడగనుక మాతామహార్జితము పూర్వార్జితము.

ii. దౌహిత్రులు సమష్టికుటుంబమెంబర్లు అయినప్పుడు వారికి సంక్రమించిన మాతామహార్జితమునందు మృతశేషత్వ ధర్మము వర్తించును.

---

(1). 7. మ. 458.
(2). 17. క. 33.
(3). 20. మ. 207.
(4). 25. మ. 678.

iii. అప్రతిబంధదాయమందును, సంసృష్టిమూలమున మరల సమష్టియైన ఆస్తియందును తప్ప మరియెచ్చటను మృతశేషత్వధర్మము వర్తింపదని కలకత్తా మద్రాసు హైకోర్టులు చేసిన జనరల్ రూలు సరి అయినదికాదు. సపత్నులయందును, కుమార్తెలయందును మృతశేషత్వధర్మము వర్తించుచున్నది.

మాతామహుడు కాలముచేత మాత్రమే పూర్వుడా? అతని యాస్తి హిందూధర్మశాస్త్రమునందు ప్రత్యేకోద్దేశముతో వాడబడియెడి పూర్వార్జితమా? లేక యింగ్లీషు 'లా'లో వాడబడియెడి పూర్వార్జితమువంటిదా? హిందూలాప్రకారము పూర్వార్జితమైనచో, అందు దౌహిత్రులయొక్క పురుషసంతతికి జన్మముచేత హక్కు కలుగునా? దౌహిత్రులు వినియోగము చేయకుండ నాటంకము చేయుటకు వారి పురుషసంతతికి హక్కు కలదా? అను విషయములు ప్రివి కౌన్సిలు వారిచే ఆకేసులో నాలోచింపబడలేదు.

మాతామహుని యాస్తి దౌహిత్రునకు పూర్వార్జితమని ప్రివి కౌన్సిలు వారనుటతోడనే హైకోర్టులకు తరువాతి కేసులలో చాలసందేహములు కలుగుచు వచ్చినవి.

19. మ. 70 కేసులో జ్ఞాతియొకడు సంతానములేకుండ చనిపోవుటచే, నాతని యాస్తి వారసులకు సంక్రమించినప్పు డది పూర్వార్జితము కాదనియు, నది సప్రతిబంధదాయమనియు, అందు వారి పుత్రాదులకు జన్మముచే హక్కు కలుగదనియు అప్రతిబంధదాయమునదక్క మరియొకచోట మృతశేషత్వధర్మము వర్తించదనియు మద్రాసు హైకోర్టువారు తీర్మానించియుండిరి. ప్రివి కౌన్సిలువారితీర్పు ననుసరించి, ఈతీర్పులోని విషయము లెంతవఱకు ముందు అమలుజరుపుటకు నిషేధింపబడినవి అని సంశయము వచ్చినది.

మేనమామయాస్తి వారసత్వముచే సంక్రమించినప్పు డది పూర్వార్జితమగునా? యని ప్రశ్నరాగా మద్రాసు హైకోర్టువారు, ప్రివికౌన్సిలువారితీర్పును ఆలోచించి యీాదిగువవిధముగా తీర్మానించిరి(1).

i. మేనమామ పూర్వుడుకాడు. మేనమామఆస్తి మేనల్లునకు సంక్రమించినప్పుడు అది పూర్వార్జితము కాజాలదు. అందు మృతశేషత్వము, పుత్రాదులకు జన్మముచేత హక్కుకలుగుట మొదలగు ధర్మములు వర్తింపవు. అది సప్రతిబంధదాయమగును. జగ్గంపేట కేసులోని ప్రివికౌన్సిలుతీర్పు యీాకేసునకు వర్తించదు.

ii. 19. మ. 70 కేసులో మద్రాసుహైకోర్టువారు చేసిన "అప్రతిబంధదాయమునందుదక్క మరియెచ్చటను మృతశేషత్వధర్మము వర్తించదు"అను రూలునుమాత్రమే ప్రివికౌన్సిలు తీర్పు నిషేధించినది. కాని, మిగిలిన విషయములు ఆతీర్పువలన నిషేధింపబడలేదు.

iii. మితాక్షరి, మనుస్మృతి మొదలగు హిందూధర్మశాస్త్రములు, దౌహిత్రులు మాతామహునకు పౌత్రులవంటివారనియు, పౌత్రులవలెనే పిండోదకము లిచ్చుట కధికారము కలవారని చెప్పుచుండుటచే మాతామహునియాస్తి దౌహిత్రులకు సంక్రమించినప్పుడది పూర్వార్జితమై యప్రతిబంధదాయమునందువలెనే మృతశేషత్వధర్మము వర్తించును.

iv. మాతామహునియాస్తి పూర్వార్జితమని మితాక్షరిమొదలగు హిందూశాస్త్రములలో విశేషార్థముతో వాడబడు పూర్వార్జితములోనే ప్రివికౌన్సిలువారు చేర్చినారు. కావున దానియందు పుత్రాదులకు జన్మముచేతనే తండ్రితో సమాన హక్కుకలిగి, పితృపితా

(1). 27. మ. 300. (ఫు. బెం.)

మహార్జితమైన ఆ స్తియందు కలిగియుండు అన్నిహక్కులును కలిగి యుండును.

ఈతీర్పును అనుసరించుచు మద్రాసుహైకోర్టువారు మఱియొక కేసులో మాతామహుని ఆస్తి దౌహిత్రునకు సంక్రమించునప్పు డం దాతని పుత్రపౌత్రాదులకు జన్మముచేతనే హక్కుకలుగుననియు, అత నితో విభజించుకొనుటకు హక్కుకలదనియు తీర్మానించిరి. ఈకేసు విచారణలో, కొన్నిసందేహములు ఆలోచనలోనికి తేబడి సమాధాన మీయబడినవి(1). అవియేవనగా:—

i. ప్ర. ఒకమాతామహునకు ఇద్దరుముగ్గురు కుమార్తెలవలన దౌహిత్రులున్నప్పుడు వారందరికి మృతశేషత్వధర్మము వర్తించునా?

జ. వారు భిన్నగోత్రజులై భిన్నకుటుంబములలోనివారై నచో వర్తింపదు. దౌహిత్రులు సమష్టికుటుంబమెంబర్లయిన యెడలమాత్ర మే ఆధర్మము వర్తించును.

ii. ప్ర. ఒకని కిరువురు దౌహిత్రులుండి, ఆస్తి సంక్రమింపక పూర్వమే ఒకడు చనిపోయి, యాతని కొకకుమారుడున్నచో, మాతామహునియాస్తి నిలిచియున్నదౌహిత్రునకేవచ్చునా? మాతా మహునియాస్తి పూర్వార్జితమువంటిదే యంటిరి, కావున దానియందు అప్రతిబంధదాయమువలెనే చనిపోయినవానికుమారునకు కూడ వచ్చునా ?

జ. మాతామహునకు దౌహిత్రుడుమాత్రమే పౌత్రునితో సమానమని శాస్త్రములందు చెప్పబడినది. కాని దౌహిత్రునికుమా రుడు పిండోదకముల నిచ్చువాడుకాడు కావున, నతనికి హక్కులేదు.

మదరాసుహైకోర్టువారు మరియొకకేసులోకూడ మాతామ హునియాస్తి పూర్వార్జితమేయగు ననియు, అం దాతనికుమారులకు

(1). 27. మ. 382.

హక్కు కలుగుననియు తీర్మానించిరి(1). అలహాబాదు హై.కో. వారు మ. హై. కో. వారి యభిప్రాయముతో నేకీభవింపలేదు. జగ్గంపేట కేసులో ప్రి. కౌ. ఉపయోగించిన పూర్వార్జితమనుశబ్దము హిందూలాలో ప్రత్యేకముగా నుపయోగించునర్థములో నుపయోగించలేదనియు, ఇంగ్లీషు లాలో ఉపయోగింపబడెడి, సమష్టిఆస్తి (Joint property) అని యర్థమిచ్చెడిభావములో నుపయోగించిరనియు, ఈ రెండు విధములగు ఆస్తులయందునుకూడ మృతశేషత్వధర్మ మన్వయించుననియు, ఆకేసులో, సోదరు లిరువురకును మృతశేషత్వధర్మ మన్వయించునా ? లేదా ? యనునదియే ప్రధానప్రశ్నయగుటచే, ప్రి. కౌ. వారు కూలంకషముగా ధర్మశాస్త్రములనన్నిటిని విచారింపక, మృతశేషత్వధర్మ మన్వయించునని తీర్మానించిరనియు, అందుచే మాతామహార్జితము దౌహిత్రునకు సంక్రమించినప్పు డాతనితనయునకు జన్మముచేత హక్కు కలుగదనియు, దౌహిత్రుడు చేసిన వినియోగముల నాక్షేపించుట కాతని పుత్రపౌత్రులకు హక్కు లేదనియు, తీర్మానించిరి(2).

పాట్నాహైకోర్టువారు ఒకకేసులో ఈవిషయమును మరల విమర్శించి,

i. దౌహిత్రుడు మాతామహునకు కుమారునివంటివాడని మితాక్షరి చెప్పుచున్నది. అందువలన దౌహిత్రు డొకవిధముగా మాతామహుని కుటుంబములో ఒకమెంబరగును. కాని దౌహిత్రుని కుమారుడుమాత్రము తండ్రిమాతామహుని కుటుంబములోని మెంబరు కాజాలడు.

(1). 30. ఇం. కే. (మ) 889 = 39. మ. 930; 80.ఇం. కే. (మ) 79.
(2). 29. అ. 667.

ii. దాహిత్రునకు సంక్రమించిన మాతామహార్జితమునందు ఆతనికుమారునకు జన్మముచే హక్కుగలుగదు. దాహిత్రుడు మాతామహార్జితమునందు చేసిన వినియోగముల నాక్షేపించుట కాతని పుత్రున కధికారములేదు.

iii. మాతామహార్జితము, వారసత్వముచే వచ్చిన స్త్రీధనము, వారసత్వముచే సంక్రమించిన వృద్ధప్రపితామహునియొక్కయు అంతకు పూర్వులయొక్కయు ఆస్తి, పురోహితుడు సహాధ్యాయి వీరివలన సంక్రమించిన ఆస్తి, ఇవి పూర్వార్జితములుకావు.

iv. మాతామహార్జితము పూర్వార్జితముకాదు. కావున ఆయాస్తి దాహిత్రునకు సంక్రమించి, పిమ్మట అతనికుమారులకు సంక్రమించి నప్పుడు ఆదాహిత్రుడు చేసిన ఋణములకు, డిక్రీనిపొందినవాడు, ఆయాస్తిపైని వారంటు అమలు జరుపవచ్చును. అట్లు జరుపకుండ దాహిత్రునికుమారుడు ఆటంకపరుపజాలడు. అని తీర్మానించినారు(1).

పాట్నాహైకోర్టులో మరియొక కేసువచ్చినది. అందలి వివరము లివి: నారాయణసింగు అనునతనియాస్తి దాహిత్రులయిన బర్రాలాల్, చోటేలాల్ అను నిరువురకు సంక్రమించినపిదప బర్రాలాలు చనిపోయినాడు. అతనికి మానసింగు అను ఒకకొడుకు. అతడు సగంవంతు వాటాకొఱకు చోటేలాలుపైని దావాతెచ్చెను. జగ్గంపేట కేసులోని ప్రి. కౌ. తీర్మానమునననుసరించి, యీకేసునకు మృతశేషత్వ ధర్మము వర్తించుననియు అందుచే బర్రాలాలు వాటా, అతని కొడుకునకురాక తనకువచ్చునని చోటేలాలు వాదించెను.

ఈకేసు తీర్మానించుట కనేక సంశయములు కలిగెను.

i. పూర్వార్జితమందుమేని, కలకత్తా కేసులోని ప్రి వి కౌన్సిలు తీర్పునకు వ్యతిరేకము

---

(1). 48. ఇం. కే. 870.

ii. పూర్వార్జితముకాదందుమేని, జగ్గంపేటకేసులోని ప్రి. కౌ. తీర్పునకు వ్యతిరేకము.

iii. మృతశేషత్వధర్మము వర్తించునందుమేని చనిపోయినవాని కుమారునకు హక్కులేకుండ పోవును. ఇది లోకవిరుద్ధము.

iv. మృతశేషత్వధర్మము వర్తించదనియందుమేని జగ్గంపేట కేసులోని ప్రి. కౌ. తీర్పునకు వ్యతిరేకము.

v. అప్రతిబంధదాయమందును, సంసృష్టికావింపబడిన సమష్టి ఆస్తియందును దక్క మరియెచ్చటను మృతశేషత్వములేదని కలకత్తా(1) మద్రాసు(2) హైకోర్టుల తీర్మానములు సరిఅయినవనియు, కుమార్తెలకును, సపత్నులకును మృతశేషత్వధర్మమున్నట్లు తోచుచున్నను అది మృతశేషత్వధర్మముచేవచ్చుచుండుటలేదనియు, ఒకభార్యగాని, ఒకకుమార్తెగాని చనిపోయినప్పుడు వారి భర్త లేక తండ్రి, అప్పుడు చనిపోయిన క్లైంచబడి మరల వారి వారసులగు నిలిచియున్న రెండవభార్యకును రెండవకుమార్తెకును సంక్రమించుచున్నదనియును సమాధానము చెప్పచూచెదమేని, జగ్గంపేటకేసులో ప్రి. కౌ. వారు ఇందుకు వ్యతిరేకముగా చెప్పియున్నందున దానిని కాదనుట కెవరికిని అధికారములేదు.

vi. మాతామహార్జితమునందు దౌహిత్రుని కుమారులకు జన్మముచేతనే హక్కు కలుగుననియందుమేని అతడు తన తండ్రియొక్క మాతామహుని కుటుంబములోనివాడు కాడుకదా! అతడు తనతండ్రి మాతామహునకు పిండోదకములనిచ్చుట కర్హుడుకాడుకదా! పిండోదకములనిచ్చుటకు అర్హతలేదని వృద్ధప్రపితామహునియాస్తియందు ప్రపౌత్రుని పుత్రునకు జన్మముచేత హక్కుకలుగదని యెంచినప్పుడు,

(1). 17. క. 33.

(2). 19. మ. 70.

పిండోదకములనిచ్చుట కర్తృతలేని యీతనికిమాత్రము జన్మముచే నెట్లుహక్కు కలుగును ? అని సంశయము.

vii జన్మముచేత హక్కు కలుగదని యందుమేని, దౌహిత్రునకు మాతామహార్జితము పూర్వార్జితము కాదనవలసివచ్చును. పూర్వార్జితమన్నచో, కుమారునకు జన్మముచేతనే హక్కు కలుగును కదా? ఈమొదలగు విషయముల నాలోచించి ఆకేసుసందర్భములను బట్టి పా. హై. కో. ఈదిగువరీతిగా తీర్మానించినారు.

i. పురుషసంతానమున్నప్పుడు మృతశేషత్వధర్మమువర్తింపదు.

ii. బ్రరాలాల్, చోటేలాలు అనువారలు, సమష్టికుటుంబ మెంబర్లు. వారిరువురకు మాతామహార్జితము సంక్రమించినది. అది వారికదివరకున్న పూర్వార్జితపు సమష్టికుటుంబాస్తితో చేరిపోయినది. అందుచే యిదికూడా పూర్వార్జితము. జగ్గంపేటకేసులోని ప్రి. కౌ. వారి అభిప్రాయముకూడ నిదియే. అందుచే మానసింగునకు తండ్రివాటాయందు హక్కు కలదని తీర్మానించిరి(1).

లాహోరుహైకోర్టువారు ఒకఫుల్ బెంచికేసులో మాతామహునియాస్తి, దౌహిత్రులకు పూర్వార్జితమగునని తీర్మానించిరి(2).

ఈతీర్పులను ఇందలివాదములను చూడగా చూడగా సంశయములు హెచ్చుచున్నవి. కాని ఇదమిత్థమని స్పష్టముగా నిర్ణయింపబడలేదు. ఎప్పుడైన ప్రి. కౌ. వారిచే నీవిషయము మరల కూలంకషముగా విమర్శింపబడి, నిర్ధారణమగువఱకును నిట్లే సంశయాస్పదముగా నుండును. కాని అంతవరకును మదరాసుతీర్పులు ఆంధ్రదేశమును బయిండుచేయును. కావున నవియే నమలులో నున్న ట్లెంచబడవలయును.

---

(1). 73. ఇం. కే. 822 (866-869); 121 ఇం. కే. (పా) 887.

(2). 80. ఇం. కే. (లా) ఫు. బెం. 564; 1895. పం. రి. 82.

మాతామహుడు దౌహిత్రులకు తనఆస్తిని విల్లుద్వారా యిచ్చినప్పుడు, అది దౌహిత్రులకు ప్రత్యేకపుటాస్తియగుననియు, అందు వారికి మృతశేషత్వధర్మము వర్తింపదనియు క. హై. తీర్మానించిరి(1).

విభాగములో వచ్చిన వాటా పూర్వార్జితమా ?

7. సమష్టికుటుంబ మెంబర్లు విభజించుకొన్నప్పుడు వచ్చిన భాగములు, వారిపురుషసంతానమునకు పూర్వార్జితముగానే యెంచబడి, అందాసంతానమునకు జన్మముచేతనే హక్కు కలుగును. వారిలో వారికి మృతశేషత్వధర్మమును వర్తించును(2). ఆపురుషసంతానమావిభాగకాలము నాటికి పుట్టియుండక దరిమిలాను జన్మించినను జన్మించినది మొదలు వారికి హక్కు కలుగును(3). పురుషసంతానము కలుగకపోయినచో విభాగములోవచ్చిన వాటా, అతని ప్రత్యేకపుటాస్తిగా యెంచబడి, స్వార్జితమువలెనే అతనియనంతర మాతని వారసులకు చెందును(4).

విభాగములో ఆస్తి యొకతనఖాకు లోబడి వాటా పెట్టబడినప్పుడు, ఆమెంబరు ఆతనఖాను తనస్వార్జితపు ద్రవ్యములో నుండి తీర్చినను ఆస్తియొక్క స్వభావము మారక, పూర్వార్జితముగానే యెంచబడి, అందుపుత్రునకు జన్మముచేతనే హక్కు కలుగును(5). అయితే ఆతనఖాబాకీకి పూర్వార్జితము కోర్టుద్వారా వేలముకాబడి, ఆవేల

(1) 77. ఇం. కే. (క) 450.

(2). 29. అ. 244. ప్రి. కౌ; 9. బొం 478; 5. బొం. హై. 8. 129; 88 ఇం. కే. (ప్రి. కౌ.) 418.

(3). 8. క. 1; 10. బొం 528 (550)

(4). 17 అ 456 ప్రి. కౌ; 1. మ. 312; 9 మూ. ఇం. అ. 544.

(5). 5 మ. హై. 8. 150

ములో ఆమెంబరు, తనస్వార్జితద్రవ్యముచే కొనినచో, అప్పుడా స్వభావము మారిపోయి స్వార్జితముగా నెంచబడును(1).

సమష్టి కుటుంబాస్తిని విభజించుకొన్నప్పుడు, భాగములను పంచుకొన్నవారితోమాత్రమే సమష్టి వ్యష్టిగా మారిపోవును. కాని పంచుకొనని తనకుమారుడును తానును, సమష్టిగానే యెంచబడి వారు సమష్టికుటుంబ మెంబర్లుగానే యుందురు.

తండ్రిస్వార్జితము, కుమారునకుసంక్రమించినప్పుడది పూర్వార్జితమా ?

3. తండ్రి స్వార్జితము, అతని యనంతరము కుమారులకు సంక్రమించినప్పు డాకుమారుల కది స్వార్జితము కానేరదు. వారి కది పిత్రార్జితమై, వారి పుత్రపౌత్రులకు ఆయాస్తియందు జన్మముచేతనే స్వత్వముకలుగును. తండ్రియొక్క పూర్వార్జితపు ఆస్తి కాదనుకారణముచే అతనిపుత్రపౌత్రులకది పూర్వార్జితము కాకుండనుండదు(2). ఔడ్ చీఫ్‌కోర్టువారు అది పూర్వార్జితము కానేరదనియు Joint tenants వలె నుండుననియు మృతశేషత్వముమాత్ర ముండుననియు తీర్మానించిరి(3). కాని యిది యెంతవరకు శాస్త్రసమ్మతమో విచారణీయము.

---

(1). 20 అ 267 ప్రి. కౌ.

(2). 9. బొం ౪౨౮; 20 వీ. 8. 189; 8 మూ. ఇం. అ. 91; 48. ఇం. కే. (ఔ) 901

(3). 125. ఇం. కే. 414; 137 ఇం. కే. 814.

9. తండ్రి, తాత, మొదలగు పితృవంశీయులు, వారి స్వార్జిత మును గాని వారి ప్రత్యేకపుటా స్తిని గాని పుత్రపౌత్రాదులకు వారి సత్వముచే సంక్రమించుటకు బదులుగా వారు దాన పూర్వకముగ గాని, మరణశాసనమూలమునగాని దఖలుపర్చిన ఆ స్తి ఆపుత్రాదులకు స్వార్జితమగునా? లేక పూర్వార్జితమై దానియందు వారిపుత్రాదులకు జన్మముచేతనే స్వత్వము కలుగునా? అనువిషయమున హైకోర్టులు భిన్నాభిప్రాయముల నిచ్చియున్నవి. అట్టి యా స్తి పూర్వార్జితముగా పరిగణింపబడవలయునని క. హై. కో. వారి యభిప్రాయము(1). స్వార్జితమగునని అ. హై. కో. వారి యభిప్రాయము(2). ఇచ్చినవారి కదిస్వార్జితము గనుకను, ఇతరులెవరిచేనైన నివ్వబడినట్లే పిత్రాదుల వలన నీయబడినదికూడ పుత్రాదులకు స్వార్జితమువంటిదగుననియు, ఇచ్చినవారు ఆయా స్తిని పూర్వార్జితము కావలెనని యుద్దేశించి స్పష్ట పర్చినప్పుడుమాత్రమే పూర్వార్జితమగును గాని లేనిచో అది పుత్రా దులకు స్వార్జితమేయగునని బొం. హై. కో. వారి యభిప్రాయము(3). ఆ స్తిని యిచ్చినవారికి స్వార్జితమైనను, కుమారుల కిచ్చినప్పు డదిపూ ర్వార్జితమే యగుననియు, వారేమియు వ్రాయకుండ నూరకున్నచో, వారియనంతరము పుత్రాదులకు పూర్వార్జిత మగుచుండగా, దానము గానో విల్లురూపముగనో చెందచేసినంతమాత్రమున దానిస్వభావము మారదనియు, అయినను అదిస్వార్జితమువలె జరుగవలెనని ఆ స్తినియి చ్చినవారు తమయుద్దేశమును స్పష్టపర్చినచో అది స్వార్జితమగుననియు అట్లు స్పష్టపరుపకపోయినచో అది పూర్వార్జితమే యగుననియు

పితృపితామహాదులు పుత్రపౌత్రులకిచ్చినదిపూర్వార్జితమా?

(1) 6. వీ. రి. 71; 18 ఇం. కే. (క) 625.

(2) 29 అ 354.

(3) 10 బొం 528 (579); 12 బొం 122; 123 ఇ. కే (సిం) 763.

ను. హై. కో. వారి అభిప్రాయము(1) పిత్రాదులిచ్చిన యాస్తి పూర్వార్జితమువంటిది కావలెనని వారుద్దేశించిననే తప్ప, లేనియెడల పుత్రాదులకు, మృతశేషత్వధర్మమునకు లోబడుపద్ధతిని స్వార్జితమగునని బొంబాయి కోర్టువారి అభిప్రాయము(2). తండ్రియిచ్చిన ఆస్తి, కుమారులకు స్వార్జితమగునని సింధుకోర్టువారు తీర్మానించియున్నారు. 123 ఇం. కే. (సిం) 703. ఈవిషయమున తమయభిప్రాయము నిదమిత్థమని నిర్ణయింపక ముందెప్పుడైన యిట్టికేసు వచ్చినప్పుడు మితాక్షరి మొదలగు ధర్మశాస్త్రములను విమర్శించి యేది అనుసరణీయమో చెప్పెదమని ప్రి. కౌ. వారు చెప్పియున్నారు(3). మితాక్షరయందేమి చెప్పబడెనో చూతము.

"పితృద్రవ్యావిరోధేన ప్రతిగ్రహాలబ్ధ మప్యవిభజనీయం."

పితృద్రవ్యవ్యయములేకుండ ప్రతిగ్రహము వలన లభించినది కూడ దాయాదులకు పంచి యివ్వనక్కరలేదు. పితృద్రవ్యమనగా కేవలము, తండ్రిద్రవ్యమే కాదనియు సమష్టికుటుంబ మెంబర్లద్రవ్యమనియు స్మృతిచంద్రికలో చెప్పఁబడినది. అయితే యీదానమువలన పితృద్రవ్యము వ్యయమైనదా ? అని ప్రశ్న. ఈప్రశ్నకిచ్చెడి ప్రత్యుత్తరమువలన పూర్వార్జితమో, స్వార్జితమో, తేలగలదు.

దానమిచ్చిన ఆస్తి తండ్రికి స్వార్జితము. కావున అది పితృద్రవ్యమనియు, అది యీదానముచే వ్యయమగును. కావున నిది విభజింపదగని యాస్తిలో చేరదనియు, ఒకవాదము.

తండ్రి, దానము మొదలగునవి చేయక యూరకున్నచో అతని యనంతరము కుమారులకు సంక్రమించినప్పుడు, అది పూర్వార్జితము

(1) 3. మ. హై. 8. 50; 24 మ 429; 54 ఇం. కే. (మ) 146.

(2). 12. ఇం. కే. 770; 123 ఇం కే. 849; 33. ఇం. కే. (బొ) 785; 68. ఇం. కే (బొ) 217.

(3). 76 ఇం. కే. ప్రి. కౌ. 922

గాయెంచబడి వారికుమారులకు జననముచేత స్వత్వముకలుగును. అది తండ్రియిచ్చినంతమాత్రమున దానిస్వభావము మారదని వేరొకవాదము. పౌత్రులు తనకుకూడ పిండోదకములనిచ్చువారు కావున అట్టివారికి తనస్వార్జితమునందు హక్కులేకుండ చేయవలయునను నూహ పితామహునకుండదు. కావున పూర్వార్జితముగానే అమలుజరుపవలెననెడియుద్దేశమాతనికి కలిగియున్నట్లు భావనచేయుట న్యాయమని యొకసూచన. తండ్రికి స్వార్జితమగుటచే, నాతనికి స్వాతంత్ర్యమున్నప్పుడు, స్మృతిచంద్రికాకారుని యభిప్రాయానుసారముగా నది పితృద్రవ్యము (సమష్టికుటుంబద్రవ్యము) కాదు. కావున పితృద్రవ్యవ్యయము లేదని మరియొకవాదము-మొత్తముమీఁద ప్రి. కౌ. వారు చెప్పువఱకును ఈవిషయము, సందిగ్ధముగనే యుండును. అంతవఱకు నాంధ్రులకు మద్రాసువారి యభిప్రాయమే గమనింపదగినది.

10. పూర్వార్జితమైనఆస్తిపైనివచ్చెడి ఆదాయము వృద్ధినొందింపబడినప్పుడదియును(1); అట్టి ఆదాయమువలన సంపాదింపబడిన లేక క్రయమునకు పుచ్చుకొనబడిన ఆస్తియును(2); పూర్వార్జితమును విక్రయించినచో ఆక్రయధనమును, ఆక్రయధనముపెట్టి కొనినఆస్తియును(3); కూడ పూర్వార్జితమేయగును. పుత్రపౌత్రప్రపౌత్రులు, తమజననానంతరము అట్లు సంపాదింపబడిన లేక వృద్ధినొందింపబడిన ఆస్తియందేకాకుండ, తమ

పూర్వార్జితముచే వృద్ధియయినది.

(1) 11 మ 246;

(2) 29 అ 244 ప్రి కౌ; 13 మూ. ఇం. అ 542.

(3) 18 మ 73 (83); 118 ఇం. కే. (జొ) 87;

జన్మమునకు పూర్వము సంపాదింపబడినట్టియు వృద్ధినొందింపబడినట్టియు ఆస్తియందుకూడ హక్కు కలవారగుదురు(1).

పూర్వార్జితము కొంతకాల మితరులచే ననుభవింపబడి మరల కుటుంబములోనికి వచ్చినప్పుడు దానిస్వభావము మారునా ?

11. పిత్రార్జిత మేకారణముచేనైన కొంతకాలము భార్యకుగాని తల్లికిగాని మఱియొకరికిగాని యివ్వబడుటచే వారనుభవించుచున్నంతకాలమును పుత్రపౌత్రాదులకు సంక్రమింపక వారియనంతరము వచ్చినను, దానిస్వభావము మారనేరదు. అది మరల పూర్వార్జితముగానే యెంచబడి, అందు యథాప్రకారముగా పుత్రపౌత్రాదులకు హక్కు కలుగుచుండును(2)

వివరణము:—పూర్వార్జితము అక్రమముగా మరియొకరిస్వాధీనమై మరలసంపాదింపబడినప్పుడదిస్వార్జితమా ? పిత్రార్జితమా ? అను విషయమునుగూర్చి మూడవప్రకరణమున తెలుపబడును.

తండ్రి, తనస్వార్జితమును, భార్యకు సంపూర్ణహక్కులతో అనుభవించుటకు విల్లువ్రాసెను. ఆమె ఆఆస్తిని పిమ్మట తనకుమారునకు విల్లుద్వారా సంక్రమింపచేసెను. ఆఆస్తి అతనికిస్వార్జితమగునుగాని ఒకప్పుడు తండ్రిదికదాయని పూర్వార్జితము కానేరదు(3).

---

(1) 10 క 1017 (1021); 10 బొం 528 (581); 11 మ 246; 21 బొం 349; 6 ఇం. అ 283; 10 మూ. ఇం. అ. 490 (505); 82 ఇం. కే. (పా) 315;

(2) 12 బొం 122 (138); 23 క 262 (278); 18 మ. 83. 70 ఇం. కే. (లా) 1002;

(3) 114 ఇం. కే. 404 (క);

12. సమష్టికుటుంబ మెంబర్లుకలిసి సంపాదించినఆస్తి రెండు విధములు.

సమష్టికుటుంబ మెంబర్లు సమష్టిగా సంపాదించినది.

i కుటుంబమునకు కొంతపూర్వార్జితపుటాస్తియుండినప్పుడు దానిని మూలధనముగా నుంచుకొని, దానినిబట్టి తమప్రయత్నములచే సంపాదించినది.

ii అట్టి మూలధన మేమియు లేకుండ కాయకష్టాదులచే సంపాదించినది.

వివరణము :— ఒకసమష్టికుటుంబములో కొన్ని శాఖలున్నవనుకొనుఁడు. ఒకశాఖలోని మెంబర్లలోగాని, కొన్ని శాఖలలోని, మెంబర్లలోగాని, ఇద్దరుగాని అధికముగాని, చేరి కొంతఆస్తిని సంపాదించినచో, వారొకసమష్టికుటుంబములోని మెంబర్లుకదాయని ఆ ఆస్తి వారికి వేరుగా సమష్టికుటుంబాస్తిగా యెంచబడదు. అట్టి ఆస్తియందు, ఆసంపాదించిన మెంబర్లలో వారిలో వారికి మృతశేషత్వాది సమష్టికుటుంబ ధర్మములు వర్తింపవు. సమష్టికుటుంబాస్తియనగా మొత్తము కుటుంబమునకంతకును హక్కుకలిగియున్న ఆస్తియైనను కావలయును. లేదా అందొకశాఖలోనున్న మెంబర్లందరకును హక్కు కలిగియున్నదై యైననుండవలయును. అంతియేగాని కుటుంబమెంబర్లు యింకను కొందరుండగా అందుకొందరుమాత్రము చేరి కొంతఆస్తిని సంపాదించి తమలోతమకు సమష్టికుటుంబధర్మములు వర్తించునని చెప్పవలనుపడదు(1).

13. పూర్వార్జితమునుబట్టి వృద్ధియైనఆస్తి పూర్వార్జితమే యగునని యీప్రకరణమున పదియవపేరాలో చెప్పబడినది. కాని దానిచే వృద్ధిచేయబడినదని చెప్పుటకు తగినంత విశేషముగాలేక, కాయకష్టములచే సంపాదించుటకు చేయూత నొసంగునంతమాత్రపుఆస్తి యుండి దానినూతగాగొని మూలధనముగాచేసి ఆస్తిని సంపాదించినప్పు డది సమష్టికుటుంబాస్తియగునా కాదాయని ప్రశ్న రాగా అది సమష్టికుటుంబాస్తియే యని తీర్మానింపబడినది. ఇట్టి ఆస్తియందు పుత్రాదులకు జన్మముచేతనే హక్కు కలుగును(1).

మూలధనమును సాహాయ్యముగాగొని సంపాదించినది.

మూలధనము చాలతక్కువగానుండి, సంపాదించినది విశేషముగానున్నను, మొత్తమంతయును కూడ సమష్టికుటుంబాస్తియే యగును(2).

"సామాన్యార్థసముత్థానే విభాగస్తు సమస్స్మృతః"

యాజ్ఞవల్క్యస్మృతి.

అవిభక్తానాం భ్రాతౄణాం సామాన్యస్యార్థస్య
వాణిజ్యాదినా సముత్థానే సమ్యగర్థనే
కేనచిత్కృతే సమఏవ విభాగో నార్జయితు రంశద్వయం.

అవిభక్తులగు సోదరులలో నొకడు సముదాయద్రవ్యమును వర్తకము మొదలగు వ్యాపారములచేత వృద్ధినొందించినపక్షమందు, దాని నందరును సరిగానే పంచుకొనవలయును గాని సంపాదకుడు రెండుపాళ్లు తీసికొనకూడదు.

"మితాక్షరి"

(1). 18 మూ. ఇం. అ 542; 59 అ 244 ప్రి. కౌ; 128 ఇం. కే (లా) (481)
(2). 27 మ 228;

ఏమియును ఆదాయము రాని, యిల్లువంటి దేదయినకొంత ఆస్తి యున్నప్పు డది మూలధనముగా నెంచదగదు(1). కాని ఏదియేని కొంచెమైనను ఆదాయమువచ్చు ఆస్తియున్నప్పుడు ఒక్కమెంబరు దానినభివృద్ధిచేసినను, అది సమష్టికుటుంబాస్తియగును. మూలధన సాహాయ్యము లేదని వాదించువారు, ఆవిషయమును స్పష్టముగా ఋజువుచేయవలయును(2). ఈవిషయమును యోచించునప్పు డీపక్రకరణాంతమున "భావన"నుగూర్చి వ్రాసినసంగతులను గూడ చూడవలయును.

మూలధనము లేకుండ సమష్టి మెంబర్లు సంపాదించినది.

14. మొట్టమొదట యేవిధమయినకుటుంబాస్తి సాహాయ్యము లేకుండ కుటుంబమెంబర్లుకలసి, కృషివాణిజ్యాదులచేతను, కాయకష్టాదులచేతను ఆస్తిని సంపాదించినప్పు డది సమష్టికుటుంబాస్తియగునా? లేక సంపాదించిన మెంబర్లకు జాయింటుఆస్తి యగునా? వ్యాపారములోని భాగస్వాముల యాస్తివంటిదగునా? అను, ప్రశ్నలు వచ్చుచున్నవి. సమష్టికుటుంబాస్తియగునేని అందు పుత్రాదులకు జన్మముచేత స్వత్వముకలుగును. మృతశేషత్వధర్మము వర్తించును. జాయింటుఆస్తియైనచో అందు పుత్రాదులకు జన్మముచే హక్కుకలుగక, సంపాదించినవారిలో ఒకరు చనిపోయినచో వారిభాగము వారికుమాళ్లుమొదలగు వారసులకురాక, మృతశేషత్వధర్మముచే మిగిలియున్నవారలకు వచ్చును. భాగస్వాముల ఆస్తివంటిదయ్యేనేని, ఇండియన్ కాంట్రాక్టు ఆక్టు 11 వ ప్రకరణము వర్తించి, మృతశేషత్వధర్మము వర్తింపక, చనిపోయినవారిభాగము వారి

(1). 124. ఇం. కే (నా) 609.

(2). 78 ఇం. కే (అ) 1052; 29 అ 244 పి. కా.

పుత్రాదివారసులకు చెందును. ఈమూడు బాబతుల కుండుభేదము నాల్గవప్రకరణమునందు వివరముగా తెలుపబడును.

సమష్టికుటుంబాస్తి సాహాయ్యము లేకుండ సమష్టికుటుంబ మెంబర్లు కలసిసంపాదించిన ఆస్తి వారిజాయంటుఆస్తియని భావన చేయ వలయుననియు, అందొకరు పోయినచో ఆతనిభాగ మాతనిభార్యకు సంక్రమింపక మృతశేషత్వధర్మముచే మిగిలినవారికి చెందుననియు, అయితే సదరుమెంబర్లు వ్యాపారముచేయునప్పుడు, సమష్టికుటుంబ మెంబర్లవలెగాక సామాన్యభాగస్వాములవలె యగ్రిమెంటుద్వారా చేసిరేని, అప్పుడు ఆయాస్తి జాయంటుఆస్తిగాక, చనిపోయినవాని భాగ మాతనిభార్యాపుత్రాదులకు వచ్చుననియు ప్రి. కౌ. తీర్మానించినారు(1). బొంబాయి హైకోర్టువారుకూడ మొట్టమొదట కొన్నికేసులలో అట్లే తీర్మానించినారు(2). కాని దరిమిలాను, సమష్టికుటుంబమెంబర్లుకలసి సంపాదించినఆస్తి సమష్టికుటుంబాస్తియనియే భావనచేయవలయునని తీర్మానించినారు(3). మద్రాసుహైకోర్టువారుకూడ అట్లేతీర్మానించుచు, ఆస్తిసంపాదించినవారి యభిప్రాయము సమష్టికుటుంబాస్తిగా కాకుండ, సంపాదించినవారి జాయంటుఆస్తిగా నుంచుకొనవలయునని యుండెనేని అది వారిజాయంటుఆస్తియగునని తీర్మానించిరి(4). సమష్టికుటుంబాస్తియనుభావన, కొందరు మెంబర్లుమాత్రమే సంపాదించినప్పుడు లేదు(5).

---

(1). 10 మూ. ఇం. అ 490 (500)

(2) 9 బొం 438 (445); 23 బొం 144;

(3). 126 ఇం. కే. (బొం) 890; 32 బొం. 479; 128 ఇం. కే. (అ) 289 10 బొం. లా. 8 175; 50 బొం 443 తండిక్రమాళ్లు; 97 ఇం. కే. 820; 122 ఇం. కే. (నా) 446;

(4). 27 మ 32 తండిక్రమాళ్లు; 25 మ 147 (155-156); 65 ఇం. కే. (క) 655; 108 ఇం. కే. (మ) 801

(5). 25 మ 149.

మూలధనము లేకపోయినను, సమష్టికుటుంబమెంబర్లుకలసి సంపాదించిన ఆస్తి సమష్టికుటుంబాస్తియగుచు అనికొన్నితీర్పులున్నవి(1).

**15.** సమష్టికుటుంబమెంబర్లలో, కొందరు ప్రయోజకులై కొంత ఆస్తిని సంపాదించి, దానిని మొత్తముసమష్టికుటుంబమునకంతకుచు హక్కుకలిగియుండునట్లు సమష్టికుటుంబాస్తిగా చేసి వ్యవహరించుచుండుట హిందువులలో క్రొత్తకాదు. అట్లు హిందూకుటుంబములో సామాన్యముగా జరుగుచుండును(2).

సమష్టికుటుంబ ఆస్తిగా అయులు జరిపినది.

సమష్టికుటుంబమెంబర్లలో, ఏయొకనియొక్క స్వార్జితమైనను, సప్రతిబంధదాయము మొదలగు ప్రత్యేకపుటాస్తియైనను, లేక సమష్టికుటుంబమెంబర్లలో కొందరు చేరి, వేరుగా సంపాదించినబాబతు వారి జాయింటు ఆస్తిమాత్రమే యని భావనచేయదగినయాస్తియైనను, వారు వేఱుగానుంచుకొనక, సమష్టికుటుంబాస్తితోగాని, పూర్వార్జితముతోగాని, కలిపివేసినచో అదియంతయును సమష్టికుటుంబాస్తియై దానియందు సమష్టికుటుంబమెంబర్లందరకును హక్కుకలిగి, పుత్రపౌత్రులకు జన్మముచేతనే స్వత్వమేర్పడి, మృతశేషత్వాది సమష్టికుటుంబధర్మములకు లోనగును(3).

---

(1) 97 ఇం. కే (బొం) 820; 51 ఇం.కే 854; 31 ఇం. కే 18; 109 ఇం కే(లా) 779

(2). 137 ఇం. కే (లా) 92.

(3). 29 అ 244. పి౹.కౌ; 40 ఇం. కే (పి౹.కౌ.) 988; 45 ఇం. కే (పి౹.కౌ.) 806; 26. వీ. రి. 55; 10 మూ. ఇం. అ 490 (505); 75 ఇం. కే (పి౹. కౌ ) 252; 18 క 341 పి౹. కౌ; 7 మ 458; 27 మ 998; 81 ఇం. కే (మ) 1031; 90 ఇం. కే (మ) 124; 90 ఇం. కే (మ) 1016; 97 ఇం. కే (మ) 998; 16 క 397; 15 బొం 32; 21 బొం 349; 45 ఇం. కే (బొం) 584; 32 ఇం. కే 955; 128 ఇం. కే (లా) 481; 86 బొం 424; 33 క. వీ. నో. 435; 108 ఇం. కే (పా) 351; 36 ఇం. కే (పా) 263; 103 ఇం. కే (మ) 281;

స్వార్జితమును, స్పష్టముగా ప్రకటించుటవలనగాని, దానిని వ్యవహరించుటలో జరపిన ప్రవర్తనమూలమునగాని, సమష్టికుటుంబాస్తిగా మార్పుచేయవచ్చును. లేదా సమష్టికుటుంబాస్తిలో కలిపి వేయవచ్చును(1). అట్లు మార్పుగాని, కలిపివేయుటగాని, జరిగినట్లు రుజువుచేసిననేతప్ప, స్వార్జితము సమష్టికుటుంబాస్తిగా భావింపబడనేరదు(2).

హారసత్వముచే దఖలుపడిన తన ప్రత్యేకపుటాస్తియును, పూర్వార్జితమును కలిపి తనఖాపెట్టినయొకకేసులో రెండు ఆస్తులను సమష్టికుటుంబాస్తులుగనే యెంచవలయునని తీర్మానించిరి(3).

బిందెడునీటిలో రంగుపొడరును కలిపినచో, అది నీటియందంతటను వ్యాపించి, వేరుచేయుటకు వీలులేనట్లు, స్వార్జితపుటాస్తిగాని, ప్రత్యేకపుటాస్తిగాని, సమష్టికుటుంబాస్తిలో కలసిపోయినచో అంతటనుండి, యదికూడ సమష్టికుటుంబాస్తిగానే యెంచబడును(4).

సమష్టికుటుంబాస్తిని మేనేజిమెంటుచేయుచున్న మేనేజింగు మెంబరు, సమష్టికుటుంబాస్తిని, తన స్వార్జితమును లేక ప్రత్యేకపుటాస్తి కలిపివేసి వ్యవహరించుచున్నయెడల, మొత్తమంతయును సమష్టికుటుంబాస్తిగానే యెంచబడును(5).

తండ్రి, పూర్వార్జితముపై వచ్చు ఆదాయమును, తన స్వార్జితముపై వచ్చు ఆదాయమును ఒకబ్యాంకిలో ఒకకాతాలో డిపాజిట్టు

(1). 38 ఇం. కే. 244.

(2). 88 ఇం. కే (పా) 96;

(3). 138 ఇం. కే (ఔ) 490.

(4). 20 ఇం. కే. (బొం) 476; 100 ఇం. కే (బొం) 147.

(5). 50 క 439; 17 ఇం. కే (గవర్నమెంటు యిచ్చిన ఆస్తి) 760; 21 క. వీ. నో. 1065; 36 బొం 424; 20 ఇం. కే 476; 121 ఇం. కే (క) 490.

చేయుచుండెను. ఏది యెంతయో విడదీయుట కవకాశము లేకపో యెను. మొత్తమంతయును తండ్రికిని కుమారులకును సమష్టికుటుంబాస్తియగునని ప్రి. కౌ. తీర్మానించిరి(1).

సమష్టికుటుంబమెంబరు, తన స్వార్జితమును వేరుగా తనయాధీనములో నుంచుకొనక, సమష్టికుటుంబమునకు విడచివైచి, యూరకున్న యెడల, కాలదోషశాసనము వర్తించి, తిరిగి రాబట్టుకొనుట కాతని కవకాశముండదు. అట్టియాస్తి సమష్టికుటుంబాస్తిగా నెన్నబడును(2).

సమష్టికుటుంబమెంబర్లు, వేరుగా తమ స్వార్జితద్రవ్యమునుండి క్రయమునకు పుచ్చుకొనిన ఆస్తిని వారు సమష్టికుటుంబాస్తిగా వ్యవహరించిరని వాదించువారు, ఆవిషయమును స్పష్టముగాను బలముగాను రుజువుచేయవలయును(3).

స్వార్జితమునుగాని, ప్రత్యేకపుటాస్తినిగాని, సమష్టికుటుంబాస్తిగా మార్పుచేయుటకుగాని, దానిలో కలిపివేయుటకుగాని, రిజస్టరు చేయబడిన దస్తావేజు వ్రాయునవసరము లేదు(4).

సమష్టికుటుంబమెంబరు, తన స్వార్జితమును సమష్టికుటుంబాస్తితో కలువకుండ ప్రత్యేకముగా నుంచుకొనెనని బలమైన రుజువు లేనప్పుడు, ఆస్వార్జితము, సమష్టికుటుంబాస్తిలో కలిపివేసినట్లు భావన వచ్చును(5). అట్టి రుజువున్నప్పుడు, అది సమష్టికుటుంబాస్తి కాజాలదు(6).

---

(1). 29 అ 244.

(2). 24 మ 387.

(3). 134 ఇం. కే (క) 542; 193 ఇం. కే (బొ) 746; 32 ఇం. కే. 12.

(4). 96 ఇం. కే (మ) 1051.

(5). 128 ఇం. కే (లా) 481.

(6). 93 ఇం. కే (లా) 684.

16. ఇతరులతాలూకు ఆస్తి ఏదయినను, వ్యతిరేకభుక్తము వలన సమష్టికుటుంబమునకు దఖలుపడినయెడల అది సమష్టికుటుంబాస్తిగా నెంచబడి మైనరుమెంబర్లకు సహా అందరకు హక్కుకలిగియుండును(1).

వ్యతిరేకభుక్తము చేదఖలుబడిన ఆస్తి.

17. సమష్టికుటుంబమెంబర్లలో నెవరైనను, సమష్టికుటుంబాస్తి సాహాయ్యము లేకుండ వేరుగా ఆస్తిని సంపాదించుకొనుట కభ్యంతరము లేదు(2). అది, కుటుంబాస్తి సాహాయ్యముతో సంపాదింపబడెననియు, లేదా దరిమిలాను అది సమష్టికుటుంబాస్తితో కలిపివేయబడెననియు, రుజువుచేసిననే తప్ప స పాదించినవారి స్వార్జితమగును సమష్టికుటుంబమెంబర్లకు అందు హక్కు ఉండదు(3). తండ్రిజీవించియుండగా కుమారుడు, ఆస్తి సంపాదించినప్పుడు, ఆయాస్తిని సంపాదించుటకు తగిన ప్రయివేటు ఆధారము లాతడు కలిగియుండెనేని, అది కుమారుని స్వార్జితమగును(4). సమష్టికుటుంబమెంబర్లయొక్క స్వార్జితము, సమష్టికుటుంబాస్తియని భావన చేయవీలు లేదు(5) ఇద్దరు సోదరులు సమష్టికుటుంబముగా నున్నప్పుడు, అందొకనిపేర ఆస్తిని కొనిరేని ఆక్రియధనము సమష్టికుటుంబద్రవ్యమునుండి యివ్వబడెననిరుజువైననేతప్ప, సమష్టికుటుంబ మెంబరైనంతమాత్రమున అది సమష్టికుటుంబాస్తియని యూహింప

సమష్టి కుటుంబ మెంబర్లలో ఒకని పేరగానికొందరి పేరగాని ఉన్న ఆస్తి సమష్టికుటుంబాస్తి యగునా ?

(1) 186 ఇం. కే. (బొ) 702.

(2) 142 ఇం. కే. (బొ) 860.

(3) 113 ఇం. కే. (ప్రి. కౌ) 897; 95 ఇం. కే. (క) 426; 83 ఇం. కే (మ) 961.

(4) 86 ఇం. కే. (క) 734.

(5) 111 ఇం. కే. (లా) 596.

రాదు(1). సమష్టి కుటుంబాస్తిని వేలములో ఒకమెంబరు తనస్వార్జిత ద్రవ్యముతో కొననేని అది యాతనిస్వార్జితమగును(2). కుటుంబమెంబర్లలో, ఒకనికి, అతని ప్రత్యేకద్రవ్యముగాని, ప్రత్యేక సాధనము గాని లేనప్పుడు, అతని యొక్కనిపేరనున్నను, ఆయాస్తి సమష్టిఆస్తి యేయగును(3). కుమారునిపేర తండ్రి ఆస్తిని కొనినప్పుడది నామకః కొనినట్లెంచబడి సమష్టిఆస్తియగును(4) సమష్టిద్రవ్యముతో కర్త యొక్కనిపేర ఆస్తిని కొనినప్పుడు అది సమష్టికుటుంబాస్తియగును(5). కర్తకానట్టి యొకమెంబరుపేర ఆస్తి కొనినప్పుడు, సందర్భమునను సరించి నామకః కొనినట్లెంచబడవలసియుండును(6).

18. సమష్టికుటుంబమెంబర్లలో ఒకనికిగాని, కొందరికిగాని, ఇతరు లెవరైనను, ఆస్తి నిచ్చినప్పుడు, అది యాతని ప్రత్యేకపుటాస్తియై యతని స్వార్జితముగా పరిగణింపబడును. కాని సమష్టికుటుంబాస్తి కానేరదు(7). ఒకని కిచ్చినయాస్తి కుటుంబమునకంతకును యివ్వబడియెనని భావన లేదు(8). కుటుంబయజమానికివ్వబడిన యాస్తి కుటుంబమున కంతకును యివ్వబడెనని తప్పక భావింపవలసిన పనిలేదు. కుటుంబమున కంతకును యివ్వబడియెనని వాదించువారు ఆయంశమును రుజువుచేయువలయును(9).

సమష్టికుటుంబమెంబర్లలో కొందరి కితరులవలన నీయబడినయాస్తి సమష్టికుటుంబాస్తియగునా?

---

(1). 102 ఇం. కే. (మ) 360; 85 ఇం కే. 655.

(2). 59 ఇం. కే. (బొం) 569.

(3) 38 ఇం. కే. (మ) 292; 91 ఇం. కే. (క) 681.

(4). 47 ఇం. కే. (పం) 367.

(5). 48 ఇం. కే; (పా) 919.

(6). 56 ఇం. కే. 386.

(7). 102 ఇం. కే. (మ) 680

(8). 49 ఇం. కే. 912

(9). 50 ఇం. కే. (బొ) 180

**19.** సమష్టికుటుంబ మెంబర్ల యొక్క భార్యల పేరగాని, తల్లుల పేరగాని, ఉన్న యాస్తి సమష్టికుటుంబా స్తియని భావింపకూడదు. న్యాయస్థానము లట్టి భావనను చేయకూడదు(1). సమష్టి కుటుంబద్రవ్యమునుండి, ఆయాస్తి క్రియము నకు పుచ్చుకొనబడెననియు, నామకః ఆస్త్రీపేర దస్తావేజు పుట్టబడెననియు, వాదించువారు ఆవిషయ మును స్పష్టముగా రుజువు చేయువలయును. అట్లు రుజువు కాని సందర్భ ములో, ప్రతివాది వాదమును విమర్శింప నక్కరలేకుండగనే సమష్టి కుటుంబాస్తి కాదని యెంచవలయును(2).

స్త్రీలపేర నున్న ఆస్తిసమష్టికుటుంబాస్తియగునా ?

సమష్టికుటుంబములోని స్త్రీలపేర ఆస్తియున్నప్పుడు, అది సమష్టికుటుంబద్రవ్యమునుండి సంపాదింపబడినదని భావన వచ్చునని కొన్నితీర్పులున్నవి(3). స్త్రీలపేర ఆయాస్తి యెట్లువచ్చినదో ఆద్రవ్య మెచ్చటనుండి వచ్చినదో ఆయాస్తి సంపాదింపబడిన దరిమిలాను దాని యనుభవ మెట్లుండెనో మొదలగువిషయములను విచారణచేసి నిర్ధా రణ చేయవలయునని పాట్నా హైకోర్టువారు తీర్మానించినారు(4). స్త్రీపేర ఆస్తియున్నప్పుడు, ఆయాస్తి యామెదికాదని భావింపవల యునను సూత్రమెచ్చటను లేదనియు, ఆయాస్తిని సంపాదించుటకు ద్రవ్యమెచ్చటనుండి వచ్చెనో తెలిసికొని, నిజమైన హక్కుదారును నిర్ణయింపవలయునని మద్రాసు హైకోర్టువారు తీర్మానించిరి(5). సమ

(1). 32 ఇం. కే. (క) 934; 8 మ 214; 82 ఇం. కే. (క) 934; 62 ఇం. కే. (క) 348 కోడలుపేర;

(2). 34 లా. వీ. 704

(3). 10 క 685; 15 వీ. ర. 357

(4). 52 ఇం. కే. (పా) 402

(5). 1928 మ 708; 11 లా 898; 140 ఇం. కే. (క) 678.

ష్టికుటుంబద్రవ్యముతో స్త్రీపేర ఆస్తిని కొనినప్పుడు, అది నామకః ఆమెపేర కొనబడియెనని యెంచి, సమష్టికుటుంబాస్తిగా భావింపవలయును(1).

20. హిందూకుటుంబము, సమష్టికుటుంబమను భావనయుండునని మొదటిప్రకరణములో చెప్పియున్నాము. ఆస్తివిషయమైన భావననుగూర్చి ఇచ్చట చెప్పబడుచున్నది. హిందూకుటుంబము వ్యష్టిఅయినదని రుజువుచేయబడువరకును సమష్టికుటుంబమని భావనయున్నట్లే, సమష్టికుటుంబముయొక్క యావదాస్తియును సమష్టికుటుంబాస్తి యను భావనయుండును(2). కాని ప్రతికుటుంబమును ఆస్తినికలిగియుండునను భావన లేదు(3). కుటుంబాస్తిని విభాగమునకు దావా తెచ్చెడివారు, తాము విభాగమును కోరెడియాస్తి సమష్టికుటుంబాస్తియని మొట్టమొదట రుజువుచేయవలయును(4).

భావన, Presumption.

కుటుంబమెంబర్లలో ఒకరిపేరనున్నయాస్తి సమష్టికుటుంబాస్తియని వాదించువారు ఆయాస్తిని సంపాదించుటకు తగినంత సాహాయ్యమొసంగెడియేదో కొంతఆస్తిసమష్టికుటుంబమునకు మొట్టమొ

(1). 63 ఇం. కే. (అ) 676; 1921 క 571.

(2). 86 ఇం. కే. (అ) 852.

(3) 97 ఇం. కే. (మ) 632. ఇందులో చాలాతీర్పులు విమర్శింపబడి, 'లా' నిర్ణయింపబడినది. 102 ఇం. కే. (మ) 290; 126 ఇం. కే (మ) 609; 39 ఇం. కే (బొ) 498; 132 ఇం. కే. (లా) 7; 133 ఇం. కే. (లా) 628; 1930. మ. వీ. నో. 1016; 96 ఇం. కే. (లా) 247; 103 ఇం. కే (లా) 479; 80 ఇం. కే (బొ) 480;

(4) 65 క. 1069 పి9. కా; 118 ఇం. కే పి9. కా. 897; 69 ఇం. కే. పి9. కా. 128; 1 టెం. లా. 8. 164;

దట యుండెనని ఋజువుచేయవలయును. అట్టిరుజువు లేనప్పుడు, అది సమష్టికుటుంబాస్తియను భావన లేదు. అట్టిరుజువు ఉన్నప్పుడు మాత్రము, ఆయాస్తి సమష్టికుటుంబాస్తియని భావనవచ్చును. అప్పుడు, ఆయాస్తి, సమష్టికుటుంబాస్తిసాహాయ్యముతో సంపాదింపబడ లేదనియు, అది తనస్వార్జితమనియు, స్వార్జితమనివాదించువారు స్పష్టముగా రుజువుచేయవలసియుండును(1).

పూర్వార్జితము, కొలదిగనుండి దరిమిలాను సంపాదించినది విశేషముగానున్నదనుకారణముచే, ఆయాస్తి సమష్టికుటుంబాస్తియనుభావన పోజాలదు(2).

సమష్టికుటుంబమునకు మొదట ఆస్తియున్నదని చెప్పుకొన్నను లేక రుజువైనను, ఆకుటుంబమునకు ఉన్న ఆస్తియంతయును, అది ఎవరిపేరనున్ననుసరియే, సమష్టికుటుంబాస్తియనియే భావనవచ్చును. అందులోకొంత, తనస్వార్జితమని వాదించుమెంబరు, ఆవిషయమును స్పష్టముగా రుజువుచేయవలయును. తనయొక్కనిపేర క్రయదస్తావేజు పుట్టబడినదనిగాని, ఆభూమిశిస్తును తానుపుచ్చుకొనుచున్నాననిగాని

(1) 40 ఇం. కే (పం) 778.
97 ఇం. కే. (మ) 632; 102 ఇం. కే (మ) 290; 126 ఇం. కే (మ) 609; 132 ఇం. కే. (లా) 7; 1930. మ. వీ. నో. 1016; 131 ఇం. కే (మ) 494; 26 ఇం. కే (మ) 33; 33 అ. 677; 15 ఇం. కే (నా) 938; 95 ఇం. కే (నా) 183; 120 ఇం. కే (నా) 402; 131 ఇం. కే (లా) 237. 156 ఇం. కే. (మ) 205; 100 ఇం. కే. (బొం) 937, 17 ఇం. కే (పా) 232; 87 ఇం. కే. (నా) 809; 95 ఇం. కే. (క) 426.

(2) 49 ఇం. కే (నా) 240.

చెప్పినంతమాత్రమున ఆభావనపోదు. ఆద్రవ్య మెట్లువచ్చినదో, స్వార్జిత మెట్లయినదో చెప్పవలయును(1).

సమష్టిమూలధనము లేకుండ హిందూకుటుంబమెంబరు సంపాదించిన ఆస్తి వానిస్వార్జితమని భావనచేయవలయును. అతడు సమష్టికుటుంబాస్తిగా దానిని చేసెనని వాదించువారు ఆవిషయమును స్పష్టముగా రుజువుచేయవలయును(2).

ఆస్తిసంపాదనకు సాహాయ్యమొనర్చుటకు తగినంతసమష్టిమూలధనము లేదని రుజువైనప్పుడు, కుటుంబమెంబర్లలో నొకరుసంపాదించినయాస్తి సమష్టికుటుంబాస్తి యగుననుభావన లేదు(3).

మూలధనము, చాలతక్కువగానున్నప్పుడు, దరిమిలాను సంపాదింపబడినయాస్తి సమష్టికుటుంబాస్తియని భావనరాదు(4). దరిమిలాను సంపాదించినఆస్తిలో దామాషాయిని ఇంతభాగము మూలధనముండవలయునను నియమము లేదు(5).

(1) 133 ఇం. కే (లా) 628; 132 ఇం. కే (లా) 7; 101 ఇం. కే (లా) 652; 1930 మ 793; 1931 లా 118; 96 ఇం. కే. 184; 69 ఇం. కే (క) 476; 69 ఇం. కే. (పి. కౌ) 123; 142. ఇం. కే. (బొ) 860

(2) 32 ఇం. కే (మ. పు. బెం.) 12; 134 ఇం. కే. (సిం) 388; 122 ఇం. కే. (అ) 413.

(3) 71 ఇం. కే (మ) 180; 122 ఇం. కే. (అ) 413; 111 ఇం. కే (లా) 596. 22 ఇం. కే (887); 1928 మ. 764. 142 ఇం. కే. (పి. కౌ) 739.

(4) 115 ఇం. కే (పా) 237; 93 ఇం. కే (లా) 634; 49 ఇం. కే (నా) 240; 95 ఇం. కే (నా) 183 142. ఇం. కే (పి. కౌ) 739.

(5) 49 ఇం. కే (నా) 240;

సమష్టికుటుంబమెంబర్లలో ఒకరిపేర ఆస్తి యున్నంతమాత్రమున అది యాతనిస్వార్జితమని భావన రాదు(1). అది సమష్టికుటుంబాస్తియనియును భావన లేదు(2).

మూలధనమున్న దనురుజువు లేనప్పుడు, సమష్టికుటుంబమెంబర్లు సంపాదించినఆస్తి, స్వార్జితముకాదని వాదించువారు, అది యెట్లు స్వార్జితముకాదో రుజువుచేయవలసియుండును(3).

స్వార్జితమగునా కాదా యనువిషయమున, భావనచేయునప్పుడు, ఏకేసునకాకేసులోఆకేసు సందర్భములనుబట్టి యోచింపవలయునని కలకత్తాహైకోర్టువారొక కేసులో తీర్మానించియున్నారు(4). హిందూలాలో నెచ్చటను ఫలానిబాపతుఆస్తి, పూర్వార్జితమని భావన చేయవలయునని చెప్పబడియుండలేదు(5). రుజువునుబట్టి స్వభావమును నిర్ణయింపవలయును(6).

(1) 39 ఇం. కే 498;46 ఇం. కే (పా) 255;

(2) 88 ఇం. కే (ఔ) 785;

(3) 118 ఇం. కే (మ) 865.

(4) 117 ఇం. కే (క) 529. 95 ఇం. కే (క) 426.

(5) 128 ఇం. కే (ఔ) 849.

(6) 120 ఇం. కే (నా) 402.

# మూఁడవప్రకరణము.

## స్వార్జితము.

---

"స్వార్జితము" అని సామాన్యముగా వాడబడుచుండెడి యాస్తి రెండువిధములు. స్వార్జితము అనగా తనచే సంపాదింపబడినది యని యర్థము.

స్వార్జితము రెండు విధములు.

i. తన ప్రయత్నములవలన కృషివాణిజ్యాదులచే తను కాయకష్టమువలనను శ్రమపడి సంపాదించినది.

ii. అప్రయత్నముగా వారసత్వాదులవలన లభించి, తాను ప్రత్యేకముగా ననుభవించుటకు హక్కు కలిగి యున్నట్లు హిందూ ధర్మశాస్త్రములచే నంగీకరింపబడినది.

ఇందు మొదటిదానికి "స్వార్జితము" Self acquired property అనియు రెండవదానికి "ప్రత్యేకపుటాస్తి" Separate property అనియు పేళ్లు.

ఈ రెండును వేఱువేరులతో వ్యవహరింపబడుచున్నను హక్కుబాధ్యతలయందు, స్వాతంత్ర్యమునందు, వినియోగమునందు, ఆస్తి సంక్రమించుటయందు, ఈ రెండింటికిని భేదములేదు. న్యాయవాదులును న్యాయస్థానములును, ఈ రెండింటినిగూడ సామాన్యముగా స్వార్జితమనియే వాడుచుందురు.

2. "యద్యేనలబ్ధం తత్తస్యైవ నాన్య స్యేతి ప్రసిద్ధతరం"

స్వార్జిత విషయమున స్మృతివచనములు.

ఎవనిచేత యేదిపొందబడునో అది వానికేచెందును. ఇతరులకు చెందదు. ఇది సుప్రసిద్ధతరమైన విషయము. మితాక్షరి.

"పితృద్రవ్యాఽవిరోధేన యదన్య త్స్వయమార్జితం
మైత్ర మౌద్వాహికం చైవ దాయాదానాం నతద్భవేత్

క్రమా దభ్యాగతం ద్రవ్యం హృత మభ్యుద్ధ రేత్తు యః
దాయాదేభ్యో నతద్దద్యా ద్విద్యయా లబ్ధమేవచ"

యాజ్ఞవల్క్యస్మృతి.

పితృద్రవ్యవ్యయము లేకుండ తనచేత నార్జింపబడినదియు, స్నేహితునివలన పొందబడినదియు, వివాహమందు ప్రాప్తమైనటువంటిదియు విద్యచే లభించినట్టిదియు నే యితరద్రవ్యముకలదో అది దాయాదులకు రాదు. పితృక్రమముగా ప్రాప్తమై యితరులచేత నపహరింపబడిన ద్రవ్యము నే భాగరి సాధించుచున్నాడో ఆతఁడాద్రవ్యమును దాయాదుల కీయనక్కర లేదు. ('పితృద్రవ్యావిరోధేన' అనుమాటకు వ్యాఖ్యానము చేయుచు, విజ్ఞానేశ్వరుఁడు "మాతాపిత్రోర్ద్రవ్యవినాశేన" అని తలిదండ్రుల ద్రవ్యనాశము లేకుండ అని తల్లిద్రవ్యమును గూడ చేర్చినాడు. పితృద్రవ్యమనగా తలిదండ్రుల ద్రవ్యమని గ్రహించుచుండవలయును.)

ఈశ్లోకములయందు, అయిదువిధములగు ధనములను దాయాదులకు పంచియివ్వనక్కర లేదని యాజ్ఞవల్క్యమహర్షి నిర్ణయించి యున్నాఁడు. "పితృద్రవ్యవ్యయము లేకుండ తనచే నార్జింపబడిన" అను వాక్యము తక్కినవానికికూడ నన్వయించునని మితాక్షరి వ్యాఖ్యానమున చెప్పబడినది.

"అత్రచ పితృద్రవ్యావిరోధేన యదన్యత్స్వయమార్జిత మితి సర్వశేషః. అతశ్చ పితృద్రవ్యావిరోధేన యన్మైత్రం, పితృద్రవ్యావిరోధేన యదౌద్వాహికం, పితృద్రవ్యావిరోధేన యత్క్రమాయాత ముద్ధృతం, పితృద్రవ్యావిరోధేన విద్యయా యల్లబ్ధ మితిప్రత్యేక మభిసంబధ్యతే"

పితృద్రవ్యవ్యయము లేకుండ మిత్రులవలన లభించినది, పితృద్రవ్యవ్యయము లేకుండ వివాహమునందు ప్రాప్తమైనది, పితృద్రవ్య

వ్యయము లేకుండ నితరులచే నపహరింపబడినదానిని మరల సంపాదించినది, పితృద్రవ్యవ్యయము లేకుండ నేర్చుకొనిన విద్యచే లభించినది, ఈద్రవ్యమును దాయాదులకు పంచియివ్వనక్కర లేదని యర్థము.

"పితృద్రవ్యవిరోధేన ప్రత్యుపకారేణ యన్మైత్రం,
ఆసురోద్రవిణాదానా దిత్యుక్త్వా దాసురాదివివాహే
షు పితృద్రవ్యవ్యయేన యదౌద్వాహికం లబ్ధం,
తథా పితృద్రవ్యవ్యయేన యత్క్రమాయాత ముద్ధృతం,
తథా పితృద్రవ్యవ్యయేన లబ్ధయా విద్యయా యల్లబ్ధం,
తత్సర్వం సర్వైర్భ్రాతృభిః పిత్రా చ విభజనీయం.

పితృద్రవ్యమునుండి ఉపకారమును పొందిన మిత్రునిచే ప్రత్యుపకారముగా నీయబడినదియును, ఆసురాది వివాహములయందు ఓలి మొదలగు ధనమిచ్చుటవలన పితృద్రవ్యము వ్యయమై అందువలన లభించిన ద్రవ్యమును, పితృద్రవ్యము వ్యయముచేసి, యితరులవలన అపహరింపబడిన ఆస్తిని తిరిగి రాబట్టినేని అదియును పితృద్రవ్యవ్యయముచేత సంపాదించిన విద్యచే లభించిన ధనమును సోదరులందఱును తండ్రియునుగూడ పంచుకొనవలయును.

"తథా పితృద్రవ్యావిరోధే నేత్యస్య సర్వశేషత్వాదేవ
పితృద్రవ్యావిరోధేన ప్రతిగ్రహలబ్ధమ ప్యవిభజనీయం"

"పితృద్రవ్య వ్యయము లేకుండ" అను వాక్యమునన్నిటికిని చేర్చుటవలన పితృద్రవ్యవ్యయము లేకుండ ప్రతిగ్రహమువలన లభించినది కూడ విభజింపదగినది కాదు. మితాక్షరి.

ఈయభిప్రాయమునే మనువుకూడ నంగీకరించియున్నాడు.

"విద్యాధనంతు యద్యస్య తత్తస్యైవ ధనంభవేత్,
మైత్రమౌద్వాహికంచైవ మాధుపర్కిక మేవచ.
అనుపఘ్నన్ పితృద్రవ్యం శ్రమేణ యదుపార్జితమ్,

స్వీయ మీహితలబ్ధం తన్నాకామో దాతుమర్హతి.
పైత్రకంతు పితాద్రవ్య మనవాప్తం యదాప్నుయాత్,
నతత్పుత్రైర్భజేతార్థ మకామ స్స్వయమార్జితమ్.

విద్యవలన లభించిన ధన మెవనిదో, యది వానిదే యగును. మఱియు, స్నేహము, వివాహము, మధుపర్కపూజ వీనియందు లభించినదియు విభాగార్హముకాదు తండ్రిద్రవ్యమును చెఱుపక సేద్యము మొదలగువానిచే శ్రమపడి, యొకడు కొంతద్రవ్యమును సంపాదించె నేని, అట్టిద్రవ్యమును పంచి యియ్య నొల్లనివాడు దానిని పంచియివ్వ నక్కరలేదు ఎయ్యది పితృధనమో దానిని అసమర్థుడై తండ్రి విడిచి పెట్టెనేని, అతని పుత్రుడు స్వశక్తిచే దానిని సాధింపవచ్చును. తండ్రి, తనకిష్టము లేదేని, తన స్వార్జితమును కొడుకులకు పంచి యివ్వనక్కరలేదు.

మనువు.

స్వయమార్జిత మవైద్యోభ్యో వైద్యః కామం న దద్యాత్.

విద్యలను చదివినవాడు వైద్యుడు. విద్యలను చదివి తద్ద్వారా స్వయముగా ఆర్జించుకొన్న సొత్తునుండి విద్యాదులు చదువక స్వార్జితములేని సోదరులు మొదలగువారికి భాగము నీయకపోయినను దోషములేదు. పారమార్థికదృష్టితో భాగమునిచ్చిరేని యభ్యుదయము కలుగును.

గౌతములు.

పరభక్తప్రదానేన ప్రాప్తా విద్యాయదాన్యత,
తయా ప్రాప్తంచ విధినా విద్యాప్రాప్తం తదుచ్యతే.
ఉపన్యస్తే చ యల్లబ్ధం విద్యయా పణపూర్వకం,
విద్యాధనంతు తద్విద్యాత్ విభాగే న విభజ్యతే॥

కాత్యాయనుడు.

3. పైన వ్రాసిన స్మృతివచనములను బట్టియును, దేశకాల భేదముల ననుసరించియును, ప్రస్తుతమున స్వార్జితమును ఈదిగువవ్రాసిన పదితరగతులుగా విభజింపవచ్చును :—

స్వార్జితము పదితరగతులు.

i సప్రతిబంధదాయము.

ii సేవ, యుద్ధము మొదలగునవి చేయుటచే మెచ్చి ప్రభువులచే నీయబడినది.

iii విద్యచే లభించినది.

iv బంధువులు, స్నేహితులు, ఇతరులు ఉచితముగా నిచ్చినది.

v ఇతరులచే నపహరింపబడిన కుటుంబాస్తిని తిరిగి సంపాదించినది.

vi కష్టపడి స్వప్రయత్నమువలన కృషివాణిజ్యాదులు చేసి సంపాదించినది.

vii వివాహమందు లభించినది.

viii తనతో సమష్టిగా నుండదగిన కుటుంబమెంబర్లు లేనప్పుడు అతని యావదాస్తి.

ix అవిభాజ్యపు జమీందారీపైని వచ్చెడి ఆదాయము.

x ఇతరములు.

4. సప్రతిబంధదాయమునుగూర్చి రెండవప్రకరణమున విశేషముగా చర్చించియున్నాము. పితృ పితామహ ప్రపితామహులును, మాతామహుడునుదప్ప నితరులగు సపిండులు, సమానోదకులు, మేనమామ మొదలగు బంధువులు మొదలగువారు సంతతిలేకుండ చనిపోయినప్పుడు, వారసత్వముచే వచ్చిన ఆస్తి సప్రతిబంధదాయమగును. ఇది యెవరికి సంక్ర

సప్రతిబంధదాయము.

మించునో వారి ప్రత్యేకపుటాస్తియై సంపూర్ణాధికారము కలిగియుం డును. అందు వారిపుత్రులు మొదలగువారికి జన్మముచే హక్కు కలుగదు(1). తండ్రియొక్క స్వార్జితము, పుత్రునకు సంక్రమించినప్పుడు అది యాతనికి స్వార్జితమగునా ? పూర్వార్జితమగునా ? యను విషయమునుగూర్చి రెండవ ప్రకరణమున విశేషముగా చెప్పబడినది. కావున అచ్చట చూడవలయును.

5. గవర్నమెంటువారిచే సమష్టికుటుంబమెంబర్లలో నెవరికైన నీయబడిన యాస్తి వారిస్వార్జితమగును. అందు తక్కిన మెంబర్లకు హక్కు లేదు(2). సమష్టికుటుంబలాభముకొరకని దొరతనమువా రాస్తి నొసంగిరేని అది సమష్టికుటుంబాస్తి యగును(3).

పరిభువులచే లభించినది.

1857 సంవత్సరములో జరిగిన మ్యూటినీలో చేసిన సేవకు మెచ్చి గవర్నమెంటువారిచ్చినగ్రాంటు స్వార్జితమగునని ప్రి. కౌ. తీర్మానించినారు(4). గవర్నమెంటువారు, సమష్టికుటుంబాస్తిని, దఖలుపర్చుకొని ఎట్టిషరతులు విధింపకుండ వారు మరల గ్రాంటుచేసిరేని, ఆగ్రాంటునుపొందినవాని కది స్వార్జితముకాదనియు, అది కుటుంబాస్తియగుననియు, అలహాబాదు హైకోర్టువారు తీర్మానించినారు(5). గవర్నమెంటువారు సమష్టిహిందూకుటుంబ మే

(1) 27 మ. 300; 36 బొం. 424; 32 మ. 88; 3 మ. 370; 9 మ. 188; 18 వీ. రి. 477; 19 మ 70; 20 మ. 207; 20 వీ. రి. 170; 35 క 1089; 1 అ 652; 14 బొం. లా. రి. 400; 8 మ. హై. రి. 455; 12 క. వీ. నో. 103; 10 పెం. లా. రి. 183; 6 మ. 1; 1932 లా. 636.

(2) 9 మూ. ఇం. అ 543 (610); 16 ఇం. కే. 855; 15 మ 284; 8 క 615; 4 క 889.

(3) 21 అ 53 (ప్రి. కౌ.)

(4) 17 ఇం. కే. (ప్రి. కౌ.) 760.

(5) 88 ఇం. కే. (అ) 894=38 అ 590.

నేజరునకు దేశాయి ఈనామును ఇచ్చినయెడల, అది కుటుంబ మెంబర్ల అందరియొక్క ఆస్తి యగును అని మదరాసు హైకోర్టువారు తీర్మా నించిరి(1).

పురాతనపుగ్రాంటు అయినచో అది కుటుంబమునకే చేయ బడిన ట్లెంచవలయునని తీర్మానించిరి(2).

6. విద్యచే లభించినది స్వార్జితమగునా? పితృధనవ్యయము లేకుండ నేర్చికొనినవిద్యచే లభించినది స్వార్జితమనియు, పితృధనము వ్యయముచేసి నేర్చికొనినవిద్యచే లభించినది, సమష్టికుటుంబమునకు చేరుననియు స్మృతికర్తల యభిప్రాయము. ఆలోచించి చూచినచో, ప్రతిపురుషుడును కొంతకాలము కుటుంబములోనే యుండి, ఎంతయో కొంతవిద్య కుటుంబఖర్చుతో నేర్వవలసియే యుండునని, హిందువుల ఆచారముల నెరిగియున్నవారికి విదితమే. అక్షరాభ్యాసమొనర్చిన వెంటనే స్వతంత్రముగా విద్యనేర్చుకొనుటకు తగినశక్తి సంపాదించుట సాధ్యమా? ఏమాత్రమువిద్య కుటుంబద్రవ్యముతో సంపాదించినను, అది సమష్టి ఆస్తియే యని నిర్ధారణచేయు నెడల, స్మృతికర్తలవాక్యముల కర్థము లేకపోవును. కావున ఏదియోకొంతవిద్య కుటుంబద్రవ్యవ్యయముతో నేర్చికొనినను, ఆవిద్య నాధారముగాచేసికొని ఆస్తిని సంపాదించెనేని అది సమష్టిద్రవ్యమునకుచేరక, వాని స్వార్జితమగుననియు, ఏదైనవిశేషవిద్యను కుటుంబద్రవ్యవ్యయముచేసి సంపాదించినచో ఆద్రవ్యము వాని స్వార్జితముకాక సమష్టికుటుంబమునకు చేరుననియు స్మృతికర్తల అభిప్రాయమైన ట్లూహింపవలసియున్నది. న్యాయస్థానములు కూడ నట్లేతీర్పులనొసంగుచున్నవి. అయితే స్మృతులకాలమునకును ఇప్పటి

విద్యచే లభించినది.

(1) 27 మ. లా. జ. 618.

(2) 34 ఇం. కే. 827.

కిని, విద్యలలోను, సంపాదించెడి వ్యాపారములలోను చాల భేదముం డుటచే న్యాయస్థానము లాభేదమును గమనించి దేశకాలానుగుణ్యముగ తీర్మానించుచున్నారు. ఈయభిప్రాయములను బొం. హై. వారు ప్రి కౌ. వారును తమతీర్పులలో పొందుపరచియున్నారు(1). ఈవిషయమున నొకకేసులో ప్రి. కౌ. వారు ధర్మశాస్త్రవిమర్శన చక్కగా చేసియున్నారు కుటుంబద్రవ్యవ్యయము లేకుండ విశేష విద్యను సంపాదించితినని చెప్పువారు ఆవిషయమును స్పష్టముగా రుజువు చేయవలయునని తీర్మానింపబడినది(2). అట్టివిద్య సమష్టి కుటుంబద్రవ్యముతో సంపాదింపబడెనని భావన వచ్చును(3). ఈవిషయముపై చేయబడినతీర్పులను విమర్శించి చూచినచో కుటుంబముయొక్క స్థితినిబట్టి సామాన్యజ్ఞానము (General knowledge) కలుగనట్టివిద్య, కుటుంబద్రవ్యము వ్యయముచేసి చెప్పించినను ఆవిద్యనాధారముచేసికొని యాతడు సంపాదించినయాస్తి ఆతని స్వార్జితమగుననియు, కుటుంబద్రవ్యముతో నేదైన విశేషవిద్య (Techinical education ) నభ్యసించినయెడల తన్మూలమున సంపాదించినయాస్తి సమష్టికుటుంబాస్తియగుననియు స్పష్టము కాగలదు(4). విశేషవిద్య నభ్యసించినప్పుడు అందుక్రింద కుటుంబద్రవ్యము వ్యయముకాలేదని వాదించువారిపై రుజువు భారముండును.

---

(1) 6 బొం 225 (242, 248); 44 ఇం. కే. (ప్రి. కౌ.) 269.

(2) 60 ఇం. కే. (ప్రి. కౌ.) 879.

(3) 34 ఇం. కే 714.

(4) 20 అ 485; 10 వీ. ఠి. 122; 1 మ 252; 2 మ. హై. ఠి 56; 7 మ. హై. ఠి. 47; 6 బొం. హై. ఠి. 1; 15 బొం. 32; 32 అ. 305; 4 మ. 330; 10 బొం. 528 (555); 76 ఇం. కే. (సిం) 408.

సామాన్య విద్యఅనగా నెట్టిదియో విశేషవిద్యఅనగా నెట్టిదియో, వివరముగా తెలియుటకై న్యాయస్థానము లేసందర్భమున నెట్లు తీర్మానించిరో ఆవివరములను తెలిపెడికొన్ని తీర్పులసంగ్రహమును, ఒకపట్టికగా ఈక్రింద పొందుపరచితిని.

ఈసంశయములకు అవకాశము లేకుండచేయుటకై 1930 సంవత్సరములో, ఇండియాగవర్నమెంటువారు నె 30 రు ఆక్టును చేసియున్నారు. సమష్టికుటుంబద్రవ్యముతోగాని, సమష్టికుటుంబమెంబర్లలో యేయితరమెంబరుయొక్క సాహాయ్యముతోగాని, ఎట్టివిద్య నేర్చికొనినను, ఆవిద్యవలన లభించినధనము సంపాదించినవాని స్వార్జితమగును గాని, సమష్టికుటుంబాస్తి గా నేరదని యీఆక్టులో చెప్పబడియున్నది. కావున నీవిషయమున సంశయములతో పని లేదు.

| తీర్పు. | సమష్టికుటుంబ ద్రవ్యముతో నేర్చికొనిన విద్య. | చేసిన యుద్యోగము లేక వ్యాపారము. | తీర్పుఫలితము. |
| --- | --- | --- | --- |
| 44 ఇం. కే. 269. ప్రి. కౌ. | కరాచీ, హైస్కూలులో చదువను వ్రాయను ఇంగ్లీషుభాష నేర్చికొనియెను. | 1847 సం॥ రం॥లో జన్మించి, చదువనేర్చికొనిన పిమ్మట ప్లీడరుగుమస్తాగా ప్రవేశించి 1869 వరకు కుటుంబద్రవ్యముతో పోషింపబడుచు, గుమాస్తా ఉద్యోగమువలన సంపాదించినధనమును వేరుగానుంచుకొనెను. 1878 లో వేరుగానుండి బ్రోకరు వ్యాపారముచేసి ఆస్తిని సంపాదించెను. | ఇతడు కుటుంబద్రవ్యవ్యయముచేసి, ఆవిద్య నేర్చికొనినా డనుకారణమువలనగాని, 1869 వరకు సమష్టికుటుంబద్రవ్యము వలన పోషింపబడినాడనుకారణమునగాని అతడు సంపాదించిన ఆస్తి సమష్టికుటుంబాస్తి కానేరదనియు, అది యతని స్వార్జితమనియు తీర్మానించిరి. |

| తీర్పు. | సమష్టికుటుంబ ద్రవ్యముతో నేర్చికొనిన విద్య. | చేసిన యుద్యోగము లేక వ్యాపారము. | తీర్పు ఫలితము. |
|---|---|---|---|
| 6 బొం. 225. | ప్రారంభవిద్య. | ప్లీడరు. ప్లీడరు పరీక్షకు కావలసినద్రవ్యము కుటుంబద్రవ్యమునుండి తీసికొనలేదు. | స్వార్జితము. |
| 60 ఇ. కే. 179. ప్రి. కౌ. ఇందు చాలతీర్పులు విమర్శింపబడినవి. | ఐ. సి. యస్. పరీక్ష. | ఇంగ్లండువెళ్లి ఐ.సి.యస్. పరీక్ష ప్యాసు అయి, ఇండియాలో ఉద్యోగముచేసెను. ఆపరీక్ష ప్యాసు అగుటకు సమష్టికుటుంబద్రవ్యము ఖర్చుపడలేదని, అతడు ఋజువుచేయలేదు. | సమష్టికుటుంబాస్తి యగునని తీర్మానించిరి. |

| తీర్పు. | సమష్టికుటుంబ ద్రవ్యముతో నేర్చికొనిన విద్య. | చేసిన యుద్యోగము లేక వ్యాపారము. | తీర్పు ఫలితము. |
|---|---|---|---|
| 13 గ ఇం. కే. 270 (లా) | ప్రవేశ పరీక్షవరకును. | 15 రూపాయలుజీతముగల గుమాస్తాగా ప్రవేశించి యిప్పుడు నెల 1 కి రు 260- లు జీతము పుచ్చుకొనుచుండెను. | సమష్టికుటుంబాస్తి కానేరదు. |
| 32 అ 305. | ప్రవేశపరీక్ష. | తండ్రి జ్యోతిష్కుడు. అతనివద్దకొంత జ్యోతిషము నేర్చుకొని తరువాత తన బుద్ధికుశలతచే ఆశాస్త్రమునందు ప్రావీణ్యము సంపాదించి తన్మూలముగ చాలధనమును సంపాదించెను. | స్వార్జితము. |

7. సమష్టికుటుంబమెంబర్లలో నెవరికైనను, బంధువులు స్నేహితులు మొదలగు వారెవరైనను ఆస్తిని యిచ్చినయెడల, అది యెవరి కీయబడియెనో వారి ప్రత్యేకపుటాస్తియగును గాని, సమష్టి కుటుంబాస్తి కానేరదు (1). సమష్టికుటుంబమున కంతకును చేరవలయునని, యిచ్చినవారి యుద్దేశమైనచో, అది సమష్టికుటుంబాస్తి యగును(2). ఇద్దరుసమష్టిసోదరులకు గవర్నమెంటువారిచ్చినగ్రాంటు, సమష్టికుటుంబమున కిచ్చినట్లు భావింపవీలు లేదని తీర్మానించుచు, సమష్టికుటుంబమున కంతకును యిచ్చినట్లు యిచ్చినవారు స్పష్టముచేసిననే తప్ప అది ఎవరి కివ్వబడియెనో వారి స్వార్జితముగా భావింపవలయు నని ప్రి. కౌ. వారొక కేసులో చెప్పియున్నారు(3).

బంధువులు స్నేహితులు మొదలగు వా రిచ్చినది.

8. సమష్టికుటుంబాస్తి, యేకారణముచేనైన నితరుల స్వాధీనమైపోయి కుటుంబమునకు స్వాధీనముకాకుండ చాలకాలమున్నపుడు, సమష్టికుటుంబద్రవ్యసాహాయ్యము లేకుండ, కుటుంబమెంబర్లలో నెవరైన దానిని తిరిగి రాబట్టెనేని, అది సమష్టికుటుంబాస్తియగునా? లేక సంపాదించినవాని స్వార్జితమగునా? యనువిషయమున స్మృతికర్తలలో భిన్నాభిప్రాయములున్నవి. యాజ్ఞవల్క్యులు ఆయాస్తి సంపాదించినవాని స్వార్జితమగుననియు, దాని నితరులకు పంచి యివ్వనక్కరలేదనియు, చెప్పియున్నారు. ఆవచన

సమష్టికుటుంబాస్తి ఇతరులస్వాధీనమై పోయినపుడు, అది తిరిగిరాబట్టినచో, స్వార్జితమగునా ?

(1) 102 ఇం. కే. (మ) 680; 43 ఇం. కే. 117; 26 బాం 445; 49 మ 98; 9 హై. లా. జ. 435;

(2) 78 ఇం. కే. 574.

(3) 142 ఇం. కే. 5.

ములు ఈప్రకరణారంభమున నుదాహరింపబడినవి. శంఖస్మృతి మాత్రము వేరురీతిగా నున్నది.

పూర్వనష్టాం తు యో భూమిమ్ ఏకశ్చేదుద్ధరేత్క్రమాత్
యథాభాగం లభన్తేఽన్యే దత్వాంశం తు తురీయకమ్.

పూర్వమునందునష్టమైన భూమిని ఒకడు ఉద్ధరించెనేని అతనికి నాల్గవవంతు నిచ్చి, తక్కినదానిని అతనితోగూడ అందరును యథారీతిగనే విభజించుకొనవలయును. శంఖుడు.

శంఖస్మృతి ననుసరించి, కొన్ని కేసులలో నాల్గవవంతుభూమిని తిరిగి రాబట్టినవాని కిచ్చి, తక్కినదానిని సమష్టికుటుంబాస్తియని తీర్మానించినారు. కొన్నిదరిమిలా కేసులలో యాజ్ఞవల్క్యులకంటె శంఖస్మృతికి ప్రాముఖ్యమునిచ్చుటకు కారణముగుపడదని యెంచి, మొత్తమంతయును, సంపాదించినవానిస్వార్జితముగనే తీర్మానించిరి. శంఖస్మృతిలో, భూమి అని యుండుటచేత, స్థిరాస్తి అయినచో మాత్రమే నాల్గవవంతు నిచ్చి, చరాస్తిఅయినచో మొత్తమంతయును సంపాదించినవానికే యిచ్చి యున్నారు. తండ్రి అట్లుపోయిన ఆస్తిని రాబట్టెనేని అంతయును అతని స్వార్జితమగును(1).

అయితే, ఈ రూలువర్తించుటకు కొన్ని నియమములున్నవి.

(1) ఆయాస్తి, కుటుంబమెంబర్లుగాక, యితరులెవ్వరైనను స్వాధీనముచేసికొని యుండవలయును.

(2) ఆయాస్తిని తిరిగి రాబట్టుటకు తక్కినమెంబర్లు అశ్రద్ధచేయుటగాని, అయిష్టముచూపుటగాని, అశక్తులైయుండుటగాని, జరుగవలయును.

---

(1) 8. వీ. రి. 12; 120 ఇం. కే. (మ) 108; 24 ఇం. కే. (బొం) 478; 4 వ 220 (269); 14 వీ. రి 24; 24 బొం 108; 10 బొం. 528; 5 వ. హై. రి. 120; 9 వీ. రి. 69; 3 క 508; 14 ఇం. కే. (బొం) 769.

(3) తక్కిన మెంబర్లు అతనికి అధికారమైనను ఇచ్చియుండవలయును.

(4) ఆ స్తిని తిరిగి స్వాధీనము చేసికొనవలయును. కాని డిక్రీని పొంది నంతమాత్రమున ఈ రూలు వర్తింపదు.

ఈ నియమములలో నేది వర్తింపకపోయినను, అది సమష్టికుటుంబాస్తి యగును. కాని స్వార్జితము కానేరదు. సమష్టికుటుంబద్రవ్యము ఖర్చుపెట్టి సదరు ఆ స్తిని తిరిగి సంపాదించినచో అది సంపాదించినవాని స్వార్జితము కాదు.

వివాహకాలమందు లభించినది.

9. వివాహకాలమందు సమష్టికుటుంబమెంబర్లలో నొకనికి, మామగారు గాని, ఇతరులుగాని యిచ్చిన ఆ స్తి అతని స్వార్జితమగును. కాని సమష్టికుటుంబాస్తి కానేరదు(1).

కృషివాణిజ్యములచే సంపాదించినది

10. సమష్టికుటుంబమెంబరు సమష్టిద్రవ్యసాహాయ్యము లేకుండ కృషివాణిజ్యాదులు చేసి గాని, కాయకష్టముచే గాని ఆ స్తిని సంపాదించినపుడు అది వాని స్వార్జితమగును(2). అందు తక్కిన మెంబర్ల కెట్టి యధికారమును లేదు. అందు సంపాదించినవాని పుత్రపౌత్రాదులకు జన్మముచేత స్వత్వము కలుగదు. ఈ విషయమై రెండవప్రకరణమున విశేషముగా చర్చింపబడినది కావున అచ్చట చూడవలయును పిత్రార్జితము కొంతయున్నను దానిని విడచి వేరుగానుండి వ్యాపారముచేసి ఆ స్తిని సంపాదించినపుడది స్వార్జితమగును(3).

(1) 25 వీ. 8. 307; 12 క. వీ. నో. 103; 32 ఇం. కే. (మ) 955.

(2) 75 ఇం. కే. (లా) 774.

(3) 48 ఇం. కే. 694.

**11.** కుటుంబమునం దొక్కఁడే పురుషుఁడుండి, అతనితో సమష్టిగా నుండదగినవా రెవరును లేకుండ బోయినపుడు ఆకుటుంబాస్తియం దాతనికి స్వార్జితమునందువలెనే సమస్తహక్కులును కలిగియుండును. ఆయాస్తి నాతఁడు తనయిష్టమువచ్చినట్లు వినియోగింపవచ్చును. దాని నాటంకపెట్టుట కెవరికిని అధికారము లేదు. వినియోగముచేసిన నాటికి గర్భస్థుఁడైయున్నపుత్రుఁడు తప్ప దరిమిలాను జన్మించినపుత్రులకు గాని, దరిమిలాను దత్తస్వీకారముచేసికొనిన దత్తపుత్రునకు గాని ఆ వినియోగము చెల్లదని వాదించుట కధికారము లేదు. ఆయేకమెంబరు, విల్లు వ్రాయవచ్చును. కాని విల్లువ్రాసినదరిమిలాను పుత్రుఁడు కలిగినచో ఆవిల్లు చెల్లదు(1). విల్లువ్రాసిన వాని యనంతరమున గాని అది అమలులోనికి రానేరదు. అప్పటి కాతఁడు ఏకమెంబరుగాక కుమారునితో సమష్టికుటుంబమెంబరగును.

కుటుంబమునం దొక్కఁడే మెంబరున్నపుడు అతని హక్కు.

మదరాసు ఫుల్ బెంచివారు, ఆదాయపుపన్నుతో సంబంధించిన యొకకేసులో కుటుంబమున కొక్కఁమెంబరు మాత్రమేయున్నను ఆతనివలన మనువృత్తి పుచ్చుకొనువితంతువులును యితరులును కొందరున్నప్పుడు,అది సమష్టికుటుంబ మనిపించుకొనునని చెప్పియున్నారు(2). కాని ఈ తీర్పువలన నాతనిహక్కునకు భంగముకల్గినట్లు కనపడదు.

సమష్టికుటుంబమెంబరుయొక్క వితంతువు, దత్తతాధికారమును పొందియున్నయెడల, పైన వ్రాసిన యేకమెంబరునకు సంపూర్ణా

(1) 59 ఇం. కే. (లా) 256; 26 ఇం. కే. (అ) 871; 33 ఇం. కే. (అ) 918; 8 మ 89; 11 మ 246; 16 మ 76; 12 బొం 105; 6 మా. ఇం. అ. 309; 3 బొం. హై. 8. 6; 8 ను. హై. 8. 6; 138 ఇం. కే. (అ) 624; 138 ఇం. కే (లా) 58.

(2) 140 ఇం. కే. (మ) 17.

ధికారముండదు. ఆవితంతువు దత్తస్వీకారము చేసికొనిన యెడల, ఆ దత్తుడు ఏకమెంబరు చేసినవినియోగముల నాక్షేపించుట కధికారము కలిగియుండును.

12. అవిభాజ్యపు జమీందారీపైని వచ్చెడుఆదాయము ఆ జమీందారుయొక్క ప్రత్యేకపుటాస్తియగును. కాని అవిభాజ్యపు జమీందారీలో కలిసిపోనేరదు. ఆయాదాయములో కొనిన స్థిరాస్తి అతని స్వార్జితము-దానిని ఆతడు తన యిష్టము వచ్చినట్లు వినియోగము చేసికొనవచ్చును(1). సదరు ఆదాయమును అవిభాజ్యపు జమీందారీలో కలిపి వేయుట కాతని కభ్యంతరము లేదు(2).

అవిభాజ్యపుజమీందారీ ఆదాయము స్వార్జితమా?

13. మతగురువుగా గాని, పురోహితునిగా గాని యుండుట వలన వచ్చెడి ఆదాయము స్వార్జితమగును(3). కొన్ని పనులు చేయుట కేర్పరచి, ప్రభుత్వము వారు భూమిని యిచ్చినప్పుడు ఆయుద్యోగము వంశపారంపర్య వచ్చినదియైనను దానిపైని వచ్చెడిఆదాయము స్వార్జితమగును(4).

ఇతర విషయములు.

సమష్టికుటుంబమెంబరు తనజీవితమును భీమా (insurance) చేయించికొనినప్పుడు అది యాతనికి ప్రత్యేకఆస్తిగా భావింపబడవలయును. ఆతని యనంతర మాసొమ్ము ఆతని ప్రత్యేకవారసులకు

(1) 1932 బొం 651; 138 ఇం. కే. (ప్రి. కౌ). 861; 25 మ. లా. జ. (ప్రి. కౌ.) 84; 8 మ 145; 29 క 433.

(2) 61 ఇం. కే. (మ) 242.

(3) 94 ఇం. కే (లా) 492; 65 ఇం. కే (పా) 687.

(4) 48 ఇం. కే (నా) 187.

చెందునుగాని తక్కిన కుటుంబమెంబర్లకు రానేరదు. ప్రిమియము సమష్టికుటుంబద్రవ్యమునుండి చెల్లించినచో అది సమష్టికుటుంబము నకు చెందును. కాని ఆసంగతి వారు స్పష్టముగా రుజువుచేయవల యును(1).

సమష్టికుటుంబముయొక్క యిల్లు స్వార్జితద్రవ్యముచే మరమ్మతు చేయించినంతమాత్రమున నది స్వార్జితము కాదు(2).

కుమారుడు కలిసియున్నాడనుకారణముచే తండ్రిస్వార్జితము కుటుంబాస్తి కానేరదు(3). తండ్రిస్వార్జితమును ఆతడుచేసిన ఋణము నకు ఋణదాత జప్తుచేయకుండ కుమారుడాటంకపరుపజాలడు(4).

**14.** స్వార్జితమునందు సంపాదించినవానికితప్ప తక్కినకుటుం బమెంబర్ల కెట్టిహక్కులును లేవు. సంపాదించుకున్నవాడు సమష్టి కుటుంబమెంబరైనను, యితరమెంబర్లయొక్క అంగీకారముతో ప్రస క్తిలేకుండ తనస్వార్జితమును తనయిష్టమువచ్చినట్లు విల్లుద్వారాగాని, దానముగాగాని, విక్రయరీత్యాగాని, మరియొకవిధముగాగాని ఎవరికైనను వినియోగము చేసికొనుట కధికారము కలదు(5). కుమారులున్నను తండ్రి తనస్వార్జితమును తనయిష్టమువచ్చినట్లు వినియోగించుకొనుట కధికారము కలదు. కుమారు లట్లుచేయకుండ ఆటంకపరుప జాలరు(6). తండ్రి తనస్వార్జితమునైనను, పుత్రుల యనుమతి లేకుండ

స్వార్జితమునందు సమష్టికుటుంబ మెంబర్ల హక్కులు.

(1) 1932 (నా) 162; 29 మ 121.

(2) 97 ఇం. కే (సిం) 505.

(3) 102 ఇం. కే (మ) 290.

(4) 115 ఇం. కే (లా) 478.

(5) 80 ఇం. కే (నా) 322. 17 మ 251; 24 మ 429; 1 అ 394; 9 మూ. ఇం. అ. 96; 28 మ 386; 4 మూ. ఇం. అ 1; 59 ఇం. కే (లా) 256.

(6) 20 అ. (పి. కా.) 257; 35 ఇం. కే. 404; 76 ఇం. కే (నా) 934.

వినియోగము చేయకూడదని కొన్ని స్మృతులయందున్నది. కాని ఆవిధి యిప్పుడమలులో లేదు.

స్వార్జితమును, సమష్టికుటుంబాస్తిలో కలుపకుండ, సంపాదించినవాడు వేరుగా నుంచుకొనిననేతప్ప, అది సమష్టికుటుంబాస్తిలో కలిసిపోవును. ఒకసారి, స్వార్జితము, సమష్టికుటుంబాస్తిలో కలిసిపోయినపిమ్మట మరల దానిని వేఱుపరచుటకు శక్యముకాదు. ఈవిషయము రెండవప్రకరణములో విపులముగా చెప్పబడినది. కావున అచ్చట చూడవలయును(1).

స్వార్జితము సంపాదించినవాని యంగీకారము లేనిదే విభాగార్హముకాదు(2). తండ్రి, తన స్వార్జితమును, కుమారుల యనుమతిలేకుండ విక్రయింపవచ్చును. దానమీయవచ్చును. కుమాళ్ళలో అసమవిభాగమును చేయవచ్చును. ఒకకుమారునకిచ్చి తక్కినవారికి లేకుండ చేయవచ్చును(3).

**15.** ఫలానియాస్తి స్వార్జితమని భావన చేయవలయునను నియమము లేదు. స్వార్జితవిషయమున రుజువుభారము సామాన్యముగా స్వార్జితమని వాదించువారిపైననే యుండును(4). రెండవప్రకరణమున

భావన. భావననుగూర్చి వ్రాసినవిషయములుకూడ చదువుడు. ఇందుతో సంబంధించిన యీతీర్పులనుగూడ చూడవలయును(5). సమష్టికుటుంబమెంబర్లు వేరుగా కాపురముండి, వేరుగా భోజ

(1) 99 ఇం. కే (మ) 775; 45 ఇం. కే 806; 40 ఇం. కే 988; 29 అ 244; 45 కలా. జ. 93; 17 ఇం. కే (ప్రి. కౌ) 607; 20 ఇం. కే (బొం) 476.

(2) 28 బొం 608.

(3) 1 అ 394; 6 వీ. రి. 71; 20 వీ. రి 137.

(4) 28 ఇం. కే. (మ) 528; 22 ఇం. కే (మ) 27.

(5) 104 ఇం. కే (క) 694, 99 ఇం. కే (మ) 775; 96 ఇం. కే (క) 199; 111 ఇం. కే (లా) 896.

నములుచేయుచు సంపాదించిన ఆస్తి సమష్టికుటుంబాస్తియనుభావన లేదు(1). స్వార్జితమని వాదించువారు తమ సంపాదనకు సమష్టికుటుంబాస్తిసాహాయ్యము లేదని రుజువుచేయవలయును(2). సమష్టికుటుంబాస్తి న్యాయముగా వినియోగము చేయబడినపిమ్మట, ఒకమెంబరు స్వార్జితద్రవ్యముతో నయాస్తిని కొనుట తటస్థించెనేని అది స్వార్జితమే యగును. కాని స. కు ఆస్తి కానేరదు(3). తండ్రి, స. కు తాలూకు కాతాను ఒకకుమారుని పేర ట్రాన్సుఫరు చేసినంతమాత్రమున అది కుమారునకు స్వార్జితము కానేరదు(4).

ఇద్దరుసోదరులు సమష్టిగా ఆస్తిని సంపాదించినప్పుడు, వారు దానిని సమష్టికుటుంబాస్తినిగా చేసిరని సాక్ష్యముండిననేతప్ప, అది సమష్టికుటుంబాస్తియని భావనచేయవీలు లేదు(5).

ఒకసమష్టికుటుంబమెంబరు సంపాదించినఆస్తి స్వార్జితమా? సమష్టికుటుంబాస్తియా? యనిప్రశ్నవచ్చినప్పుడు, ఆవిషయమును, సాక్ష్యమునుబట్టి తీర్మానించవలయును(6). వేరువేరుమెంబర్ల పేర వేరువేరు ఆస్తులను కొనినప్పుడు ఆయాఆస్తులు వారికి స్వార్జితముకావలయుననుద్దేశమున్నట్లు యెంచవలయును(7).

సమష్టికుటుంబమెంబరు, వేరుగా ఆస్తిని సంపాదించినప్పుడు, అది స్వార్జితమగునా? కాదా? యని నిర్ధారణచేయుటకు, ఆసొమ్ము

(1) 130 ఇం. కే (నా) 108.
(2) 73 ఇం. కే (అ) 1052.
(3) 71 ఇం. కే (మ) 855.
(4) 69 ఇం. కే (నా) 612.
(5) 35 ఇం. కే (క) 655.
(6) 1927 మ 38; 45 క 666; 40 ఇం. కే 988.
(7) 66 ఇం. కే. (ప్రి. కౌ.) 551.

యెచ్చటనుండివచ్చినది? అను విషయమును విచారణచేయవలయును(1). సమష్టికుటుంబద్రవ్యమునుండి సొమ్ముతీసుకొనెనను సాక్ష్యము లేనప్పుడు అది స్వార్జితమని భావింపవచ్చును(2). స్వార్జితమనివాదించు వానికి ఆస్తిని సంపాదించుటకు తగినమార్గములున్నవా? లేవా? అనికూడ చూడవలయును(3). అట్టిమార్గములుండి, మూలధనము లేనప్పుడు స్వార్జితమగును(4).

కుటుంబము సమష్టిగానుండగా సంపాదించిన ఆస్తి సమష్టి కుటుంబాస్తి యని భావింపవలయును(5).

---

(1) 22 ఇం. కే 51 పి. కౌ.

(2) 1927 మ 586.

(3) 86 ఇం. కే (క) 734.

(4) 22 ఇం. కే 852 మ.

(5) 68 ఇం కే (క) 322; 86 ఇం. కే (మ) 682.

## సాల్గవప్రకరణము.

### సమష్టికుటుంబమెంబర్లకుండు హక్కులు-బాధ్యతలు.

1. ప్రతిసమష్టికుటుంబమెంబరును సమష్టికుటుంబాస్తియందు సమష్టిస్వాధీనానుభవమునకు హక్కుకలిగియుండును. అనగా ఇతరమెంబర్లతోపాటుగ తానుకూడ ఆస్తిని స్వాధీనమునం దుంచుకొనుటకును, అనుభవించుటకును హక్కుకలిగి యుండును. సమష్టికుటుంబాస్తిలోని యేభాగమునైనను, తన ప్రత్యేకస్వాధీనమునం దుండవలయుననిగాని, తనకు ప్రత్యేకముగా హక్కుకలదనిగాని, యేమెంబరును చెప్పజాలఁడు(1). సమష్టి కుటుంబాస్తియందు అందరు మెంబర్లకును సమూహముమీఁద హక్కుభుక్తములు కలిగియుండును(2). అట్టి సమష్టిస్వాధీనానుభవమునుండి యేమెంబరైన తొలగింపబడినప్పుడు అతడు తక్కినవారిపైని విభాగమునిమిత్తము కాకుండ, సమష్టిస్వాధీనానుభవము కొరకు దావాచేసి డిక్రిని పొందవచ్చును(3). అట్టిడిక్రిలో కోర్టువారు వాది, సమష్టిస్వాధీనమునకు హక్కు కలిగియున్నాడని, నిర్ధారణచేయుటమాత్రమే కాకుండ సమష్టిస్వాధీనానుభవ మీయబడినట్లు కూడ వ్రాయవలయును. లేనిచో విభాగముకొరకు దావాలేకుండ సమష్టిస్వాధీనమునుమాత్రమే పొందవలయునను నాతనికోర్కె నెరవేరదు(4). సమష్టికుటుంబాస్తిలోని యేభాగమునైనను, తక్కినవా

సమష్టి స్వాధీనానుభవము.

(1) 26 బొం. 141.

(2) 9 మూ. ఇం. అ. 543 (615).

(3) 20 బొం. 467; 26 బొం. 141; 59 ఇం. కే. (అ) 116.

(4) 26 బొం. 141 (145)

రికి పరిసక్తి లేకుండ, తన యొక్క స్వాధీనములో నుంచవలయునని యింజంక్షను కోరుటకు హక్కు లేదు(1).

సమష్టి కుటుంబమెంబర్లలో నెవనినైనను తక్కిన వారు కుటుంబాస్తిని సమష్టిగా ననుభవింపకుండ నభ్యంతరము కలుగచేయుచు వచ్చినచో, అట్టివారిపైని ఇంజంక్షను కొరకు దావాతెచ్చి, డిక్రీని పొంది సమష్టిస్వాధీనమును పొందవచ్చును.

క. చ. అను వారు సమష్టిసోదరులు. క. అనువాడు, చ. అనువాని వాడుకలోనున్న గదులలోనికి వెళ్లకుండ ఒకద్వారమును మూసివేసెను. అట్లు చేయకుండ చ. కోర్టులో దావాచేసి యింజంక్షను చేయించవచ్చును(2). క. చ. అను వారు సమష్టికుటుంబమెంబర్లు. వారికొకషాపు వున్నది. అందులోనికి వెళ్లకుండగను, లెక్కలుచూడకుండగను, షాపువ్యవహారము చేయకుండగను, క. అనువానిని చ. ఆటంకపరచెను. ఆటంకము తొలగించుటకు క. దావాచేసి యింజంక్షను చేయించవచ్చును(3).

సమష్టికుటుంబ మెంబర్లెవరైన కుటుంబాస్తిని పాడుచేయుచున్నప్పుడు అట్లు చేయకుండ దావాచేసి యింజంక్షను చేయించవచ్చును(4).

సమష్టికుటుంబాస్తిలో దేనినైనను స్వాధీనముకలిగి యుండకుండునట్లు ఒకమెంబరును నిరోధించుటకు మరియొకమెంబరున కధికారము లేదు(5).

---

(1) 56 ఇం. కే. (మ) 608; 123 ఇం. కే (అ) 375.

(2) 19 బొం 269.

(3) 23 బొం 144.

(4) 19 బొం 269.

(5) 1920 మ. వీ. నో. 864.

సమష్టికుటుంబ మెంబర్లలో నెవరైనను, కుటుంబాస్తిలో నే భాగమునైనను స్వాధీనమును కలిగియున్నాడనుచో, ఆస్వాధీనమును నది, అందరు మెంబర్లతరఫునను కలిగియున్న ట్లెంచబడవలయును(1).

ఒక సమష్టికుటుంబమెంబరు తక్కినవారి యనుమతి లేకుండ సమష్టికుటుంబముయొక్క యేప్రిదేశమందైనను యిండ్లు మొదలయినవి కట్టకూడదు. అందరు మెంబర్లయొక్క అనుభవమునకు ఆటంకములుగులాగున మరి యేపనియును చేయకూడదు. అట్లు చేయకుండులాగున తక్కినవారు కోర్టుయింజంక్షనుమూలమున నాటంకపరుపవచ్చును. కాని అందరుమెంబర్ల అనుభవమున కాటంకము లేనిపద్ధతిని ఒకగోడకట్టించినచో అట్లు యింజంక్షను కోరకూడదు(2).

ఆదాయములో భాగమును కోరకూడదు.

2. సమష్టికుటుంబ మెంబరు, కుటుంబమొత్తమునకు వచ్చు ఆదాయములో తనవంతును తనకిమ్మని కోరుటకు హక్కులేదు. మొత్తముఆదాయము నంతయును ఒకచోనుంచి, మొత్తము కుటుంబముయొక్క అవసరము ననుసరించి ఖర్చుపరుచుచుండవలయునే కాని, వాటాలవెంబడిని ఖర్చుపెట్టవలయునని కోరకూడదు(3).

---

(1) 17 మ. లా. ట 361; 27 మ. లా. జ. 608.

(2) 12 అ 436; 18 అ 115; 20 పీ. రి. 160; 12 బెం. లా. రి. 188; 6 బొం. హై రి. 54; 8 బెం లా. రి. 67.

(3) 23 బొం 144; 11 మూ. ఇం. అ. 75 (89); 137 ఇం. కే. (లా) 775.

3. కుటుంబము సమష్టిగా నున్నంతవరకు, మెంబర్ల భాగ మింతింతయని నిర్దిష్టపరచుటకు శక్యముకాదు. కుటుంబములో సంభవించు జనన మరణములను బట్టి భాగము తగ్గుచు హెచ్చుచు నుండును. విభాగమునాటికున్న మెంబర్లనుబట్టి అప్పుడు భాగము నిర్దిష్టమగును. కావున విభాగము కోరునాడు దక్క యేమెంబరుయొక్క భాగ మెంతయో నిర్దిష్టము కానేరదు(1). కావున విభాగము నిమిత్తము కాకుండ, తనభాగముయొక్క నిర్దిష్టతనుగూర్చి యేమెంబరును దావా తేజాలడు(2). భాగనిర్దిష్టము చేయుమని డిక్లరేషనుదావా తేకూడదు. కాని ఒకయాస్తి సమష్టి కుటుంబాస్తియని డిక్లేరు చేయించుమని దావా తేవచ్చును(3). ప్రత్యేకముగ డిక్లరేషనుకొరకు దావా తేకూడదనియు, సమష్టిస్వాధీనముకొరకు కూడ ఆదావాలో కోర్కె యుండవలయుననియు, పాట్నా హైకోర్టువారొక కేసులో తీర్మానించినారు(4).

సమష్టిగా నున్నంతవరకు భాగనిర్దిష్టము శక్యము కాదు.

4. సమష్టికుటుంబమెంబరు చనిపోయినతోడనే అతని హక్కు ప్రత్యేకముగా నెవరికిని సంక్రమించక నిలిచియున్న సమష్టికుటుంబములో నంతర్భూతమై పోవును. దీనినే ఇంగ్లీషుభాషలో Law of Survivor-ship అనియెదరు ఇంగ్లీషుభాషలో "సర్వైవరు" శబ్దమునకు చనిపోవగా మిగిలిన

సర్వైవరు షిప్పు.

(1) 40 క 784 పి. కౌ; 12 ఇం. కే. 695; 25 మ 149; 11 మూ. ఇం. అ. 75.

(2) 123 ఇం. కే. (అ) 375; 38 బొం 120;

(3) 83 ఇం. కే. (అ) 227; 137 ఇం. కే. (లా) 775.

(4) 73 ఇం. కే. 818.

వాడని యర్థము. ఇంగ్లండు దేశములో జాయింటు టెనెంట్సు (Joint tenants) అనియును, టెనెంట్సు ఇన్ కామన్ (Tenants in Common.) అనియును, రెండుశబ్దములు న్యాయశాస్త్రవిషయములలో ఆస్తితో సంబంధించి వాడుచుందురు. ఒక ఆస్తిని సమష్టిగా సంపాదించుటవలనగాని, ఎవరిచేనైన నుచితముగానో, మరణశాసనమూలముననో బడయుటవలనగాని, కొందరు మనుష్యులకు సమష్టిహక్కు అయినచో వారందరును జాయింటు టెనెంట్సు అగుదురు. అందొకరు చనిపోయినచో, నతని భాగము అతని వారసులకు పోవక చనిపోవగా మిగిలినవారికి చెందును. చనిపోవగా మిగిలినవారికి చెందుటనే సర్వైవరుషిప్పుద్వారా వచ్చెనని చెప్పుదురు. చనిపోవగా మిగిలినవారికి ఆస్తి చెందుచుండుట, ఒకరి అంగీకారము లేకుండ తక్కినవారు ఆస్తిని వినియోగము చేయుటకు హక్కు లేకుండుట, ఇష్టమువచ్చినప్పుడు విభజించుకొనుటకు హక్కు కలిగియుండుట మొదలగు కొన్నివిషయములలో హిందూ సమష్టికుటుంబమునకును ఈజాయింటు టెనెంట్సునకును సామ్యముండి రెండును కొన్ని సామాన్యధర్మములను గలిగియుండుటచేతను, హిందూధర్మశాస్త్రములయం దీవిషయము ప్రస్తావింపబడకపోవుటచేతను హిందూదేశమున న్యాయమూర్తిపదవి నధిష్ఠించిన విదేశీయు లీపదమును తీర్పులలో నుదహరించుచు వచ్చిరి. రానురాను క్రమక్రమముగా హైందవ న్యాయమూర్తులును హైందవ న్యాయవాదులునుగూడ నీశబ్దమును విశేషముగా నుపయోగించుచున్నారు ఈశబ్దము నుచ్చరించినతోడనే న్యాయశాస్త్రపరిచయముగలవారలందఱకును ఆసంబంధమయినహక్కు బాధ్యతలు మున్నగునవి గోచరించుచుండును. కాని హిందూ సమష్టికుటుంబమందలి సర్వైవరుషిప్పునకును, ఇంగ్లీషున్యాయశాస్త్రమునందలి జాయింటు టెనెంట్సు సర్వైవరుషిప్పునకును భేదమున్నది. ఇంగ్లీషులా ననుసరించి జాయింటు

ఔనెంట్సు అగుటకు వారొకకుటుంబములోనివారు కానక్కరలేదు. హిందూలాప్రకారము ఒకసమష్టికుటుంబమెంబర్లలోనేకాని యన్యత్ర సర్వైవరుషిప్పు వర్తించదు(1). ఇంగ్లీషులాప్రకారము జాయంటు ఆస్తియందు వారి పుత్రులకు జన్మముచే హక్కుకలుగదు. హిందూలా ప్రకారము సమష్టి కుటుంబాస్తియందు పుత్రపౌత్రులకు జన్మముచే తనే హక్కుకలుగును.

జాయంటు ఔనెన్సీ హిందూ ధర్మశాస్త్రములలో నెచ్చటను చెప్పబడియుండలేదు(2) హిందూకుటుంబమనగా సమష్టికుటుంబమనియు, విభజించుకొనునాటికి సమష్టికుటుంబమునందరు మెంబర్లుండురో వారు భాగార్హులనియు, స్మృతికర్తల యభిప్రాయము. అందుచేతనే విభాగసందర్భమున కావలసిన విషయములను విపులముగా వ్రాసియున్నారు. కాని కుటుంబము సమష్టిగానున్నప్పుడొక మెంబరు చనిపోయినచో నేమికావలయునను విషయమునుగూర్చి విమర్శింపవలసిన యావశ్యకము వారికి లేకపోయినది. వారి యభిప్రాయాను సారముగా చనిపోయిన మెంబరుయొక్క భార్య, పుత్రికలు మొదలగువారు మిగిలినసమష్టికుటుంబమెంబర్లచే పోషింపబడదగినవారు. చనిపోవగా మిగిలిన పురుషులు సమష్టికుటుంబమెంబర్లు. వారే సమష్టికుటుంబాస్తికి హక్కుదారులు. వారే భాగమున కర్హులు.

ఒకమెంబరు చనిపోయినతోడనే అతడదివరకనుభవించుచున్నహక్కు అతనికుమారునకు చెందదా? యని ప్రశ్నింతురేమో! చెందుననుమాట నిశ్చయమే. కాని యది కొన్నిపద్ధతులకు లోబడియుండును. చనిపోయిననాటికెంతహక్కు తండ్రికి కలదో, అంత హక్కు మాత్రమే కుమాళ్ళకు వచ్చునని చెప్పవీలులేదు. విభాగకా

(1) ఫ. హిం. లా.

(2) 23 క 670 పి. కౌ; 10 బొం. లా. రి. 184.

లమునకు తండ్రిజీవించియున్నచో నాతని కెంత భాగమువచ్చునో, అంత భాగమునకు కుమాళ్లు హక్కుదారులగుదు రని చెప్పవలసియుండును. క. అనువానికి, చ, ట, త, అను ముగ్గురుకుమాళ్ళు. అందులో. 'చ' అనువానికి 'ప' అను కుమారుడు కలిగినపిమ్మట చనిపోయెనేని అప్పటికి కుటుంబాస్థిలో 'చ' నాల్గవవంతునకు హక్కుదారుడు. ఎప్పుడును 'ప' కు తండ్రితాలూకు నాల్గవవంతునకే హక్కుకలిగియుండు నని యెంచరాదు. 'చ' మృతిచెందిన దరిమిలాను 'క' అనువాని కింకొకకుమారుడు కలిగెనేని, 'ప' అనువాని హక్కు అయిదవవంతగును. పిమ్మట ట, త, లు నిస్సంతుగా చనిపోయిరేని అతనిహక్కు మరల మూడవవంతగును. ఇట్లే జననమరణములను బట్టి భాగములలో హెచ్చుతగ్గు లగుచుండును. ఈవిధముగానే పినతండ్రులు, పెదతండ్రులు, వారిసంతానము మొదలగువారికి గూడ జననమరణములను బట్టి భాగములలో నల్పాధిక్యములు వచ్చుచుండును. చనిపోయిన మెంబరుయొక్కహక్కు తక్కిన మెంబర్లలో లీనమైపోవు నని చెప్పుట సమంజసము. ఈలీనమయిపోవుటనే సర్వైవరుషిప్పుద్వారా సంక్రమించెనని వాడుచుందురు. "సంక్రమించుట" యనుపదము సరియైనయర్థమును స్ఫురింపజేయదు. కాని చాలవాడుకలోనున్న పదమును తీసివేయజాలము. "సర్వైవరుషిప్పు" అనుపదమునకు ఈగ్రంథమున "మృతశేషత్వము" అనియును, Law of Survivor ship అనుటకు మృతశేషత్వధర్మమనియును, వాడబడును.

ఈమృతశేషత్వధర్మము ననుసరించి, చనిపోయినవానిభాగ మెవనికి చేరుననుటలో వారసత్వము నందువలె "సన్నిహితులు దూరపుజ్ఞాతులు" అనునియమము లేదు. అప్పటికిమిగిలియున్న కుటుంబమెంబర్లందఱియందను ఆభాగము లీనమగును(1). చనిపోయినవాని

(1) 1 అ. 105; 38 బొం 120;

భాగమునకు మృతశేషత్వధర్మముచే మిగిలిన సమష్టికుటుంబమెంబర్లు హక్కుదారులగుదురను విషయము చాలకేసులలో అంగీకరింపబడి సుప్రసిద్ధమైయున్నది. కావున దానికి తీర్పుల నుదాహరింప బనిలేదు(1).

సమష్టికుటుంబమెంబరు కానట్టి యొకనికి, ఒకటెకంటె నెక్కువభార్యలున్నప్పుడు, అతడు చనిపోయినతోడనే అతనియాస్తి భార్యలకు సంక్రమించును. అందొకభార్య చనిపోయినతోడనే ఆమె యనుభవించుచున్నయాస్తి తక్కినభార్యలకు సంక్రమించును. భార్యలందరును చనిపోవువరకును ఇట్లే చనిపోయినభార్యయొక్క భాగము నిలిచియున్నభార్యకు వచ్చుచుండును. ఈరీతిగనే సమష్టికుటుంబమెంబరుకాని యొకపురుషుడు, భార్యయు, పుత్రసంతతియు లేకుండ చనిపోయినచో ఆతనియాస్తి కుమార్తెలకు సంక్రమించును. ఆకుమార్తెలలోకూడ ఒకకుమార్తెచనిపోయినచో ఆమెభాగము మిగిలియున్నకుమార్తెలకు సంక్రమించును. ఇట్లు, భార్యలలోను కుమార్తెలలోను ఒకరుచనిపోయినచో నిలిచియున్నవారికి సంక్రమించుటను గూడ "సర్వైవరుషిప్పు" అని వాడుచున్నారు. ఒకసమష్టికుటుంబమెంబరు చనిపోయిన తోడనే అతనిహక్కు తక్కినమెంబర్లలో లీనమగుటకును, భార్యలు, కుమార్తెలు వారిలోవారికి సంక్రమించుటకును, భేదమున్నది. ఈరెండింటికినికూడ సర్వైవరుషిప్పు అని పేరిడుటవలనసంశయమునకు కారణమగుచున్నది. ఒకభార్య పోయినతోడనే ఆమెభర్త చనిపోయినట్లెంచవలయును. అతనికి "వారసులెవరు" అని ప్రశ్నించినచో నిలిచియున్నభార్య అని సమాధానమువచ్చును. ఇట్లే ఒకకుమార్తెచనిపోయినచో, అప్పుడామెతండ్రిచనిపోయినట్లెంచబడి, యతనికి వారసులయిన, మిగిలినకుమార్తెలకు సంక్రమించును. అంతమాత్రముచే వారిలోవారికి సర్వైవరుషిప్పు ఉన్నదనితెలంప

(1) 9 మూ. ఇం. అ. 610.

రాదు. అందరుభార్యలును అందరుకుమార్తెలును చనిపోవువరకును చనిపోయినపురుషుని ఆస్తి అతనిపురుషవారసులకు సంక్రమింపజాలదు. కావున ఒకభార్యగాని, యొకకుమార్తెకాని చనిపోయినచో, మిగిలినభార్యలు, మిగిలినకుమార్తెలు అందరును పూర్తిగా నశించిపోవువరకును వారికి సంక్రమించి అందరియనంతర మసలుపురుషుని వారసు లప్పుడెవరుందురో వారికి సంక్రమించును. ఒకరియాస్తి మఱియొకరికి సంక్రమించుటకు వారసత్వము అని పేరు. దీనికి ఇంగ్లీషులో succession సక్సెషన్ అందురు. సక్సెషనునకును, సర్వైవరుషిప్పునకును భేదమున్నది. భార్యలుగాని కుమార్తెలుగాని వారిలోవారు విభజించుకొన్నను, ఒకరు చనిపోయినచో సర్వైవరుషిప్పు నశించిపోదు. విభాగముతో ప్రసక్తిలేకుండ మిగిలినవారికి వచ్చుచుండును. సమష్టికుటుంబమెంబర్లవిషయమున నట్లుకాదు. సమష్టికుటుంబమెంబరు విభజించుకొన్నతోడనే సర్వైవరుషిప్పు నశించిపోవును. మఱియు నతఁడు ఇన్సాల్వెంటుఅయి, అతనిభాగము రిసీవరుచేతికిపోయినప్పుడును, అతనిభాగము విక్రయించుటగాని, తనఖాపెట్టుటగాని, అతనిజీవితకాలములో కోర్టువారివలన జప్తుచేయుట గాని తటస్థించినప్పుడును, అట్లు వినియోగమయిపోయిన ఆస్తియందు మిగిలినసమష్టికుటుంబమెంబర్లకు సర్వైవరుషిప్పు నశించిపోవును. డిక్రీకిపూర్వము జప్తుచేయబడినపుడు, సమష్టికుటుంబమెంబరుకాలములో జీవితడిక్రీనిపొందనియెడల సర్వైవరుషిప్పు నశించిపోదు(1).

స్వార్జితమునందు మృతశేషత్వధర్మము వర్తింపదు. సమష్టికుటుంబమెంబరు చనిపోయినప్పు డాతనిభార్యకు సర్వైవరుషిప్పు వర్తించదు.

(1) 1931. మ. వీ. నో. 1015; 17. మ. 144.

తండ్రియనంతరము శూద్రులలో దాసీపుత్రులకును, ఔరసులకును, మృత శేషత్వధర్మము వర్తించునని బొంబాయిహైకోర్టువారు తీర్మానించినారు. కాని ఔరసునివాటాలో దాసీపుత్రుడు సగమునకు మాత్రమే హక్కుకలిగియుండును(1).

5. సమష్టికుటుంబమెంబరు, తనవాటాకుటుంబాస్తిని మరణశాసనముద్వారా ఎవరికిని సంక్రమింపచేయుజాలడు. ఎందువలననగా మరణశాసనము (విల్లు) మెంబరు చనిపోయినపిమ్మట గాని, అమలులోనికి రాదు. మెంబరు చనిపోవుటయు, ఆతనిహక్కు తక్కిన సమష్టికుటుంబమెంబర్లలో లీనమగుటయు ఒక్కసారిగ తటస్థించును. అందుచే ఆతనియనంతర మాతని దని చెప్పదగినయాస్తి యేమియు నుండదు. అందుచే సమష్టికుటుంబమెంబరు మరణశాసనముద్వారా ఆస్తిని సంక్రమింపచేయజాలడు(2). సమష్టికుమారుడుండగా తండ్రి తనభార్యకు జీవనాంశముకొరకు కొంతఆస్తి యిచ్చినట్లు విల్లువ్రాసెను. అది చెల్లదనితీర్మానించిరి(3). తండ్రి తనజీవితకాలములో సమష్టికుటుంబాస్తిని, కొన్నిసందర్భములయందు దానమిచ్చుటకు అధికారము కలదు(4). అట్టి యధికారమున్నది కదాయని తన అనంతరము అమలుజరుగుటకు విల్లుద్వారా సమష్టికుటుంబాస్తిని తండ్రి ఎవరికిని యివ్వజా

సమష్టికుటుంబ మెంబరు విల్లు వ్రాయవచ్చునా?

(1) 137 ఇం. కే. (బొం) 572.

(2) 50 మ. (ప్రి. కా.) 421; 88 ఇం. కే; (మ) 967; 84 ఇం. కే.(మ) 9`5 25 ఇం. కే. 917.

(3) 59. ఇం. కే. (మ) 681; 100 ఇం. కే. (లా) 110.

(4) 59 ఇం. కే. (బొం) 480; 74 ఇం. కే. (అ) 865; 109 ఇం. కే. (అ) 272; 122 ఇం. కే. (లా) 734; 111 ఇం. కే. (లా) 251; 1931 మ. వీ. నో. 215.

లదు(1). విల్లుద్వారా ఆస్తిని పంపకముచేసినను అది చెల్లదు(2). సమష్టికుటుంబమెంబరు విల్లు వ్రాసినయెడల, దానియంతట నది చెల్లని కాగితము కాదు. దానినెవరైనను కోర్టులో దావాతెచ్చి రద్దుచేయించుకొనవలయును(3). సమష్టికుటుంబమెంబరు, దత్తస్వీకారముచేసికొనుటకు తనభార్య కధికార మిచ్చుచు విల్లు వ్రాయవచ్చును. ఆమెంబరు చనిపోయినతోడనే ఆస్తియంతయును సర్వైవరుషిప్పుద్వారా తక్కిన మెంబర్లలో లీనమైపోయినను విల్లుననుసరించి ఆతనిభార్య దత్తస్వీకారము చేసికొనినచో ఆదత్తుడు ఆకుటుంబములో సమష్టికుటుంబమెంబరై తక్కిన మెంబర్లందరతోపాటు హక్కుగలిగి యుండును(4). సమష్టికుటుంబమెంబర్లందరును కలసియైనను విల్లు వ్రాయకూడదు.

సమష్టికుటుంబ మెంబరు తనభాగమును వినియోగము చేయవచ్చునా ?

6. సమష్టికుటుంబమెంబరు తన యవిభక్తభాగమును దానపూర్వకముగా ఎవరికిని యివ్వజాలడు ఈవిషయమున న్యాయస్థానములన్నియును ఒకే యభిప్రాయమును కలిగియున్నవి. తండ్రి, కుమార్తెలకు, ప్రేమపూర్వకముగా కుటుంబస్థితిని బట్టి స్వల్పభాగమును దానమీయవచ్చును.

మదరాసు, బొంబాయి మధ్యపరగణాలరాష్ట్రములలో స. కు. మెంబరు తనయవిభక్తభాగమును, విక్రయింపవచ్చును. కనఖాపెట్టవచ్చును. ఋణదాతలు అతనిజీవితకాలములో జప్తు

(1) 138 ఇం. కే. (లా) 58; 106 ఇం. కే. (బొం) 79; 83 ఇం. కే. (మ) 967.

(2) 19 ఇం. కే. (ప్రి. కౌ) 826; 49 అ. 763.

(3) 1928 లా. 967.

(4) 51 అ. 54.

చేయింపవచ్చును. బెంగాలు, బీహారు సంయుక్తపరగణాలలో, అట్టి విక్రియాదులు చేయకూడదు.

ఈవిషయమును గూర్చి "వినియోగములు" అనుప్రకరణమున విశేషముగా చర్చింపబడినది. కావున వివరములకు అచ్చట చూడవలయును.

7. సమష్టికుటుంబమెంబర్లును, వారిభార్యలును, వారిసంతానమును, సమష్టికుటుంబద్రవ్యమునుండి పోషింపబడవలయును. శుభాశుభకార్యముల కయ్యెడి యావత్తుఖర్చులును అందుండి భరింపబడవలయును.

పోషణహక్కు.

8. సమష్టికుటుంబమెంబరు తనయిష్టము వచ్చినప్పుడు, కుటుంబమునుండి విడిపోయి, ఆస్తిలో తనభాగమును విభజించుకొనుటకు హక్కు కలిగియుండును. ఈవిషయమును గూర్చి "విభాగము" అను ప్రకరణమునవిపులముగా వ్రాయబడినది. కావునవివరములకు అచ్చట చూడవలయును.

విభాగపుహక్కు.



# ఐదవ ప్రకరణము.

---

## సమష్టికుటుంబ వ్యవహార నిర్వహణము.

---

1. సమష్టికుటుంబవ్యవహారము లన్నియును సామాన్యముగా కుటుంబములోని పెద్దవానిచే నిర్వహింపబడుచుండుటయు, తక్కిన మెంబర్లందరును వానియనుమతిని నడచుచుండుటయును, అతడు వయోవృద్ధు అయినప్పుడుగాని, వ్యవహారనిర్వహణసామర్థ్యము లేనప్పుడుగాని, కుటుంబమెంబర్లలో అందులకు దగినవారు మరియొకరా కార్యములను నిర్వహించుచుండుటయును, హిందువుల కనుభవమయియున్నవిషయము. అట్టి పెద్దను ఇంగ్లీషులో మేనేజరు అందురు. మనపూర్వులు కర్త అని వాడియున్నారు.

కర్త.

2. స్వాభావికముగను, మయినర్లవిషయమున తప్పని సరిగను, సమష్టికుటుంబమునకు తండ్రియే కర్తగానుండును(1). అతడు లేనప్పుడు మిగిలినమెంబర్లలో పెద్దవాడు కర్త అగుచుండును. సోదరులలో పెద్దవాడు కర్తయని భావనచేయవచ్చును(2).

సామాన్యముగా తండ్రికర్తగా నుండును.

---

(1) 5 క 148 (పి. కా.)

(2) 125 ఇం. కే. (లా) 894.

3. కుటుంబములో సమర్థుడైనపెద్దవా డుండగా సమష్టిగా నున్నంతవరకు కుటుంబకార్యనిర్వహణము తనకిమ్మని చిన్నవాడు కోరుటకు హక్కులేదు(1). కాని పెద్దవాడు కార్యనిర్వహణబాధ్యతనుండి తప్పించుకొని తక్కినవారిలో సమర్థుడగువానిని కర్తనుగా నేర్పరుపవచ్చును(2). తండ్రిజీవించియుండగా తండ్రియాజ్ఞపైని పెద్దకుమారుడు వ్యవహారములను నిర్వహించుచు, ఒక్కొక్కప్పుడు, ఆతడే తండ్రిజీవితకాలములోనే కర్త కావచ్చును(3).

పెద్దవాడుండగా చిన్నవాడు కర్త కానేరడు.

4. కుటుంబవ్యవహారములలో కుటుంబమెంబర్లందరును పాల్గొనవచ్చును. కాని, కర్త యొక్కడే యుండవలయును. ఇరువురు కర్తలుండరాదు. మైనరు కర్తగా నుండకూడదు(4). అదివరకే అధికారమును పొందియున్న యెడల, కర్త కానట్టి యితర మెంబరు వ్యవహరింపవచ్చును. లేదా, అట్టి మెంబరు చేసిన వ్యవహారములను తక్కినవారు దరిమిలాను అంగీకరింపవచ్చును(5).

కర్త యొక్కడే యుండవలయును.

---

(1) 32 మ 167; 66 ఇం. కే (మ) 155

(2) 29 క 797.

(3) 49. ఇం. కే. (పా) 907.

(4) 30 మ. లా. జ. 21.

(5) 32 బొం 375

5. సమష్టికుటుంబమెంబర్లచే నియమితుడు కాకపోయినను, హిందువుల ఆచారములను ధర్మములను అనుసరించి కర్త కుటుంబ వ్యవహారములను నిర్వహించుటకు నియమితుడైనవానివలెనే యెంచబడును(1). కాని, కర్తను యిప్పటిశాసనముల యందు నిర్వచింపబడినఏజంటు లేక ట్రస్టీవంటివాడని యెంచకూడదు(2). కర్త ఇండియన్ కాంట్రాక్టు ఆక్టుయొక్క 10 వ ప్రకరణములో చెప్పబడినఏజంటువంటివాడు కాడు(3). ట్రస్టీవంటివాడని తలంపవచ్చును కాని ట్రస్టీవలె ఖర్చు తగ్గించి, ఆదాయమును నిలువచేయవలయునను మొదలగు ట్రస్టీచేయవలసిన విధు లీతనికి లేవు(4). కర్తకు జీతబత్తెములు లేవు. వ్యవహారము లిట్లు చేయుమనియు, ఇంతసొమ్ము మాత్రమే ఖర్చుపరచుమనియు నాతనిని నిర్బంధించుట కెవరికిని అధికారము లేదు(5).

కర్త ట్రస్టీగాని, ఏజంటుగాని కాడు.

6. కుటుంబమునకు వచ్చెడి ఆదాయమును రాబట్టుటకును, దానిని ఖర్చుపెట్టుటకును కర్తకు సర్వాధికారమున్నది. కుటుంబావసరములకు ఖర్చుపరచుచున్నంతకాలము ఖర్చును తగ్గించుమని గాని, నిలువచేయుమని గాని, ఖర్చును హెచ్చించుమని గాని, కోరుటకు తక్కినవారి కధికారము లేదు(6). కుటుంబకార్యనిర్వహణమున నాతనికి కొంతస్వేచ్ఛ యుండవలయును(7). కాని, యతడు న్యాయమైనరీతిగాను జాగ్రత

కుటుంబాదాయముపై కర్తయొక్క అధికారము.

(1) 1 మ 169.
(2) 35 మ 177.
(3) 22 అ 307 (317) ; 26 మ 544 (553).
(4) 61 ఇం. కే. (ప్రి. కౌ.) 690
(5) 18 క. వీ. నో. 309; 3 మ. హై. రి. 177.
(6) 18. క. వీ. నో 309.
(7) 17 ఇం. కే. (మ) 609

గాను వ్యవహారమును నడపవలయును(1). కర్త, యెక్కువ ఖర్చు చేయుచున్నాడనిగాని, వ్యవహారములను జాగ్రతగా నిర్వహించుచుండుట లేదనిగాని, పక్షపాతము చూపుచున్నాడని గాని, తోచినప్పుడు తక్కిన మెంబర్లు చేయవలసినపని విభాగమును కోరుటయే(2).

కర్తకుండెడి విశేషాధికారములు.

7. కుటుంబమునకు కర్తగానున్నాడను కారణముచే తక్కిన మెంబర్లకంటె అతనికి ఆస్తియందు ఎక్కువహక్కులేమియు నుండవు. కాని కార్యనిర్వాహణముతో సంబంధించినంతవఱకు అతనికి విశేషాధికారములు కొన్నియున్నవి.

అవి యేవనగా:—

వినియోగములు.

(క) కుటుంబముయొక్క న్యాయమైన యవసరముకొఱకును, కుటుంబముయొక్క లాభముకొఱకును న్యాయములైన షరతులకు లోబడి, కుటుంబాస్తిలోని కర్తయొక్క భాగమునే కాకుండ అందరు మెంబర్లయొక్క భాగములనుకూడ వినియోగముచేయుటకు కర్త కధికారముకలదు. ఈవిషయమును గూర్చి ఆఱవప్రకరణమున విపులముగా వ్రాయబడినది. కావున అచ్చట చూడవలయును.

ఋణములు.

(చ) కుటుంబావసరములకొఱకు తక్కినమెంబర్లు అందరును చేరనక్కరలేకుండ తానొక్కడే అప్పులను చేయుటకు కర్త కధికారము కలదు. ఆయప్పులు, సమష్టికుటుంబాస్తి నంతను బయిండుచేయును. ఈవిషయమునుగూర్చి ఏడవప్రకరణమున విపులముగా వ్రాయబడినది. కావున అచ్చట చూడవలయును. సమష్టికుటుంబమేనేజింగుమెంబరు (కర్త), కుటుంబావసరము

(1) 35 ఇం. కే (అ) 326.

(2) 13. క. వీ. నో 309; 8 మ. హై. కే. 177.

కొరకు, ప్రామిసరినోటుపైని బదులు తెచ్చినప్పుడు ఆరుణము తక్కిన మెంబర్లయొక్క సమష్టికుటుంబాస్తిలోని భాగములనుకూడ బయిండుచేయుననియు, ప్రామిసరినోటు గనుక, లేక హుండి గనుక లేక విడిరుణము గనుక, ఆయప్పు, వ్రాసినవానినితప్ప తక్కినవారిని బయిండుచేయదని చెప్పుటకు వీలులేదనియు అన్నిహైకోర్టులును తీర్మానించినవి(1).

(ట). సమష్టికుటుంబవర్తకమును కొనసాగించుటలో కంట్రాక్టులనుచేయుట, రశీదులను యిచ్చుట, బాకీలను వసూలుచేయుట, వదలివేయుట, రాజీపడుట మొదలగు వ్యాపారసంబంధములైన కార్యములనన్నిటిని చేయుటకు కర్తకధికారము కలదు. ఇట్టివిషయములలో అట్టి విశేషాధికారము కర్తకుండిననేగాని వ్యాపారము జరుగనేరదు(2).

వర్తకవిషయము.

సమష్టికుటుంబమునకు పూర్వమునుండియు నుండిన వర్తకమును కొనసాగించునప్పుడు వర్తకముకొరకు కర్త తెచ్చినరుణములు అవసరములును, న్యాయమైనవియు నయ్యెనేని సమష్టికుటుంబములోని మేజరుమెంబర్లనే కాకుండ మైనరుమెంబర్లనుకూడ బాధించును. వర్తకపుటాస్తియేకాకుండ సమష్టికుటుంబాస్తి యావత్తును ఆరుణము

(1). 4 మ 375; 28 మ 597; 20 బొం 488; 28 అ 288; 44 అ 893; 18 బొం 520; 7 క. వీ. నో. 725; 11 క. వీ. నో. 189; 26 ఇం. కే 750; 28 ఇం. కే. 845; 31 ఇం. కే. 317; 88 ఇం. కే. 839; 73 ఇం. కే. 1018; 2 ఇం. కే. 173; 131 ఇం. కే. (అ) 513; 66 ఇం. కే (అ) 150; 102 ఇం. కే. (పా) 295.

(2). 33 అ 272. పి9. కా; 81 ఇం. కే (ఔ) 303.

లకు బాధ్యత కలదియగును(1). క్రొత్తవర్తకమును ప్రారంభించి అందుకొరకు ఋణములనుచేయుటగాని, ఆస్తిని వినియోగము చేయుటకుగాని కర్తకధికారము లేదు. దీనినిగూర్చి, ఆరవ, ఏడవప్రకరణములలో ఇంకను కొన్ని విషయములు విపులముగా చెప్పబడును.

మధ్యవర్తుల ద్వారా తగవు ఫయిసలాచేయుట.

(త). సమష్టికుటుంబముయొక్క ఆస్తితో సంబంధించి, యితరులతో వచ్చెడి తగాదాలలో మధ్యవర్తులద్వారా తగవును ఫయిసలుచేసికొనుట, కుటుంబమునకు లాభకరమేని, అందుకొరకు మధ్యవర్తుల నేర్పరచుటకు కర్త కధికారము కలదు. ఆమధ్యవర్తు లిచ్చెడి అవార్డునకు మైనర్లతోకూడ తక్కిన మెంబర్లు అందరును బాధ్యులగుదురు. కాని అందు లాలోచీగాని మోసముగాని యుండరాదు(2). కొందరుమెంబర్లుమాత్రమే మధ్యవర్తి నేర్పరచుకొని రేని ఆయన యిచ్చిన తీర్పు తక్కినవారిని బయిండు చేయదు(3).

(ప). కుటుంబలాభముకొరకు సదుద్దేశముతో నేదావాలో నైనను కర్త రాజీపడినచో అది మైనర్లతోసహా తక్కిన మెంబర్లనంద

(1). 1 బాం. హై. రి 51; 10 బాం. లా. రి. 668; 37 ఇం. కే. 230; 41 ఇం. కే. 224; 48 ఇం. కే 76; 53 ఇం. కే. 262; 55 ఇం. కే. 64; 132 ఇం. కే (పి. కా.) 618; 2 ఇం. కే (మ) 203; 106 ఇం. కే. 183.

(2). 2 మ. హై. రి. 47; 1 అ 651; 16 అ 321; 27 బాం 287; 61 ఇం. కే (లా) 628; 104 ఇం. కే. (లా) 202; 122 ఇం. కే. (లా) 231; 126 ఇం. కే. (లా) 579; 139 ఇం. కే. (బాం) 820; 50 ఇం. కే (మ) 471; 24 ఇం. కే. (నా) 866; 36 అ 388;

(3) 60 ఇం. కే (మ) 615; 25 ఇం. కే 849.

రను బాధ్యులనుగా చేయును(1). కాని మైనరుమెంబర్లు దావాలో పార్టీలుగానున్నచో కోర్టువారి యుత్తరువును పొందనిదే రాజీపడకూడదు(2). అట్లుపడినచో ఆరాజీని రద్దుచేయుటకు కోర్టున కధికారము కలదు(3). సోదరులలో పెద్దవాడు రాజీపడినచో అది తక్కినవారిని బయిండుచేయును(4). దావాలో మైనరుమెంబర్లకు కర్తకాకుండ మరియొకరు గార్డియనుగా నున్నపుడు అట్టిగార్డియనుయొక్క సమ్మతిలేనిదే కర్త రాజీపడకూడదు. అట్లుపడెనేని మైనర్లతో సంబంధించినంతవరకే కాకుండ కర్తపైనికూడ ఆరాజీ రద్దుఅగును(5). దగా మోసముచే రాజీపడినప్పుడు, అది తక్కినమెంబర్లను బయిండుచేయదు(6).

రాజీ.

(౫). సమష్టికుటుంబము, ఇతరుల కీయవలసిన బాకీలకు కాలదోషముపట్టకుండుటకై, బాకీలను వప్పుకొనుటకుగాని, వసూలుయిచ్చి చెల్లువ్రాయుటకుగాని, కర్త కధికారము కలదు. కర్తయొక్కడే వప్పుకొనినను, చెల్లువ్రాసినను ఆబాకీకి కాలదోషము పట్టదు. ఆబాకీ తక్కినమెంబర్లందరిమీాదను బయిండుఅగును(7). విభాగమైనపిదప, కర్త

కాలదోషము లేకుండ వప్పుదల.

(1). 1 అ 651; 61 ఇం. కే (లా) 628; 5 పా 480; 71 ఇం. కే (అ) 628; 55 క 10;

(2). 19 ఇం. కే. (ప్రి. కౌ.) 515.

(3). డిటో; 74 ఇం. కే. (ప్రి. కౌ.) 765.

(4). 125 ఇం. కే. (లా) 894.

(5). 73 ఇం. కే (బొం) 118.

(6). 25 ఇం. కే. 849.

(7). 107 ఇం. కే (బొం) 60; 54 ఇం. కే (మ) 318; 31 ఇం. కే (క) 80; 58 ఇం. కే (మ) 878; 109 ఇం. కే (పా) 655; 111 ఇం. కే (అ) 143; 5 మ 169; 28 ఇం. కే (అ) 429; 88 ఇం. కే (క) 1025; 68 ఇం. కే (కో)196;

అట్లువప్పుకొనినయెడల ఆవప్పుదల తక్కినవారినిబయిండుచేయదు(1). కాలదోషముపట్టిన బాకీలకు కర్త తిరిగి వ్రాసియిచ్చినయెడల అది కర్తనేగాని, తక్కినమెంబర్లను బయిండుచేయదు(2).

(జ). సమష్టికుటుంబమునకు రావలసిన అన్ని బాపతులసొమ్ములను పుచ్చుకొని రశీదు లీయవచ్చును. ఆరశీదులు కుటుంబములోని తక్కినమెంబరుల నందరను బయిండు చేయును(3). కోర్టువారి అనుమతి అక్కరలేకుండ మైనర్లకురావలసినసొమ్ములను కర్త పుచ్చుకొనవచ్చును(4).

రశీదులిచ్చుట.

(డ). సమష్టికుటుంబము మేనేజిమెంటు చేయవలసినట్టి ధర్మసంస్థ లేమయిననున్నయెడల, వాటిధర్మకర్తృత్వము కర్తకే చెందును. విభాగమువరకును తాముకూడ కొంతకాల మాకార్యమును నిర్వహించెదమని యితరమెంబర్లు కోరకూడదు(5).

ధర్మకర్తృత్వము.

(ద). కర్త, స. కు. యొక్క యావత్తువ్యవహారములను నిర్వహించుట కధికారముకలదు. కాని, సామాన్యముగా అది కుటుంబలాభముకొరకై యుండవలయును. వ్యవహారజ్ఞానము బాగుగా గలిగినమనుష్యుడు చేసినట్లు ఆవ్యవహారములను కర్త నిర్వహింపవలయును. అప్పుడాతడుచేసినవన్నియు తక్కినమెంబరులను మైనర్లను సహా బయిండుచేయును. అవివేకముతోడను, అశ్రద్ధతోను, దురుద్దేశ

యావత్తువ్యవహారములను నిర్వహింపవచ్చును.

(1). 32 ఇం. కే 997; 33 ఇం. కే (మ) 986; 18 ఇం. కే (అ) 726.
(2). 61 ఇం. కే (పా) 20; 82 ఇం. కే (లా) 96; 32 ఇం. కే 997;
(3). 1927 పా 329; 19 ఇం. కే (అ) 645; 80 ఇం. కే (అ) 12;
(4). 103 ఇం. కే (పా) 75.
(5). 32 మ 167.

ముతోను, లాలోచీగాను చేసినపనులు తక్కినమెంబర్లను బయిండు చేయవు(1).

(బ). కుటుంబము సమష్టిగా నున్నంతకాలము, కుటుంబము యొక్క ఆదాయవ్యయములను లెక్కచెప్పుమని యడుగుటకు ఇతర మెంబర్లకు హక్కులేదు. ఈవిషయమునుగూర్చి "విభాగము" అను ప్రకరణమున విశేషముగా తెలుపబడును. కావున అచ్చట చూడవలయును.

జమాఖర్చు.

8. కంట్రాక్టులు, తనఖాలు, క్రయములు, ఋణములు బాకీలు మొదలగువ్యవహారములలో దావాలు నడిపించవలసివచ్చినప్పుడు వాదులుగాగాని, ప్రతివాదులుగాగాని, సమష్టికుటుంబమెంబర్లు అందరును చేరనక్కరలేకుండ, కర్తయొక్కడే పార్టీగా నుండి దావాను నడిపింపవచ్చును. అనగా సమష్టికుటుంబముతరఫున కర్తయొక్కడును వాదిగా చేరవచ్చును(2). దావాలో కర్తఅనివ్రాయకపోయినను అతడు కర్తఅయినప్పుడును, సమష్టికుటుంబముతరఫున దావాచేయుచున్నప్పుడును ఆదావా చెల్లుట కభ్యంతరములేదు(3). ఏదేనివ్యవ

దావాలలో కర్తయొక్కడును పార్టీగానుండవచ్చునాః

(1). 60 ఇం. కే 481; 128 ఇం. కే 775; 1930 అ 767; 75 ఇం. కే (పా) 508; 76 ఇం. కే (సిం) 778; 116 ఇం. కే (అ) 491;

(2) 21 మ. లా. జ. 378 ప్రి. కౌ; 15 ఇం. కే. (అ) 126; 39 ఇం. కే. (మ) 427; 10 ఇం. కే. (మ) 874; 26 క 349; 25 అ 878; 133 ఇం. కే. (అ) 416; 32 అ 183; 17 ఇం. కే. 198; 72 ఇం. కే. 815; 38 ఇం. కే. 691; 88 ఇం. కే. 116; 101 ఇం కే. 44; 27 ఇం. కే. (అ) 795; 32 ఇం. కే. 996; 85 ఇం. కే 181; 58 బొం 777; 58 బొం 444; 70 ఇం. కే (మ) 160;

(3) 133 ఇం. కే (లా) 116; 121 ఇం. కే. 330; 63 ఇం. కే (పా) 564;

హారములో కర్తయొక్కడే కాకుండ ఇద్దరుముగ్గురు మెంబర్లుచేరి వ్యవహరించి రేని, అందునుగూర్చి వచ్చెడిదావాలో వారందరును పార్టీలుగా చేరవలయునని పి). కౌ. తీర్మానించినారు(1).

ఇతరులు వాదులుగానుండి స. కు. మెంబర్లందరిపైనను దావా చేయనక్కరలేకుండ కర్తయొక్కనిపైనను దావా చేయవచ్చును. కర్తపైనిగాని, తండ్రిపైనిగాని, దావాచేసినప్పుడు దావావ్యవహారమునందు కర్తకును లేక తండ్రికిని తక్కిన మెంబర్లకును సమాన బాధ్యత యున్నప్పుడు, ఆదావాలో కాబడినతీర్మానము, అందరు మెంబర్లను బయింషు చేయును. దావాలో కర్త అనిగాని, సమష్టికుటుంబముతరఫున మేనేజిమెంటు చేయుచున్నవారు అనిగాని, వ్రాయక పోయినను కర్తనుగాక కొందరు మేజరుమెంబర్లనుచేర్చి, మరికొందరు మేజరుమెంబర్లను చేర్చకపోయినను, ఆతీర్పు అందరను బయిండు చేయును. ఆతీర్పును రద్దుచేయుమనియును, అది తమను బాధింపదనియును యితరమెంబర్లు దావాతెచ్చినను లాభములేదు. అట్టిదావాకు పునరావృత్తిదోషము (Resjudicata) కూడ పట్టును(2).

తక్కినమెంబర్లనుకూడ పార్టీలనుగా చేర్చినకేసులలో అనవసరమనియెంచి వారిని తప్పించివేసినను, మేనేజరుపైని కాబడినతీర్పు

---

(1) 9 ఇం. కే. 739.

(2) 9 ఇం. కే (పి). కౌ.) 789; 24 ఇం. కే (పి). కౌ.) 504; 101 ఇం. కే (పి). కౌ.) 44; 64 ఇం. కే (బొం) 966; 98 ఇం. కే. (లా) 960; 71 ఇం. కే (అ) 623; 138 ఇం. కే (నా)161; 121 ఇం. కే. 380. 122 ఇం. కే (మ) 164; 22 మ 461; 30 మ. 324; 125 ఇం. కే. (లా) 369; 109. ఇం. కే (మ) 372; 36 అ 383; 15 ఇం. కే 876; 66 ఇం. కే. 485; 58 ఇం. కే. 489;63 ఇం. కే 288; 1 పా. లా. జ. 468; 1930 పా 293. 80 ఇం. కే (పా) 34. 40 ఇం. కే. 2. 49 ఇం. కే. 627;

తప్పించివేసిన మెంబర్లనుకూడ బయిండుచేయును(1). ఒకవేళ, కర్త యకస్మార్టిగానున్నను అంతమాత్రముచేత అతడు తనవిధిని నిర్వర్తించ లేదనిగాని, ఆతీర్పు తక్కినవారిని బయిండుచేయదనిగాని చెప్ప వీలులేదు(2).

కర్తయొక్కడే తెచ్చినదావాలో తక్కినమెంబర్లనుకూడ పార్టీలనుగా చేర్చవలయునని ప్రతివాది కోరవచ్చును. కాని దావా విచారణకాకముందే ఆయభ్యంతరమును చెప్పవలసియుండును(3). కర్త దావా తెచ్చినప్పుడు, అది స. కు. తరపున తెచ్చెననుభావన లేదని మ. హై. వారును అట్టిభావనయున్నదని అ. హై. వారును తీర్మానించిరి(4). కర్తతోపాటు కొందరుమెంబర్లు దావాలో చేరినప్పుడట్టిభావన లేదు(5).

తండ్రికాకుండ యితరులు కర్తగా నున్నప్పుడు, అతడుచేసిన విడిరుణములకు కర్తయొక్కనిపైని డిక్రీని యిచ్చిరేని, ఆడిక్రీవారంటు గ్రింధములో సమష్టికుటుంబాస్తిపైని అమలు జరుపవచ్చునా? అను విషయములో హైకోర్టులలో భిన్నాభిప్రాయములున్నవి(6). ఒకమనుష్యునిపై దావాచేయుసందర్భములో అతడు ఒకకుటుంబమునకు కర్తగానున్నాడని దావాలో వ్రాయకపోయినప్పుడును, డిక్రీలోనైనను, అతనిని కుటుంబమేనేజరు అని ఉదాహరింపకపోయినప్పుడును, తుదకు డిక్రీని చదివిచూచినప్పుడైనను, అందు వ్రాయబడినమాటలను

(1) 121 ఇం. కే (పా) 330.

(2) 83 ఇం. కే (మ) 985; 121 ఇం. కే. (పా) 330.

(3) 10 బొం 32; 28 బొం 11; 25 అ 152.

(4) 7 ఇం. కే. 341; 1928 అ. 86; 107 ఇం. కే. (అ) 698.

(5) 1930 మ 206.

(6) 114 ఇం. కే. (లా) 881

బట్టి కుటుంబమేనేజరుగానే అతనిపైని డిక్రియివ్వబడినదని తోచకుండునప్పుడును, ఆడిక్రిని కర్తపైననే అమలు జరుపవలయునని కాని తక్కిన మెంబర్లపైనిగాని, వారి ఆస్తిపైనిగాని, అమలు జరుపకూడదని మద్రాసుహైకోర్టువారియభిప్రాయము(1). అలహాబాదు హైకోర్టువారుకూడ కొన్ని కేసులలో మద్రాసువారి అభిప్రాయముతో నేకీభవించినారు(2). దావాలో కర్త అని వ్రాయకపోయినను, కర్తపైని దావా చేసినప్పుడు, ఆరుణము సమష్టికుటుంబముకొరకు చేసినదైనచో, తక్కినమెంబర్ల వాటాఆస్తిపైనికూడ బయిండుఅగునని కలకత్తా, బొంబాయి హైకోర్టుల అభిప్రాయము(3). లాహోరు హైకోర్టువారు ఒకసారి మద్రాసువారితోను, ఇంకొకసారి కలకత్తావారితోను ఏకీభవించినారు(4). మేనేజరుపైని దావా చేసినప్పుడు అందరిపైనను చేసినట్లేయని ప్రి. కౌ. తీర్పులు చాలకలవు. కాని అవియన్నియును స్థిరాస్తితో సంబంధించినవి కాని విడిడిక్రీలు కావు. స్థిరాస్తితో సంబంధించిన వ్యవహారములలో ఈవిషయమును సులభముగా గ్రహింపవచ్చును. కాని విడిరుణములవిషయములో భేదమును గ్రహించుట కష్టసాధ్యము.

స్థిరాస్తినిగూర్చి సమష్టికుటుంబముతరఫున తెచ్చెడిదావాలలో కర్తయొక్కడును దావా తేవచ్చునని కొన్నితీర్పులును, కర్తతోపాటు స. కు. మెంబర్లు అందరును చేరవలయునని కొన్ని తీర్పులును

---

(1). 8 మ 208; 10 మ 316; 12 మ. 325.

(2). 9 అ 142; 12 అ 209; 16 అ 449.

(3). 29 క 583; 14 బొం 597.

(4). 66 ఇం. కే 425; 114 ఇం. కే 669; 114 ఇం. కే 881.

ఉన్నవి(1). కాని ప్రి. కౌ. వారు కర్తయొక్కడును దావా తేవచ్చునని వక్కాణించియున్నారు(2).

స. కు. తరఫున కర్తకాకుండ యితరమెంబరు ఒక్కడును దావా తేకూడదు(3).

స. కు. వ్యాపారసంబంధమయినదావాలో మేనేజింగుమెంబరుమాత్రమే దావా తేవలయును(4).

సమష్టికుటుంబవర్తకవ్యాపారములో, ఆవ్యాపారమునందు పాల్గొనుచున్న మెంబర్లుమాత్రము దావాలో పార్టీలుగా చేరిన చాలును. ఆవ్యాపారసంబంధములేని మేజర్లుగాని మైనర్లుగాని పార్టీలుగా చేరనక్కర లేదు.

ఒకకర్తచనిపోయినప్పుడు, అతనిస్థానమున దరిమిలాను ఏర్పడినకర్త దావాలో చేరినచాలును (5).*

---

(1). 8 మ 324; 6 మ 27; 36 ఇం. కే (పా) 197; 28 మ 190; 10 బొం 82; 12 బొం 158; 30 బొం 477.

(2). 9 ఇం. కే (ప్రి. కౌ.) 739.

(3). 18 మ 88.

(4). 96 ఇం. కే (బొం) 281.

*(5). 125 ఇం. కే (పా) 869.

9. సమష్టికుటుంబాస్తిని తనఖాను పొందినవారు, తెచ్చెడి దావాలలో మైనర్లతోసహా అందరిని పార్టీలనుగా చేర్చుటమంచిది. ముందు తగవులు లేకుండపోవును. అట్లుచేయక మేనేజరును ఒక్కరినిచేర్చి దావా తెచ్చిననుచాలునని అ. హై. తీర్మానించిరి(1). నలుగురుసోదరులు తనఖా వ్రాసియిచ్చిరి. అయిదవసోదరు డందు చేరలేదు. తనఖాదారు నల్గురుసోదరులలో జీవించియున్నవారిని చనిపోయినవారికుమాళ్ళనుచేర్చి దావా తెచ్చెను. అయిదవసోదరునికుమాళ్లు తమను చేర్చలేదనియు, అందుచే తమవాటాపైని తనఖా చెల్లదనియు వాదించిరి. కాని మేనేజరు తనఖాలోచేరియున్నప్పుడు తక్కిన మెంబర్లు చేరకపోయినను, ఆతనఖాడిక్రీ అందరిపైనను బయిండుఅగును(2). తండ్రివ్రాసియిచ్చినతనఖా బాకీకి తండ్రియొక్కనిపైన డిక్రీపొందినప్పుడు, కుమాళ్ళను పార్టీగాచేర్చలేదనుకారణముచే ఆడిక్రీ చెల్లకపోదనియు, ఆడిక్రీబాకి న్యాయమైనదైనచో కుమాళ్ళభాగములనుకూడ విక్రయింపవచ్చుననియు, తీర్మానించిరి(3). తనఖాదారుకు తెలిసియున్నయెడల, మేనేజరుతోపాటు, స. కు మెంబర్లందరిని దావాలో చేర్చవలయునని క. హై. వారు తీర్మానించిరి(4). తనఖాబాకీకి దావాచేయునప్పుడు, మెంబర్లనందరిని పార్టీలనుగాచేర్చవలసియుండునని బొం. హై.

తనఖాబాకీలకు దావాలు.

(1). 15 ఇం. కే (అ.పు.బెం.) 126; 15 ఇం. కే (అ) 138; 7 ఇం. కే (అ) 112; 9 ఇం. కే. (అ) 476.

(2). 121 ఇం. కే (అ) 817.

(3). 24 ఇం. కే (పి్రి.కౌ) 504; 89 ఇం. కే (పా) 779; 82 క 296; 36 క 948; 77 ఇం. కే 689; 1929 అ 553; 55 ఇం. కే (మ) 820.

(4). 27 ఇం. కే 425.

వారొకకేసులో తీర్మానించిరి(1). కాని మేనేజరుపైనిదావాచేసి డిక్రీపొందినప్పుడు, ఆఋణము న్యాయమైనదైనదేని, ఆడిక్రీబాకీకి తక్కిన మెంబర్లవాటాలుకూడ విక్రయించవచ్చునవియు, వారు పార్టీలుగా లేరనుకారణముచే ఆవిక్రయము నాపుటకు వీలులేదనియు చెప్పియున్నారు(2). మేనేజరు పార్టీ కాకపోయినచో మెంబర్లనందరను పార్టీలనుగా చేర్చవలయును(3).

సమష్టికుటుంబమునకు యితరులువ్రాసియిచ్చిన తనఖాబాకీకి కర్తయొక్కడును దావా తేవచ్చునా? తక్కిన మెంబర్లు పార్టీలుగానుండనక్కరలేదా? అనువిషయమున భిన్నాభిప్రాయములున్నవి(4). కాని దరిమిలాతీర్పులనుబట్టి కర్తయొక్కడును దావా తేవచ్చునని నిర్ణయమైనది(5).

మైనర్లకుగార్డియను నియామకము తప్పదు

10. ఏదావాలోనైనను మైనర్లనుపార్టీగా చేర్చినప్పుడు, కర్త ఆదావాలో పార్టీగానున్నాడుకదాయని మైనరుమెంబర్లకు గార్డియనును నియమింపకుండనుండుటకు వీలులేదు. మొత్తముకుటుంబమునకంతకును కర్త ప్రతినిధిగా నుండుననుమాట నిజమే. మైనరుమెంబర్లను దావాలో చేర్చకుండనున్నప్పుడు కర్త అట్లు ప్రతినిధియగును. కాని మైనర్లను

(1). 40 బొం 248.

(2). 34 బొం 354.

(3). 21 ఇం. కే (క) 712.

(4). 28 క 577; 41 క 727; 34 అ 549; 39 ఇం. కే (పా) 225.

(5). 126 ఇం. కే (పా) 369; 99 ఇం. కే 151; 93 ఇం. కే (పా) 982; 75 ఇం. కే (పా) 378; 45 ఇం. కే (మ) 76; 46 ఇం. కే 727; 68 ఇం. కే 564; 58 ఇం. కే 489; 15 ఇం. కే 876; 35 మ 685; 22 మ 207; 39 ఇం. కే (మ) 427; 72 ఇం. కే (క) 722.

చేర్చినపిమ్మట గార్డియనును యేర్పరుపకతప్పదు. అట్టి యేర్పాటు చేయకుండ దావా నడిపించిరేని ఆదావాలో కాబడినతీర్పు మైనర్లను బయిండు చేయదు(1).

కర్తగాక మిగిలిన మెంబర్లు బదులు తేవచ్చునా ?

11. సమష్టికుటుంబమెంబర్లలో సామాన్యముగా కర్తయే బదులుతెచ్చుటకు అర్హుడు. కాని యితరమెంబర్లు, అప్పులనుతెచ్చి కుటుంబవర్తకమునకుగాని, మరియేయితర అవసరకార్యములకొరకుగాని ఉపయోగపర్చినప్పుడు అది సమష్టికుటుంబమెంబర్లు అందరివాటాల కుటుంబాస్తిని బయిండు చేయును(2).

సమష్టికుటుంబమునకు రావలసిన సొమ్ములను కర్తగాకతక్కిన మెంబర్లువసూలుచేయవచ్చునా ?

12. సమష్టికుటుంబమునకు యివ్వవలసినసొమ్ములను కర్తకే యిచ్చుచుండుటమంచిది. కర్తగాక తక్కిన మెంబర్లకు యిచ్చినప్పుడు, ఆసొమ్ము కుటుంబద్రవ్యములోనికి చేరినదని రుజువుచేసిననేతప్ప, ఆబాకీతీర్మానమైనట్లెంచబడదు(3). కర్త వేరేయుండగా మరియొక మెంబరు, కుటుంబమునకు రావలసినబాకీలు వసూలుచేయుచున్నారని చెప్పినంతమాత్రమున బాకీ తీర్మానమైనట్లెంచదగదు(4).

కర్తకుప్రతిఫలము.

13. సమష్టికుటుంబవ్యవహారములను నిర్వహించినందులకు ప్రత్యేకప్రతిఫలమేమియును కర్త పొందజాలడు. తనవాటాయొక్కను కర్త వ్యవహరింపవలసినదేకదా!(5).

(1). 129 ఇం. కే (అ) 560.
(2). 23 మ 597; 20 క 453; 10 ఇం. కే (సిం) 978; 120 ఇం. కే (లా) 611
(3). 21 మ. లా జ. 508; 378.
(4). 21 ఇం. కే 777; 7 బొం. హై. 8. 141.
(5). 18 మ 73.

14. సమష్టికుటుంబములోని మైనరుమెంబర్లకు 1890 సంవత్సరపు గార్డియన్సు అండు వార్డ్సు ఆక్టుననుసరించి గార్డియనును నియమించుటకధికారము లేదు(1). కాని కోర్టువారు స్వతంత్రాధికారముక్రింద (inherent jurisdiction) గార్డియనును నియమింపవచ్చును(2).

ఇతర విషయములు.

ఒక కంపెనీలో, సమష్టికుటుంబము భాగస్వామిగా నున్నప్పుడు కర్త చనిపోయెనేని, ఆస్వామ్యము నశించిపోవదు. మిగిలిన మెంబర్లతోనున్నకుటుంబము భాగస్వామిగా నుండును(3).

సమష్టికుటుంబము తాలూకు భూములను కవులునకు యిచ్చుటకును శిస్తులకు దావాలుచేయుటకును కర్తకు మాత్రమే అధికారము కలదు(4).

సమష్టికుటుంబముయొక్క ద్రవ్యమును బదులిచ్చి తనపేర దస్తావేజు వ్రాయించుకొనినకర్త చనిపోయెనేని, ఆకుటుంబముయొక్క క్రొత్త మేనేజరు ఆసామ్మీను పుచ్చుకుని దస్తావేజును చెల్లువ్రాసియిచ్చి వేయవచ్చును. అదిచెల్లుట కభ్యంతరము లేదు(5).

చనిపోయినకర్తపేరనున్న దస్తావేజుబాకీకి మిగిలిన మెంబరు సక్సెషన్ సర్టిఫికెట్టు అక్కరలేకుండ దావాచేసి రాబట్టుకొనవచ్చును (6).

---

(1). 30 బొం 152; 32 మ 139; 25 అ 407.

(2). 132 ఇం. కే (ప్రి కౌ.) 613; 122 ఇం. కే (బొం) 129; 112 ఇం. కే (అ) 873; 74 ఇం. కే (క) 244; 25 బొం 353; 19 బొం. 96.

(3). 95 ఇం. కే (అ) 152; 114 ఇం. కే (అ) 881.

(4). 38 ఇం. కే. (మ) 645.

(5). 94 ఇం కే (సిం) 664.

(6). 98 ఇం. కే (మ) 872.

ఆఱవప్రకరణము.

## వినియోగములు. (Alianations.)*

అస్వాధీనముగాగాని, స్వాధీనము చేసిగాని, తనఖాయిచ్చుట, విక్రయించుట, దానమిచ్చుట, హామీయిచ్చుట మొదలగుకార్యముల వలన, ఆస్తిని పరాధీనముచేయుటయును, ఆస్తిపైని బాధ్యతలను కలుగచేయుటయును వినియోగ మనబడును. వీటిని ఇంగ్లీషుభాషలో Alianations అని యందురు. హిందువుల ధర్మశాస్త్రములలో దానాధిక్రయములని దానమిచ్చుట, కుదువ (తనఖా) యుంచుట, విక్రయించుట, ఈమూడును ఆస్తిని పరాధీనముచేయుమార్గములని చెప్పియున్నారు.

వినియోగ మనగేమి ?

ప్రతిబద్ధా (Exchange) అనగా ఒకరితాలూకు ఆస్తిని మరియొకరికిచ్చి, అందులకు పరివర్తనముగా వారితాలూకుఆస్తిని తాను పుచ్చుకొనుటయు, ఆస్తిని శాశ్వతపుకవ్రులునకిచ్చుటయుకూడ వినియోగములో చేరునని న్యాయస్థానములు తీర్మానించినవి(1). ప్రతిబద్ధా (Exchange) వినియోగముక్రిందకు రాదని, వాదింపబడినది. కాని అదికూడ వినియోగమే యనియు, దానికికూడ, కుటుంబావసరము, కుటుంబలాభముకొరకు తప్ప చేయకూడదనియు, అలహాబాదు హైకోర్టువారు తీర్మానించినారు(2).

---

* ఈప్రకరణమును దీనితరువాతవచ్చు "ఋణములు" అను ప్రకరణమును పరస్పరము సంబంధము కలిగియుండును. ఇందు చెప్పబడనివిషయముల కచ్చటను, అచ్చట చెప్పబడనివిషయముల కిచ్చటను జూడవలయును.

(1). 89 ఇం. కే (ప్రి.కౌ.) 722; 119 ఇం. కే (అ) 486; 187 ఇం. కే (అ) 191.

(2). 187 ఇం. కే (అ) 191; 51 అ 285; 1929 అ 387.

2. సమష్టికుటుంబాస్తిని వినియోగముచేయుటకు ఈదిగువ నుదాహరించినవారికి హక్కు కలదు.

సమష్టికుటుంబాస్తిని వినియోగము చేయుట కర్హు లెవ్వరు ?

(క). కుటుంబమునకంతకును ఒక్కమెంబరే నిలిచి యున్నప్పు డట్టియేకమెంబరు.

(చ). సమష్టికుటుంబమెంబర్లందరును యుక్తవయసు కలవారై రేని వారందఱును కలసి.

(ట). కర్త (manager.)

(త). తండ్రి.

వీరుగాక, తక్కిన సమష్టికుటుంబమెంబర్లలో నెవరైనను తమభాగమును కొన్నినిబంధనలకు లోబడివినియోగముచేయుటకర్హులే. ఆవిషయము వేఱొకచోట చర్చింపబడును. ఇచ్చట, మొత్తముకుటుంబమెంబర్లనందఱను బాధ్యులనుగా చేయుటకు ఎవరు వినియోగము చేయుట కర్హులు ? అను ప్రశ్న విచారణ చేయబడుచున్నది. కొన్ని నిబంధనలకు లోబడి, పైనచెప్పినవారు సమష్టికుటుంబాస్తిని వినియోగముచేయుటకు అర్హులు. అట్టి వినియోగములు తక్కినమెంబర్లనందరిని, బాధ్యులనుగాజేసి, వినియోగములను పొందినవారికి ఆస్తియందు సంపూర్ణమైన హక్కును కలుగచేయును. వీరుగాక తక్కినమెంబర్లు వినియోగముచేసినప్పుడు, అది తక్కిన మెంబర్లను బయిండుచేయదు(1). పైనపేర్కొనిన నల్గురును వినియోగములనుచేయునప్పుడు ఎట్టినిబంధనలకు లోబడవలయునో ఇట క్రమముగా విమర్శింపబడును.

ఆపత్సమయమునందు, కర్త హాజరుగా లేనప్పుడు, తక్కిన మెంబర్లలో నెవరైనను, కుటుంబము యొక్క న్యాయములైన యవస

(1). 182 ఇం. కే. 568 (అ); 36 అ 188; 10 మ 316; 23 మ 597; 20 క 458.

రములకొరకు వినియోగమును చేయవచ్చుననియు, ఆవినియోగము మెంబర్లనందరను బయిండు చేయుననియు కొన్ని తీర్పులున్నవి(1).

కర్త, వినియోగము చేయునప్పుడు, అప్పటికి కుటుంబమెంబర్లలో మేజరుగా నుండువారియంగీకారమును పొందవలయునా? లేదా? యనువిషయమున తీర్పులో కేరీతిగా లేవు. వారియంగీకారమును పొందవలయునని కొన్ని తీర్పులున్నవి(2). కాని దరిమిలా తీర్పులలో వినియోగము న్యాయమయిన యవసరముకొరకైనచో, అట్టి యంగీకారము లేకపోయినను ఆవినియోగము చెల్లుట కభ్యంతరముండదని తీర్మానించియున్నారు(3). వ్యవహారమంతయును కర్త చేయుచున్నప్పుడు, ఆతడు వినియోగము చేయుచున్న సందర్భములో తక్కిన వయసువచ్చిన మెంబర్లు ఏమియు ననక యూరకుండిరేని ఆవినియోగమునకు వారియంగీకారమున్నదని భావింపవచ్చునని కొన్ని తీర్పులున్నవి(4). ఎట్లయినను కర్తచేసిన వినియోగమునుగూర్చి తగవువచ్చినప్పుడు, అది న్యాయమయిన యవసరముకొరకు చేయబడినదా? లేదా? యని చూచుచుందురు కాని, తక్కినవారి అంగీకారమొకప్రశ్నగా చూడరు(5). కర్తచేసిన వినియోగమును దరిమిలాను తక్కినమెంబర్లు అంగీకరించవచ్చును(6).

---

(1). 143 ఇం. కే. (బొ) కర్త జైలులోనుండెను 683; 45 అ 311; 84 అ 4; 70 ఇం. కే (పా) 391; 139 ఇం. కే (బొ) 339; 132 ఇం. కే (అ) 568. 88 ఇం. కే (సిం) 916; 1921 పా 107; 1922 పా 553; 1928 పా 557. 60 ఇం. కే (పా) 282; 111 ఇం. కే (పా) 51.

(2). 12 క 389; 25 అ 407; 39 ఇం కే (బొ) 287.

(3). 55 ఇం. కే (అ) 37; 29 క 797; 39 ఇం. కే (పి.కౌ.) 280 లేక 148; 66 ఇం. కే (పా) 149.

(4). 11 బొం 605; 53 ఇం. కే (బొ) 664

(5). 54 క. లా. జ. 54; 96 ఇం. కే (లా) 443.

(6). 76 ఇం. కే (అ) 872;

వినియోగము నాటికున్న మెంబర్లందరును అంగీకరించవలయునా ? అక్కరలేదా యనువిషయము సంశయముగానున్నది(1). వారందరును అంగీకరించినచో ఆవినియోగమునకు న్యాయమైన యవసరము కలదని భావనచేయవచ్చును(2).

కర్త చేసినవినియోగము న్యాయమైనదైనచో, ఆదస్తావేజులో కర్త అని వ్రాయకపోయినను, మయినరుమెంబర్లకు గార్డియను అని వ్రాసినను ఆవినియోగము చెల్లకపోదు(3).

యుక్తవయసువచ్చిన మెంబరు, వినియోగమును చేయుటలో కర్తతో చేరినంతమాత్రమున ఆవినియోగము న్యాయమైన యవసరముకొరకు చేయబడినదను రుజువు అక్కరలేదని యెంచకూడదు(4).

కర్తవ్రాసి యిచ్చెడు దస్తావేజులో తక్కిన మెంబర్లు సాక్షిసంతకములు చేసినంతమాత్రమున, ఆ వినియోగము న్యాయమైన యవసరముకొరకు చేయబడిన దని నిర్వివాదగా నంగీకరింపజనదు(5). ఇద్దరు సోదరులు, మూడవసోదరునకు కుటుంబాస్తిని తనఖా పెట్టుటకధికార మిచ్చినప్పుడు, కుటుంబరుణముల కాతడు తనఖాపెట్టినచో అది చెల్లును(6).

(1). 81 ఇం. కే (నా) 575.

(2). 72 ఇం. కే (బొ) 100(; 1925 అ 28; 88 ఇం. కే 586.

(3). 42 ఇం. కే (మ) 554; 140 ఇం. కే 256; 1933 అ 73.

(4). 1930 అ 379; 88 ఇం. కే 127; 1929 అ 205.

(5). 1930 అ 292;

(6). 53 మ. లా. జ 592.

ఒకమెంబరు, కొంతఆస్తినికొని ఆక్రయధనమునకై కొంత సమష్టికుటుంబద్రవ్యములోనుండి యిచ్చి మిగతాధనమునకు ఆయాస్తినే అమ్మినవానికి తనఖాపెట్టెను. ఆయాస్తిని తమక్రింద నుంచుకొని తనఖా చెల్లదని తక్కినమెంబర్లు వాదించుటకు హక్కు లేదు(1).

తండ్రియును, మైనరుకుమారుడును ఉన్నప్పుడు, తండ్రి కుటుంబాస్తిని వినియోగముచేసెనేని, ఆ వినియోగమునకు మైనరుతరఫున తండ్రి అంగీకారము నొసంగెనని వాదించుటకు వీలు లేదు(2).

ఏకమెంబరు చేయు వినియోగములు.

3. కుటుంబమున కంతకును ఒక్కడే మెంబరున్నప్పుడు కుటుంబాస్తి యాతనిస్వార్జితము వంటిదనియు, అత డాయాస్తిని తన యిష్టమువచ్చినట్లు వినియోగము చేయవచ్చుననియు, మూడవప్రకరణమున తెలుపబడినది. ఏకమెంబరుచేసిన వినియోగములను దరిమిలాను కలిగినకుమాళ్లు ఆక్షేపింపఁజాలరు(3). అతడు కుటుంబాస్తిని విల్లుద్వారా యితరుల కిచ్చివేయవచ్చును. కాని విల్లు అతని యనంతరముగాని అమలులోనికి రాదు. కావున ఈలోపుగ నాతనికి కుమారుడు కలిగినచో ఆవిల్లు అమలుజరుగనేరదు. అట్టి మెంబరునకు చనిపోయిన సమష్టిసోదరులయొక్క భార్యలు, చనిపోయిన సోదరపుత్రులయొక్క భార్యలు మొదలగువారుండి, వారుగాని, తనభార్యగాని వినియోగము చేసిననాటికి గర్భవతులైయుండి, వారలకు కుమారులు కలిగిరేని, సదరు వినియోగముల నాక్షేపించుటకు ఆకుమారులకు హక్కుకలిగి

(1) 91 ఇం. కే. 976.

(2) 43 మ. 824.

(3) 86 ఇం. కే. (పి. కా.) 249; 88 ఇం. కే. (అ) 1052; 128 ఇం. కే. (లా) 481. 62 ఇం. కే. (బొ) 811;

యుండును. కాని ఆ వినియోగము న్యాయమయిన యవసరముకొరకు గాని, కుటుంబలాభముకొరకుగాని చేసినచో వారు చేయు ఆక్షేపణలు చెల్లనేరవు.

4. వినియోగము చేయునాటికి కుటుంబములోనున్న మెంబర్లందరును యుక్తవయసు వచ్చినవారుగానుండి, వారందరును కలసి ఆ వినియోగమును చేసినయెడల అది యవసరముకొరకు చేయబడక

కుటుంబమెంబర్లందరు మేజర్లుగానుండి చేసిన వినియోగములు.

పోయినను, చెల్లుట కట్టి యాక్షేపణయు నుండదు. ఆ వినియోగము నాక్షేపించుట కెవ్వరికి నధికారము లేదు. కాని ఒక్కమెంబరైనను మైనరుగానున్నచో, ఆ వినియోగము నాక్షేపించుట కాతని కధికారము కలదు. మైనరు, అట్టి వినియోగము నాక్షేపించుచు చేసిన దావాలో, అప్పటికున్న మేజరు మెంబర్లందరును చేరి, వినియోగము చేసినంత మాత్రమున, ఆ వినియోగము న్యాయమయినదను భావన రానేరదు(1). అట్టి భావనవచ్చునని కొన్నితీర్పులున్నవి(2). వినియోగము చేయునాటికి, గర్భస్థుడైయున్న పురుషునకు కూడ ఆ వినియోగము నాక్షేపించుటకు హక్కుకలదు. కాని, ఆ వినియోగము న్యాయమయిన యవసరముకొరకును, కుటుంబలాభముకొరకును చేసియున్నచో ఆయాక్షేపణలు చెల్లవు.

---

(1) 114 ఇం. కే. (అ) 185; 66 ఇం. కే. (పా) 149; 66 ఇం. కే (బొ) 930.

(2) 79 ఇం. కే. (అ) 1019; 43 ఇం. కే 253; 63 ఇం. కే. (అ) 307.

5. ఏకమెంబరుగాని, కుటుంబమెంబర్లందరును కలిసిగాని చేయు వినియోగములకు నిర్బంధములంతగా లేవు. ఏమనిన, ఆయాస్తి వారిది. అందు తమకు హక్కుకలదని చెప్పెడివారు మరియొకరు లేరు.

కర్త, లేక తండ్రి చేయు వినియోగములు.

కర్త, లేక తండ్రి చేయువినియోగములలో తమ కాయాస్తియందు హక్కుగలదని చెప్పెడి యితర మెంబర్లు లేక కుమారులు ఉండియుందురు. కావున వారుచేయు వినియోగములను గూర్చి నిర్బంధము లెక్కువయున్నవి. 'కర్త' అనుశబ్దములో తండ్రికూడ ఇమిడియే యున్నాడు. అనగా తండ్రి, కుమాళ్ళు, మాత్రమే గల కుటుంబములో తండ్రి కర్తయగు చునేయున్నాడు. కాని తండ్రికాకుండ ఒక్కొకకుటుంబమునకు ఒక్కొకప్పుడు మరియొకరు కర్తగా నుండవచ్చును. అనగా జ్యేష్ఠసోదరుడు, పెదతండ్రి మొదలగువారు కర్తగా నుందురు. తండ్రి కర్తగానుండి చేసిన వినియోగమునకును ఇతరులు కర్తగానుండి చేసిన వినియోగమునకును భేదమున్నది. ఇతరకర్తకు లేని యధికారములు కొన్ని తండ్రికి కలవు. అనగా ఆస్తి వినియోగవిషయమున తండ్రికి గల యధికారములన్నియు ఇతరకర్తకు లేవు. ఈభేదమును గూర్చి ముందు మరియొకపేరాలో తెలుపబడును.

వినియోగవిషయమున స్మృతివచనములు.

6. సమష్టికుటుంబాస్తి వినియోగవిషయమున విజ్ఞానేశ్వరుడు తన మితాక్షరియందిట్లు వ్రాసియున్నాడు.

"యేజాతా యేప్యజాతాశ్చ యేచ గర్భే వ్యవస్థితాః వృత్తించ తేఽభి కాంక్షంతే నదానం నచ విక్రయః ఇతి మనువచనాత్(1). అస్యాపవాదః ఏకోపి స్థావరే

(1) ఈవచనము వ్యాసునిదని కొందరనెదరు.

కుర్యాద్దానాదమన విక్రయం ఆపత్కాలే కుటుంబార్థే ధర్మార్థేచ విశేషత ఇతి(1) అస్యార్థః॥ అప్రాప్తవ్యవహారేషు పుత్రేషు పౌత్రేషు చానుజ్ఞాదానావసమర్థేషు భ్రాతృషువా తథావిధే ష్వవిభక్తేష్వపి సకలకుటుంబవ్యాపిన్యామాపది తత్పోషణేవావశ్యకర్తవ్యేషుచ పితృ శ్రాద్ధాదిషు స్థావరస్య దానాదమనవిక్రయమేకోపి సమర్థః కుర్యా దితి. యత్తు మనువచనం—విభక్తావావిభక్తావా సపిండా స్థావరే సమాః। ఏకోహ్యనీశస్సర్వత్ర దానాదమనవిక్రయ ఇతి(2) తదప్యవి భక్తేషు ద్రవ్యస్య మధ్యస్థత్వా దేకస్యానీశ్వరత్వా త్సర్వాభ్యనుజ్ఞాఽ వశ్యం కార్యా—విభక్తేషుతూత్తరకాలం విభక్తావిభక్తసంశయవ్యు దాసేన వ్యవహారసౌకర్యాయ సర్వాభ్యనుజ్ఞా—నపున రేక స్యానీ శ్వరత్వేనాతో విభక్తానుమతివ్యతిరేకేణాపి వ్యవహారసిద్ధ్యత్యేవేతి వ్యాఖ్యేయం.

పుట్టిన వారిచేతను, పుట్టబోవు వారిచేతను, గర్భమందున్న వారి చేతను, జీవనాధారము కోరబడుచుండును. కావున దానము, విక్ర యము చేయకూడదు. అని మనువు చెప్పియున్నాడు. కాని దీనికొక యపవాదము (మినహాయింపు)న్నది ఆపత్కాలమందును, కుటుంబ సంరక్షణమందును, ధర్మార్థములయందును స్థిరాస్తిని ఒక్కడైనను దానముచేయవచ్చును. కుదువ బెట్టవచ్చును. విక్రయించవచ్చును. అని బృహస్పతివచనముకలదు దీని కర్థమేమనగా, వ్యవహారము నెఱుంగజాలక అనుజ్ఞనిచ్చుట కశక్తులుగానున్న స్థితిలో, పుత్రులును పౌత్రులును ఆవిధముగానే సోదరులు నున్నప్పుడు సకలకుటుంబము నకును వ్యాపించిన యాపదయందుగాని సకలకుటుంబపోషణమందు గాని, అవశ్యకర్తవ్యములైన పితృశ్రాద్ధాదులయందుగాని, కుటుంబ

(1) ఈవచనము బృహస్పతి దని వివాదరత్నాకరము.

(2) ఈవచనము బృహస్పతిదని కొందరు.

నిర్వాహకుడుగానున్నయాతఁడొక్కఁడును స్థావరమును దానమిచ్చుట, కుదువయుంచుట, విక్రయించుట, చేయవచ్చును. స్థావరమునందు విభక్తులైనను అవిభక్తులైనను సపిండులు సమానాధికారులు. ఒకడు అధికారికాడు. కావున దానదమన విక్రయములను చేయకూడ దను మను వచనమున కీవిధముగా యర్థము చెప్పవలసియున్నది అవిభక్తులైనపక్షములో ఆద్రవ్యమునందు స్వత్వమందఱకు నుండును. కావున అందఱి యనుమతియు నావశ్యకము. ముందెప్పుడైన విభక్తుడా? అవిభక్తుడా? యను సంశయమువచ్చి తగవులు రాకుండుటకై వ్యవహారసౌకర్యముకొరకు విభక్తులందఱి యనుమతిని పొందవలయునని చెప్పబడినదే కాని, ఒక్కఁడైన యజమానికి స్వత్వము లేదని కాదు. కావున వారి సమ్మతి లేకున్నను వ్యవహారము సిద్ధించునని యర్థము

"ధర్మార్థములయందును" అనుమాటకు, పితృశ్రాద్ధాదులు అనిమాత్రమే యర్థము చేయకూడదనియు, ఆవాక్యములు, "ధర్మార్థము" లనుమాటలలోని యర్థమునకు మితినేర్పరచుట కుదాహరింపబడ లేదనియు, అ. హై. తీర్మానించినారు(1).

వినియోగము ను గూర్చి ప్రివికౌన్సిలువారి వాక్యములు.

7. ప్రివికౌన్సిలువారు, మొట్టమొదట హనుమాన్‌ప్రసాద్ కేసు(2) లో మైనరుయొక్క ఆస్తిని గార్డియను తల్లి తనఖాపెట్టినప్పుడు అది చెల్లునా? చెల్లదా? అని ప్రశ్నరాగా ఆవిషయమై తమ అభిప్రాయమును యీాదిగువవ్రాసిన యర్థమిచ్చుమాటలలో వెల్లడించియున్నారు.

మైనరుతాలూకు ఆస్తిపైని బాధ్యతను కలుగచేయుటకు మేనేజరునకున్న యధికారము సంపూర్ణమైనది కాదు. అవసరము తటస్థించినప్పుడును, లాభముకొరకునుమాత్రమే ఆయధి

(1). 43 అ 560.
(2). 6 మూ. ఇం. అ. 393.

కారమును న్యాయముగా చలాయించవలయును. వ్యవహారదక్షుడగు యజమాని వ్యవహారమును నడపురీతిగా సదుద్దేశముతో బదులు యిచ్చినవానికి నష్టముకలుగకుండ నుండునట్లు వ్యవహరింపవలయును. ఆస్తిపైని వచ్చినబాధను (pressure) తొలగించుట, దానికి సంభవించిన ఆపదను నివారించుట, లాభముకలుగ చేయుట, మొదలగు విషయములను గమనించి, వినియోగములను చేయవలసియుండును.

ప్రివికౌన్సిలువారియీ వాక్యములు దరిమిలాను చాల కేసులలో ఉదాహరణగా తీసుకొని ఈ వాక్యములమీదనే ఆధారపడి తమతీర్పులను వ్రాయుచువచ్చినారు కావున ఇవి చాల ముఖ్యములైనవి. ఈ వాక్యములు తనఖాతో సంబంధించినవైనను క్రయములకును సమష్టికుటుంబకర్త చేసిన వినియోగములకును కూడ చాల కేసులలో అన్వయింపచేసినారు(1).

పైతీర్పులోనే యీాదిగువ వాక్యములు కూడకలవు. బదులిచ్చువాడు, కర్త న్యాయమయిన యవసరముకొరకు బదులుపుచ్చుకొనుచుండెనా? లేదా? యని సదుద్దేశముతో దర్యాప్తు చేసి బదులిచ్చినప్పుడు అది చెల్లతగినది. ఆదర్యాప్తులో ఆతడు మోసపోయినను, ఆతనఖా చెల్లుట కభ్యంతరముండదు. నిజముగా అట్టి యవసరము లేకపోయినను, అది న్యాయమైనది కాకపోయిననుకూడ సదుద్దేశముతో బదులిచ్చినవానిసొమ్మునకు నష్టము రాకూడదు. అట్టిసందర్భములో ఆద్రవ్యము ఆయవసరముకొరకు ఖర్చుపడియెనా లేదా యని కూడ ఋణదాత చూడనక్కరలేదు. ఆకుటుంబ మేనేజిమెంటును తాను తీసుకొనినగాని ఆఋణదాత ఆద్రవ్యము ఎట్లు వెచ్చింపబడియెనో ఎట్లు చూడగలడు? ఋణదాత తగినజాగ్రతతోను, సదుద్దేశ

(1). 24 ఇం. కే (మ) 856; 132 ఇం. కే. 618; 14 బొం.లా.రి. 187; 39 అ 487; 21 వీ. రి. 196.

ముతోను ప్రవర్తించెనా? లేదా? యను విషయమునే ఆలోచించవలయునే కాని, ఆకనుకూడ మోసపోయినంతమాత్రమున ఆశ డిచ్చిన ద్రవ్యము పోకూడదు ఈ వాక్యములను దరిమిలాను ఒక కేసులో ప్రి. కౌ. వారు మరల స్థిరపర్చినారు(1).

కర్త, బదులుపుచ్చుకొనునప్పుడు గాని, వినియోగము చేయునప్పుడుగాని, చేయు షరతులు చాల న్యాయమైనవిగాను, వ్యాపార ధర్మము నతిక్రమింపకుండునట్టివిగాను ఉండవలయును. అట్లుండకపోయినచో కర్త తనయధికారమునకు మించి వ్యవహరించినాడని యర్థము అట్టివ్యవహారము చెల్లదు. ఆషరతులు పైనచెప్పిన మితికి లోబడియున్నవని రుజువుచేయుభారము బదులు ఇచ్చినవానిది అని ప్రి. కౌ. వారు ఒక కేసులో చెప్పియున్నారు ఈ వాక్యములు ముఖ్యములును గమనింపదగినవియు నై యున్నవి(2).

న్యాయమైన యవసరముకొరకును కుటుంబ లాభముకొఱకును తప్ప సమష్టి కుటుంబాస్తిని వినియోగము చేయకూడదు.

8. పైన 6 వ పేరాలో వ్రాసిన స్మృతివచనములను, 7 వ పేరాలో వ్రాసిన ప్రివికౌన్సిలువారి వాక్యములను బట్టి చూచినచో సమష్టికుటుంబాస్తిని, ఆపత్కాలమందును, కుటుంబపోషణకును, అవశ్యకర్తవ్యములకును, శ్రాద్ధాదులకును, తప్ప కుటుంబమెంబర్లందరియొక్క యనుమతి లేనిదే కర్త వినియోగము చేయకూడదనియు, పైనచెప్పిన కార్యములకు వారియనుమతితో నిమిత్తములేకుండ కర్తయొక్కడును వినియోగము చేయవచ్చుననియు స్పష్టమగుచున్నది. స్మృతులలో చెప్పబడిన కార్యముల నన్నిటిని వేరువేరుగా చెప్పనక్కరలేకుండ ప్రి. కౌ. వారును, ఇతరన్యాయస్థానములును న్యాయమైనయవసరము, కుటుం

(1) 182 ఇం. కే 613; 43 ఇం. కే (పా) 625.
(2). 1928 పి.కౌ. 64.

బలాభము అను రెండు వాక్యముల నుదాహరించుచున్నారు. వీటిని ఇంగ్లీషులో legal necessity, Benifit of the Estate or family అనియెదరు. న్యాయమైన యవసరముకొరకుగాని, కుటుంబలాభము కొరకుగాని, కర్త యొక్కడును వినియోగము చేసినను, అది మైనరు మెంబర్లనుసహా అందఱను బయిందు చేయుచు(1). కర్తచేసినవినియో గము, న్యాయమైనయవసరముకొఱకుగాని కుటుంబలాభముకొఱకు గాని, కానియెడల, అది వ్రాసియిచ్చినవారిని దక్క యితరులను బయిందు చేయదు మైనరు మెంబర్లను బయిందుచేయదు. కర్త వినియో గము చేసినప్పు డది న్యాయములైన వ్యవహారపుషరతులకు లోబడి యుండవలయును. వినియోగవిషయమున నివి ముఖ్యసూత్రములు.

స్మృతులలో కుటుంబలాభము కొరకు వినియోగము చేయ వచ్చునని చెప్పబడియుండలేదు కాని న్యాయస్థానములలో కుటుంబ లాభముకూడ చేర్చబడినది(2).

కర్త, కుటుంబాస్తిని తనఖాపెట్టినప్పుడు వడ్డీరేటును, షర తులును, న్యాయములైనవిగా నుండవలయును. లేనిచో, తక్కిన మెం బర్లను బయిండుచేయవు(3).

న్యాయమైనయవసరముగాని, కుటుంబలాభముగాని లేకుండ సమష్టికుటుంబాస్తిని కర్త వినియోగము చేసినప్పుడు, ఆయాస్తిలోని తమ భాగములను ఆవినియోగము బాధించదని తక్కిన మెంబర్లు దావా చేసి రద్దు చేయించుకొనవచ్చును. మదరాసు బొంబాయిరాష్ట్రములలో వినియోగము చేసినవాని భాగముమాత్రము రద్దుకానేరదు. కర్త,

(1). 133 ఇం కే.(లా)628; 125 ఇం.కే(లా) 881; 48 అ 560; 20 ఇం కే. 921.

(2). 74 ఇం. కే. 18; 63 ఇం. కే. 554.

(3). 50 ఇం. కే (ప్రి.కా.) 434; 71 ఇం. కే (ప్రి.కా.) 933; 118 ఇం. కే (బొ) 410.

తండ్రిగానున్నప్పుడు, పూర్వపురుణములకు ఆయన చేసినవినియోగము సమష్టికుటుంబమెంబర్ల నందరను బయిందుచేయును. తండ్రిచేసిన వినియోగమైనను, న్యాయమైన యవసరము, కుటుంబలాభము, పూర్వపురుణతీర్మానము, స్వల్పముగా దానము, ఈనాలుగు కార్యములకు తప్ప, అన్యథా వినియోగమైనచో యితరకర్త చేసినదానివలెనే దానిలోకూడ కుమారుడు తనవాటాలను బయిందుచేయకుండ రద్దు చేయించవచ్చును. బొంబాయి మదరాసు రాష్ట్రములలో అట్టి వినియోగములను పూర్తిగా రద్దుచేయుడని కోరుటకు హక్కులేదు. ఏమనిన ఆరాష్ట్రములలో సమష్టికుటుంబమెంబరు తనభాగమును యితరమెంబర్ల అంగీకారముతో నిమిత్తము లేకుండ విక్రయించుటగాని, తనఖాపెట్టుటగాని చేయవచ్చును. దానము విషయములోమాత్రము బొంబాయి మదరాసు రాష్ట్రములలో సైతము కుమారులవాటాలే కాకుండ తండ్రివాటాకూడ రద్దు అయిపోవును(1).

న్యాయమయిన యవసరమనగా నేమి?

9. న్యాయమైన యవసరములనగా నెట్టివి? ఈ ప్రశ్నకు సమాధానమిచ్చుట చాలకష్టము. సామాన్యముగా హిందూకుటుంబాచారములను వారిధర్మములను ఎఱింగినవారికి, ఏది న్యాయమైన యవసరమో? ఏదికాదో? తెలియకపోదు. ఆవిషయమున వారికి న్యాయస్థానముల సాహాయ్యమక్కర యుండదు. కాని దురాశాపరులగు కక్షిదారులు చీటికి మాటికి నీవిషయమున తగవులాడుచుండుటచే న్యాయస్థానములకు తీరనిపని కలుగుచున్నది. న్యాయమైనయవసరము అనుపదములో విధిగా లేక తప్పనిసరిగా అత్యావశ్యకమైన యవసర మనునర్థము

(1). 28 మ 89.

లేదు(1). ఈఖర్చు చేయకపోయినచో గొప్పయాపదగాని, నష్టము గాని కుటుంబమునకు వచ్చునని రుజువుచేసిననే తప్ప న్యాయమైన యవసర మనిపించుకొనదని చెప్పుటకుకూడ వీలులేదు. కుటుంబమునకు న్యాయముగా అవసరమైన ఖర్చు అంతయును న్యాయమైనయవసరముక్రిందకు వచ్చును(2). సామాన్యముగా న్యాయమని యెంచబడుచున్నకార్యము లీక్రింద చెప్పబడును. అన్నిటిని లెక్కించిచెప్పుట దుర్ఘటము కావున పాఠకులు వీటినిబట్టి తక్కినవిషయములను గ్రహింపవలయును. ఏది న్యాయమైన యవసరమో యేదికాదో యేకేసునకాకేసుసందర్భములనుబట్టి నిర్ణయింపవలయును(3).

1. దొరతనమునకు జమీందారులకు చెల్లించవలసినపన్నులు.
2. సమష్టికుటుంబమెంబర్లు, వారిభార్యలు, సంతానము, వీరిపోషణకగు ఖర్చులు.
3. సమష్టికుటుంబమెంబర్లయొక్కయు, వారికుమార్తెలయొక్కయు, వివాహవ్యయము, ద్విజులలో ఉపనయనమున కగు ఖర్చులు.
4. చనిపోయినవారి దహన శ్రాద్ధాదులకగు ఖర్చులు.
5. సమష్టికుటుంబాస్తిని సంరక్షించుటకును, పోయినదానిని తిరిగి రాబట్టుట కగు వ్యాజ్యపుఖర్చులు.
6. ఏదయిన గొప్పక్రిమినల్ కేసులో చిక్కువడియున్నప్పుడు సమష్టికుటుంబమెంబర్ల నందుండి తప్పించుట కగు న్యాయమైన ఖర్చులు.

(1). 54 ఇం. కే (పా) 208; 56 ఇం. కే (పా) 479; 57 ఇం. కే (క) 858; 1929 లా. 897 116 ఇం. కే (పా) 38.

(2). 57 ఇం. కే (క) 858.

(3). 29 ఇం. కే (ప్రి. కౌ.) 122; 24 మ 266; 29 ఇం. కే. (బొ) 567.

7. కుటుంబ వర్తకసంబంధములైన యప్పులు.

8. సమష్టికుటుంబముకొరకు చేయబడిన యప్పులు.

కాలదోషముపట్టిన యప్పులకు కుటుంబాస్తిని కర్త వినియోగముచేయుట న్యాయమైన యవసరమునుకాదు. కుటుంబలాభమును కాదు(1).

కుటుంబలాభముకొరకు చేయబడినకార్యములు న్యాయమైన యవసరములలో చేరునని లాహోరు హైకోర్టువారొక కేసులో చెప్పియున్నారు(2).

వినియోగముచేయుట, అప్పటికి అనుకూలముగా కనపడియెనని రుజువుచేసినంతమాత్రమున అది న్యాయమైన యవసరముకాదు. మైనర్లను బయిండుచేయదు(3).

కాలదోషము పట్టినయప్పులకు తండ్రి కుటుంబాస్తిని వినియోగము చేయవచ్చునని పా. హై. వారును, చేయకూడదని బొం. హై. వారును చెప్పియున్నారు(4).

కుటుంబమునకు క్రొత్తగా ఆస్తిని కొనుటకై కర్త, అప్పు చేయవచ్చును(5).

తనవిభక్తసోదరుని ఆర్థిక దుస్థితినుండి తప్పించుటకై తండ్రిచేసిన వినియోగ మాతని కుమారులను బయిండుచేయదు(6).

---

(1). 133 ఇం. కే (అ) 419; 41 బొం 347; 1926 అ. 248.

(2). 92 ఇం. కే (లా) 669.

(3). 78 ఇం. కే (బొం) 1017

(4). 41 బొం 347; 1931 పా 40; 85 అ 207; 89 ఇం. కే. 28;

(5). 43 ఇం. కే (పా) 625;

(6). 48 ఇం. కే (పా) 228; 68 ఇం కే (మ) 216; 75 ఇం కే (అ) 872; 138 ఇం. కే(లా) 642

తండ్రిచేసిన పూర్వపురుణములకు, (అవి తండ్రి స్వంతముకొరకు చేసినవైననుసరియే) తండ్రి వినియోగముచేసినప్పుడు అది న్యాయమైన యవసరముకొరకు చేసినట్లే యెంచబడును. అయితే, యీసూత్రము తండ్రికానట్టి కర్తకు అన్వయించదు. తండ్రికానట్టి కర్త పూర్వపురుణములకని వినియోగముచేసినప్పుడు ఆరుణములు న్యాయమైన యవసరముకొరకు చేయబడినట్లు రుజువుకావలయును. తండ్రికివలె పూర్వపురుణములుకదా యని న్యాయమైనయవసరమనుభావనరాదు. తండ్రిచేసినట్టి అపూర్వపురుణములైనను, న్యాయశాస్త్రసమ్మతములుకానివిగాను దుష్ప్రవర్తనకొరకుచేసినవిగాను యుండకూడదు(1). చీటీఫండు వ్యవహారములకై ఆస్తిని తనఖాపెట్టుట న్యాయమైన యవసరముకాదు (2).

పన్నులు.

**10.** గవర్నమెంటువారు పన్నుకొరకు చరాస్తి జప్తుచేయునప్పుడు అందుకొఱకు కర్తపెట్టిన తనఖా, చెల్లతగినది. అది న్యాయమయిన అవసరము(3). ద్రవ్యము నిలువ యుండగా పన్నుల కొరకని తనఖాపెట్టుట న్యాయమైన యవసరము కానేరదు(4).

---

(1). పూర్వపురుణములనగా సెట్టినియో 7 వ ప్రకరణమున తెలుపబడును. 31 అ 176; 18 క 21; 1932 బొం 438; 47 అ 795 (ప్రి. కౌ.)

(2). 1927 మ 778.

(3). 37 ఇం. కే (అ) 1035; 25 అ 407; 29 క 797; 37 ఇం. కే (బొ) 1035

(4). 1928 (అ) 65.

11. సమష్టికుటుంబాస్తి విషయమై యేవేని తగవులువచ్చినప్పుడు, వాటిని నివారించుటకొరకయ్యెడు వ్యాజ్యపు ఖర్చులు న్యాయమైన యవసరమగును(1). ఆస్తిని సంరక్షించుటకొరకు అయిన ఖర్చులుమాత్రమే న్యాయమైన యవసరమగును. మరియొక ఆస్తిని రాబట్టుటకొరకయ్యెడు ఖర్చులు న్యాయమైన యవసరముకాదు(2).

వ్యాజ్యపు ఖర్చులు.

12. పిల్లలసంరక్షణకొరకుచేసిన వినియోగము న్యాయమైన యవసరము. పిల్లల విద్యకొరకు ప్రత్యేక మొకగృహము కట్టించుట న్యాయమైన అవసరము కానేరదు(3). సోదరునిభార్యకు జీవనాంశముకొఱకు కుటుంబాస్తిలో న్యాయమైనంతభాగమును సంపూర్ణహక్కులతో ఆమెకు యిచ్చివేయుటకు కర్త కధికారము కలదు(4) కుటుంబసంరక్షణముకొరకు తండ్రి చేసిన వినియోగము చెల్లతగినది(5). కుటుంబముపై ఆధారపడియున్న బంధువులను సంరక్షించుటకూడ న్యాయమైన యవసరమగును(6).

మెంబర్ల సంరక్షణము.

ఒకమెంబరు, తనభార్యకు జీవనాంశముకొరకు, తక్కినమెంబర్ల అంగీకారముతో తనవాటాలోని కొంత ఆస్తిని దానమిచ్చినచో అది చెల్లుట కభ్యంతరముండదు(7).

(1) 95 ఇం. కే (నా) 707; 12 క 389.

(2). 97 ఇం. కే (క) 149; 86 ఇం. కే (అ) 769; 1924 (నా) 1; 45 అ 390

(3). 90 ఇం. కే 594;

(4) 180ఇం. కే (మ) 460

(5) 101ఇం. కే (మ) 571

(6). 80 ఇం. కే (అ) 31

(7). 1931 మ 106

సమష్టికుటుంబమెంబర్లను, వారికుటుంబమును పోషించుట కయ్యెడివ్యయము న్యాయమైన యవసరమగును(1).

13. గృహము మరమ్మతుచేయుటకయ్యెడిఖర్చు న్యాయమైన యవసరము. ఋణదాత, గృహమును మరమ్మతు చేయుట కెంతయగునో యస్టిమేటుచేసిచూడనక్కరలేదు(2). కాపురముండుటకై గృహమును నిర్మించుట న్యాయమైన యవసరమగును(3).

ఆస్థిసంరక్షణము.

14. కర్తగాని, మరియొకమెంబరుగాని, ఏదయిన క్రిమినలు కేసులో, ముద్దాయిగా నున్నచో, అతనిని తప్పించుటకొరకు అయ్యెడి ఖర్చు కుటుంబముయొక్క న్యాయమైన యవసరముగా నెంచబడును. అతనికి శిక్షపడినయెడల, కుటుంబముయొక్క ప్రతిష్ఠకు భంగకరము కావున, ఆఖర్చు న్యాయమైన యవసరమనియు, దానికొరకుచేసిన వినియోగము అందరను బయిండు చేయునవియు తీర్మానించిరి. ఆ క్రిమినల్ కేసులో తీర్మానము వ్యతిరేకమై ఆమెంబరు శిక్షింపబడినను, ఆఖర్చు న్యాయమైన యవసరము కాకపోదు(4). కొన్ని కేసులలో ఇందుకు వ్యతిరేకములైనతీర్పు లున్నవి. కర్త, హత్యకేసులో ముద్దాయిగానుండి వాదించుటకయ్యెడిఖర్చునకు సమష్టికుటుంబాస్తిని తనఖా

క్రిమినల్ కేసుల కయ్యేను ఖర్చులు

(1). 6 అ 417

(2). 90 ఇం. కే (లా) 148.

(3). 85 ఇం. కే. 826.

(4). 148 ఇం. కే (డా) 683; 139 ఇం. కే (డా) 64; 24 ఇం. కే (మ) 356; 52 ఇం. కే (పా) 734; 83 అ 472; 71 ఇం కే (అ) 749; 84 అ 4; 1 పా 171; 52 ఇం. కే 964.

పెట్టినప్పుడు అది యితరమెంబర్లను బయిండు చేయదు. వారి యంగీకారమున్నట్లు తోచినప్పుడుమాత్రము బయిండు చేయును(1). తండ్రి యితరునిమీాద అక్రమముగా దురుద్దేశముతో ఒక క్రిమినల్ కేసును తెచ్చెను. అందుకొరకై తండ్రిమీాద నష్టమునకు డిక్రీయిచ్చిరి. ఆడిక్రి మొత్తము న్యాయమైన యవసరముక్రిందకు రాదనియు, అది కుమారులను బయిండు చేయదనియు తీర్మానించిరి(2). ఒకమెంబరు, తనపైన వచ్చిన క్రిమినల్ కేసులో వాదించుటకు ఖర్చులనిమిత్తము సమష్టి కుటుంబద్రవ్యమును వాడుకొనవచ్చును(3). తండ్రి నమ్మకద్రోహము చేసి, అందుకుగాను తనపైని కేసురాకుండుటకై ఆవ్యవహారమును ఫయిసలా చేసికొనుసందర్భములో కొంత ఆస్తిని వినియోగము చేసెను. ఆవినియోగము కుమారులను బయిండు చేయదని తీర్మానించిరి(4). క్రిమినల్ కేసులో విధింపబడిన జరిమానాను చెల్లించుటకై తండ్రిపెట్టిన తనఖా కుమారుని బయిండు చేయదు(5).

**15.** ద్విజులలో పురుషులకు వివాహమొనర్చిననేగాని, కులభ్రష్టులగుదురనునియమము లేదు. కావున పురుషులవివాహపుఖర్చులకుగాను చేసిన వినియోగములు, ఆదస్తావేజులలో చేరిన మేజరుమెంబర్ల భాగములనేగాని, తక్కినవారిభాగములను బాధించవని మొట్టమొదట మ. హై. వారు తీర్పు యిచ్చినారు(6). కాని ఆవిషయమున నింకొక కేసులో సందేహపడినారు(7).

వివాహవ్యయము.

(1). 39 ఇం. కే (పా) 665.
(2). 1924 (పా) 465.
(3). 1919 (పా) 451.
(4). 140 ఇం. కే (లా) 220.
(5). 15 మ. లా. టు. 372.
(6). 27 మ 406.
(7). 34 మ 422.

బొంబాయి హైకోర్టువారు, మ. హై. వారి మొదటితీర్పునకు వ్యతిరేకాభిప్రాయమిచ్చినారు(1). బ్రహ్మచారిగా గాని, సన్యాసిగా గాని, కాలముగడుప నిచ్ఛలేని ద్విజులకు వివాహము తప్పనిసరి కావున అందుకొఱకు చేయబడినఋణము సమష్టికుటుంబాస్తులమీాద బయింండు అగునని మ. హై. ఫుల్ బెంచిలో తీర్మానింపబడినది(2). తండ్రి తననాల్గవవివాహముకొఱకు చేసిన తనఖాఋణము న్యాయమైన యవసరము కాదనియు అది కుమారుని బయిండు చేయదనిరి(3).

సమష్టికుటుంబమెంబర్లయొక్క ఆడపిల్లలవివాహవ్యయము న్యాయమైనయవసరమగును. అందుకొఱకు సమష్టికుటుంబాస్తిపైని బాధ్యతకూడ కలదు(4). విభక్తసోదరుని కుమార్తె వివాహవ్యయము న్యాయమైనయవసరముకాదు(5).

సోదరివివాహమునకై చేసిన ఋణముగాని, వినియోగముగాని చెల్లనేరదని మేజరైనను, మైనరైనను చెప్పవీలులేదు. ఆ సందర్భములో గార్డియను చేసినవినియోగము, మైనరును బయిండు చేయును(6). ఒకకుటుంబమున 'క' యును అతని సోదరుని కుమారుడు 'చ' యు నుండిరి. 'క' తనకుమార్తెవివాహసమయమున నామెకు మొత్తమాస్తిలో పదియవవంతు పసపుకుంకుమక్రింద నిచ్చెను.

---

(1). 32 బొం 81; 32 అ 575.

(2). 17 ఇం. కే (మ. ఫు.) 308; 65 ఇం. కే (పా) 315; 19 ఇం. కే. 835.

(3). 1930 (నా) 282.

(4). 23 మ 512; 26 మ 497: 55 మ 728; 28 ఇం. కే (మ) 264; 11 బొం 605; 36 అ 158.

(5). 79 ఇం. కే (అ) 69.

(6). 85 ఇం. కే (లా) 741; 125 ఇం. కే (లా) 50; 110 ఇం. కే. 482; 38 ఇం. కే (ఔ) 601; 140 ఇం. కే (ఔ) 556; 22 ఇం. కే (అ) 688;

ఆదానము 'చ' ను బయిండు చేయును(1). మొత్తముకుటుంబాస్తి 200 యకరములభూమి యున్నప్పుడు, ఎనిమిదియకరముల భూమిని తండ్రి తనకుమారుల యంగీకారము లేకపోయినను, తనకుమార్తె కిచ్చెను. ఆదానము చెల్లునని తీర్మానించిరి(2). తండ్రి జీవించియుండగానే కుమార్తెలకు వివాహముచేసెను. కాని కొన్ని కారణములచే వివాహసంబంధమైన యేర్పాటులను ఆయన పూర్తిచేయలేదు. ఆయన యనంతరము పెద్దకుమారుడు కర్తయై సోదరీలకు కొంత ఆస్తినిచ్చెను. అది చెల్లుననియు తక్కిన మెంబర్లను బయిండుచేయుననియు తీర్మానించిరి(3).

తండ్రివంకబాంధువులు ఆడపిల్లకు వివాహము చేయనియెడల మేనమామ వివాహముచేసి, ఆఖర్చును తండ్రి ఆస్తిని స్వాధీనమునందుంచుకొనియున్న సన్నిహితులవలన రాబట్టుకొనవచ్చును(4).

క. తండ్రి, చ. కుమారుడు. చ. ముందుగా చనిపోయెను. చ. కు ఒకకుమార్తె కలదు. ఆమెకు వివాహముచేయకుండ క. చనిపోయెను. అతనియాస్తి అతని వారసులకు దఖలుపడినది. చ.యొక్క కుమార్తె వివాహపుఖర్చులు, క.యొక్క ఆస్తిపైని బాధ్యత యగునని తీర్మానించిరి(5).

ఒకడు తనవివాహకాలమందు తనభార్య జీవనాంశముకొరకు కొంత ఆస్తినిచ్చెను. అది యాతని కుమాళ్ళను మనుమలను కూడ బయిండుచేయునని పా. హై. తీర్మానించిరి(6).

(1). 30 ఇం. కే (ము) 782.
(2). 35 మ 628.
(3). 17 మ. లా. జ. 528.
(4). 1932 లా 129.
(5). 131 ఇం. కే (లా) 351.
(6). 57 ఇం. కే (పా) 341.

16. సమష్టికుటుంబమునకు పూర్వమునుండి యున్న వర్తకము సాగించుటకై కర్తయైనను తండ్రియైనను అప్పులను చేయవచ్చును. కుటుంబాస్తిని తనఖా, లేక క్రయము చేయవచ్చును(1). కాని వారు క్రొత్తవర్తకమును ప్రారంభింపకూడదు. క్రొత్తవర్తకమునకై చేసిన యప్పులును వినియోగములును తక్కిన మెంబర్లను బయిండుచేయవు(2). తండ్రిమాత్రము క్రొత్తవర్తకమును ప్రారంభింపవచ్చుననియు, అందు కొఱకాతడు చేసిన యప్పులును ఆస్తి వినియోగములును కుమాళ్ళను బయిండుచేయుననియును కొన్ని కేసులలో తీర్మానింపబడినది(3). కాని ఈనడుమ ప్రివికౌన్సిలువారొక కేసులో ఈవిషయమున తండ్రికిని యితరకర్తకును భేదము లేదనియును, తండ్రి కూడ క్రొత్త వర్తకమును ప్రారంభింపరాదనియు, తీర్మానించియున్నారు(4) వర్తకసంబంధములైన యప్పులలో తండ్రికిని యితర కర్తకునుగల భేదమును పాఠకులు గమనింపవలసియున్నది. ప్రి. కౌ. వారి తీర్మానము ననుసరించి, క్రొత్తవర్తకమును ప్రారంభించుటకై

వర్తకసంబంధములైన యప్పులును వినియోగములు.

(1) 22 ఇం. కే (మ) 638; 6 మూ. ఇం. అ. 393; 118 ఇం. కే (బొం) 353; 87 ఇం. కే (అ) 27; 101 ఇం. కే (ప్రి.కౌ.) 373; 132 ఇం. కే (ప్రి.కౌ.) 613; 21 అ 71; 5 క 79; 21 అ 83; 31 మ.లా.జ.(ప్రి.కౌ)665;79 ఇం. కే (అ) 517 2 ఇం. కే (బొం) 173; 114 ఇం. కే (అ) 743; 341; 112 ఇం. కే (అ) 681;

(2). 119 ఇం. కే (పా) 405; 43 ఇం. కే (డొ) 554; 67 ఇం. కే (ప్రి.కౌ.) 124; 47 బొం 637; 45 మ 281; 92 ఇం. కే (మ) 977; 46 అ 364; 50 మ 421; 6 క. వీ. నో. 419; 34 బొం 72; 32 ఇం. కే (డొ) 380; 1928 అ 447; 1929 (పా) 130; 27 ఇం. కే 567.

(3). 52 బొం 376; 41 మ 824; 46 అ 364; 50 అ 776; 1929 (లా) 687; 1930 (నా) 10; 50 మ. లా జ. 208; 81 ఇం. కే (బొం) 301; 52 మ 227. 137 ఇం. కే (బొం) 717;

(4). 137 ఇం. కే (ప్రి.కౌ.) 781. ఈతీర్పువెని, అ. హై. వారి యభిప్రాయము నకు 140 ఇం. కే 509. చూడవలయును. 36 క. వీ. నో. 826.

సమష్టికుటుంబాస్తిని వినియోగము చేసినప్పుడు, అది కర్త చేసినను తండ్రి చేసినను కూడ చెల్లనేరదు. ఆస్తిని వినియోగము చేయకుండ, కర్త అప్పులను తెచ్చి క్రొత్తవర్తకమును ప్రారంభించెననుకొనుడు. ఆయప్పులు తక్కినమెంబర్లను బయిండు చేయవు. ఆస్తిని వినియోగము చేయకుండ, తండ్రి అప్పులను తెచ్చి క్రొత్తవర్తకమును ప్రారంభించినప్పుడు, ఆయప్పులు పూర్వపురుణములను కారణముచేతను, అశాస్త్రీయములైన రుణములు కాకపోవుటచేతను అవి కుమారులను బయిండు చేయును. ఆరుణములకు దరిమిలాను తండ్రి సమష్టికుటుంబాస్తిని వినియోగము చేసినను అది చెల్లుటకభ్యంతర ముండకపోవచ్చును. పైనచెప్పిన పి. కా. కేసులో ఈ వాదమువచ్చినది. కాని అందుపై వారేమియు నభిప్రాయ మీయలేదు. కుటుంబాదాయము, కుటుంబసంరక్షణకు చాలకపోవుటచే, కర్త కుటుంబాస్తిని తనఖాపెట్టి ఒకలొట్టియ (Camel) ను, కొని సరకులను మోయుటకు అద్దెకిచ్చి దానితో మరికొంత ఆదాయమును సమకూర్చుచుండెను. కర్త చేసిన యీకార్యము చాల వివేకముతో కూడినపనియనియు, ఈతనఖా చెల్లుననియు, కర్త క్రొత్తవర్తకమును ప్రారంభింపకూడ దనుసూత్రమిట్టికార్యములకు వర్తించదనియు అ. హై. తీర్మానించిరి(1).

తండ్రి స్పెక్యులేటివు వ్యాపారముచేసి, అందులో నష్టపడి, అందుకొరకు రుణముచేసి, కుటుంబాస్తిని తనఖాయిచ్చినచో, అది చెల్లుననియు, ఆరుణము దుష్ప్రవర్తనక్రిందకుగాని అవ్యావహారికరుణముక్రిందకుగాని రాదనియు తీర్మానింపబడినది(2).

కుటుంబము, సామాన్యముగా వర్తకము చేయుకుటుంబమైనప్పుడు తండ్రి, క్రొత్తవర్తకము చేయుటకొరకు తనఖాయిచ్చి బదు

(1). 133 ఇం. కే (అ)412.

(2). 107 ఇం. కే (పి. కా.) 29; 90 ఇం. కే. (పా) 553; 89 ఇం. కే (లా) 1022; 124 ఇం. కే (నా) 453. 106 ఇం. కే (బొ) 392;

లు తెచ్చినచో, ఆతనఖా చెల్లుననియు, ఆవర్తకము పూర్వమునుండియు వచ్చెడివర్తకము కాదను కారణముచే నది రద్దుచేయకూడదనియు కొన్ని కేసులలో తీర్మానింపబడినది(1)

వర్తకకుటుంబము కాకుండునప్పుడు, తండ్రి స్వకృత్యేటిప్ర వ్యాపారముచేసి, అందుకొఱకు సమష్టికుటుంబాస్తిని తనఖా పెట్టిరేని కుమాళ్ళభాగము బయిండుకాదు(2).

సమష్టికుటుంబద్రవ్యముతో క్రొత్తవర్తకమును ప్రారంభించిన ప్రారంభింపవచ్చును. కాని మైనరుమెంబర్లున్నప్పుడు తండ్రిఅయినను సరియే క్రొత్తవర్తకమునకై ఆస్తిని వినియోగము చేయకూడదు(3).

పినతండ్రి క్రొత్తగా వర్తకము ప్రారంభించి Wagering Contracts చేసెను. అన్నకొడుకుకు తాను గార్డియనుగా జిల్లా కోర్టువారివలన నియమింపబడి కోర్టు వారిశాంక్షనుపొందిన స.కు. ఆస్తిని ఆవర్తకమునకై తనఖాపెట్టెను. కోర్టువారిశాంక్షనును పొందినను, ఆతనఖా మైనరును బయిండుచేయదని(4).

17 తండ్రియైనను, కర్తయైనను, కుటుంబాస్తినసుసరించి, న్యాయమైనంతస్థిరాస్తిని ధర్మకార్యములకు వినియోగము చేయవచ్చును(5). తండ్రి తనకంటె భాగ్యవంతుడైన

ధర్మకార్యములు

యొకబ్రాహ్మణునకు కుటుంబాస్తిలో ఎనిమిదవవంతును దానమిచ్చెను. అది చెల్లదని తీర్మానించిరి(6). మతసంబంధమైన

(1). 128 ఇం. కే (లా) 366; 79 ఇం. కే (అ) 517;117 ఇం.కే (మ) 716 క్రొత్తగా జిన్నింగు ఫ్యాక్టరీపెట్టెను 102 ఇం. కే (మ) 680; 49 ఇం కే (మ) 220.

(2). 119 ఇం. కే (లా) 239

(3). 112 ఇం. కే (అ) 881.

(4). 114 ఇం. కే 748.

(5). 1931 లా 289;

(6), 1929 అ 865.

కార్యములను చేయుసందర్భమున దేవతావిగ్రహమునకు కర్త సమష్టి కుటుంబాస్తినను సరించి కొంత దానపూర్వకముగా నీయవచ్చును. అది తక్కిన మెంబర్లను బయిండు చేయును(1). కర్త కుటుంబములోని బంధువులకు బంధుత్వముననుసరించియును, కుటుంబాస్తిననుసరించియును కొంచెముఆస్తిని దానమీయవచ్చును(2). కాని బంధువులు కానివారలకును, తన కెంతయుపకారము చేసినవారికైనను, శ్రాద్ధాదులయందు దక్క యితరులకును కర్త దానమీయకూడదు(3). 'క' అనువాడు తనతండ్రి శ్రాద్ధమునకై పండ్రెండవరోజున నలువది సెంట్ల భూమిని పిండములయొద్ద దానమిచ్చెను. అది చెల్లదని 'క' యొక్క కుమారులు దావా తెచ్చిరి. కాని కోర్టువారు ఆదానమిచ్చుటకు 'క' కు అధికారముకలదని తీర్మానించిరి(4).

కర్త, తన దౌహిత్రునకు కొంచెముగానైనను సమష్టికుటుంబాస్తిని తక్కిన మెంబర్లయంగీకారము లేనిదే యివ్వకూడదు. అట్లిచ్చినచో చెల్లదు(5).

18. సమష్టికుటుంబాస్తిని న్యాయమయిన యవసరముకొరకు కర్త వినియోగము చేయవచ్చునని తెల్పుచు న్యాయములైనయవసరములనగా నెట్టివియో చెప్పబడినవి. అయితే సమష్టికుటుంబాస్తిని విక్రయించునప్పుడు ఆక్రయధనము, అవసరకార్యములకొరకు ఖర్చుపడినను, అప్పుడా క్రయము చేయవలసినంత యవసరమున్నదా? లేదా?

వినియోగమునకు న్యాయమైన అవసరసమయము.

(1). 49 ఇం. కే. (మ) 742; 101 ఇం. కే (ప్రి. కౌ.) 79; 8 అ 76; 16 మ 853; 43. అ 560.

(2). 1927 నా 97.

(3). 1929 అ 854.

(4). 49 ఇం. కే. (మ) 742.

(5). 98 ఇం. కే. (బొ) 1047.

యనువిషయముకూడ విచారణీయము. ఏదియో కొంత న్యాయమైన యవసరమైనఖర్చు కలదుకదా యని కర్త, ఆస్తిని విక్రయింపకూడదు. ఆకుటుంబముయొక్క స్థితిగతులననుసరించి, అప్పుడావిక్రయము చేయుట అవసరమగునా కాదా యని, విచారణ చేయవలయును. ఆకాలమున విక్రయముచేయుట, కుటుంబమునకు లాభకరమని తోచిననేతప్ప, విక్రయముచేయరాదు(1).

ముందు అవసరమువచ్చునని యెంచి వినియోగము చేయకూడదు(2). తండ్రికి రుణములున్నవని రుజువుచేసినంతమాత్రమున అతడుచేసిన వినియోగము చెల్లునని చెప్పరాదు. ఆరుణములకు ఆస్తినివినియోగముచేయవలసినంతతొందర వచ్చినదనికూడ రుజువుచేయవలయును(3).

తండ్రి కుటుంబాస్తిని తనఖాబాకీక్రింద విక్రయించెను. ఇంచుమించుగ మూడుసంవత్సరములవరకును ఆతనఖాబాకీకి వాయిదాయున్నప్పుడు తొందరపడి విక్రయించి, ఆసొమ్ము క్రయదారునివద్ద నిలవయుంచెను. ఆవిక్రయము చెల్లతగనిదని తీర్మానించిరి(4).

తండ్రి పూర్వపురుణములకు సమష్టిఆస్తిని విక్రయించినప్పుడు, ఆరుణదాతలు తొందరకలుగచేయ లేదనియు, అందుచే అప్పట్లో ఆవిక్రయముచేయనవసరము లేదనియు, అందుచే అది చెల్లదనియు, వాదించుటకు కుమారులకు హక్కులేదు. పూర్వపురుణములతో సంబంధిం

(1). 106 ఇం. కే. (బొం) 79

(2). 3 లా. లా. జ. 484;

(3). 73 ఇం. కే (అ) 1010

(4). 121 ఇం. కే (అ) 385

చిన కేసుకాదనుకారణముచే పైనవ్రాసిన అ. హై. తీర్పును మ. హై. వారంగీకరించ లేదు(1).

ఒక కేసులో ఆ స్త్రీని విక్రయించుటకంటె తనఖాపెట్టుటయుంచి దనియు కర్త అట్లుచేయలేదు. కావున ఆవిక్రయము చెల్లదనియు వాదించిరి. కాని ఆవిషయమై కర్తకు స్వాతంత్ర్యముండవలయుననియు దానిని ఆక్షేపించరాదనియు ఆకేసుసందర్భమునుబట్టి ప్రి. కౌ. వారు తీర్మానించిరి(2).

క్రయధనములో కొంతమాత్రమే న్యాయమైన యవసరముకున్నప్పుడు.

19. క్రయధనములోగాని, తనఖాసొమ్ములోగాని, కొంత సొమ్మమాత్రమే న్యాయమైన యవసరముకొరకు వినియోగమైనప్పుడు, ఆవినియోగము చెల్లునా ? చెల్లదా ? యను విషయమున హైకోర్టులలో భిన్నాభిప్రాయములుండెడివి. క్రయధనములో ఎంతస్వల్పమొత్తమునకు న్యాయమైనయవసరము కన్పింపకపోయినను, ఆక్రయము చెల్లనేరదని చాలకేసులలో అ. హై. తీర్మానించియున్నారు. కాని కొన్ని కేసులలో ఈరూలుయొక్క కాఠిన్యమును తగ్గించినారు(3). క్రయధనములో చాలభాగము న్యాయమైన

(1). 121 ఇం. కే (మ) 837; 1931మ 615;

(2). 101 ఇం. కే (ప్రి. కౌ). 373.

(3). 25 అ 380; 27 అ 494; 46 అ 531; 72 ఇం. కే. (అ) 134; 82 ఇం. కే. 68; 90 ఇం. కే. 988; 83 ఇం. కే. (అ) 838; 80 ఇం. కే.(అ) 226; 86 ఇం. కే. (అ) 91; 48 అ 592; 48 అ 183; 47 (అ) 355; 83 ఇం. కే. (అ) 32; 1922 (అ) 321; 43 ఇం. కే. (మ) 358; 44 అ 688; 88 ఇం. కే. 54, & 32; 98 ఇం. కే. 824.

యవసరముకొరకు వినియోగమైనచో, ఆక్రియము చెల్లునని మ.హై. తీర్మానించిరి(1). కలకత్తా, బొంబాయి హైకోర్టులు, సామాన్యముగా మద్రాసుహైకోర్టువారితో ఏకీభవించినారు(2).

ప్రివికౌన్సిలు వారొక కేసులో ఈవిషయమునుగూర్చి చక్కగా విమర్శించి, గిరిధరలాల్ కేసులోను, హనుమాన్ ప్రసాద్ కేసులోను చేసినరిమార్కులను అనుసరించుచు అలహాబాదు హైకోర్టుతీర్పులు సరియైనవికావని యభిప్రాయమొసంగి, క్రయము అవసరముకొరకు చేయబడినట్లును, ఆవశ్యకమునుగూర్చి క్రయదారు తృప్తికరముగులాగున దర్యాప్తు చేసినట్లును, క్రయధనము మిక్కిలి తక్కువగా లేదనియును బుజువైనచో క్రయధనములో స్వల్పభాగమునకు న్యాయమైన యవసరమును చూపలేకపోయినను, ఆక్రియమును రద్దుచేయకూడదని తీర్మానించిరి(3). ఈతీర్పుతో వెనుకటి అలహాబాదుతీర్పులన్నియు రద్దుఅయినవి. దరిమిలాను చాలకేసులలో ఈతీర్పును అనుసరించియున్నారు(4). న్యాయమైన యవసరమున్నదని స్పష్టమైనప్పుడు క్రయధనము తా॥ ప్రతిపద్దును సరిగా ఖర్చుపడినదని క్రయదారు రుజువుచేయనక్కర లేదు(5). పైన వ్రాసినవిషయములు

(1) 47 మ. లా. జ. 565; 1928 మ 450; 16 మ. లా. జ. 595; 1928 మ. 120.

(2) 17 ఇం. కే. (క) 577; 130 ఇం. కే. (బొం) 594; 72 ఇం. కే. (లా) 448; 74 ఇం. కే. (క) 612.

(3) 100 ఇం. కే. (ప్రి.కౌ.) 130;

(4) 101 ఇం. కే. (ప్రి. కౌ.) 373; 107 ఇం. కే. (ప్రి. కౌ.) 4; 116 ఇం.కే. (ప్రి. కౌ.) 605. 122 ఇం. కే. (అ) 744; 122 ఇం. కే. (లా) 480; 1929 అ 503; 1928 ఔ 465.

(5) 120 ఇం. కే. (అ) 549; 133 ఇం. కే. (లా) 628;

సులభముగా బోధపడుటకై ముఖ్యములగు కొన్ని తీర్పులసార మిట వ్రాయబడుచున్నది.

(1) కర్త, రు 6000 లకు విక్రయముచేసెను. అందులో రు 3281 లు న్యాయమైన అవసరముకొరకు ఖర్చుపడెనని తేలినది. క్రయదారు క్రయముయొక్క ఆవశ్యకమును ఋజువుపర్చలేకపోయెను. ఆక్రయమునురద్దుచేసి, రు 3281-0-0 లును క్రయదారునకిచ్చునట్లు తీర్మానించిరి. 126 ఇం. కే. (అ) 230.

(2) రు 300 లకు 3 ప్రతులు కర్త విక్రయించెను అవసరము నూరు రూపాయలుమాత్రమే. రెండుప్రతులను విక్రయించినచో అవసరముతీరిపోవును. మూడవప్రతిని విక్రయించుట ఆవశ్యకముకాదనియెంచి, ఆప్రతిని క్రయములోనుండి తప్పించి, వాదులస్వాధీనముచేసిరి. 126 ఇం కే. (అ) 361.

(3). తండ్రి రు 11000 లకు తనఖాపెట్టెను. అందులో రు 2486-2-8 లకు న్యాయమైన అవసరముగాని, పూర్వపురుణముగాని యున్నట్లు రుజువు పడలేదు. ఆమొత్తము మయినరుకుమాళ్లను బయింకుచేయదని క్రిందికోర్టులు తీర్మానించినవి. ఆతీర్మానముపైని గ్రాసుఅప్పీలు లేనందున ప్రివికౌన్సిలుతీర్మానము వర్తింపవలసియున్నను వర్తింపచేయలేదు. 120 ఇం. కే. (నా) 326.

(4) తండ్రి రు 10000/-లకు ఆ స్తిని తనఖాపెట్టెను. రు 9800 లకు న్యాయమైనయవసరమున్నది. తక్కినదికూడ న్యాయమైన యవసరముకొరకే యని యెంచవచ్చునని తీర్మానించిరి. 121 ఇం. కే. (అ) 221.

(5). రు 10767-7-0 లకు క్రయము. రు 7744-8-0 లు న్యాయములైన పూర్వపురుణములున్నట్లు కనబడినది. క్రయముచెల్లు

ననియు, తక్కిన మొత్తమునకు క్రయదారు ఏమియు రుజువు చేయనక్కర లేదనియు, తీర్మానించిరి. 116 ఇం. కే (ప్రి. కౌ.) 605.

(6). తండ్రి రు 6400 లకు ఆస్తిని తనఖాపెట్టెను. పూర్వపుడిక్రీ రుణమును తీర్మానించుటకు రు 5762-10-0 లు ఖర్చుపడెను. తక్కిన 637-6-0 లు తనఖాయిచ్చినరోజున పుచ్చుకొనియెను. ఈసొమ్ము న్యాయమైనయవసరముకొరకని యెంచవచ్చునని తీర్మానించిరి. 115 ఇం. కే. (పా) 886.

(7) రు 4000 లకు క్రయము. రు 2600 లకు న్యాయమైన యవసరము రుజువైనది. మిగిలినదానిలోనుండి చిల్లరరుణములు, కొన్నితీర్చినట్లు కొంతసాక్ష్యముండెను. ఈక్రయము చెల్లునని తీర్మానించిరి. 114 ఇం. కే. (బొం) 245.

(8). రు 11000 లు కిమ్మతుగలఆస్తిని రు 1000 లకు మేనమామకు విక్రయించెను. ఆక్రయముచెల్లదని కుమారులు దావా తెచ్చిరి. ఆ రు 1000లునుపూర్వపురుణమును తీర్మానించుటకై వినియోగించెను. ఆసొమ్ము కుమారులు యిచ్చుపద్ధతిని క్రయము చెల్లదని తీర్మానించిరి. 27 మ. 162.

పైనను దాహరించిన తీర్పులనుబట్టిచూచినచో స్వల్పమొత్తములకు న్యాయమయినయవసరము కన్పింపకపోయినను, వినియోగము చెల్లవచ్చుననుసూత్రము క్రయములకును తనఖాలకును కూడ వర్తింపచేయుచున్నట్లు కనపడుచున్నదికాని, ఈసూత్రము క్రయములకేగాని, తనఖాలకు వర్తించదనియు, సొమ్ము ఎంతయవసరమో కర్తకు తెలిసియుండును కావున, అంతమొత్తమునకే తనఖాపెట్టవచ్చుననియు, కావలసినమొత్తమునకు సరిపడిన ఆస్తిని విక్రయించుట దుర్ల

భము కావున ఆసూత్రము క్రయములకు మాత్రమే వర్తించుననియు ఫుల్‌కోర్టువారు తీర్మానించిరి(1).

వినియోగము చేసినకాలమునకు దావావచ్చినప్పుడు, న్యాయమయిన యవసరమున్నదా లేదా యనుప్రశ్న విచారణీయముకాదని కొన్ని తీర్పులున్నవి(2).

కుటుంబలాభమనగా నెట్టిది?

20. కర్త, సమష్టి కుటుంబాస్తిని కుటుంబలాభముకొరకు వినియోగము చేయవచ్చును. స్మృతులలో ఆపత్కాలమందును, కుటుంబపోషణకును, శ్రాద్ధాది ధర్మకార్యములయందును అని మాత్రమే యున్నది. కాని హనుమాన్ ప్రసాద్ కేసులో ప్రి. కౌ. వారు, కుటుంబలాభముకొరకును అనికూడ చేర్చియున్నారు. అయితే మరియొకసారి ప్రి. కౌ. వారు కుటుంబలాభమనగా కుటుంబముపైన వచ్చిన ఆపత్తును సమర్థించుకొను స్వభావముగల తరగతి (Defencive nature)లోనిదై యుండవలయునని చెప్పియున్నారు. ఈ యధికారమును చలాయించుటలో చాల జాగ్రతగా నుండవలయును. ఆవినియోగము చేయనిచో ఆస్తికి నష్టము సంభవించుట, కుటుంబమునకు విశేష ద్రవ్యనష్టము కలుగుట, ఈమొదలగునవి లాభములక్రింద పరిగణింపవచ్చును. ఏవైన దావాలువచ్చినప్పుడు, ఆస్తిని కాపాడునిమిత్తము దావాలలో పోరుటకూడ లాభముకావచ్చును. ఇది లాభము. ఇది లాభముకాదు. అని నిర్ణయించుట చాల కష్టము(3). ఈవిషయమున హైకోర్టులలో భిన్నాభిప్రాయము లున్నవి.

(1) 134 ఇం. కే. 1089; 118 ఇం. కే. 489; But see 8 పా 558.

(2) 89 ఇం. కే (లా) 20 సం॥ 803; 51 అ. 14 సం॥ 430; 1927 మ 215.

(3) 89 ఇం. కే (పి). కౌ.) 722; 40 మ 709; 86 ఇం. కే. 769; 71 ఇం. కే. 959;

కాపురమున్న గ్రామమునకు చాలదూరములో ఆస్తియుండి, దానిని మేనేజిమెంటు చేయుట కష్టముగా నున్నప్పుడు, సమీపములో ఆస్తిని కొనుటకై దానిని విక్రయించుట, లాభమగునా? కాదా? యని, యొక ప్రశ్నరాగా అలహాబాదు హైకోర్టువారు ఫుల్ బెంచిలో కుటుంబలాభమును నిర్వచించుటలో కుటుంబముపైన వచ్చినదానిని సమర్థించుకొను స్వభావముగల తరగతి (Defencive nature)లోనిదై యుండవలయుననుమాట దరిమిలా ప్రి. కౌ. తీర్పు(1). నాటినుండి వచ్చినదనియు, హనుమాన్ ప్రసాద్ కేసు(2)లో యీమాట లేదనియు కుటుంబలాభమనినప్పుడు కేవలము పైచెప్పినస్వభావము (Defencive nature) కలది కానక్కర లేదనియు, వ్యవహారదక్షతగల యజమాని సదుద్దేశముతో లాభముకొరకు చేసినది కుటుంబలాభముక్రిందకు వచ్చునని యు చెప్పి ఈవిక్రయము చెల్లుననితీర్మానించిరి(3).

వినియోగము చేయునాటికుండు పరిస్థితులనుబట్టి కుటుంబలాభమగునో? కాదో? నిర్ణయింపవలయును. కాని, దరిమిలాను సంభవించిన విషయములనుబట్టి నిర్ణయింపకూడదు. తిరిగి భూములను కొనవలయునని స. కు. తా॥ భూములను విక్రయించి ఆసొమ్ము ఒక బ్యాంకిలో వేసి, ఒక సంవత్సరము వడ్డి పుచ్చుకొనినపిదప ఆబ్యాంకి దివాలా తీసెను. దివాలా తీసినందువలన ఆసొమ్ము పోయినదికదా యని ఆవిక్రయము చెల్లకూడదని చెప్పరాదు(4). వడ్డి పెరిగిపోవుటచే నష్టము వచ్చినదని అసలు వినియోగము చెల్లదని చెప్పరాదు(5).

(1) 39 ఇం. కే. (ప్రి. కౌ.) 722
(2) 6 మూ. ఇం. అ. 393
(3) 116 ఇం. కే (అ. ఫు. బెం.) 484; 141 ఇం. కే (నా) 494; 121 ఇం. కే (నా) వ్యతిరేకము 669; 140 ఇం. కే (అ. ఫు. బెం) 509;
(4) 116 ఇం. కే. (అ) 484; 78 ఇం. కే (నా) 384.
(5) 116 ఇం. కే. (పా) 38.

క్రొత్తగా ఒకవర్తకమును ప్రారంభించుట కుటుంబలాభము కానేరదు. లాభముకొరకు ఉద్దేశించియే ప్రారంభించినను అది లాభమని యెంచరాదు. అందుకొరకు చేసిన అప్పుగాని తనభాగాని చెల్లనేరదు(1).

ఏదికుటుంబలాభమో! ఏదికుటుంబలాభముకాదో నిర్ణయించుటకు సామాన్యసూత్రమేదియు చెప్పవీలులేదు. ఏకేసున కాకేసుసందర్భములనుబట్టి తీర్మానించవలసి యుండును(2). అట్టి కేసులయొక్క సంగ్రహము నొకపట్టీగా నుదాహరించడమయినది. వీటినిబట్టి తక్కిన విషయములను గ్రహింపవలయును.

(1). ఆస్తిని క్రయముచేసి, సొమ్ముక్రింద మార్చుట, అప్పటికి లాభముగ కనుపడెనని యోచించి కర్తచేసిన వినియోగము తక్కిన మెంబర్లను బాధించదు. 73. ఇం. కే. (బొం) 1017.

(2). సాలు 1 కి రు 125-0-0 లు శిస్తు వచ్చెడుభూమిని 1200 రూపాయలు పుచ్చుకొని సాలునకు రు 70-0-0 శిస్తు యిచ్చెడుపద్ధతిని శాశ్వతపుకవులున కిచ్చెను. శిస్తును సరిగా యివ్వనిచో భూమిలో నుండి తొలగించుటకు హక్కు కలదనికూడ అందు వ్రాయబడియెను. ఇది లాభకరముకాదు. 116 ఇం. కే. (అ) 491.

(3). ఒకయిల్లు, కాపురముండుటకు యోగ్యముగా లేదనియును, అద్దెవచ్చుట లేదనియును బుజువయ్యెను. ఈయిల్లును అమ్మివైచుట కుటుంబలాభమగును. 64 ఇం. కే. (బొం) 923.

---

(1) 67 ఇం. కే (పి. కా.) 124; 70 ఇం కే. (మ) 337; 118 ఇం. కే. (బొం) 555; 119 ఇం. కే. (పా) 406; 112 ఇం. కే. (అ) 881; 125 ఇం. కే. (ఔ) 411.

(2) 48 ఇం. కే (పా) 198; 91 ఇం. కే (ఔ) 495.

(4). కుటుంబమునకు భూములను కొనుటకై, పూర్వార్జితమును తనఖాపెట్టెను. ఇది కుటుంబమునకు లాభముకాదు. మయినరుకుమారుల వాటాలను బయిందు చేయదు. కాని, కొన్నభూములు తనఖాలో చేరినప్పుడు, ఆభూములను విక్రయించుటకు మైనర్లు అభ్యంతరము కలుగచేయకూడదు. 116 ఇం. కే. (అ) 484; 69 ఇం. కే (మ) 756; 140 ఇం. కే. (అ. ఫు. బెం.) 509.

(5). వారసత్వము రీత్యా, యితరులతాలూకు ఆస్తి దఖలుపడునని యెంచి, అందుకొరకు దావాతెచ్చి ఆఖర్చులకొరకు సమష్టి కుటుంబాస్తిని తనఖాపెట్టెను. అదివరకున్న కుటుంబాస్తి సంరక్షణకై దావాతెచ్చినచో అది కుటుంబలాభమగును. కొంత ఆస్తి వచ్చునని అందుకై అదివరకున్న ఆస్తిని వినియోగము చేయుట లాభముగా నెంచ వీలులేదు. క్రొత్త ఆస్తి రాకపోవచ్చును. 4 అ 532; 71 ఇం. కే. (అ) 959.

(6). కుటుంబమునకు రు 4300-0-0 అప్పు ఉండెను. ఈయప్పునకు సరిపడినమరికొంత ఆస్తియున్నను, దానిని విక్రయించక, మరికొంతఆస్తిని రు 18000-0-0 లకు విక్రయించిరి. మిగిలినసొమ్ముతో కొన్నిభూములను కొనుటకు ఊహించిరి. ఇదికుటుంబలాభముకాదనియెంచి, మయినర్లవాటాలను బయిందుచేయదనిరి. 39 ఇం. కే. (మ. ఫు. బెం) 358.

(7) క. తండ్రి చ, ట, కుమారులు. నె 130 రు భూమిని మూడుభాగములుగా పంచుకొనినపిమ్మట క. చనిపోయెను. సవతితల్లియొద్దనుండి, క. యొక్క భాగమునుకొని, అందుకై చ, ట, లు తమభాగములను తనఖా పెట్టిరి. క. వాటాలో, ఒకనుయ్యి యుండెననియు, దానివలన సాలునకు రు 400-

లు లాభమువచ్చుననియు, దానిని యితరులు కొనిరేని, చ, ట, లకు నష్టమువచ్చుననియు, సూచింపబడెను. ఈవ్యవహారము కుటుంబలాభము కొరకుకాదు. 121 ఇం. కే (నా) 669.

(8) తండ్రి, తనజమీందారీ ప్రక్కనున్న మరియొక జమీందారీని వ్యవహరించుటకు నెలకు రు 5 జీతమునకు యేర్పరచుకొని, జాగ్రతగా వ్యవహరించుటకై తన యాస్తిని రు 500 లకు తనఖాయిచ్చెను. ఇది ప్రత్యేకము జీతము కొరకైనచో చెల్లదు. కాని తనజమీందారీయును అదియును కలిపి వ్యవహరించినచో, తనజమీందారీకి లాభముండుననియెంచి, చేసెను. కావున నిదికుటుంబలాభమనిరి. 117 ఇం. కే. (అ) 609.

(9). ఇతరఆస్తిని కొనుటకై కుటుంబాస్తిని తనఖాపెట్టెను. అయితే ఆయితరఆస్తికొనకపోయినచో, కుటుంబాస్తికి నష్టమువచ్చునని రుజువుచేయబడెను. ఈవ్యవహారము కుటుంబలాభమునకని యెంచి, తనఖా చెల్లుననిరి. 116 ఇం. కే (పా) 33; 92 ఇం. కే (సిం) 378; 128 ఇం. కే (అ) 775; 60 ఇం. కే (అ) 3.

(10). క్రొత్తగా కొంతఆస్తినికొనుటకు కుటుంబాస్తిని తనఖాపెట్టెను. క్రొత్తఆస్తికొనుటవలన కుటుంబమునకు లాభమేమియు లేదు. కావున, యీవ్యవహారము కుటుంబలాభముకాదని తీర్మానించిరి. 60 ఇం. కే (అ) 3; 43 ఇం. కే (పా) 193; 118 ఇం. కే (బొం) 555; 109 ఇం. కే 448.

(11). రు 29000-0-0 లకు క్రొత్తగా ఆస్తిని కొని, రు 6000-0-0 రొఖ్ఖమిచ్చి, మిగతామొత్తమునకు కుటుంబాస్తిని తనఖా

యిచ్చెను. ఇది, మంచివ్యవహారజ్ఞానముతో కూడిన మనుష్యుడు చేయుకార్యముకాదు. కావున ఇది చెల్లదు 141 ఇం. కే (నా) 494.

(12). విభక్తుడైన సోదరునియొక్క ఆస్తిపైనిగల తనఖాహక్కును కొనుట, కుటుంబలాభము కానేరదు. 138 ఇం. కే (లా) 642. 1924 లా 721.

(13). శిథిలమైనస్థితిలోనున్నట్టియు, పడగొట్టుమని మ్యునిసిపలువారు నోటీసునిచ్చినట్టియు, ఇంటినివిక్రయించివేయుట కుటుంబలాభమగును. 64 ఇం. కే (బొం) 923.

(14). కుటుంబాదాయమువలన తీర్చలేనంతటి యప్పుచేసి భూమిని కొనుట కుటుంబలాభముకాదు. 43 ఇం. కే (పా) 625; 43 ఇం. కే (పా) 193

(15). కుటుంబమునకున్న భూమి మంచిదికానప్పుడు, దానిని అమ్మి అంతకంటె ఎక్కువ ఆదాయమువచ్చెడు భూమినికొనుట కుటుంబలాభమగును. అట్లు చేయుటకు తండ్రి కధికారము కలదు. అది మయినరుకుమూళ్ళను బయింఘు చేయును. 101 ఇం. కే.(మ) 619; 96 ఇం. కే (అ) 443;

(16). కుటుంబాస్తిని, కర్త ప్రతిబద్ధాకు మార్చివేసెను. తక్కిన మెంబర్లు అభ్యంతరము కలుగచేయలేదు. ఆవ్యవహారము చెల్లునని తీర్మానించిరి. 113 ఇం. కే (అ) 753.

(17). క్రొత్తఆస్తినికొనుటవలన లాభముకలుగవచ్చును. సర్వదా న్యాయమైనయవసరముకాదని తలంపరాదు. 98 ఇం. కే (అ) 773;

**21.** కర్త హెచ్చు రేటువడ్డీకి బదులుపుచ్చుకొని, ఆస్తిని తనఖా యిచ్చినప్పుడు అది చెల్లనేరదని తక్కిన మెంబర్లు ఆక్షేపించవచ్చును. అంతటి హెచ్చు రేటువడ్డీకి బదులు తేవలసినంతయవసరమప్పుడు కలదని ఋజువు చేయు భారము తనఖాపట్టినవారిపై నుండును(1). కర్త హెచ్చువడ్డీకి బదులుతెచ్చినప్పుడు, అంతవడ్డి చెల్లదనియు, అది తక్కిన మెంబర్లను బయిండు చేయదనియును కోర్టులు తీర్మానించవచ్చును. వడ్డిరేటు తగ్గించి తీర్పు యివ్వవచ్చును. క్రిందికోర్టువారు తగ్గించినప్పుడు అప్పీలుకోర్టువారు హెచ్చుచేయవచ్చును. హెచ్చు రేటు అనగా నెంత? ఏ రేటు సాధారణము? ఏ రేటు అసాధారణము? అరువిషయము లాయూకేసులలో ఋజువు చేయబడిన యంశములనుబట్టి నిర్ధారణ చేయవలయును అట్టి ఋజువు లేకపోయినచో, కోర్టువారు జాగ్రత్తగా ఆలోచించి చేయవలయును(2). దండనపరతుగుంటేనే కోర్టువారు తగ్గించవచ్చును గాని, మొదట ఎంత రేటు యేర్పరచుకొన్నను, అందులకు వ్యతిరేకముగా రేటుతగ్గించకూడదని పా. హై కోర్టు కేసులో తీర్మానించుచు, నె 1 కి రు 1 కి రు 0-1-0 చొ॥ వడ్డి యిచ్చుటకు తీర్మానించిరి. దగా, లాలోచి, అక్రమపు అధికారము (undue influence) ఇట్టివియుంటేమాత్రము రేట్లు తగ్గించవచ్చును(3).

(1) 13 ఇం కే 5; 19 ఇం కే 639; 71 ఇం. కే పి). కా 933; 50 ఇం. కే. పి). కా. 434; 1931 అ 208; 116 ఇం. కే. (పా) 33; 100 ఇం. కే. 686; 74 ఇం. కే. 695; 74 ఇం. కే. 346; 134 ఇం. కే (బొ) 1089. 113 ఇం కే (బొ) 410; 18 క 311; 41 అ 609; 52 ఇం. కే (పా) 964; 50 ఇం. కే (అ) 814; 80 ఇం. కే 34.

(2). 50 ఇం. కే. (పి) కా) 434; 71 ఇం. కే. పి). కా 933; 124 ఇం. కే (అ) 759; 84 అ 126.

(3). 89 ఇం, కే (పా) 852; 29 క 823.

నెలకు నూటికి రు 0-8-0 లు వంతున ప్రామిసరినోటుపైని ఉన్న యప్పునకు రు 1-8-0 లు వంతున వడ్డితో తనఖా వ్రాసియిచ్చెను వడ్డిరేటు హెచ్చుచేయబడినదికదా యని అది యధికవడ్డీ యని చెప్పరాదు. అంత హెచ్చురేటునకు తనఖా వ్రాయవలసిన యవసరము వచ్చినదని తనఖాపొందినవారురుజువుచేయవలయును(1). అవసరమునకు మించినమరతులతో తనఖాయిచ్చుట, కర్తకు అధికారము లేనికార్యము(2).

మొట్టమొదట యేర్పాటుచేసికొనిన ప్రకారము వడ్డిరేటు యెంతహెచ్చుగానున్నను అది అమలుజరుగవలసినది న్యాయమే. కాని మొట్టమొదట యేర్పాటుచేసికొనినవారు సమష్టికుటుంబమెంబర్లు అందరును కారు. వారితరఫున కర్తయో తండ్రియో చేసినకాంట్రాక్టులోని హెచ్చురేటు తక్కినవారినందరిని బయిండుచేయవలయునని చెప్పుట ధర్మముకాదు. కావున ఆ రేటు తగ్గించుటకు కోర్టునకధికారముకలదు(3) మెంబర్లు అందరును కలసిచేసిన కాంట్రాక్టుఅయినచో వడ్డిరేటు తగ్గించకూడదు. ఈసూత్రమునను సరించి, తండ్రియు కొడుకును మాత్రమేగల యొకకుటుంబములో వారిద్దరునుకలసి అంగీకరించి నె 1 కి నూటికి రు 3-చొ॥ వడ్డిరేటున మూడు నెలలకొకసారివడ్డి అసలులో కలియుపద్ధతిని తెచ్చినరుణమునకు వడ్డియేమియు తగ్గించక, కాంట్రాక్టు రేటుప్రకా॥ పాట్నాహైకోర్టువారు డిక్రియిచ్చినారు(4).

(1). 36 ఇం. కే (అ) 217.
(2). 50 ఇం. కే (ప్రి. కౌ) 434.
(3). 50 ఇం, కే (పా) 814; 68 ఇం. కే (అ) 307.
(4). 52 ఇం. కే (పా) 964.

ఏ యే కేసులలో వడ్డీ రేటు యెట్లు తగ్గించినది యీ క్రింది
పట్టీ వలన తెలియగలదు.

| లారిపోర్టు నెంబరు పేజీ. | పార్టీలు యేర్పరచుకొన్న షరతులు | కోర్టు వారి తీర్పు. |
|---|---|---|
| 19 ఇం. కే. 639. | నెల 1 కి నూటికి రు 2-8-0 చొ॥ ఆరుమాసములకొకసారి కాంపౌండు. ఒక సంవత్సరము దాటిన పిదప నెల 1 కి నూటికి రు 3-2-0 చొ॥ వడ్డీ. | నెల 1 కి నూటికి రు 1-0-0 చొ॥ మాత్రమే కుటుంబాస్తి పైని బయిందు చేయును. |
| 126 ఇం. కే. 506 (బొ) | నెల 1 కి నూటికి రు 2-0-0 చొ॥ సాలు వారి కాంపౌండు వడ్డీ | నెల 1 కి నూటికి రు 0-12-0 చొ॥ సింపిల్ వడ్డీ. |
| 73 ఇం. కే. 73 (అ) | నెల 1 కి నూటికి రు 1-8-0 చొ॥ సాలు వారి కాంపౌండు వడ్డీ. | కొంత తగ్గించినారు. |
| 124 ఇం. కే. 759 (అ) | నెల 1 కి నూటికి రు 1-0-0 వాయిదా నాటికి యివ్వనిచో వడ్డీ అసలులో చేర్చుట. సాలు వారి కాంపౌండు. | తగ్గించలేదు. ఆ రేటు న్యాయమని తీర్మానించినారు. |
| 121 ఇం. కే. 326 (నా) | వాయిదా నాటికి యివ్వనిచో నెల 1 కి నూటికి రు 1-4-0 చొ॥ కాంపౌండు వడ్డీ. | నెల 1 కి నూటికి రు 1-4-0 చొ॥ సింపిల్ వడ్డీ. |

| | | |
|---|---|---|
| 116 ఇం. కే. 543. (పా) | తండ్రి నెల 1 కి నూటికి రు 1-0-0 చొ॥ ఒక తనఖా, 1-4-0 చొ॥ ఒకతనఖా, 1-6-0చొ॥ ఒకతనఖా, 2-0-0చొ॥ మరియొక తనఖాపెట్టెను. | అంత హెచ్చు వడ్డికి బదులు తెచ్చుటకు అవసరమున్నదని తనఖాదారు రుజువు చేయవలయును. కుమారులకు సదరు రేటు అధికమని ఆక్షేపించుటకు హక్కు కలదు. |
| 116 ఇం. కే. 33 (పా) | నెల1కి నూటికిరు1-4-0 చొ॥ సాలువారి కాంపౌండు వడ్డి. | సింపిల్ వడ్డి. |
| 71 ఇం కే. 933 ప్రి. కౌ. | నెల1కి నూటికిరు3-0-0 చొ॥ మూడుమాసములకొకసారివడ్డి అసలులో కలియుట. | నెల 1 కి నూటికి రు 1-0-0 సింపిల్ వడ్డి. |
| 82 ఇం. కే. 817 ప్రి. కౌ. | నెల1కి నూటికి రు2-0-0 చొ॥ సాలు వారి కాంపౌండు వడ్డి. | ఈ కేసులో సమష్టి కుటుంబాస్తితో సంబంధము లేదు. ఇచ్చినవాడు పుచ్చుకొనినవాడుమాత్రమేయున్నారు. అందుచే తగ్గించలేదు. |

| | | |
|---|---|---|
| 137 ఇం. కే. 717. | నెల1కి నూటికి రు1-0-0 మూడుమాసముల కొక సారి కాంపౌండు వడ్డి. | నెల 1 కి నూటికి రు 1-0-0 చొ॥ సింపిలువడ్డి. |
| 134 ఇం. కే. 1089 (ఔ) | నెల1కి నూటికి 0-13-0 చొ॥ సాలువారికాంపౌండువడ్డి. | సదరు రేటున సింపిలువడ్డి. |
| 50 ఇం. కే. 814. (పా) | నూటికి సాలునకు రు25/- వడ్డి సాలువారి కాంపౌండు. | నెల 1 కి నూటికి రు1-8-0 చొ॥ బారువడ్డి. |
| 51 ఇం. కే. 52 (పా) | నెల1కి నూటికి రు2-0-0 చొ॥ ఆరుమాసముల కొకసారి కాంపౌండువడ్డి. | డిటో డిటో |
| 74 ఇం. కే. 695. | నెల1కి నూటికి రు1-4-0 చొ॥ సాలువారికాంపౌండువడ్డి. | నెల 1 కి నూటికి రు1-4-0 చొ॥సింపిలువడ్డి. |

| | | |
|---|---|---|
| 50 ఇం. కే. 434 ప్రి కౌ. | నెల1కి నూటికి రు2-8-0 చొ॥ ప్రతి ఆరుమాసము లకును వడ్డియివ్వవలయు ను. అట్లివ్వనిచో పత్రం తేదీ మొదలు నెల 1 కి నూటికి రు 3-2-0 చొ॥ ఆరుమాసములకొకసారి వడ్డి అసలులో కలియుట గవర్నమెంటుపన్ను చెల్లించుటకొరకు రు 398-0-0 లు బదులుపుచ్చుకొనిమె ను. అప్పీలు తేదీ నాటికి మూడులక్షల రూపాయ లైనది. | మొదటి అప్పీలు కోర్టువారు అసలు ఫాయిదాలు రు 20000/- కు యిచ్చిరి. ప్రి. కౌ. వారు, నెల1కి నూటికి రు1-0-0 చొ॥ బారు వడ్డి ప్ర॥ రు 1778-4-0 లకు డిక్రి యిచ్చిరి. |
| 108 ఇం. కే. 337 ప్రి. కౌ. | నెల1కి నూటికి రు1-4-0 చొ॥ సాలువారీకాంపౌండువడ్డి. | దస్తావేజులోని రేటు ఖాయముచేసిరి. కాంపౌండు వడ్డియుండ కూడదను నియమ మెచ్చటను లేదు. ఇంతకంటె హెచ్చు |

రేటు వడ్డికి డిక్రి ఇవ్వకూడదను నియమమును లేదు. అప్పుపుచ్చుకొను నాటిస్థితి, అవసరము, మొదలగువానిని గూర్చి కోర్టులు ఆలోచించ వలయునని ఈకేసులో ప్రి. కౌ. వారు చెప్పియున్నారు. ఈవిషయ మునుగూర్చిన కేసులను ఇందువిశేషముగా చర్చించియున్నారు. ఈ కేసు చాలముఖ్యమైనది.

22. సమష్టికుటుంబమెంబర్లలో నెవరైనను తక్కినవారియను మతిలేకుండ, తన భాగమును వినియోగము చేయవచ్చునా యను విషయమున భిన్నాభిప్రాయములున్నవి. మద్రాసు బొంబాయి బీరారు మధ్యరాష్ట్రములలో తన యనిర్దిష్ట భాగమును ఏమెంబరైనను, విక్రయించుట గాని తనఖాపెట్టుటగాని చేయవచ్చును(1). అయితే, విక్రయము, తనఖా మొదలైన ప్రతిఫలయుక్తములగు వినియోగములు చేయుటకే అట్టిమెంబరు హక్కుగలిగియుండును. కాని తనభాగమును విల్లుపూర్వకముగాగాని(2) దానపూర్వకముగాగాని(3) వినియోగముచేయకూడదు. సంయుక్తపరగణాలలోను, బెంగాలులోను సమష్టికుటుంబమెంబరు తనయనిర్దిష్ట భాగమును ఏవిధముగాను వినియోగము చేయరాదు. అట్లుచేసినచో మొత్తము వినియోగమంతయును రద్దుఅయిపోవును. చేసినవాని భాగమైనను

సమష్టి కుటుంబ మెంబర్లలో నొకడు తనభాగమును వినియోగము చేయవచ్చునా?

(1) 6 బొం. హై. కి. 247; 10 బొం. హై. కి 139. 162; 50 ఇం. లే (బొం 765, 8 మ. హై. కి 6; 25 మ 690; 49 ఇం. లే (మ) 666; 5 బొం. 48 55 ఇం. లే (మ) 544; 52 ఇం. లే (మ) 746; 46 ఇం. లే 754; 68 ఇం. లే (ప్రి. కౌ.) 578; 66 ఇం. లే (నా) 289; 56 ఇం. లే (నా) 44; 53 ఇం. లే 231; 122 ఇం. లే (నా) 699; 1928 ప్రి. కౌ. 165; 42 మ 154; 43 బొం. 472;

(2) 8 మ. హై. కి 6; 5 బొం 48; 29 బొం 351; 58 ఇం. లే (అ) 667; 32 క వీ. నో. 3;

(3) 27 మ 162; 40 ఇం. లే (మ) 205; 49 ఇం. లే (మ) 666; 19 బొం 403; 7 మ 357; 9 మ 278; 11 మ 246; 11 బొం. హై. కి 76; 12 బొం. హై కి 229; 45 ఇం. లే (ప్రి. కౌ) 806; 77 ఇం. లే (నా) 50; 14 మ 459; 5 బొం 48; 32 మ. లా. జ 439; 8 ఇం. లే 391;

చెల్లదు(1). కాని ఆవినియోగము, కుటుంబముయొక్క న్యాయమైన యవసరముకొరకుగాని, తండ్రియొక్క పూర్వపురుణములకొరకు గాని, చేసినచో చెల్లుట కభ్యంతరముండదు.

సమష్టికుటుంబమెంబరు, కుటుంబాస్తిలోని యొకప్రతిని ప్రత్యేకము విక్రయింపజాలడు(2). సమష్టికుటుంబమెంబర్లలో నొకడు విభాగమునకుపూర్వ మొకయాస్తిని విక్రయించెను. విక్రయముచేయునాటి కాయాస్తి యాతనిదొక్కనిది కాదనుహేతువుచే ఆక్రయము చెల్లకపోదు. విభాగములో నాయాస్తిని ఆతనివాటాలోనికి చేర్చిరి(3).

సమష్టికుటుంబమెంబరు, తక్కినమెంబర్లు అంగీకరించినయెడల, కుటుంబాస్తిలోని కొంతభాగమును తనభార్యకు జీవనాంశమునకు బదులుగా సంపూర్ణహక్కులతో యిచ్చివేయవచ్చును(4).

సంతానములేని యొక మెంబరుయొక్క శ్రాద్ధాదికర్మలు చేయుటకై యొకమెంబరునకు తక్కినమెంబర్లు ఉచితముగా ఆస్తి నిచ్చినప్పుడు అది న్యాయమగును(5).

సమష్టికుటుంబములోని యొకమెంబరు తనవాటాను విక్రయము చేసినప్పుడు తక్కినమెంబర్లు, అది విక్రయముకాదనియు, ప్రతిఫలములేనిదే విక్రయించినట్లు వ్రాసియిచ్చెననియు వాదించవచ్చును. వారివాదము నిజమైనచో, ఆక్రయము చెల్లదు(6).

(1) 40 ఇం. కే (ప్రి కా.) 284; 18 క 157; 15 అ 389; 39 ఇం. కే (ప్రి.కా.) 280; 40 ఇం. కే. (284);
(2) 16 మ. లా. ట 370
(3) 27 మ 162.
(4) 130 ఇం. కే (మ) 460.
(5) 50 ఇం. కే (మ) 597;
(6) 58 మ. లా. జ. 763=1927 మ 950;

సమష్టికుటుంబములోని యొక మెంబరు కుటుంబాస్తిలోని తన హక్కును, వదలుకొనదలచుకొనిన యెడల తక్కిన మెంబర్ల కందఱకును వదలివేయవలయును కాని కొందరకు మాత్రమే వదలివేయకూడదు. కొందఱకు వదలివేసినను అందరకును వదలివేసినట్లే యెంచబడి, అందరకును ఆయాస్తియందు హక్కు కలుగును. తండ్రి తన భాగమును వదలివేసినాడనినచో అందు కుమారుల భాగములు చేరలేదని యర్థము(1).

సమష్టికుటుంబములోని మైనరు మెంబరునకు తల్లి సంరక్షకురాలు అయినను ఆమె మైనరు భాగమును వినియోగము చేయజాలదు(2).

తక్కిన మెంబర్లు అంగీకరించిన యెడల ఒక మెంబరు కుటుంబాస్తిని దానమీయవచ్చును(3).

అవిభక్తభాగమును వినియోగముచేసి మెంబరునకు తక్కినకుటుంబములో ఎట్టి సంబంధముండును?

23. సమష్టికుటుంబమెంబరు, తన భాగమును విక్రయించినంతమాత్రమున కుటుంబమునుండి వ్యష్టి అయినట్లెంచరాదు. మృతశేషత్వాదిధర్మము లాతని యెడల నశింపవు(4). అతడు ఏయాస్తిలోని భాగమును విక్రయించెనో ఆయాస్తితో సంబంధించినంతవఱకు కాతడు విభక్తుడు. అతని భాగమునంతను విక్రయించినచో, అంతవరకును విభక్తుడే. అయినను, కుటుంబములోనుండి విడిపోయినట్లెంచరాదు(5). ఒక మెంబరు కుటుంబాస్తిలోని తన భాగ

(1) 1931 లా 289; 49 ఇం. కే. 263.

(2) 62 ఇం. కే (పా) 132.

(3) 72 ఇం. కే (బొ) 470.

(4) 25 ఇం. కే (మ) 585; 21 బొం 797 (808); 22 ఇం. కే (మ) 555 38 ఇం. కే (మ) 270;

(5) 25 మ 690 (717); 34 ఇం. కే (మ) 794.

మునంతను విక్రయించునప్పుడు, కుటుంబములోనుండి విడిపోవలయు ననునుద్దేశ మాతనికి కలదని యెంచి, ప్రి కౌ. వారు చెప్పినట్లు(1) ఆనాటినుండియు, విభాగస్థితియేర్పడిన దని యూహింపవచ్చుననియు, అందుచే కుటుంబములోనుండి విడిపోయినట్లెంచవలయు ననియు ఒక కేసులో మ హై. వారు సూచించినారు(2). మొత్తముపైని ఈవిషయములో మ. హై. లో భిన్నాభిప్రాయములున్నవి(3).

అవిభక్తభాగమును కొన్నవానిహక్కు బాధ్యతలు.

24. సమష్టికుటుంబ మెంబర్లలో ఒకనియొక్క గాని, కొందరియొక్క గాని, అవిభక్తభాగమును లేక భాగములను కోర్టువేలములో గాని, ఆమెంబర్లవద్ద స్వయముగా గాని కొన్న వానిహక్కు లెట్టివి అనువిషయ మిట విమర్శింపబడును.

(అ) అట్టి క్రయదారు, తాను కొన్నఆస్తిని స్వాధీనముచేయుమని కుటుంబమెంబర్లను కోరుటకు హక్కులేదు. తాను బలవంతముగా స్వాధీనముచేసికొనుటకును హక్కులేదు. బలవంతముగా స్వాధీనముచేసికొనినచో క్రయదారును తొలగించివేయుటకు తక్కిన మెంబర్లకు హక్కుకలదు(4).

(ఆ) అట్టి క్రయదారు, కవులు తనఖా మొదలగుకారణములచే అదివరకే స్వాధీనమును కలిగియున్నప్పుడును, ఎవనిభాగము

(1) 37 ఇం. కే (ప్రి. కౌ.) 321.

(2) 124 ఇం. కే (మ) 497.

(3) 34 ఇం. కే 791; 15 ఇం. కే 351; 39 మ 159; 39 మ 265; 24 ఇం. కే 696

(4) 11 బొం. హై 8 76; 20 మ 243; 50 ఇం. కే (బొం) 765; 10 బొం 368. (తొలగించుట); 85 ఇం. కే (పా) 1014;

తనకు క్రయమైనదో, అట్టి మెంబరు అదివరకు ఏకారణముచే నైన ప్రత్యేకముగా భుక్తమును కలిగియుండి, అతనివలన స్వాధీనము చేయబడినప్పుడును, అతనిని యితరమెంబర్లు తొలగించుటకు హక్కుకలిగియుందురా యను విషయమున భిన్నాభిప్రాయములున్నవి. క్రయదారును తొలగించనవసరము లేదనియు, ఇతరమెంబర్లతో సామాన్యభాగస్థునివలె నుండుననియు, అట్లుండుటకు ఇతరమెంబర్ల కిష్టములేనిచో వారు విభాగము నిII దావా తేవలసియుండుననియు బొం హై. కోర్టువారియభిప్రాయము(1). మ. హై. వా రాయభిప్రాయముతో నేకీభవింపక, క్రయదారు సామాన్యభాగస్థుడు కాజాలడనియు, అతనిని తొలగించుటకు ఇతరమెంబర్లకు హక్కుకలదనియు తీర్మానించిరి(2). అతను భాగమును కోరుటకు మాత్రము హక్కుకలిగియుండుననిరి(3).

(ఇ) అట్టి క్రయదారు, మొత్తము సమష్టికుటుంబమెంబర్ల నందరను పార్టీలనుగా జేర్చి, విభాగము నిమిత్తము దావా తెచ్చుటకు హక్కుకలిగియుండును. తనకు అమ్మినవానికి, కుటుంబములోనుండి విడిపోవుటకును, తన భాగమును పంచియిమ్మని దావా తెచ్చుటకును హక్కుకలదు. కావున అట్టిహక్కుయీక్రయదారునకు గూడ నుండును(4). అట్టిదావాలో అమ్మినవానికి వచ్చుభాగమును క్రయదారునకు యిప్పించవచ్చు

(1) 1 బొం 95; 2 బొం 676; 5 బొం 493, 499; 96 ఇం. కే (బొం) 166; 50 బొం 204; 46 బొం 28;

(2) 38 మ 264; 39 మ 265 (269)=25 ఇం. కే 585; 37 ఇం. కే (మ) 168; 48 ఇం. కే (మ) 374. 45 మ 449;

(3) 95 ఇం. కే (మ) 209.

(4) 8 క 193; 19 క 625; 2 పా 385; 75 ఇం. కే (మ) 406.

ను(1) క్రయదారు ఏదైన నొకప్రతిని కొన్నయెడల, అవకాశ ముండెనేని, ఆప్రతిని అమ్మినమెంబరునకు వచ్చెడి వాటాలో చేర్పించి, ఆప్రతిని క్రయదారునకు యిప్పించవచ్చును. లేదా ఆదావాలో, అమ్మినవానివాటాలోనికి వచ్చెడి ఆ స్తిలో క్రయపుటాస్తితో సమానమయిన ఆ స్తిని క్రయదారునకిప్పింపవలయును(2) క్రయదారు, విభాగముకొఱకు మాత్రమే దావా తేవలయును గాని సమష్టిస్వాధీనము (Joint Possession). కొరకు దావా తేకూడదు. ఆదావాలో మొత్తము కుటుంబాస్తినంతయును, మొత్తము కుటుంబమెంబర్లనందరను చేర్పవలయును(3).

(ఈ) అట్టి క్రయదారు, సమష్టికుటుంబాస్తిలో, ఒకప్రతియందు మాత్రము కొంతభాగమును కొనియున్నప్పుడు, ఆప్రతిని మాత్రము విభజించి తన వాటాయిమ్మని కోరుటకు హక్కు లేదనియు, ఇతరమెంబర్లందరును అందు కంగీకరించినచో అట్లు చేయవచ్చుననియు, దావా చేయునప్పుడు, మొత్తము కుటుంబాస్తి విభాగమునకే దావా చేయవలయుననియు బొం. హై. వారిఅభిప్రాయము(4). ఆయొక్కప్రతి విభాగము

(1) 11 బొం హై. రి 72; 8 మ. హై. రి 6; 29 మ 264; 56 ఇం. కే (లా) 254 68 ఇం. కే (మ) 869; 44 మ 167.

(2) 21 నా. లా. రి 38; 25 మ 690 పు బెం; 35 మ 47 పు. బెం; 64 ఇం కే (బొం) 115. 1931 బొం 218; 96 ఇం. కే (మ) 993; 72 ఇం. కే (మ) 81; 21 లా. టీ. 111; 1925 (నా) 299;

(3) 21 నా. లా. రి 38; 50 ఇం. కే (బొం) 765; 36 ఇం. కే (మ) 665; 35 ఇం. కే (క) 294 22 ఇం. కే (మ) 555. 25 ఇం. కే (మ) 585; 96 ఇం. కే (బొం) 166; 116 ఇం. కే (నా) 648; 43 బొం 17.

(4) 28 బొం 184; 24 బొం 128; 67 ఇం. కే (బొం) 833.

నిమిత్తము దావా తెచ్చుటకు క్రయదారునకు హక్కు కలదని అ. హై. వారి అభిప్రాయము(1). మొత్తము విభాగమునకే దావా చేయవలసియుండు నని మ. హై., క. హై. ల యభిప్రాయము(2). అమ్మినమెంబరుగాక, కుటుంబములోని యితర మెంబర్లు, అమ్మినప్రతిలోని తమ వాటాలను విభజించి యిప్పించుమని, దావా తేవచ్చుననియు, మొత్తము కుటుంబాస్తి విభాగమునకు దావా తేనక్కరలేదనియు బొం. హై., మ. హై. ల అభిప్రాయము(3); అట్లు తేరాదనియు, అట్టి యితరమెంబర్లు, మొత్తము విభాగముకొరకు దావా తేవలయు ననియు పా. హై. వారి యభిప్రాయము(4).

(ఉ) ఒకమెంబరుతాలూకు భాగమునందు క్రయదారుపొందిన క్రయము చెల్లతగినది కాదని తక్కినమెంబర్లు తెచ్చినదావాలో, క్రియము చెల్లతగినదని కోర్టువారు స్థిరపర్చునెడల, ఆదావాలో మెంబర్లు అందరును పార్టీలుగానుండి విభాగవిషయమును విమర్శించి తీర్మానించుటకు కోర్టున కనుకూలముగ నుండెనేని క్రయదారు వేరుగ దావా చేయనక్కరలేకుండ ఆదావాలోనే ఆతడు కొనినభాగమును విభజించి యిప్పించవచ్చును(5).

(ఊ) ఏమెంబరుయొక్క భాగము విక్రయము చేయబడియెనో, ఆమెంబరు చనిపోయిన పిమ్మట ఆక్రయదారు విభాగముకొరకు

(1) 28 అ 39;

(2) 18 మ 275; 20 మ 243; 22 ఇం. కే (మ) 555; 11 క 896 (899); 35 ఇంకే (సిం) 478. 12 ఇం. కే (మ) 408.

(3) 19 మ 267; 28 అ 56; 46 ఇం. కే (బొం) 133; 34 మ 269; 34 మ 402.

(4) 74 ఇం. కే (758) పా.

(5) 20 ఇం. కే (పి. కా) 958; 75 ఇం. కే (మ) 406. 76 ఇం. కే (మ) 1018. 39 ఇం. కే (బొం) 23.

దావాచేయకూడ దని మొదట తీర్పు లగుచు వచ్చినవి కాని, దరిమిలాను, ఆమెంబరు చనిపోయిన పిమ్మటకూడ క్రయదారు విభాగమునిమిత్తము దావాచేయుటకు హక్కుకల దనియు, ఆమెంబరు జీవించియుండగా విభాగముచేసికొనక పోవుటచేత ఆతనిభాగము మృతశేషస్వత్వధర్మముచే తక్కిన మెంబర్లలో లీనమైపోయిన దనువాదము చెల్లదనియు, తీర్మానించిరి(1).

(ఋ) ఒకమెంబరుయొక్క భాగమంతయు విక్రయమయినప్పుడు, విక్రయమయినవాడు, సమష్టికుటుంబ మెంబరునకు, ఎంతభాగమునకు హక్కుకలిగియుండునో, అంతభాగమునకును క్రయదారు హక్కుకలిగియుండును. క్రయమయిన పిమ్మట, కొంతకాలమువరకును క్రయదారు తనకు క్రయమయిన ఆస్తి స్వాధీనమునకు గాని, విభాగముకొరకు గాని, ప్రయత్నింపక పోవుటవలన ఆమధ్యకాలములో, కుటుంబములో కలిగిన మరణజననములను బట్టి క్రయదారునకు హెచ్చుతగ్గులు కలుగవు అని క. బొం. హై. తీర్మానించినవి(2).

ఉదా:—(1)క, చ, ట, అనువారు ముగ్గురుసోదరులు. క, తన $\frac{1}{3}$ భాగమును ప కు అమ్మివేసెను. పిదప చ, చనిపోయెను. తరువాత ప, విభాగముకొరకు దావా తెచ్చెను. ప, $\frac{1}{3}$ భాగమునకే హక్కుదారుడగును కాని $\frac{1}{2}$ కు కాదు.

(2). క తండ్రి, చ, ట, లు కుమాళ్ళు. క తన $\frac{1}{3}$ భాగమును ప కు అమ్మివేసెను. ప విభాగము ని॥ దావా తెచ్చులోపల క, కు త, అను వేరొకకుమారుడు కలిగెను. విభాగములో త, కు

(1) 25 మ 690 పు. బెం; 141 ఇం. కే (మ) 122.

(2) 10 క 626; 28 క 670; 89 ఇం కే (బొం) 23; 28 బొం 201; 21 బొం 797.

వాటాయిచ్చి, ప కు $\frac{1}{4}$ వంతుమాత్రమే డిక్రియివ్వవలెనని వాదించిరి. కాని అది అంగీకరింపక కోర్టువారు $\frac{1}{3}$ డిక్రియిచ్చిరి.

కాని ఈవిషయమున మదరాసు హైకోర్టువారు భిన్నాభిప్రాయులైనారు. ఈసందర్భము మ. హై. లో చాలసారులు విమర్శింపబడినది(1). ప్రి. కౌ. వారివలన స్పష్టమైనతీర్పు రాలేదు(2) అదివరకున్న కేసులనువిమర్శచేసి, 1932 సం॥లో మ. హై వారు విక్రయమయిన తేదీనాటికి, మెంబరున కె త భాగమున్ననూ దానితో నిమిత్తము లేదనియు, విభాగమునిమిత్తము దావావారాబడిన తేదీనాటికి ఆమెంబరు ఎంతభాగమునకు హక్కుకలిగియుండునో అంతభాగమునకు మాత్రము క్రయదారు హక్కుకలిగియుండుననియును తీర్మానించినారు(3). అనగా విక్రయమయిన తేదీకిని దావా తేదీనాటికిని నడుమ కుటుంబములో కలిగెడు జననమరణములనుబట్టి ఆభాగము మారిపోవుచుండుననియర్థము. నాగపూరుకోర్టువారుకూడ ఇట్లే అభిప్రాయపడిరి(4).

క. తండ్రి. చ, ట, కుమాళ్లు. చ. మేజరు. ట, మైనరు. క, కొంతఆస్తిని క్రయము చేసెను. దస్తావేజులో ట కుగార్డియనుగా, క సంతకముచేసెను. చ ఆవిక్రయమునకు అంగీకరించలేదు. విక్రయము దరిమిలాను, ట, చనిపోయెను. కాని త, అనుమరియొక కుమారుడు కలిగెను. క-ట, అనువారు చనిపోయిన పిమ్మట క్రయదారు స్వాధీనము కొరకు దావాతెచ్చెను. తండ్రిచేసిన వినియోగము న్యాయమైనదని రుజువుచేయలేకపోయెను. అయినను తండ్రివాటాపైని క్రయము బయిండుచేయుననియును, దావాతేదీనాటికి, చ, త, లు

(1) 14 మ 408; 25 మ 690; 35 మ 47; 46 మ 815; 48 మ 684; 45 మ 449.
(2) 141 ఇం. కే 122 (మ) 122 at 125.
(3) 141 ఇం. కే. 122.
(4) 116 ఇం. కే (నా) 648.

న్నారు కావున క్రియదారునకు తండ్రియొక్క మూడవ వంతు వాటాకు మాత్రమే డిక్రియిచ్చిరి(1).

(ౠ) అవిభక్త భాగమును కొన్న క్రయదారు, కొనిన తేదీ మొదలు విభాగమునకు దావా తెచ్చు తేదీవరకును గతఫలసాయమును పొందజాలడు(2).

(ఌ) అవిభక్త భాగమును తనఖాపట్టిన తనఖాదారు దరిమిలానుజరిగిన విభాగములో తనఖాపెట్టినవాని వాటాకు ఏయాస్తి వచ్చునో ఆయాస్తిమీదమాత్రమే తనఖాబాధ్యతను అమలుజరుపుటకు హక్కు కలిగియుండును(3). ఒకమెంబరుపైనికాబడిన డిక్రికి, సమష్టికుటుంబాస్తిలో ఒకానొకయాస్తి వేలముకాబడెను. తక్కిన మెంబర్లు ప్రత్యేకముగా ఆయాస్తి వేలము వేయరాదని దావా తెచ్చిరి. వేలము తేదీనాటికి వేలము వేయబడిన ఆస్తికిమ్మతుకంటె ఆమెంబరువాటా ఆస్తి చాలయెక్కువ కిమ్మతుకలదిగా నుండెను. ఈసందర్భములో వేలమయిన ఆస్తిని ఆవాటాలోనికిచేర్చి, వేలములో కొనినవానికి యిప్పించవచ్చునని తీర్మానించిరి(4).

(ౡ) తనఖాదారు, తనతనఖాబాకీకి దావాచేయునప్పుడు ఆదావాలోనే విభాగమును కోరకూడదు(5). ఇద్దరుసోదరులు తనఖాపెట్టిరి. అందొకడు తనభాగమును తనఖాదారునకే అమ్మి

(1) 112 ఇం. కే (మ) 558;

(2) 27 మ. లా జ 409; 25 ఇం. కే (మ) 585; 57 ఇం. కే (బొం) 582; 59 ఇం. కే. 428; 89 మ 265.

(3) 20 క 582; 137 ఇం. కే (బొం) 603; 39 ఇం. కే 586.

(4) 1927 మ. 1084; 23 బొం 385; 24 అ 483; 34 మ 173; 30 ఇం. కే (క) 420

(5) 21 ఇం. కే (బొం) 689.

నై చెను. రెండవవాడు మరియొకనికి విక్రయించెను ఈక్రయ దారు మొత్తముతనఖానంతను విడిపించుమని కోరజాలడు(1).

25 తండ్రిచేసిన వినియోగములకును కర్తచేసిన వినియోగ ములకును భేదమున్నది. (క) కర్త సమష్టికుటుంబావసరమునకును, లాభముకొరకునుదప్ప వినియోగమును చేయకూ డదు. చేసినచో, కర్తభాగమే కాని యితరభాగము లు బయిండుకావు. తండ్రి, కుటుంబముయొక్క అవసరము, లాభము, కొరకుమాత్రమే కాకుండ, తనపూర్వపు సొంతఅప్పులకుకూడ, తనభాగమే కాకుండ, కుమారులభాగములనుకూడ వినియోగము చేయవచ్చును. పూర్వపురుణములకొరకు కానియెడల, ఆవినియోగము కుమారుల భాగములను బయిండుచేయదు. తండ్రికానట్టికర్త, పూర్వపురుణముల కని విక్రయించినంతమాత్రమున చెల్లదు. అవసరముండవలయును.

తండ్రిచేసిన విని యోగములకును, ఇతరకర్తచేసిన విని యోగములకును గలభేదము.

(చ) వినియోగము చెల్లునా? చెల్లదా? అని ప్రశ్నవచ్చినప్పుడు, ఋజువుభారమువిషయమునకూడ భేదమున్నది కర్త వినియో గముచేసినప్పుడు, ఆవినియోగము న్యాయమైన యవసరము కొరకుగాని, కుటుంబలాభముకొరకుగాని చేయబడినట్లు ఆవిని యోగమును పొందినవాడు రుజువుచేయవలయును అట్లు రుజు వుచేయనిచో, ఆవినియోగములు చెల్లవు. 43 ఇం. కే (పా) 625;

(ట) తండ్రి, వినియోగముచేసినప్పుడు, అది చెల్లదని కుమారులు దావాతెచ్చునెడల, సదరువినియోగములు, తండ్రిదుర్వ్యవర్త న కొరకును శాస్త్రవిరుద్ధములైన కార్యములకొరకును, చేయ

(1) 106 ఇం. కే (మ) 196.

బడియెనని కుమారులు రుజువుచేయవలయును. లేనిచో, ఆవినియోగములను రద్దుచేయుడని కోరుటకు కుమారులకు హక్కులేదు. 112 ఇం. కే. (మ) 553.

తండ్రి, తనపూర్వపురుణములకు కుటుంబాస్తిని వినియోగము చేసెనేని, దానిని రద్దుచేయుమని కోరుటకు న్యాయమయినయవసరము లేదనిగాని, కుటుంబలాభముకొరకు చేయబడినదికాదనిగాని, రుజువుచేసినంతమాత్రమున లాభములేదు. ఆకారణములమీద ఆవినియోగమును రద్దుచేయకూడదు. దుర్వ్యవర్తనకొరకు ఆపూర్వపురుణములు చేయబడినవనియును, ఆరుణములు ప్రత్యక్షముగా ఆదుర్వ్యవర్తనకార్యములకే ఖర్చుపడెననియు, కుమారులు ఋజువుచేయవలయును. 1932 లా. 636; 1928 మ 105;

తండ్రి, పూర్వపురుణములకు సమష్టిఆస్తిని విక్రయించినప్పుడు, ఆరుణములు సమష్టికుటుంబముయొక్క అవసరముకొరకుగాని, లాభముకొరకుగాని చేయబడినవై యుండనక్కరలేదు. పూర్వపురుణములైనచాలును అయితే అవి అన్యాయములును, దుర్వ్యవర్తనకొరకును చేయబడినవై యుండకూడదు. అట్టివికానిరుణములకు తండ్రిచేసినవినియోగము కుమారులను బయిండుచేయును(1). అట్టిరుణములకు పితామహుడు ప్రపితామహుడు చేసినవినియోగములు కూడ పౌత్రులను ప్రపౌత్రులను బయిండుచేయును(2).

(1) 1930 పా. 827; 73 ఇం. కే (బొ) 466; 63 ఇం. కే (బొ) 288; 59 ఇం. కే (బొ) 570; 60 ఇం. కే (బొ) 187; 89 ఇం. కే (పి. కా) 280; 77 ఇం. కే (పి. కా) 689; 64 ఇం. కే (నా) 718; 1925 మ 1248; 48 ఇం. కే 989; 107 ఇం కే (లా) 385; 95 ఇం. కే (బొ) 857; 1926 అ 79; 1925 అ 367; 88 ఇం కే (బొ) 474; 46 అ 301; 40అ 77; 1931 మ 615; 62 ఇం. కే (పా) 182.

(2) 114 ఇం. కే (పా) 703; 112 ఇం. కే. 151; 98 ఇం. కే 1053.

అన్యాయములును దుర్వ్యవర్తనకొరకు చేయబడిన రుణములన నెట్టివియో నేడవ ప్రకరణమున తెలుపబడును.

తండ్రి పూర్వపురుణములకు ఆస్తివిక్రయించినను బజారుధర లకంటె తక్కువకు విక్రయించినచో ఆవిక్రయము చెల్లదు(1).

పూర్వపుతనఖాబాకీకి తండ్రి సమిష్టిఆస్తిని విక్రయించినపుడు అది చెల్లుట కభ్యంతరముండదు. ఆతనఖాబాకీ యెట్టిదని కోర్టువారు విచారణచేయనక్కరలేదు(2) అయితే తండ్రికానట్టికర్త వినియోగము చేసినప్పుడు, న్యాయమైన యవసరమునకు చేసెనా? యను ప్రశ్నమాత్రమే విచారణీయముకాని, దుర్వ్యవర్తనరుణములా? శాస్త్రసమ్మతముకానిరుణములా? యనుప్రశ్నలతో పనిలేదు(3).

విని యోగసందర్భమున తండ్రికిగల విశేషాధికారములు-

26. సమిష్టికుటుంబాస్తి వినియోగము విషయమున కర్తకంటె తండ్రికి కొన్నియధికారము లెక్కువయున్నవి. ఈదిగువవ్రాసిన మూడువిధములగు నధికారములును కర్తకు లేవు.

అవియేవనగా:—

(i) పూర్వార్జితమైన చరస్థిరాస్తులయందు పుత్రునకు జన్మముచేతనే హక్కుకలిగియున్నను, అతని యనుజ్ఞతో నిమిత్తము లేకుండ కొన్నికార్యములకొరకు, సమిష్టికుటుంబముయొక్క చరాస్తిలో న్యాయమయిన పరిమితిగల కొంతభాగమును తండ్రి దానమీయవచ్చును.

(1) 68 ఇం. కే (అ) 307.
(2) 51 అ 1039; 47 అ 795.
(3) 92 ఇం. కే (అ) 816.

(ii) అట్లే సమష్టికుటుంబముయొక్క స్థిరాస్తిలో న్యాయము యిన పరిమితిగల కొంతభాగమును ధర్మకార్యములకు తండ్రి దాన మీయవచ్చును.

ఈవిషయమున స్మృతివచనము లివి :—

భర్త్రా ప్రీతేన యద్దత్తం స్త్రియై తస్మిన్మృతే పితుః।
సా యథాకామ మశ్నీయా ద్దద్యాద్వా స్థావరాదృతే॥
మణిముక్తాప్రవాళానాం సర్వస్యైవ పితా ప్రభుః।
స్థావరస్యతు సర్వస్య నపితా నపితామహః॥
పితృప్రసాదా ద్భుజ్యంతే వస్త్రాణ్యాభరణానిచ।
స్థావరంతు నభుజ్యేత ప్రసాదేసతి పైతృకః॥

భర్త ప్రీతుడై యిచ్చినదానిని ఆతని యనంతరమున నామె యథేచ్ఛముగా ననుభవింపవచ్చును

మణులు ముత్యములు ప్రవాళములు మొదలగువానికి తండ్రి యేసర్వాధికారి. స్థావరమునందుమాత్రము తండ్రియును, తాతయును సర్వాధికారులుకారు. (అనగా పుత్రపౌత్రులున్నప్పుడు స్థిరాస్తియందు పితృపితామహులకు సర్వాధికారము లేదనియును చరాస్తియందు తండ్రి కధికారమున్నదనియు నర్థము, తండ్రి యనుగ్రహించి యిచ్చిన వస్త్రములు ఆభరణములు మొదలగువానిని అనుభవింపవచ్చును. తండ్రియనుగ్రహముచే నిచ్చినను స్థిరాస్తినిమాత్ర మనుభవింప జాలరు.

ఈవాక్యములనుబట్టియును, ఈప్రకరణమునందలి 6 వ పేరాలో వ్రాయబడిన మరికొన్ని స్మృతుల ననుసరించియును తండ్రికి పైన వ్రాసిన యధికార మీయబడినది. స్మృతులలోను మితాక్షరివ్యాఖ్యానమునందును ఉన్నదానికంటె న్యాయస్థానములు తండ్రియధికా

రమును అధికముచేసినవి(1). భార్యకు, కుమార్తెలకు, కుమారుల లోకొందరికి, ధర్మకార్యములయందు యితరులకు యిచ్చినదానములు కుటుంబాస్తినిబట్టి న్యాయముగానున్నంతవరకు చెల్లునని చాలకేసులలో న్యాయస్థానములు తీర్మానించియున్నవి.

ఇద్దరుకుమారులున్నప్పుడు అందొకనికిమాత్రమే విశేషముగా ఆస్తినిచ్చినప్పుడు అదిచెల్లదని తీర్మానించిరి(2). కుమారునకుగాని కుమార్తెకుగాని ప్రేమచేత తండ్రి సమష్టిఆస్తినిచ్చినప్పుడు అది ఆస్తి నిబట్టి న్యాయముగా నున్నచో చెల్లునని కొన్నితీర్పులున్నవి(3). మొత్తముఆస్తి పది, పదినైదులక్షలున్నప్పుడు కుమార్తె కిరువదివేల రూపాయలనిచ్చినచో అది న్యాయమేయని బొం. హై. తీర్మానించి నారు(4).

ప్రేమచేత నిచ్చినది దగ్గిరబంధువునకయిననే చెల్లును గాని యితరులకయినచో చెల్లదు(5).

కుటుంబాస్తినిబట్టి యిచ్చినఆస్తి హెచ్చుగానున్నదనుకారణముచే కొన్నికేసులలో దానములు రద్దుచేయబడినవి(6).

తండ్రి, తనభార్యకు కుమార్ళయంగీకారములేనిదే ఆస్తినీయకూడదు. అట్లిచ్చినయెడల మైనరుకుమార్లను బయిండుచేయదు(7).

---

(1) 55 క 210.

(2) 1 బొం 561: 31 అ 359;

(3) 5 బొం 48; 31 బొం 378; 24 బొం 549; 35 మ 628; 13 ఇం. కే (మ) 474. 1931 మ. వీ. నో 215, 57 ఇం. కే (పా) 341;

(4) 29 బొం 51;

(5) 1929 అ 854;

(6) 30 మ 453;

(7) 16 మ 84.

కుమాళ్లయంగీకారముపైని, భార్యకుగాని కుమార్తెకుగాని తండ్రి కొంతఆస్తినీయవచ్చును. కుమారుడు మైనరుగానున్నచో సంరక్షకు నివలన అనుమతిగైకొన్నచో అదిచెల్లవచ్చును(1). కుమారుడు చని పోయినసందర్భములో, పౌత్రునితల్లివద్దనుండి యంగీకారమునుపొంది పితామహుడు తనభార్యకును తనకుమార్తెకును కొంత ఆస్తినిచ్చెను. అదిచెల్లునని తీర్మానించిరి(2).

(iii) తండ్రి, సమష్టికుటుంబముకొరకు కాకుండ తనసొంతము కొరకు చేసినరుణములకు (అవి పూర్వపురుణములై యుండవలయును. మఱియు శాస్త్రసమ్మతము కానివియు దుష్ప్రవర్తనకొరకు చేయబడి నవియునై యుండకూడదు) పుత్రపౌత్రప్రపౌత్రులభాగములతోకూడ సమష్టికుటుంబాస్తిని విక్రయింపవచ్చును(3).

పైనచెప్పబడిన మూడువిధములగు నధికారములుతప్ప కర్త కంటె, తండ్రికి విశేషాధికారము లేవియును లేవు.

తండ్రియైనను సమష్టికుటుంబాస్తిని, లాభమువచ్చెడు కార్య మునకైనను తనయిష్టమువచ్చినట్లు తనఖాపెట్టుటకుగాని, విక్రయిం చుటకుగాని అధికారము లేదు(4).

---

(1) 40 ఇం. కే (మ) 118.

(2) 26 ఇం. కే 208.

(3) 39 ఇం. కే (ప్రి కౌ.) 280; 40 ఇం. కే. (ప్రి కౌ.) 284; 42 ఇం. కే (ప్రి. కౌ.) 791; 77 ఇం. కే (ప్రి. కౌ.) 689; 51 ఇం. కే (అ) 119; 27 మ (పు. బెం.) 243; 18 క 157 (ప్రి. కౌ.)

(4.) 60 ఇం. కే (అ) 68.

27. సమిష్టికుటుంబాస్తిని కర్తగాని, తండ్రిగాని, వినియోగము చేసినప్పుడు, అది Void (దానియంతటనదియే చెల్లనిది యగునా ?) లేక Voidable (ఎవరైనను దాని నాక్షేపించి రద్దుచేయింపవలయునా ?) అను ప్రశ్నకు సమాధానమీయవలసియున్నది. Void అనగా చెల్లనిది. Voidable అనగా చెల్లకుండ చేయతగినది.

కర్తగాని తండ్రిగాని చేసినవినియోగము దానియంతటనదియే చెల్లనిది యగునా? ఎవరైనను దానినాక్షేపించి, వ్యవహారము జరుపవలయునా ?

న్యాయమయిన యవసరము లేకుండ చేయబడిన వినియోగము చెల్లనిదైనను మిగిలిన మెంబర్లు, దానికి అంగీకరించి అమలుజరుపవచ్చును. కాని మైనర్లు అంగీకరించినంతమాత్రమున ఆవినియోగము చెల్లదు. మైనరునకు యుక్తవయసు వచ్చినపిమ్మట అంగీకరింపవచ్చును(1). ఒకసమిష్టికుటుంబమెంబరు చేసినవినియోగము చెల్లనిది కాజాలదు తక్కిన మెంబర్లలో నెవరైనను దానినాక్షేపించి రద్దుచేయింపవలయును(2).

పైనచెప్పిన Void, Voidable అనుమాటలు, కాంట్రాక్టుఆక్టులో చెప్పబడినరీతిగా సమిష్టికుటుంబముని షయమున వర్తించవని మ. హై. తీర్మానించినారు(3). న్యాయమైన అవసరము, కుటుంబలాభము లేకుండ కర్తవినియోగము చేసినప్పుడు, తక్కిన మెంబర్ల భాగములతో సంబంధించినంతవరకు ఆవినియోగము చెల్లనిది. చెల్లని కార్యమును ఎవరును చెల్లునట్లు చేయజాలరు. చెల్లకుండ చేయదగిన కార్యమును అంగీకరించినను, అనంగీకారమును వెల్లడించకుండ యూర

(1) 112 ఇం. కే (మ) 553;

(2) 72 ఇం. కే (కో) 470; 53 ఇం కే (కో) 953; 45 మ 449; 68 ఇం. కే. 839; 15 అ 339. B 1: 333 1933 మ 936; 1938 అ 41;

(3) 112 ఇం. కే (మ) 553;

కుండినను ఆకార్యము చెల్లును కర్త అక్రమముగా చేసినవినియోగము చెల్లదు కావున దానిని దరిమిలాను తక్కినమెంబర్లు అంగీకరించి తిరిగి దస్తావేజు వ్రాసి యిచ్చుటకు వీలులేదని ఒకకేసులో మ. హై. వారు తీర్మానించినారు(1). సమష్టికుటుంబము విషయమున ఈ సూత్రమనుయించదనియు, అట్టివినియోగమును అంగీకరించుచు దరిమిలాను తక్కినమెంబర్లు దస్తావేజు వ్రాసియివ్వవచ్చుననియు, మ. హై. మరియొక కేసులో తీర్మానించినారు(2).

అవసరముగాని, లాభముగాని, పూర్వపురుణముగాని లేకుండచేసిన వినియోగములు చెల్లనివియగునా ? లేక చెల్లకుండచేయదగినవా ? యనువిషయమున భిన్నాభిప్రాయములున్నవి. మ. పా. హై. లు చెల్లనివనియును, లా. హై. చెల్లకుండచేయతగినవనియును తీర్మానించియున్నారు(3).

చెల్లనిది, చెల్లకుండచేయతగినది అను నీరెండింటికిని భేదమేమి ? యని ప్రశ్నింపవచ్చును. కొన్నిసందర్భములలో ఈభేదమును బట్టి హక్కులలో ఎక్కువతక్కువలువచ్చుచుండును. ఎట్లనగా క, తండ్రి, చ, ట, కుమారులు. క ఆస్తిని వినియోగముచేయునాటికి చ మేజరు. అతడు క్రయమునకు అంగీకరించలేదు. ట మైనరు. అతనితరఫునకూడ క దస్తావేజు వ్రాసియిచ్చెను. తరువాత ట మైనరుగానే చనిపోయెను. పిమ్మట ఆ స్తి స్వాధీనముకొరకు క్రయదారు దావాతెచ్చెను క, న్యాయమైన అవసరముగాని, పూర్వపురుణముగాని లేనిదే విక్రయించెను గావున ఆక్రయము చెల్లకూడదనిరి. తండ్రివాటాకు

(1) 35 మ 177.

(2) 112 ఇం. కే (మ) 553; 57 క 89; 2 మ 91.

(3) 1928 మ 986; 39 ఇం. కే (పా) 665; 1930 లా 186; 52 బొం 1; 39 అ 500.

మాత్రము చెల్లునని తీర్మానించిరి. అయితే ఆక్రయము చెల్లకుండచేయదగినదనియు, ట, దావా తెచ్చి ఆక్రయమును రద్దుపర్చలేదు కావున అతనివాటాకూడ క్రయదారునకు రావలయునని వాదింపబడెను. కాని కోర్టువారు ఆవాదమునంగీకరించక ఆక్రయము చెల్లనిదనియు, క్రయదారు స్వాధీనము చేసికొనన నంతవరకు దానిని రద్దుచేయవలసిన యావసరము ట, కు లేదనియు, తీర్మానించిరి(1). చెల్లనిది చెల్లకుండ చేయదగినది (Void - Voidable) అనువిషయములలో నిట్లే అనేక విధములుగా తగవులు వచ్చుచుండును.

వినియోగములనాక్షేపించుట కెవ్వరు అర్హులు ?

**28.** సమష్టికుటుంబమెంబర్లలో, కర్తగాని, తండ్రిగాని, మరియొకమెంబరుగాని, చేసినవినియోగముల నాక్షేపించుటకు, వినియోగము చేసిననాటికి ఉన్నయితరమెంబరు లెవరైనను అర్హులైయుందురు(2) అప్పటికి గర్భస్థులైయున్న మెంబరునకుకూడ ఆక్షేపించుటకు హక్కు కలదు(3). తండ్రిచేసినవినియోగము నాక్షేపించుటకు వినియోగమునాటికి గర్భస్థుడుకాకుండ దరిమిలాను జన్మించిన కుమారులకు హక్కులేదు(4). తండ్రి వినియోగముచేయునాటికి, 'చ' అనుకుమారు డుండెను. తరువాత 'ట' కలిగెను. ఆవినియోగము నాక్షేపిం

(1) 112 ఇం. కే (మ) 553.

(2) 35 అ. 571; 20 మ 354;

(3) 57 ఇం. కే. 578; 61 ఇం. కే. (లా) 628; 11 మ. 246; 16 మ. 76; 26 ఇం. కే. (అ) 871; 28 అ 126; 116 ఇం. కే (లా) 545.

(4) 108 ఇం. కే. (మ) 689; 1927 అ 127; 24 ఇం. కే. (మ) 794; 1931 మ 550; 34 క 572; 28 అ 116; 65 ఇం. కే. (నా) 658; (బొ) 404; 43 ఇం కే. (పా) 87[illegible]; 115 ఇం. కే. (పా) 886; 79 ఇం. కే. (బొ) 666; 78 ఇం. కే; (నా) 884; 70 ఇం. కే. (మ) 769. 21 ఇం. కే. 880;

చుటకు చ, ట, లకు ఇద్దరికిని హక్కు కలదు. 'చ' జీవించియుండగా 'ట' పుట్టియుండినచో, దరిమిలాను చ, చనిపోయినను ఆవినియోగ ము నాక్షేపించుటకు ట,కు హక్కు కలదు కాని 'ట' పుట్టకపూర్వమే, 'చ' ఆవినియోగమునకు తనయంగీకారము నిచ్చెనేని, 'ట' కు దావా కారణముండదు(1) (చ) తెచ్చినదావా వానికి వ్యతిరేకమైనను, 'ట' మరల దావా తెచ్చుట కభ్యంతరము లేదు(2).

కుటుంబమెంబర్లకు మాత్రమే వినియోగముల నాక్షేపించుటకు హక్కు కలదు. కాని యితరులకట్టి హక్కు లేదు. వినియోగము చేసినవాడు ఆక్షేపించకూడదు(3).

వినియోగము చేసిన దరిమిలాను దత్తత చేసికొనబడిన దత్తునకు దత్తతకుపూర్వపు వినియోగముల నాక్షేపింప వీలు లేదు(4).

సమష్టికుటుంబమెంబరుయొక్క వారసులుకూడ అతడు చేసిన వినియోగముల నాక్షేపింపవచ్చునని అ. హై. వారు తీర్మానించిరి(5).

పితామహుడు చేసిన వినియోగమును, అప్పటికి పుట్టియుండని పౌత్రుడు ఆక్షేపింపజాలడు(6).

న్యాయసమ్మతముకాని వినియోగమును దరిమిలాను వినియోగమునుపొందినవాడు ఆక్షేపింపవచ్చును(7).

---

(1) 64 ఇం. కే. (అ) 885; 115 ఇం. కే. (పా) 886; 79 ఇం. కే. (అ) 1019; 112 ఇం. కే. (మ) 553; 94 ఇం. కే. (నా) 948; 33 అ 654; 61 ఇం. కే. (లా) 628; 40 క. 966; 18 ఇం. కే. (క) 625.

(2) 44 అ 190; 1924 (ఔ) 141; 78 ఇం. కే. (నా) 260

(3) 45 ఇం. కే. (అ) 451; 75 ఇం. కే. (అ) 931; 1930 అ 852; 42 అ 50.

(4) 5 బొం 660; 12 బొం 105; 128 ఇం. కే (అ) 829;

(5) 47. అ. 490.

(6) 1928. మ. 945.

(7) 83 అ. 743; 51 అ. 575; 116 ఇం. కే (అ) 486.

తండ్రి చేసినవినియోగమును తక్కిన మెంబర్లు ఆక్షేపింపవచ్చును. కాని అతని బాకీలకు ఆస్తినిజప్తు చేయించినరుణదాత ఆక్షేపించజాలడు(1). కాని ఆరుణదాత, ఆబాకీలకు వేయించిన వేలములో, ఆస్తినికొనినఖరీదుదారుడు, ఆయా స్థిపైని అదివరకు చేయబడిన వినియోగములు న్యాయమైనయవసరముకొరకు చేయబడలేదనుకారణముపైని ఆక్షేపించవచ్చును(2).

తండ్రి తనఖాపెట్టినప్పుడు, ఆతనఖాఆస్తి స్వాధీనమునిమిత్తము కాని తనఖాఆస్తిని వేలంవేయించి బాకీరాబట్టుకొనుటకుగాని, తనఖాదారు తండ్రిని కుమాళ్ళను కలిపితెచ్చినదావాలో కుమాళ్లు సదరు తనఖాకు ఆక్షేపణలను తెలుపునెడల, కోర్టువారు విచారణచేసి, తనఖా చెల్లునా చెల్లదా ? అనువిషయమును నిర్ధారణచేయవలయును. కాని కుమాళ్లుకూడ పార్టీలుగా నున్నారుకదాయని విచారణలేకుండ డిక్రీ యివ్వకూడదు(3).

29. తండ్రిగాని, కర్తగాని, చేసినవినియోగములు తక్కినమెంబర్లను బాధించవని తీర్మానించినప్పుడు క్రయదారునిగతియేమి ? అని యాలోచింపవలసియున్నది. సమష్టికుటుంబాస్తిలో, తండ్రికి వాటాయుండును కావున, కుమారుడు విభాగమునకు దావాతెచ్చెనేని, తండ్రివిక్రయించినభూములు తండ్రివాటాక్రిందకువచ్చెడి ఆస్తిలో చేరునట్లు వాటాలు వేయించి, విక్రయముచేసిన భూములు క్రయదారునకు యిప్పింపవచ్చును(4). తండ్రివాటాకు సరి

వినియోగములు చెల్లవని తీర్మానించినప్పుడు, క్రయదారుని గతి యేమి ?

(1) 1928 అ. 476.

(2) 15 అ 339; 53 అ 21

(3) 127 ఇం. కే. (బొ) 38;

(4) 86 ఇం. కే. (మ) 234; 46 మ 815.

పడినయా స్త్రియంతయును విక్రయించియున్న యెడల, పైనచెప్పినరీతిగా ఆయా స్త్రియంతయును తండ్రివాటాలో చేర్చి, క్రయదారునకు వదలి వేసి, మిగతా ఆస్తియే కుమారులవాటాలలో చేర్పించుట శాస్త్రసమ్మతముకాదు కీషు మేళ్లునరిచూచి, సరిగా వాటాలు వేయించి, తండ్రివాటా క్రయదారున కిప్పింపవలయును(1).

తండ్రిచేసినవినియోగము కుమారులను బయిండుచేయదని తీర్మానించినప్పుడు, ఆసొమ్మునకు కుమారులవాటాలపైని యెట్టిబాధ్యతయు నుండదు. తండ్రివద్దనుండి క్రయదారునకు తిరిగిరావలసిన సొమ్ము తండ్రియొక్క రుణముగా భావింపబడి కుమారులను బయిండు చేయదు(2).

ఒక మెంబరు చేసినవినియోగము చెల్లదనినప్పుడు క్రయధనము ను తనకు తిరిగియిప్పించుమని వినియోగముచేసినవానిపైని దావా తెచ్చి ఆతనిభాగముపైని అమలుజరుపవచ్చును(3).

తండ్రి, సమష్టికుటుంబాస్తిని విక్రయించినప్పుడు అది రద్దు అగునట్టిసందర్భములోను ఆవిక్రియము ఈక్రింద వివరించిన మూడు తరగతులుగా విభజింపవచ్చును.

(1). క్రయధనము, తండ్రి వాటా ఆస్తికిమ్మెతుకంటె బొత్తుగా తక్కువగా నున్నయెడల, ఆక్రయమును రద్దుపరచి, క్రయధనములో యెంతమొత్తము సమష్టికుటుంబమునంతను బయిండుచేయు కార్యములకు ఖర్చుపడియెనో ఆమొత్తమునకు, సమష్టికుటుంబాస్తిని జవాబుదారీచేయవలయును.

---

(1) 90 ఇం. కే. (మ) 743.

(2) 47 ఇం. కే. (మ) 192; 8 లా 678.

(3) 57 ఇం. కే. (నా) 498.

(2). క్రయధనము, తండ్రివాటా ఆస్తికిమ్మతుకంటె బొత్తుగా తక్కువగాయుండక ఇంచుమించుగా తండ్రివాటాఆస్తికిమ్మతునకు సరిపోవునట్లుండు నెడల, తండ్రివాటామాత్రమే క్రయమైన ట్లెంచబడి, తక్కినవారివాటాలు ఏవిధములగుబాధ్యతలు లేనిదానివలెనే తక్కినవారు రాబట్టుకొనుట కర్హులు- అయితే, క్రయధనములో యెంత మొత్తము సమష్టికుటుంబావసరములకు ఖర్చుపడియెనో, ఆమొత్తములో క్రయము రద్దుఅయిన వారివాటాలకు యెంతఅగునో ఆమొత్తము తండ్రికి, అనగా అమ్మినవానికి కంట్రిబ్యూషనుక్రింద యిచ్చుకొనవలసియుండును. కాని అమ్మినవాడు తక్కినవారితో సమష్టిగానున్నప్పుడును, అతనికి, యీతక్కినవారే వారసులైనప్పుడును కంట్రిబ్యూషను ప్రశ్నరాదు.

(3). క్రయధనము, అమ్మినవానిభాగముకంటె అధికముగానున్నయెడల, తండ్రివాటా విక్రయించినట్లెంచి, ఆవాటాధనము పోను మిగిలినమొత్తములో సమష్టికుటుంబముకొరకు ఖర్చుపడిన మొత్తమునకు సమష్టికుటుంబాస్తిని జవాబుదారీచేసి క్రయదారునకు ఆమొత్తము యిచ్చుకొనునట్లు తీర్మానింపవలయును(1).

క్రయదారు ఆస్తిని స్వాధీనముచేసికొనియుండినయెడల రద్దుఅయినభాగమునకు క్రయమునుగూర్చి తగాదాచేసినది మొదలు గతఫలమీయవలసియుండును(2).

కుటుంబావసరముకొరకుగాని, పూర్వపు రుణతీర్మానముకొరకుగాని కాకుండ ఆస్తిని వినియోగముచేసినప్పుడు క్రయదారునకు

---

(1) 27 మ 162; 23 మ 89; 37 మ 435; 26 మ. లా. జ. 604; 1927 మ 1116 39 ఇం. కే. (మ) 504; 118 ఇం. కే. (మ) 158; 22 ఇం. కే. (మ) 688;

(2) 39 అ 61.

ఆసొమ్మును కుమారు లిచ్చుకొనవక్కరలేదు(1). తండ్రిచేసిన క్రయధనములో కొంత న్యాయమైనయవసరమునకు ఖర్చుపడినప్పుడు, ఆమొత్తమును కుమారులు క్రయదారున కీయవలయును అట్లివ్వనిదే క్రయదారునియొద్దనుండి ఆస్తిని రాబట్టుకొనజాలరు(2).

తండ్రి కానట్టికర్త చేసినక్రయము చెల్లనప్పుడు, క్రయదారు తన క్రయధనముకొరకు కర్తపైని దావాచేసి డిక్రిని పొందవచ్చును. కర్తయును, కర్తభాగమును మాత్రమే క్రయదారునకు జవాబుదారీగాయుండును. తక్కినమెంబర్లు జవాబుదారీకారు.

తండ్రిచేసిన క్రయములనుగూర్చి పైన యీపేరాలో వ్రాయబడినయంశములు తండ్రికానట్టి కర్తచేసిన వినియోగములకును వర్తించును.

కర్తగాని, తండ్రిగాని, చేసినక్రయము చెల్లదని రద్దుచేయునప్పుడు, అందులో తండ్రివాటాయును, కర్తవాటాయును క్రయదారునకు చెల్లవచ్చును. కావున వారివాటాలు ఆదావాలో విడదీసి క్రయదారుస్వాధీనము చేయవలయునా ? లేక మొత్తమాస్తియంతయును కుమాళ్ళస్వాధీనముచేసి క్రయదారుడు విభాగముకొరకు వెళ్ళవలయునని తీర్మానింపవలయునా? యనువిషయమున భిన్నాభిప్రాయములున్నవి. మదరాసు హైకోర్టువారు, మొత్తము క్రియపుటాస్తియంతయును క్రయదారుస్వాధీనమునుండి తప్పించి వాదులస్వాధీనముచేసి, క్రయధనములో సమష్టికుటుంబముకొరకు ఖర్చుపడినసొమ్మును వాదు లిచ్చుకొనునట్లు తీర్పు యివ్వవలయునని తీర్మానించిరి(3). బొంబాయి

(1) 1917 మ. వీ. నో 739.

(2) 67 ఇం. కే. (అ) 307; 67 ఇం. కే. (బొ) 814; 111 ఇం. కే. (లా) 51; 22 ఇం. కే. 44; 23 మ. లా. జ 256;

(3) 25 ఇం. కే (మ) 535; 116 ఇం. కే (నా) 648; 121 ఇం. కే (నా) 43; 18 ఇం. కే (నా) 826.

హైకోర్టువారు క్రయదారు స్వాధీనమునుండి తప్పించనక్కర లేదనియు సమష్టిస్వాధీనమునకు డిక్రియివ్వవచ్చుననియు తీర్మానించిరి(1).

వినియోగమును పొందు సందర్భమున పొందువాని విధులు.

**30.** కర్తవలనగాని తండ్రివలనగాని క్రయమునో తనఖానో పొందు క్రయదారు లేక తనఖాదారు, అప్పుడు, ఆవినియోగమును చేయుటకు ఆకుటుంబమునకు న్యాయమైన యవసరముకలదా ? లేదా ? యని దర్యాప్తు చేసి, అట్టిఅవసరమున్నదని సదుద్దేశముతో తృప్తిపడినమీాదట ఆవినియోగములను పొందవలయునని ప్రి. కౌ. వారు, చాల కేసులలో చెప్పియున్నారు. అట్టి దర్యాప్తును ఆతడు చేసి, తృప్తిపొందినట్లు రుజువుచేయవలసిన బాధ్యత అతనిపైన కలదు. అట్లు సరిగా రుజువుచేసెనేని, ఆద్రవ్యము న్యాయమైన యవసరమునకు వినియోగపడినట్లే యెంచి, ఆవినియోగము చెల్లునని తీర్మానింపవచ్చును(2).

క్రొత్తగా షాపుపెట్టెదనని యొకడు ఆస్తిని తనఖాపెట్టెను. క్రొత్తవ్యాపారము ప్రారంభించునా ? అది యవసరమా ? అనువిషయములనుగూర్చి తనఖాదారు దర్యాప్తు చేసినట్లు తృప్తికరమైన సాక్ష్యము లేదు. అందుచే ఆతనఖా చెల్లదని తీర్మానించిరి(3).

న్యాయమైన యవసరమున్నదా లేదా యని క్రయదారు దర్యాప్తుచేసికొని, తనంతటతాను తృప్తిపొందవలయునేకాని ఆభారమును కోర్టువారిపైని పైచి, కోర్టువారు శాంక్షనుచేసిననేగాని ఆవ్యవహారమును చేయనని క్రయదారు అనుట కధికారము లేదు(4).

(1) 96 ఇం. కే (బొం) 166.

(2). 7 వ పేరా చూడుము; 56 ఇం. కే (బొ) 826; 66 ఇం. కే (పా) 945; 69 ఇం. కే (అ) 683; 44 ఇం కే. 290; 56 ఇం. కే. 700.

(3). 1932 లా 636;

(4). 56 బొం. 519;

వినియోగమును పొందునప్పుడు, పొందువాడు చేసిన దర్యాప్తులో తెలియవచ్చిన విషయములనుబట్టి వినియోగము చేయుట కవసరమున్నట్లు వానికి తెలియవచ్చినదని రుజువుచేసినచో అట్టి యవసరమున్నదని భావింపవలయు ననుసిద్ధాంత మున్నమాట నిశ్చయమే యైనను అతడు సరియైన దర్యాప్తుచేసెనా లేదా యనువిషయమును చాల జాగ్రతగా విచారింపవలసి యుండుననియు, జాగ్రతగా దర్యాప్తు చేసినచో నిజము బయల్పడునని తోచిన కేసులలో పైనచెప్పిన సిద్ధాంతమును వర్తింపచేయకూడదనియు, అ. హై. వారు తీర్మానించినారు(1).

కుమార్తె వివాహమునకు కావలసియున్నదని చెప్పి ఆస్తిని విక్రయించెను. ఆక్రయధనము కుమార్తె వివాహపుఖర్చులక్రింద ఖర్చు పడునట్లు చూడవలసిన బాధ్యత క్రయదారునకు లేదు(2). కాని వివాహముకాదగిన కుమార్తెయే అతనికి లేనప్పుడు క్రయదారు తనవిధిని నిర్వర్తించలేదని యర్థము.

వినియోగము చేయువాడు చెప్పినమాటలు నిజమైనచో ఆకార్యము న్యాయమైన యవసరమై యుండవలయును. లేనిచో ఆ వినియోగము చెల్లదు(3).

వినియోగము చేయువాడు చెప్పెడిమాటలను నమ్మి వ్యవహారము చేయరాదు. ఋణదాత లేక క్రయదారు న్యాయమయిన దర్యాప్తుచేసి తృప్తి పొందవలయును. అట్టి దర్యాప్తు చేసినట్లు నమ్మదగిన సాక్ష్యము లేకపోయినను, అవ్యవహారము చేయుటవలన కుటుం

(1). 131 ఇం. కే (అ) 513;
(2). 92 ఇం. కే (లా) 263.
(3). 85 ఇం. కే (లా) 468; 83 ఇం. కే. 54.

బమునకు చాలనష్టము కలుగునట్లు కనబడుచున్నను, ఆవినియోగము చెల్లదు(1).

దస్తావేజులో, న్యాయమయినయవసరమునుగూర్చి తెలుపబడినమాటలనుబట్టి వినియోగము పొందువాడు సరియైన దర్యాప్తు చేసెనని యెంచవలయునని చెప్పరాదు. దస్తావేజులో వ్రాయుటకంటె యితరమైన సాక్ష్యముచే దర్యాప్తు చేసినట్లు రుజువు చేయవలసియుండును(2).

ఒకడు కొంతభూమిని కవులునకు పుచ్చుకొనుటకై సమష్టి కుటుంబాస్తిని తనఖాపెట్టెను. కవులునకు పుచ్చుకొనుసంగతి నిజమా? అబద్ధమా? అనిమాత్రమే తనఖాదారు దర్యాప్తు చేయవలయును. కాని ఆకవులు కుటుంబమునకు లాభమగునా కాదాయని తనఖాదారు దర్యాప్తు చేయ నవసరము లేదు(3).

దస్తావేజులో ఒకరుణము తీర్చుటకని వ్రాసి, విక్రయించి ఆసొమ్ముతో మరియొకరుణమును తీర్చెను. ఆరుణముమాత్ర మదివరకే చేయబడినదియు, సమష్టికుటుంబమును బయిండు చేయునదియునై యుండెను. ఇది యబద్ధపుకారణములనిగాని మోసమునిగాని యనవీలు లేదనియును, ఈవిక్రయము కుటుంబమును బయిండు చేయునని ముందు తీర్మానించిరి(4).

తండ్రి, కుమారుని వివాహముకొరకని ఆస్తిని విక్రయించెను. వివాహపుఖర్చులకు అమ్మవలసిన యవసరము లేదని రుజువైనది. క్రయదారు, సామాన్య వ్యవహారజ్ఞానము కలవాడు దర్యాప్తు చేసినట్లు చేయలేదని చెప్పి ఆక్రయమును రద్దుచేసిరి(5).

(1). 43 ఇం. కే (పా) 625.

(2). 64 ఇం. కే (నా) 268; 116 ఇం. కే (నా) 643.

(3). 61 ఇం. కే (పా) 20

(4). 88 ఇం. కే. 964

(5). 77 ఇం. కే (లా) 383.

31. కర్తగాని, తండ్రిగాని, చేసిన వినియోగముల విషయమున దావావచ్చినప్పుడు, ఆదావాలో రుజువుభారమంతయును మొట్టమొదట ఆవినియోగము పొందినవానిపై నుండును(1).

ఋజువుభారము.

వినియోగము పొందినవా డేయంశములను రుజువుచేయవలయునో 32 వ పేరాలో తెలుపబడినది. తండ్రి, పూర్వపురుణములకు ఆస్తిని విక్రయించినప్పుడు లేక తనఖాపెట్టినప్పుడు, పూర్వపురుణములున్నవనియు, వాటికొరకు ఆవినియోగము చేయబడినదనియు, రుజువుచేసినచాలును. అప్పుడు తక్కిన రుజువుభారము కుమారులపై పడును(2). కుమారు లేయంశములను రుజువుచేయవలయునో 35 వ పేరాలో తెలుపబడినది.

కోర్టువేలములో ఆస్తిని కొన్నప్పుడు ఋజువుభారము కొన్నవానిపై నుండదు. కోర్టువేలములోగాక ప్రయివేటుగా కొనినప్పుడు పూర్వపురుణములున్నవా ? లేవా ? న్యాయమయిన యవసరమున్నదా ? లేదా ? యను నంశములను జాగ్రతగా దర్యాప్తుచేసినట్లు క్రయదారు ఋజువుచేయవలయును(3).

32. తండ్రిగాని, కర్తగాని, చేసిన వినియోగమునుగూర్చి తగవువచ్చినప్పుడు క్రయదారు లేక తనఖాదారు రుజువుచేయవలసిన యంశము లేవియనగా:—

క్రయదారు లేక తనఖాదారు రుజువుచేయవలసిన యంశము లెవ్వి ?

1. ఆవినియోగము అప్పుడు చేయవలసిన యవసరము కుటుంబమునకు తటస్థించినదా లేదా యని తాను దర్యాప్తుచేసితిననియు, ఆదర్యాప్తువలన ఆయవసరము

(1). 73 ఇం. కే (అ) 1024; 31 అ 176; 26 బొం 326;
(2). 34 అ 296; 16 మ 90; 24 బొం 348; 106 ఇం. కే (పా) 189;
(3). 73 ఇం. కే (అ) 1024.

కలదని తనకు తృప్తియైనదనియు, పదుద్దేశముతో ఆవ్యవహారమునందు తాను ప్రవేశించితిననియు కోర్టువారికి తృప్తికలుగులాగున రుజువు చేయవలయును.

2. తండ్రికాకుండ యితరకర్త వినియోగము చేసినప్పుడు ఆవి నియోగము న్యాయమైన యవసరముకొరకు లేక కుటుంబలాభము కొరకు చేయబడినదని రుజువుచేయవలయును 69 ఇం. కే. 845; 89 ఇం. కే. 100; 12 ఇం. కే. 178.

3. క్రయమైనచో, క్రయధనము బజారుధరల ననుసరించియే యున్నదనియూ, కేవలము తక్కువకు విక్రయింపబడలేదనియు, తన ఖాయైనచో, తనఖాప్రతిఫలము తాను సరిగా యిచ్చితిననియు రుజువు చేయవలయును.

4 తండ్రి వినియోగముచేసినప్పుడు ప్రతిఫలము ప్రాతయప్పులను తీర్చుటకు ఆవినియోగము చేయబడియెనేని ఆకుటుంబమునకు ప్రాతయప్పులున్న సంగతిని రుజువు చేయవలయును.

5. క్రయము సరియైనరేటునకే చేయబడినదని చెప్పుటకు ధాన్యపుధరలు, వాటినిబట్టి ఇన్నిరెట్లుఖరీదు అని రుజువుచేయుట మంచిపద్ధతికాదు. సమీపములోనున్న అట్టిభూములకిమ్మతు ఎట్లున్నదో రుజువు చేయవలయును. 1927 మ 664.

6. తనఖాదారు, తనఖాదస్తావేజులో వ్రాయబడిన షరతులును, వడ్డిరేటును, న్యాయములైనవనియు, అక్రమములు గావనియు రుజువు చేయవలయును, 79 ఇం. కే. (ఔ) 35;

33. ఏవినియోగమైనను, చెల్లదని దావా వచ్చినప్పుడు విని యోగమును పొందినవాడు ఏమి రుజువుచేయవలసి యుండును ?

వినియోగము చెల్ల తగినదని రుజువు చేయుటెట్లు ?

వినియోగమును తండ్రిచేసినప్పుడు, పూర్వ పురుణములున్నట్లును ఆరుణముల తీర్మానమునకని యావినియోగమును తండ్రిచేసినట్లును వినియోగమును పొందినవాడు రుజువుచేసిన చాలును అంతకంటె న్యాయమైన యవసరము మొదలగు విషయములను రుజువు చేయనక్కర లేదు. పూర్వపురుణముల నిచ్చిన రుణదాతయును వినియోగమును పొందినవాడును ఒక్కడేయైనచో, పూర్వపురుణములున్నట్లును అవి న్యాయములనియును ఆతడు రుజువుచేయవలయును. కాని యవసరము రుజువుపర్చనక్కర లేదు(1). తండ్రిచేసిన వినియోగము చెల్లదని కుమారులు దావాతెచ్చినప్పుడు దుర్వ్యవర్తనకొరకై యాసొమ్ము ఖర్చుపడినదనియు, ఆవిషయమును వినియోగమును పొందినవాడు ఎఱిగియుండెననియు రుజువుచేయవలసియుండును. అట్టిరుజువులేనప్పుడు ఆదావా చెల్లదు(2).

తండ్రి పూర్వపురుణములకొరకు కాకుండ వినియోగముచేసిన నాడే ప్రతిఫలమును పుచుకొన్నయెడల ఆవినియోగము న్యాయమైన యవసరముకొరకుగాని లేక కుటుంబలాభముకొరకుగాని చేయబడినదని వినియోగమును పొందినవాడు రుజువు చేయవలసియుండును(3).

తండ్రికానట్టి కర్త వినియోగమును చేసినప్పుడు ఆవినియోగము చెల్లతగినదని రుజువుచేయవలసిన భారమంతయును వినియోగము

(1). 1929 లా 242; 1919 నా 6; 89 ఇం. కే (లా) 47; 63 ఇం. కే (పా) 570; 50 ఇం. కే (బొ) 795; 88 ఇం. కే (బొ) 900;

(2). 68 ఇం. కే (బొ) 288;

(3). 45 అ 718;

పొందినవానిమీఁదనే యుండును. అట్టివినియోగము, ఆపత్కాలమందు న్యాయమైన యవసరముకొరకు లేక కుటుంబలాభముకొరకు చేయబడినదని రుజువు చేయవలయును. లేనిచో అది చెల్లదు.

వినియోగమును పొందినవాఁడు, వినియోగముచేసిన తండ్రికి పూర్వపురుణములున్నవా లేవా యని న్యాయమైనదర్యాప్తు చేసినట్లు రుజువు చేయవలయును. ఆదర్యాప్తు న్యాయముగాను జాగ్రతగాను చేసినట్లును, అప్పుడు తెలిసినసంగతులు నిజమని తాను నమ్మినట్లును రుజువు చేయవలయును. పూర్వపురుణములయొక్క స్వభావమును గూర్చి యాతఁడు దర్యాప్తు చేయనక్కర లేదు(1).

ఇతరకర్త చేసిన వినియోగములవిషయమున కుటుంబమునకు న్యాయమైన యవసరముకలదా ? లేక కుటుంబమునకు ఆవినియోగమువలన లాభముకలదా ? అనువిషయములను జాగ్రతగాను న్యాయముగాను తాను చేసినట్లును, అప్పుడు తెలిసినసంగతులు నిజములని తాను న్యాయముగా నమ్మినట్లును వినియోగమును పొందినవాఁడు రుజువు చేయవలయును(2).

వినియోగమునుపొందినవాఁడు, పైనచెప్పినవిధముగా సరియైన యవసరమునుగాని, లేదా దానినిగూర్చి తాను చేసిన దర్యాప్తునుగాని, రుజువుచేయవలయును. ఈ రెండిటిలో దేనినైనను సంపూర్ణముగ రుజువుచేసినచో ఆవినియోగము చెల్లును(3)

వినియోగమైన చాలకాలమునకు దావా వచ్చినయెడల, పై విషయములను సంపూర్ణముగాను కట్టుదిట్టముగాను రుజువుచేయుభారమును వినియోగముపొందినవానిపైని పెట్టుట న్యాయముకాదు. అట్టి

(1). 79 ఇం. కే (లా) 980; 78 ఇం. కే. 431.

(2). 1927 క 160;

(3). 1924 అ 170;

కేసులలో కొంతభాగమునకు రుజువుండెనేని తక్కినదికూడ న్యాయమని భావింపవలసియుండును(1).

క్రయదారుగాని, తనఖాపట్టినవాడుగాని, ఆ వినియోగము న్యాయమైన యవసరముకొరకు చేయబడినదనియో, కుటుంబలాభముకొరకు చేయబడినదనియో, పూర్వపురుణములకొరకు (తండ్రివిషయమున) చేయబడెననియో రుజువుచేసినప్పుడు, ఆసొమ్ము ఆపనులకు ఖర్చుపడినదని రుజువుచేయవలసిన బాధ్యత తనఖాదారు క్రయదారులపై లేదు(2). కాని అమ్మినవాడు, లేక బదులుపుచ్చుకొనినవాడు దుర్వ్యయముచేయు నలవాటుగలవాడని, ఋణదాత లేక క్రియదారు ఎరిగియుండెనేని, ఆసొమ్ము న్యాయముగా ఖర్చుపడునట్లు చూడవలసిన బాధ్యత వారిపై కలదు. 112 ఇం. కే. (లా) 558; 98 ఇం. కే. (లా) 865; 92 ఇం. కే. 646.

కర్త 1905 లో తనఖాపెట్టెను. భూమిని, తనఖాదారునకు స్వాధీనముచేసెను. 1926 లో తక్కిన మెంబర్లు ఆతనఖా చెల్లదని దావా తెచ్చిరి. అంతకాల మూరక యుండి, తరువాత తెచ్చిన దావా చెల్లదని తీర్మానించిరి(3).

కర్త చేసిన వినియోగమువలన కుటుంబమునకు లాభము కలిగినప్పుడు, ఆలాభమును తాము ఉంచుకొని, ఆవినియోగమును రద్దు చేయుమని కోరుటకు తక్కిన మెంబర్లకు హక్కు లేదు(4).

---

(1). 1924 అ 916; 112 ఇం. కే. 151; 50 అ 828; 44 అ 382; 1922 పా 450; 70 ఇం. కే (లా) 1002; 44 అ 756.

(2). 77 ఇం. కే (లా) 338; 74 ఇం. కే (అ) 498; 70 ఇం. కే (పా) 226; 40 అ 171. 60 ఇం. కే (అ) 3; 51 అ 1039; 1927 (ఔ) 590; 114 ఇం. కే (బొం) 245; 8 లా 632. 98 ఇం. కే (లా) 514; 90 ఇం. కే. 345 & 594.

(3). 132 ఇం. కే. (ఔ) 271.

(4). 98 ఇం. కే (అ) 778.

కోర్టువేలములో కొన్నప్పుడు కోర్టురికార్డులను చూచుటతప్ప, ఆరుణములు అక్రమపురుణములేమోయని క్రయదారు వేరుగా దర్యాప్తుచేయనక్కరలేదు(1).

34. వినియోగము, చెల్లదగినదని రుజువుచేయుటకు దస్తావేజులో వ్రాయబడిన యంశములు సంపూర్ణమైన సాక్ష్యముగా తీసికొనుటకు వీలులేదు(2). కాని, అది కొంత సాక్ష్యముగా తీసికొనవచ్చును(3). దస్తావేజులో వ్రాసినయంశములు దస్తావేజు వ్రాసియిచ్చినవాని యొప్పుదలను, అతడు, క్రయదారుతోగాని, తనఖాదారుతోగాని ఆవినియోగమునుగూర్చి చెప్పినవిషయములను తెలియచేయును కావున వానిని పూర్తిగా త్రోసివేయుటకు వీలులేదు(4). దస్తావేజువ్రాసి చాలకాలము గడచిన పిదప తగవువచ్చినసందర్భములో దస్తావేజులో వ్రాసినవిషయములకు గౌరవ మీయతగియుండును(5). కాని సంగతిసందర్భములు దస్తావేజులోని యంశములకు వ్యతిరేకముగా నున్నను, దస్తావేజులోని యంశములు నిజమును తెలియచేయునవిగా నుండక వేఱు ఉద్దేశముతో వ్రాయబడినట్లు కనబడినను, దస్తావేజులో వ్రాయబడిన యంశములను రుజువుచేయుటకు మనుష్యులు లేకపోయినను,

వినియోగముచెల్లతగినదని చెప్పుటకు దస్తావేజులో వ్రాసిన యంశములు ఎంతవరకు సాక్ష్యముగా ఉపయోగించును?

(1). 73 ఇం. కే (అ) 1024.

(2). 36 అ. (ప్రి. కౌ.) 187; 44 క 186; 40 అ 171; 18 మూ. ఇం. అ 2[illegible]9; 74 ఇం. కే (క) 612; 66 ఇం. కే 36; 1928 పా 143; 87 ఇం. కే 180; 50 అ 828; 74 ఇం. కే. 358; 109 ఇం. కే 35;118 ఇం. కే (అ) 372; 108 ఇం. కే 742; 74 ఇం. కే (కో) 358; 101 ఇం. కే. 769;

(3). 87 ఇం. కే 180.

(4). 1929 అ 481; 1928 క 508; 72 ఇం. కే. 1046; 66 ఇం. కే (అ) 564; 76 ఇం. కే. 598; 66 ఇం. కే. 36;

(5). 34 మ. లా. జ (ప్రి. కౌ.) 291; 1930 అ 9; 108 ఇం. కే. 224; 101 ఇం. కే. 769; 32 ఇం. కే 5;

కాగితములుండి వాటిని ఋణదాత రుజువుపర్చకపోయినను, దస్తావేజులో వ్రాసినయంశములకు ప్రాముఖ్య మీయకూడదు(1). న్యాయమైన యవసరము మొదలగు నంశములను రుజువుచేయుటకు దస్తావేజు కాకుండ యితరసాక్ష్య ముండవలయును(2). ఉభయపార్టీలును చనిపోయినప్పుడు, దస్తావేజులోని యంశములను నిజమని భావనచేయవలయును(3). దస్తావేజులోని యంశములు న్యాయమయిన యవసరమును పూర్తిగా రుజువుచేయవు. న్యాయమయిన యవసరముకలదని యితర సాక్ష్యమునుబట్టి రుజువుచేయవలయును(4).

తండ్రిచేసిన విని యోగములు చెల్లవనుటకు కుమారు లేయంశములను రుజువుచేయవలయును?

35. తండ్రి పూర్వపురుణములకు ఆస్తిని విక్రయించినప్పుడు, ఆరుణములు దుష్ప్రవర్తనకొరకో లేక శాస్త్రసమ్మతములుకాని కార్యములకొరకో చేయబడినవనియు, ఆ రుణములట్టివి యనుసంగతిని క్రయదారు యెఱిగియుండెననియు, లేదా న్యాయమైన దర్యాప్తుచేసియుండినయెడల, క్రయదారున కాసంగతి తెలిసియుండు ననియు, కుమారులు రుజువుచేయవలయును(5). తండ్రి పూర్వపురుణములకు ఆస్తిని విక్రయించినప్పుడు ఆవిక్రయము న్యాయమైన యవసరముకొరకు చేయబడలేదని వాదించిన లాభములేదు. పైనచెప్పినప్రకారము వాదించవలసియుండును(6). తండ్రి రొక్కమునకు విక్రయించినచో ఆవిక్రయము న్యాయమయిన యవసరముకొరకు చేయబడలేదని కుమారులు వాదించవచ్చును(7).

---

(1). 59 క 859.

(2). 28 ఇం. కే (పి్రి. కౌ.) 715.

(3). 128 ఇం. కే 241;

(4). 116 ఇం. కే (648); 119 ఇం. కే (పా) 514; 1927 మ 890;

(5). 59 ఇం. కే (బొ) 570; 78 ఇం. కే (అ) 1024.

(6). 64 ఇం. కే. (బొ) 220; 78 ఇం. కే (అ) 626;

(7). 64 ఇం. కే (బొ) 220;

తండ్రిచేసిన వినియోగముల నాక్షేపించుటకు కుమారులు మొట్టమొదట ఆయాస్తి సమష్టికుటుంబాస్తి యని రుజువుచేయవల యును(1).

తండ్రివ్రాసియిచ్చినతనఖాను రద్దుచేయుమని కోరుటకు ఆ రుణము న్యాయమైనది కాదనియో పూర్వపురుణము కాదనియో వాదించవలయునుగాని, తనఖాదారు తెచ్చినదావాలో తనను పార్టీగా చేర్చలేదనిగాని తాను మైనరుగానున్నందున తనకు సరియైనసంరక్షకు డేర్పడి క్రమముగా వాదించలేదనిగాని చెప్పినంతమాత్రమున తనఖా రద్దుకానేరదు(2).

36. తండ్రిచేసిన వినియోగములను రద్దుచేసి ఆస్తిని స్వాధీనముచేసికొనుటకు వినియోగమును పొందినవాడు ఆస్తిని స్వాధీనము చేసికొనిన పండ్రెండుసంవత్సరములలోపున దావా తేవలయును. లేనిచో కాలదోషముపట్టును. (1908 సం॥ ఇండియను లిమిటేషను ఆక్టు 126 వ ఆర్టికిలు వర్తించును.)(3).

వినియోగములను రద్దు చేయుటకై దావా తెచ్చుటకు కాలదోషము.

కర్తచేసిన వినియోగములను రద్దుచేసి ఆస్తిని స్వాధీనముచేసికొనుటకు వినియోగమునుపొందినవాడు ఆస్తిని స్వాధీనము చేసికొనిన పండ్రెండుసంవత్సరములలోపున దావా తేవలయును. లేనిచో కాలదోషముపట్టును. (1908 సం॥ లిమిటేషను ఆక్టు 144 వ ఆర్టికిలు వర్తించును(4).

(1). 123 ఇం. కే (ఔ) 849; 12 బొం 122;
(2). 126 ఇం. కే (పా) 377.
(3). 84 క 134; 131 ఇం. కే 361; 19 ఇం. కే (క) 878; 13 క. వీ. నో. 815
(4). 29 ఇం. కే 193; 32 ఇం. కే (నా) 242; 49 ఇం. కే (క) 118;

క్రయదారు ఆస్తిని స్వాధీనము చేసికొనిననాటికి కుమారులు మొదలగు తక్కిన మెంబర్లు మైనర్లుగానున్న యెడల, వారికి మైనారిటీ వదలిన మూడు సంవత్సరములలోపున దావా తేవచ్చును. (లిమిటేషను ఆక్టు 6 వ సెక్షను వర్తించును.)(1).

క్రయదారు ఆస్తిని స్వాధీనము చేసికొనిననాటికి, పుట్టియుండక దరిమిలాను జన్మించిన వానికి ఆతనిపుట్టుక మొదలు మరల క్రొత్తగా దావా కారణము కలుగదు(2). కాని, అతనియన్నకు దావా కారణముండి, ఆతడు దావా చేయకపూర్వ మీతడు పుట్టియున్న యెడల, యితనికిని దావా కారణముండును. ఎట్లనగా, క. తండ్రి. ఇతడు 1910సం॥రం జనవరు 10 తేదీని ఆస్తిని విక్రయించెను. అతనికి అప్పటికి 'చ' అను కుమారుడుండెను. 'చ' పుట్టినరోజు 1903 సెప్టెంబరు 20 వ తేదీ. 1912సం॥రం ఏప్రియల్ 1వ తేదీని 'క' కు 'ట' అను మరియొకకుమారుడు కలిగెను. 'చ' 'ట' లు ఇద్దరును 1922 సం॥రం ఫిబ్రవరు 23 వ తేదీని దావా తెచ్చిరి. దావాకు కాలదోషముపట్టినదని ప్రతివాదులు వాదించిరి. లిమిటేషను ఆక్టు 6 వ సెక్షను ప్ర॥ 'చ' కు దావా చేయుటకు 1921 సం॥రం సెప్టెంబరు 20 వ తేదీని దావా కారణము ప్రారంభమగును గాని క్రయము జరిగిన 12-1-1910 తేదీనుండి కాదనియు, 1921 వ సం॥రం సెప్టెంబరు 20 వ తేదీలోపలనే 'ట' పుట్టియుండుటచే, 'ట' పుట్టిన తేదీ నుండి 18 సంవత్సరములు కాకపోయినను అన్నగారితోపాటు, ఇతనికిని 20-9-1921 తేదీనుండి, దావా కారణము

(1). 44 బొం 742; 45 క 446; 59 ఇం. కే 589; 140 ఇం. కే (లా) 375.

(2). 86 ఇం. కే (ప్రి. కా.) 249; 1930 లా 394; 47 అ 165 ప్రి. కా.; 112 ఇం. కే (మ) 563; 61 ఇం. కే. 601; 1925 అ 54; 83 ఇం. కే (అ) 1052; 79 ఇం. కే. (అ) 1010, 1019; 82 ఇం. కే (అ) 607.

ప్రారంభమై 20-9-1924 తో కాలదోషముపట్టుననియు, లాహోరు హైకోర్టువారు తీర్మానించిరి(1).

ఆస్తిని క్రయదారు స్వాధీనము చేసికొనిన నాటికి పుట్టియుండిన వారికిగల దావాకారణముతో దరిమిలాను జన్మించినవారికి గూడ దావాకారణము కలిగి వారికి కాలదోషముపట్టినప్పుడే దరిమిలాను జన్మించినవారికికూడ కాలదోషముపట్టును. కాని ఆస్తి క్రయదారునకు స్వాధీనమైనదరిమిలాను జన్మించినవారికి వారిజన్మముతో క్రొత్తగా దావాకారణము కలుగను(2).

ఒకనికి ఇద్దరు ముగ్గురు కుమారులుండి, అందు పెద్దవాడు మేజరయినపిమ్మట తండ్రిచేసిన క్రయమును రద్దుచేయుటకు దావా తీసుకొనిరాకపోవుటచే కాలదోషముపట్టెనేని, తక్కినవారికికూడ కాలదోషముపట్టునని కొన్నితీర్పులున్నవి. ఆతీర్పు లట్లుచేయుటకు కారణము పెద్దవాడు కుటుంబకర్త కావున అందరితరఫునను దావాచేయతగినవాడు దావాచేయకపోయినచో, అందరికినికూడ కాలదోషముపట్టుననియు, ఇండియను లిమిటేషను ఆక్టు 7 వ సెక్షను ఇట్టికేసులకు వర్తించుననియు చెప్పియున్నారు. అయితే పెద్దవాడు కుటుంబకర్తకాకుండనుండనేని (తండ్రి బ్రదికియుండవచ్చును. అప్పుడు జ్యేష్ఠసోదరుడు కర్త కానేరడు.) యీతీర్పులు వర్తించవని తోచుచున్నది(3). ఈభేదమును పాటింపకయే పెద్దవాడు దావాచేయకపోవుటచే అతనికి కాలదోషము పట్టినను, తక్కిన వారికి కాలదోషముపట్టదు అని కొన్నితీర్పులైనవి(4).

---

(1) 140 ఇం. కే. (లా) 375; 40 క 966. ప్రి. కౌ;

(2) 86 ఇం. కే. ప్రి. కౌ. 249; 47 అ 165 ప్రి. కౌ; 112 ఇం. కే. (మ) 553; 61 ఇం. కే. 601; 1925 అ 54.

(3) 38 మ 118; 103 ఇం. కే. (మ) 863; 59 ఇం. కే. 759; 16 మ 436.

(4) 51 మ 627; 1927 అ 188; 1926 మ 1190;

ఈతీర్పులు ఒక ప్రి.కౌ. తీర్పు నాధారముగ తీసికొనినవి. కాని, ఆ ప్రి.కౌ. తీర్పు(1). లో, ఇందుతో సంబంధించిన తీర్పులనన్నిటిని విమర్శించియుండలేదు. అ.హై. వారి తీర్పుతో ఏకీభవించినట్లు మాత్రము వ్రాయబడినది. అందుచే ఈవిషయమున ప్రి.కౌ. వారితీర్పు సంపూర్ణ విమర్శమైనమీాదట నీయబడినదిగా కనుపట్టుటలేదు. ప్రి. కౌ. తీర్పు స్పష్టముగా లేదని మదరాసు లా జర్నలు పత్రికాధిపతు లభిప్రాయమిచ్చియున్నారు(2). ఎట్లయినను ఈవిషయ మింకొకసారి సంపూర్ణమైన విమర్శకు లోనుగావలసియున్నది.

తండ్రిగాని, కర్తగాని, సమష్టికుటుంబాస్తిని విక్రయము చేయునప్పుడు, తమతోపాటు తక్కిన కుటుంబమెంబర్లలోని మైనర్లకు గార్డియనులుగా నుండి కొందరు దస్తావేజులను వ్రాయుచున్నారు. కొందరు తక్కినవారిని చేర్చకుండ తామొక్కరే వ్రాయుదురు ఈ రెండుకేసులలోను కూడ మైనర్లు ఆవిక్రయములను రద్దుచేయుటకు ఇండియను లిమిటేషను ఆక్టు 44 వ ఆర్టికలు ప్రకారముగా మైనారటీవదలిన మూాడుసంవత్సరముల లోపుగా దావా తేవలయునా? లేక 126-144 ఆర్టికిలుల ప్రకారముగా క్రయదారు విక్రయమైన ఆ స్తిని స్వాధీనము చేసికొనిన పండ్రెండు సంవత్సరములలోపున దావా తేవచ్చునా? అని సంశయమురాగా మైనరుతాలూకు స్వంతఆస్తిని గార్డియను విక్రయించినప్పుడుమాత్రమే 44 వ ఆర్టికిలు వర్తించునుగాని సమష్టికుటుంబములోని మైనరుభాగమును కర్తగాని తండ్రిగాని విక్రయించినప్పుడు ఆయాస్తి స్వాధీనముకొరకు 44 వ ఆర్టికిలు వర్తించదనియు, 126-144

(1) 93 ఇం. కే. 216.

(2) 50. మ. లా. జ. 49.

ఆర్టికిల్సు వర్తించి పండ్రెండు సంవత్సరములవరకు కాలదోషము పట్ట దనియు తీర్మానించియున్నారు(1).

తండ్రివలన క్రయమును పొందిన క్రయదారు ఆస్తిని స్వాధీనము చేసికొనకుండ నున్నప్పుడు, ఆక్రయమును రద్దుచేయుటకై దావాను తెచ్చునెడల క్రయమైన తేదీమొదలు ఆరు సంవత్సరముల లోపున తేవలయును. లేనిచో కాలదోషము పట్టును(2). అదివరకే స్వాధీనము కలిగియున్నవారిపేర తండ్రి తనఖావ్రాసి యిచ్చినయెడల, ఆ తనఖాను రద్దుచేయుటకై తెచ్చెడిదావాకు ఆరు సంవత్సరములు కాలదోషము(3).

ఒకమెంబరు ఆస్తిని విక్రయించినప్పుడు క్రయదారు ఆయాస్తిలో ప్రవేశించినదిమొదలు వరుసగా పండ్రెండు సంవత్సరములు అతని భుక్తములో నుండెనేని వ్యతిరేకభుక్తమువలన క్రయదారునకు హక్కు యేర్పడును. తక్కిన మెంబర్లు దానిని రాబట్టుకొనజాలరు(4).

తండ్రిపెట్టిన తనఖాబాకికి దావాచేయబడి, ఆబాకీకి కోర్టువారివలన ఆస్తి వేలమయినప్పుడు, ఆ వేలము రద్దుచేయవలయునని ఒక సంవత్సరములోపున దావా తేవలయును. అట్లు దావాచేయనియెడల కాలదోషము పట్టును. దర్మిలాను తనఖా విడిపించుటకు వేరే దావా తేకూడదు. ఇతరబాకీకి వేలమయినప్పుడును 1 వ సంవత్సరములోపున ఆవేలమును రద్దుచేయించుమని దావా తీసుకొని రావలయును(5).

---

(1) 44 ఇం. కే. (మ) 605; 86 ఇం. కే. 234; 84 ఇం. కే (మ) 794; 8 ఇం. కే. (అ) 505; 38 అ 126.

(2) 119 ఇం. కే. (అ) 90; 114 ఇం. కే. (లా) 59; 1929 అ 750;

(3) 53 అ 163.

(4) 54 ఇం. కే. (మ) 885;

(5) 116 ఇం. కే. (పా) 543; 56 ఇం. కే. (పి. కౌ.) 274; 84 ఇం. కే. 288.

37. సమష్టికుటుంబము తాలూకు ఆస్తిని విక్రయించుటకు కర్త యితరులతో కాంట్రాక్టు చేసినప్పుడు ఆవిక్రయము న్యాయమైన యవసరముకొరకుగాని, కుటుంబ లాభముకొరకుగాని, పూర్వపురుణముల (తండ్రి అయినయెడల) కొరకుగాని చేయబడినప్పుడు, ఆకాంట్రాక్టు చెల్లును. అందరు మెంబర్ల వాటాలను బయిందు చేయును. ఆకాంట్రాక్టుప్రకారము విక్రయమును పూర్తిచేయించుటకై క్రియదారు కోర్టులో దావా తెచ్చి, తక్కిన మెంబర్ల భాగముల మీదను మైనరు మెంబర్ల భాగములమీదను కూడ డిక్రి పొందవచ్చును(1). కాని ఆవిక్రయము పైన చెప్పిన కార్యములకు కాకపోయినచో అది చెల్లదు. తక్కిన మెంబర్లను మైనరు మెంబర్లను బయిందు చేయదు. ఆకాంట్రాక్టునుబట్టి విక్రయమును పూర్తిచేయుటకు డిక్రి యివ్వకూడదు. కాంట్రాక్టును వ్రాసియిచ్చినవాని భాగముమీదనైనను డిక్రి యివ్వకూడదని తీర్పులున్నవి(2). అయితే అట్టి విక్రయమునకు కాంట్రాక్టుయిచ్చినకర్తపైని నష్టమునకు దావా తెచ్చి డిక్రిపొందవచ్చును(3).

విక్రయమునకు కాంట్రాక్టుచేసినప్పుడు గానినిఅను లంజరుపుటకు మైనరు మెంబర్లపైని దావా చేయవచ్చునా ?

సమష్టికుటుంబములోని యొక మెంబరు తన భాగమును విక్రయించుటకు కాంట్రాక్టు వ్రాసియిచ్చినప్పుడు ఆకాంట్రాక్టుననుసరించి దావా తేవచ్చును. కాని, కుటుంబాస్తిలో యేదేని యొకప్రతిని పూర్తిగా తనభాగమని యగ్రిమెంటు వ్రాయించియిచ్చినప్పుడు ఆకాంట్రాక్టునుబట్టి దావా తేకూడదు(4). ఆప్రతిలో కాంట్రాక్టు వ్రాసి యిచ్చిన వానిభాగమునకు కూడ డిక్రి యివ్వకూడదు(5).

---

(1) 23 మ. లా. జ. 610; 40 ఇం. కే. (పా) 142;

(2) 26 మ 74; 32 మ 320; 37 మ 387; 37 మ 403; 38 మ 1187; 38 మ 859,

(3) 39 ఇం. కే. (మ) 358; 26 బాం 326.

(4) 38మ 1187; 39మ 265; 38మ 684; 37మ 387; 40మ 365; 42 ఇం. కే. 378.

(5) 16 మ. లా. ట. 370.

తండ్రి కొంతభూమిని విక్రయించుటకు, కంట్రాక్టువ్రాసియిచ్చెను. ఆకంట్రాక్టు ప్రకారము క్రయదస్తావేజు వ్రాయించియిప్పించుమని తెచ్చి నదావాలో ఆకంట్రాక్టు కుమారునిభాగముపైని బయిండు కాదని నిర్ణయించి, తండ్రిభాగమునకుమాత్రమే డిక్రియిచ్చిరి. క్రయదారు, తండ్రిపైని నష్టమునకు దావాతెచ్చి డిక్రీని పొందెను. ఆడిక్రీవారంటు గ్రంథములో కుమారునివాటాసహా మొత్తముఆస్తిపైని అమల్లు జరుపవచ్చునని తీర్మానించిరి(1).

కుటుంబమేనేజరు, సమష్టికుటుంబావసరముకొరకు కొంతఆస్తిని విక్రయించుటకు యగ్రిమెంటును వ్రాసియిచ్చి పిమ్మట చనిపోయెను. ఆయగ్రిమెంటు మైనర్లుసహా తక్కినమెంబర్లను బయిండుచేయునని తీర్మానించిరి(2).

ప్రి. కౌ. వారొకకేసులో మైనరుయొక్క సంరక్షకుడుగాని, మైనరుయస్టేటుయొక్క మేనేజరుగాని, మైనరుతరఫున క్రయవిక్రయములు జరుపుటకు కంట్రాక్టువ్రాసియిచ్చినచో అవి చెల్లవని ఒకసందర్భములో తీర్మానించియున్నారు(3).

ప్రి. కౌ. వారితీర్పు, సమష్టికుటుంబకర్తకు అన్వయించదనియు, న్యాయమైన యవసరముకొరకుగాని, కుటుంబలాభముకొరకుగాని, చేసినకంట్రాక్టులలో మైనరుమెంబర్ల భాగములమీదకూడ డిక్రియివ్వవచ్చుననియు, పా. హై. తీర్మానించినారు(4).

(1) 116 ఇం. కే. (మ) 360.

(2) 3 లా. వీ. 435; 4 మ. లా. జ. 9;38 మ. లా. జ. 77; 44 మ. లా. జ. 226; 46 మ. లా. జ. 575; 23 మ. లా. జ. 610.

(3) 39 క 331.

(4) 40 ఇం. కే. (పా. ఫు. బెం) 142;42 మ 185 ఫు బెం;

ప్రి. కౌ. వారితీర్పు, సమష్టికుటుంబకర్తకును తండ్రికినికూడ వర్తించుననియు, అట్టికాంట్రాక్టుల ననుసరించి వచ్చెడిదావాలలో మైనర్ల భాగములకుతప్ప, మిగిలినభాగములకు డిక్రియివ్వవచ్చుననియు, మైనర్ల భాగములమీద డిక్రియివ్వరాదనియు, క. హై. తీర్మానించినారు(1). మేజరుమెంబర్ల భాగములకు వారుకంట్రాక్టులో చేరకపోయినను డిక్రియిచ్చినారు(2).

కర్త కుటుంబాస్తిని విక్రయించుటకు యగ్రిమెంటువ్రాసియిచ్చినప్పుడు, ఆకంట్రాక్టు మైనరుమెంబర్లను బయిండుచేయదని కోర్టువారు నిర్ధారణచేసినప్పుడు, క్రయదారు కర్తపైని నష్టమునకు దావా తేవచ్చుననియు, ఆనష్టమును యగ్రిమెంటు వ్రాసినకర్త, తనసొంతబాధ్యతపైని యిచ్చుకొనవలసియుండుననియు, అదిసమష్టికుటుంబాస్తియనియు, మెంబర్లలో మైనర్లున్నారనియు, కర్తకు విక్రయించుటకధికారమున్నదనియు, ఆవిక్రయము అప్పుడు చేయుట కవసరమున్నదనియు, క్రయదారు యెరిగియున్నను, నమ్మినను కూడ ఆనష్టమిచ్చుకొనవలసిన బాధ్యత కర్తకు తప్పదనియు తీర్మానించియున్నారు(3).

విశేషవిషయములు.*

(1) తండ్రి సమష్టికుటుంబము తా॥ భూమిని కవులునకుయిచ్చి ఆశిస్తును తనఖాబాకీకి అగుపడ్డ డిక్రీద తీర్మానించుట కేర్పరచి అందు కొన్ని అక్రమపుషరతులనుచేర్చెను. ఆకవులు చెల్లదని ప్రి. కౌ. వారు తీర్మానించి కుమారునివాటాను కవులునుండి విడిపించిరి. 69 ఇం. కే. 273.

(1) 69 ఇం. కే. (క) 192; 127 ఇం. కే. (క) 66.

(2) 127 ఇం. కే. (క) 66.

(3) 39 ఇం. కే. (మ) 358;

* తండ్రి పెట్టెడుతనఖాలను గూర్చి మరికొన్నివిషయములు విశేషప్రకరణములో వ్రాయబడినవి. కావున అచ్చట చూడవలయును.

(2) తండ్రి చాలదూరదేశములో వంటవాడుగా నుండెను. విక్రియముచేసిన ఆస్తివలన ఆదాయము వచ్చుటలేదు. కుమారుని యుపనయనమువచ్చినది. అతనికి 11-12 సంవత్సరములవయసుండెను ఆస్థితిలో ఆస్తిని అమ్మివేసెను కుమారుని భాగముతోసహా తండ్రి చేసిన క్రయముచెల్లునని తీర్మానించిరి. 101 ఇం. కే. (మ) 571.

(3) తండ్రి, సమష్టికుటుంబాస్తిలోనుండి కుమార్తెకు కుటుంబముయొక్క స్థితిననుసరించి న్యాయమైనంత ఆస్తిని ఉచితముగానీయవచ్చును. 21 మ. లా. జ. 695; 32 మ. లా. జ. 364.

(4) కాని, తండ్రి తనభార్యకుగాని, తనతల్లికిగాని అట్లు ఉచితముగా నీయవచ్చునని తలంపరాదు. ఈసందర్భమున కుమార్తెకును తక్కినవారికిని భేదమున్నది. తల్లికిని భార్యకును వారిజీవనాంశము కొరకు తగినయేర్పాటును మాత్రమే చేయవచ్చును. తండ్రి, కుమారులతో పంచుకొనినచో తనవాటాను యెంతవచ్చునో అంతవరకును భార్య, తల్లి, వీరలకు దానమీయవచ్చునను వాదము చెల్లదు. 47 మ. లా. జ. 465

(5) తండ్రి కుటుంబావసరముకొరకు విక్రియముచేసెనని క్రియదారు రుజువుచేసినప్పుడు, ఆయవసరము మరియొకవిధముగా గడపవచ్చుననియు, క్రయముచేయవలసినయవసరములేదనియు రుజువు చేయవలసిన బాధ్యత కుమారులపై నుండదు. 79 ఇం. కే. (బొ)663.

(6) తండ్రియొక్క రుణములకును, విక్రయముయొక్క ప్రతిఫలము యిచ్చుటకును గలసంబంధమును క్రయదారు రుజువు చేయవలయును. 1923 లా 255.

(7) విక్రయము, అవసరముకొరకు చేయబడినప్పుడు, తండ్రి కుటుంబమేనేజరుగానున్నట్లు దస్తావేజులో వ్రాయబడలేదను విషయము లెక్కింపదగినదికాదు. 120 ఇం. కే. (అ) 549.

(8) కర్త లేక తండ్రి చేసిన క్రయము చెల్లకూడదని దావా తెచ్చు నప్పుడు డిక్లరేషనునకు మాత్రమే దావా తేకూడదు ఆస్తిస్వాధీనము కొరకుకూడ దావా తేవలయును డిక్లరేషనునకుమాత్రమే దావా తెచ్చిన యెడల కోర్టుఫీజు చెల్లించినచో ఆదావాలోనే స్వాధీనము కొరకు డిక్రియివ్వవచ్చును(1).

(9) క్రియమురద్దుచేసినను తండ్రి దుర్వ్యవర్తనాదులకొరకు ఆసొమ్మును వ్యయముచేసియుండనిచో కుమారులు క్రయధనమును క్రయదారునకు యిచ్చి, ఆ స్తినిస్వాధీనము చేసికొనవలసియుండును. యిది తండ్రియనంతరము కాబడినడిక్రి(2).

(10) తండ్రి, తానును, మైనరుకుమారుల తరఫున సంరక్షకుడు గాను ఒకతనఖాను వ్రాసియిచ్చెను. మైనర్లు యుక్తవయస్సువచ్చిన పిమ్మట, ఆతనఖాయావత్తుబాకీ తీర్చుటకై ఆస్థిని ట్రాన్సుఫరుచేసినంత మాత్రమున వారు ఆతనఖాబాకీకి అంగీకరించినట్లుగాని, ఆతనఖా న్యాయమయినయవసరముకొరకు చేయబడినట్లు రుజువుచేయువలసిన బాధ్యతను తనఖాదారునుండి తప్పించినట్లు వప్పుదలయున్నదనిగాని భావింపకూడదు(3).

(11) తండ్రి, సమష్టికుటుంబాస్తిని విల్లుద్వారా ఎవరికిని చెంద చేయలేడు. సమష్టిగానుండగా వ్రాసినవిల్లు చెల్లకపోవుటయే కాకుండ అందువలన సమష్టికుటుంబాస్తియందు కుమారులకుగల భాగపు హక్కుయొక్క స్వభావము మారనేరదు(4).

---

(1) 78 ఇం. కే. (లా) 818; 1932 లా. 636.

(2) 73 ఇం. కే. (లా) 818; 11 క 896;

(3) 134 ఇం. కే. (నా) 274,

(4) 1931 లా 289.

(12) కర్త, వినియోగమును చేసినప్పుడు, దానిని రద్దుచేయుడని దావాతెచ్చుటకు హక్కుకలిగియున్న మెంబర్లలో ఒకనికి కాలదోషము పట్టినయెడల, ఆవినియోగము నాక్షేపించుటకు హక్కుకలిగియున్న తక్కినమెంబర్లకు కాలదోషము లేదు(1).

(13) కర్త, ఎట్టి యవసరమును లేకుండ, పూర్వపుగృహమును ఒకనికి అమ్మివేసెను. ఆతడు మరియొకనికి అమ్మివేసెను. మొదట అమ్మినవానికుటుంబములోనిమైనర్లు ఆక్రయము చెల్లదని దావాతెచ్చిరి. ఆఖరుక్రియుదారు, ట్రాన్స్ఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టుయొక్క 41 వ సెక్షను ప్రకారముగా తనక్రయము చెల్లునని వాదించెను. కాని యిట్టి కేసులకు ఆసెక్షను వర్తించదని చెప్పి క్రయమునురద్దుచేసిరి. 53 అ 290 ప్రి కౌ.

(14) కుటుంబమునకు ఒకయిల్లుకొని, క్రయధనములో కొంత భాగముకొరకు పూర్వపుటాస్తిని మేజరుమెంబర్లయంగీకారముతో కర్త పెట్టినతనఖా చెల్లునని తీర్మానించిరి. 25 ఇం. కే. (అ) 263.

(15) ముగ్గురు సోదరులపేర్లతో తనఖాదస్తావేజు వ్రాయబడియెను. తనఖాబాకి కుటుంబావసరముకొరకని అందుదాహరింపబడినది. కర్త యొక్కడు మాత్రమే సంతకము చేసెను కర్త చేసినంత మాత్రమున అది పూర్తియైన దస్తావేజుగా యెంచబడదనియు, ఆ దస్తావేజు చెల్లదనియు తీర్మానించిరి. 25 మ 389;

---

(1) 1931 అ 603; 1926 పి. కౌ. 16.

# ఏడవ ప్రకరణము.

## ఋణములు *

సమష్టికుటుంబసంబంధమైన యప్పులనుగూర్చి యాలోచించుటకు ముందు వాటిలో గల భేదములను తెలిసికొనవలసియున్నది. ఆభేదము లేవి యనగా ?—

సమష్టికుటుంబ ఋణములలో భేదములు.

(i) సమష్టికుటుంబావసరముకొరకు కర్తచేసినవి. (పితృపితామహ ప్రపితామహులలో నెవరైనను కుటుంబమునకు కర్తగానున్నప్పుడట్టివా రీతరగతిలో చేరుదురు)

(ii) సమష్టికుటుంబావసరముకొరకు కర్తకాకుండ తక్కిన మెంబర్లలో నెవరైనను చేసినవి.

(iii) సమష్టికుటుంబావసరముకొరకు కాకుండ ఇతర కార్యములకొరకుగాని, తమస్వోపయోగముకొరకుగాని, పితృపితామహప్రపితామహులు కానట్టి యితర మెంబరులు (కర్తతో సహా) చేసినవి.

(iv) సమష్టికుటుంబావసరముకొరకు కాకుండ యితర కార్యములకొరకుగాని, తమ స్వోపయోగముకొరకుగాని, పితృపితామహ ప్రపితామహులు చేసినవి.

ఈ నాలుగును ముఖ్యములైన తరగతులై యున్నవి. ఋణములను తీర్చుటకొను, ఆరుణములను సమష్టికుటుంబాస్తిపైని బయిండు

---

* అస్తిని హామీలేక తనఖాయిచ్చి తెచ్చినరుణములనుగూర్చి ఆగవప్రకరణములో చెప్పబడినది. ముఖ్యముగా తనఖాలేని విడిరుణములనుగూర్చి యీప్రకరణములో చెప్పబడును.

చేయుటలోను ఆ యాంతరగతులనుబట్టి బాధ్యతలలో భేదమున్నది. ఈభేదములను గూర్చి యీదిగువ పేరాలలో విమర్శింపబడును.

(ఈప్రకరణములో 'తండ్రి' యని వ్రాసినపుడు సామాన్యముగా ఆశబ్దములో పితృపితామహప్రపితామహులును, కుమారుడు లేక పుత్రుడు అని వ్రాసినప్పుడు ఆశబ్దములో పుత్రపౌత్రప్రపౌత్రులును చేరియున్నారని భావింపవలయును. వ్రాతసౌకర్యముకొరకు అట్లు వ్రాయబడును. సందర్భానుసారముగ 'తండ్రి'—'పుత్రుడు' అనుశబ్దములు ప్రత్యేకముగ తండ్రికిని పుత్రునకును మాత్రమే అన్వయింపచేయవలసిన తావులలో అట్లే యర్థము చేసికొనవలయును)

సమష్టికుటుంబావసరముకొరకు కర్తచేసిన ఋణములు.

2. సమష్టికుటుంబముయొక్క న్యాయమైన అవసరముకొరకును, సమష్టికుటుంబముయొక్క లాభముకొరకును, సమష్టికుటుంబమునకు పూర్వమునుండియు నున్న వర్తకమును కొనసాగించుటకొరకును కర్త అప్పులను చేయవచ్చును. ఆయప్పులు మైనర్లవాటాలతోసహా కుటుంబాస్తిపైని బయిండు అగును(1). న్యాయమైన యవసరమనగా నెట్టిదియో, కుటుంబలాభమనగా నెట్టిదియో ఆరవ ప్రకరణమున విపులముగా చెప్పబడినది. కావున అచ్చట చూడవలయును(2). ఈ దిగువ 4 వ పేరాలో వ్రాసినయంశములనుకూడ చూడవలయును.

విభజించుకొనుటకు పూర్వము చేసినఋణములకు విభాగానంతరము, కర్త తిరిగి ప్రోనోటు వ్రాసియిచ్చినచో అది కర్తను మా

(1). 114 ఇం. కే. (లా) 669; 62 ఇం. కే. (లా) 810; 66 ఇం. కే. (మ) 158[illegible]; 70 ఇం. కే. (పా) 391;

(2). 145—170 పేజీలు.

త్రమే బయిందు చేయును; గాని తదితరులను బయిందు చేయదు(1).

కర్త ప్రానోటుమీద, సమష్టికుటుంబావసరముకొరకు బదులు తెచ్చినప్పుడు, తక్కిన మెంబర్ల వాటాలు కూడ బయిందుఅగును. ప్రానోటు బాకీవ్రాసి యిచ్చినవానిమీద తప్ప తక్కినవారిని బయిందు చేయదను సూత్రము(2), సమష్టికుటుంబకర్తకు వర్తించదు(3).

సమష్టికుటుంబావసరముకొరకు కర్త చేసినను యితరులు చేసినను ఆఋణములకు సమష్టికుటుంబాస్తి బయిందు అగును. ఆఋణములు చేసినవారిసొంతబాధ్యతకూడ నుండును. కాని, ఋణముచేసినవారు వ్రాసియిచ్చెడి పత్రములో గాని ప్రానోటులో గాని, పద్దులో గాని చేరని యితరమెంబర్లపైని సొంతబాధ్యత (Personal liability) యుండదు(4). అట్లుండునని ఒక కేసులో చెప్పబడినది(5). కాని దరిమిలాను ఆకేసుకు వ్యతిరేకముగా తీర్పుయిచ్చినారు(6). కర్తయొక్కడును వ్రాసియిచ్చి తెచ్చిన అప్పులు సమష్టికుటుంబావసరముకొరకైనను తక్కిన మెంబర్లపైని సొంతబాధ్యత యుండదని చాల కేసులలో తీర్మానింపబడినది(7).

(1). 117 ఇం. కే (మ) 720.

(2). 50 ఇం కే. (పి్ర-కౌ) 216; 101 ఇం. కే. (జౌ) 573.

(3). 144 ఇం. కే. (పా) 325; 122 పేజీచూడుము; 66 ఇం. కే. (అ) 150; 31 ఇం. కే. 317. అయినను ఈప్రకరణములో ప్రామిసరినోటు, బాకీలనుగూర్చి ప్రత్యేకముగ వ్రాయబడిన పేరానుకూడ చూడుడు.

(4). 24 మ 555; 59 ఇం. కే. (మ) 685; 65 ఇం. కే. (పా) 224; 22 మ 166; 72 ఇం. కే. (బొం) 242; 66 ఇం. కే (మ) 155; 2 లా 159; 134 ఇం. కే. (పా) 420.

(5) 121 ఇం. కే (పా) 451.

(6). 132 ఇం. కే. (పా) 871.

(7). 19 క 159; 24 మ 555; 12 లా. వీ. 403=59 ఇం. కే. (మ) 685; 132 ఇం. కే. (పా) 871;

కర్తచేసిన ఋణములన్నియును న్యాయమయిన యవసరము కొరకు చేయబడినవను భావన యుండును. న్యాయమయిన యవసరముకొరకు చేయబడెనని ఋణదాత ఋజువుచేయవలయును(1).

కర్త, కొంతభూమిని కవులునకు పుచ్చుకొని, శిస్తుయివ్వలేదు. కవు లిచ్చినవాడు వీనిపై దావాచేసి డిక్రిని పొంది డిక్రిబాకీక్రింద సమష్టికుటుంబాస్తిని జప్తుచేసెను. కర్తయొక్క సోదరుడు తనభాగమును జప్తు చేయకూడదని దావా తెచ్చెను. కవు లిచ్చినవాడు, ఆకవులు వ్యాపారము సమష్టికుటుంబముకొరకు చేసెనని, తన స్టేటుమెంటులో వ్రాయలేదు. కవులు భూమిలో ఫలించిన ఫలసాయము కర్తతోకూడ ననుభవించెనని వాదించెను కాని ఆసంగతి ఋజువుచేయలేకపోయెను. కర్తయొక్క సోదరునివాటా జప్తుచేయకూడదని తీర్మానించిరి(2).

సమష్టికుటుంబా వసరముకొరకు కర్తకానట్టి యితరమెంబరులుచేసినవి.

3. సామాన్యముగా సమష్టికుటుంబమునకు కావలసినయప్పులను చేయుటకు కర్తయే అర్హుడు. కర్తయనగా నెవరో అయిదవప్రకరణమున తెలుపబడినది(3). కర్త హాజరుగా లేనప్పుడును, ఆపత్కాలమునందును, 2 వ పేరాలో చెప్పబడిన కార్యములకొరకు కర్త కానట్టి యితరమెంబరులు చేసినయప్పులు కర్తచేసిన వాటివలెనే కుటుంబాస్తిపైని బయిండుచేయును కుటుంబమెంబర్లందరును వాటిని తీర్చుటకు బాధ్యులైయుందురు(4). ఈవిషయము మిటాక్రింది స్మృతులలో నంగీకరింపబడినది.

(1). 74 ఇం. కే. (లా) 484; 117 ఇం. కే. (నా) 223; 50 ఇం. కే. 36; 12 పా. లా. టై. 741.

(2). 69 ఇం కే. 846.

(3). 118. 119 పేజీలు.

(4). 68 ఇం. కే (మ) 462; 132 ఇం. కే (అ) 568;

అవిభక్తైః కుటుంబార్థే యదృణం తు కృతం భవేత్
దద్యుస్తద్రిక్థినః ప్రేతే ప్రోషితేవా కుటుంబిని.

కుటుంబయుపయోగముకొఱకు అవిభక్తులచేత చేయబడిన రుణమును కుటుంబాధ్యక్షుడీయవలయును. ఆతడు చనిపోయినయెడల గాని, దేశాంతరగతుడైనయెడలగాని బాధ్యులారుణమును తీర్చవలయును. యాజ్ఞ్యవల్క్యస్మృతి.

గ్రహీతా యది నష్టః స్యాత్కుటుంబార్థే కృతో వ్యయః
దాతవ్యం బాంధవైస్తత్స్యాత్ ప్రవిభక్తైరపి స్వతః॥
కుటుంబార్థేఽధ్యధీనోఽపి వ్యవహారం యమాచరేత్
స్వదేశే వా విదేశే వా తం జ్యాయాన్న విచాలయేత్॥

ఋణము గైకొన్నవాడు మృతుడయ్యేనేని, ఆరుణము కుటుంబమునకై వ్యయము సేయబడియున్నచో నట్టిరుణమును విభక్తులు నవిభక్తులునైనవారలగువానిదాయాదు లారుణమును తీర్చవలయును. యజమానుడు స్వదేశమునయున్నను పరదేశముననున్నను వానికుటుంబపోషణమునిమిత్తము వానిభృత్యుడు సేయుఋణమును యజమానుడే తీర్చుకొనవలయును. మనుస్మృతి.

సమష్టికుటుంబమునకు వర్తకమున్నప్పుడు, కర్తయొక్కడే కాకుండ తక్కిన మెంబర్లుకూడ ఆవర్తకములో పాల్గొనవలసియుందురు. అందుచే వర్తకములో పాల్గొనెడి యేమెంబరైనను ఆవర్తకమునకు కావలసిన యప్పులను చేయవచ్చును. వర్తకములేనికుటుంబములోమాత్రము కర్త కాకుండ యితర మెంబరు అప్పుతెచ్చెనేని, ఆసొమ్ము సమష్టికుటుంబమునకు ఖర్చుపడియెనని రుజువుచేయవలసిన భారము ఋణదాతపైనుండును(1).

(1). 1932 లా 671;

కర్తకాకుండ తక్కిన మెంబర్లు ఋణములను చేసినప్పుడు ఆ ద్రవ్యము సమష్టికుటుంబముకొరకు ఖర్చుపడియెనని ఋజువుచేయవలసిన భారమంతయు ఋణదాతపైనుండును.

సమష్టికుటుంబావసరమనగా నేమి?

4. సమష్టికుటుంబావసరమనగా నెట్టిదియో, అరవప్రకరణమున విపులముగా చర్చించియున్నాము. ఆప్రకరణముయొక్క 8-17 పేరాలలో వ్రాయబడినయంశములు యిచ్చటకూడ నన్వయించును. సమష్టికుటుంబావసరము లేవియనగా:—

(అ) సమష్టికుటుంబాస్తిపైని చెల్లవలసినపన్నులు(1).
(ఆ) కుటుంబమునకున్న ప్రాతయప్పులు(2)
(ఇ) సమష్టికుటుంబమెంబర్ల యొక్క జీవితావసరములకు అవసరమయినద్రవ్యము(3).
(ఈ) కుటుంబమునందలి స్త్రీపురుషుల వివాహోపనయనాది సంస్కారముల కగు ఖర్చులు(4).
(ఉ) కుటుంబమెంబర్ల మృతసంస్కారములు, తద్దినములు, మొదలగునవి(5).
(ఊ) కుటుంబాస్తిని కాపాడుటకు అవసరమయ్యెడు వ్యాజ్యపు ఖర్చులు(6).

---

(1). 28 ఇం. కే. 21; 37 ఇం. కే (పా) 888;
(2) 60 ఇం. కే. 219.
(3). 6 అ 417; 29 ఇం. కే. 23.
(4). 27 మ 206; 37 మ 278; 13 ఇం. కే (మ) 802; 1 పా 506; 85 ఇం కే (లా) 741; 32 అ 575.
(5). 14 బొం 567; 16 వీ. 8. 52.
(6). 29 ఇం. కే (మ) 28;

(ఋ) కర్తగాని, మెంబరుగాని, క్రిమినల్ చర్యలలోనుంచి తప్పించుటకయ్యెడి ఖర్చులు(1).

(ౠ) గృహారామమరమ్మతులు, నిర్మాణము, వీటి కగువ్యయములు.

(ఌ) విద్యావ్యయము.

(ౡ) కుటుంబపు రక్షణకుగాను వచ్చినకష్టమునకు చేయబడినరుణములు, పూర్వమునుండియు నున్నవర్తకమును కొనసాగించుటకై చేయబడిన రుణములు(2).

(ఎ) కుటుంబలాభముకొరకు క్రొత్తగా ఆస్తిని సంపాదించుటకై చేయబడురుణములు(3).

Note:—వీటినిగూర్చిన వివరములకు 143-158 పేజీలను చూడవలయును.

సమష్టికుటుంబమెంబరుయొక్క భార్య, తనజీవనాంశముకొరకు దావా తేవలయునన్నచో, భర్తనే కాకుండ తక్కిన మెంబర్లనుకూడ చేర్చి దావా తేవచ్చును. ఆమెకు బాకీపడిన జీవనాంశము సమష్టికుటుంబముయొక్క అప్పుగా యెంచబడవలయును(4).

క. తండ్రి. అతను రు 975/- అప్పుచేసి చనిపోయెను. చ. మైనరుకుమారుడు. చ యొక్క తల్లి, చ కు సంరక్షకురాలుగానుండి, క చేసినయప్పునకును క, యొక్క శ్రాద్ధపుఖర్చులకు రు 400/- బదులుపుచ్చుకుని ఆమొత్తమునకును కలిపి తిరిగి ప్రోనోటు వ్రాసియిచ్చెను.

(1). 45 అ 211; 1 పా 171; 6 క. వీ. నో 619; 89 ఇం. కే. 861; 34 అ 4; 26 మ. లా. జ 528; 4 పా. లా. జ 653.

(2). 21 అ 78; 5 క 792; 11 బొం 605; 127 ఇం. కే (బొం) 507; 102 ఇం. కే. (మ) 680; 121 ఇం. కే (మ) 184; 26 ఇం. కే. (క) 836; 72 ఇం. కే (మ) 48; 1918 మ వీ. నో. 576; 72 ఇం. కే (మ) 815; 60 ఇం. కే. 610; 55 ఇం. కే 711;

(3) 55 ఇం. కే. 974.

(4). 87 ఇం. కే (మ) 571.

ఆప్రోనోటు చెల్లునని యు, మైనరును బయిండు చేయుననియు తీర్మా నించిరి(1).

5. పితృపితామహప్రపితామహులు కానట్టి కర్తగాని, యితర మెంబర్లుగాని, సమిష్టికుటుంబావసరముకొరకుకాకుండ ఇతర కార్యములకొరకుగాని, తమస్వోపయోగముకొరకుగాని, ఋణములను చేసినప్పుడు, ఆరుణములను చేసినవారే తీర్చుకొనవలయును. తక్కిన మెంబర్లుగాని, కుటుంబాస్తిగాని ఆరుణములకు బాధ్యులు కారు. ఆ రుణములను యితర మెంబర్లు తీర్చనక్కర లేదు.

సమిష్టికుటుంబావసరముకొరకు కానట్టిరుణములు- వాటిబాధ్యతలు.

(పితృపితామహప్రపితామహులు చేసినరుణములకు మాత్రము పుత్రపౌత్రప్రపౌత్రులపైని బాధ్యతయుండును. దానినిగూర్చి ఈదిగువ పేరాలలో క్రమక్రమముగా నిమర్శింపబడును). అయితే, అట్టిరుణములను చేసినమెంబరు హామీ, తనఖా, మొదలగువాటిచే ఆ స్తిపైని బాధ్యతకలుగ చేసినప్పుడును అతనిజీవితకాలములో కోర్టువారివలన జప్తుచేయబడినప్పుడును మాత్రము, సమిష్టికుటుంబాస్తిలోని యాతనిభాగముపైని బాధ్యత కలిగియుండును. అతనిజీవితకాలములో నిట్టివి జరిగియుండనియెడల, ఋణదాతలు ఆయప్పులను వదలుకొనవలసినదేగాని రాబట్టుకొనుటకు వేరుమార్గములు లేవు. హిందూలాప్రకారము సమష్టికుటుంబమెంబరుయొక్క భాగము, ఆతనియనంతరమున మృతశేషత్వధర్మముచే తక్కినమెంబర్లలో లీనమైపోవునుగాని వేరుగా నిలిచియుండదు(2). అందుచే ఋణదాతలు తమబాకీకి చనిపోయి

(1). 145 ఇం. కే (ఔ) 187.

(2). 4 ప్రకరణము 4 వ పేరా. 109-115 పేజీలు.

నవానిభాగముపైని బాధ్యతను కలుగజేయుడని కోరుట కవకాశము లేదు(1).

సమష్టికుటుంబములోని యొక మెంబరు తనకొరకు చేసినవిడి రుణములకు అతనిజీవితకాలములో అతనిపైనిదావాచేసి డిక్రిపొంది సమష్టికుటుంబాస్తిలోని యతని యవిభక్తభాగమును జప్తుచేయించి వేలం వేయించవచ్చును(2). అతనిజీవితకాలములో జప్తుఅయినయెడల, అతనిజీవితకాలములోనైనను అతనియనంతరమైనను జప్తుఆస్తిని వేలము వేయించవచ్చును(3). అతనియనంతరము జప్తు చేయవీలు లేదు(4). దావాచేసి, డిక్రికాకపూర్వము అతనిభాగమును తోడజప్తుచేయించినను అతనిజీవితకాలములో డిక్రిని పొందకపోయినచో, జప్తుఅయిన యాస్తిపైని అమలుజరుపవీలు లేదు(5). తోడజప్తుఅయి, అతనిజీవిత కాలములో డిక్రినికూడ పొందినకేసులలో ఆయాస్తిని అతనియనంత రము వేలమువేయవీలులేదని బొం. హై. పా. హై. లు తీర్మానించి నవి(6). తోడజప్తు (attchment before judjment,) అయినఆస్తిని తిరిగిజప్తుచేయనవసరములేదు కావున ఆయాస్తిని అతనియనంతరము వేలము వేయవచ్చునని మ. హై. వారుతీర్మానించినారు(7).

---

(1) 5 క 148; 18 క 157; 18 ఇం. కే. 819; 28 ఇం. కే. 362.

(2) 8 క 198 ప్రి. కౌ; 72 ఇం. కే (ప్రి. కౌ) 48;

(3) 5 క 148 ప్రి. కౌ; 18 క 157 ప్రి. కౌ; 23 అ 106; 89 ఇం. కే. (అ) 291.

(4) 5 క. 148; 18 క 157;

(5) 17 మ 144; 8క 514; 136 ఇం. కే (మ) 778;

(6) 38 బొం 185; 38 ఇం. కే. 956; 83 ఇం. కే. (పా) 418;

(7) 92 ఇం. కే. (మ) 504; 24 ఇం. కే. (మ) 320; 24 ఇం కే. (మ)667; 38 మ 159.

సమష్టికుటుంబమెంబరుపైని ప్రోనోటుబాకీకి దావాతేగా దావామధ్యస్తము దాతను చనిపోయెను. ఆతనిసోదరులను పార్టీలనుగా చేర్చవలయునన్నచో, చనిపోయినవానికి వేరుగా ఆస్తియున్నదని ముందుగా రుజువుచేసినగాని, పార్టీలనుగా చేర్చవీలులేదు ఆవిషయమును వారంటు గ్రంథములో విచారణచేయవచ్చును. గనుక పార్టీగా చేర్చకూడదాయునిన అట్లుచేర్చుట పార్టీకి అనవసరముగా శ్రమకలుగచేయుటయని తీర్మానించిరి(1).

సమష్టికుటుంబమెంబరు చేసిన యతని సొంతయప్పులకు ఆ మెంబరునకు స్వార్జితపుటాస్తి యున్నయెడల, ఆతనియనంతర మా స్వార్జితపుటాస్తి యెవరికి సంక్రమించునో, వారిపైని దావాచేసి ఆ స్వార్జితపుటాస్తిపైని అమలుజరపి రాబట్టుకొనవచ్చును ఆతనిజీవితకాలములోనే డిక్రినిపొందినయెడల, అతనియనంతరము అతనిస్వార్జితపుటాస్తిపైని అమలు జరపి రాబట్టుకొనవచ్చును. పితృపితామహ ప్రపితామహులు చేసిన సొంతయప్పులకుమాత్రము వారియనంతరమునగూడ (అవిఅక్రమములు కాకపోయినచో) సమష్టికుటుంబాస్తిపైని బాధ్యత యుండును. ఇందునుగూర్చి రాబోవుపేరాలలో విపులముగా చర్చింపబడును.

కొందరుమెంబర్లపైని సొంతయప్పులకు దావాచేసి డిక్రిపొందిన ఋణదాతయును ఆమెంబర్లును లాలోచీఅయి, కోర్టువేలములో కొంతఆస్తిని ఋణదాత పాడుకొని స్వాధీనము చేసికొనినప్పుడు తక్కినమెంబర్లు తమభాగములనేగాని మొత్తపుటాస్తిని రాబట్టుకొనజాలరు(2).

(1) 127 ఇం. కే. (మ) 237.

(2) 48 ఇం. కే. (మ) 799.

సమష్టికుటుంబమెంబర్లలో ఎవని భాగమైనను అతనిసొంత యప్పులకు కోర్టులో వేలమయినప్పుడు, వేలమయిన నెలదినముల లోపున బాకీమొత్తమును కోర్టులో డిపాజిట్టుచేసి, తక్కిన మెంబర్లలో ఎవరైనను ఆ వేలమును రద్దుచేయించవచ్చును(1).

6. పితృపితామహులు సమష్టికుటుంబావసరముకొరకు చేసిన ఋణములు 2-3 పేరాలకిందకు వచ్చును. అట్టిఋణములకు ఆపేరాలలో వ్రాసిన విషయములు వర్తించును. అట్టివికాకుండ యితరవిధముగాగాని తమసొంతముకొరకుగాని చేసిన ఋణములకు హిందూధర్మశాస్త్రములలో ప్రత్యేక ధర్మమొకటి నియమితమైయున్నది సమష్టికుటుంబఋణములకు కుమారులు మొదలగువారిపైనుండు బాధ్యతకును, 6-7 పేరాలలో చెప్పబడు ఋణములకు పుత్రాదులపైనుండు బాధ్యతకును భేదమున్నది. ఈ రెండు ఋణములును రెండు బాధ్యతలును ఒక్కతరగతిలోనివికావు. ఈవిషయమును బాగుగ జ్ఞాపకముగ నుంచుకొనవలయును. రెండవతరగతిలోని ఋణముల బాధ్యతా విషయమయిన స్మృతివచనము లివి.

పితృపితామహుల ఋణములతో సంబంధించిన స్మృతివచనములు.

"పితరి ప్రోషితే ప్రేతే వ్యసనాభిప్లుతేపి వా ।
పుత్రపౌత్రైః ఋణం దేయం నిహ్నవే సాక్షిభావితం ।
రిక్థగ్రాహ ఋణం దాప్యో యోషిద్గ్రాహ స్తథైవచ ।
పుత్రోఽనన్యాశ్రితద్రవ్యః పుత్రహీనస్య రిక్థినః ॥

తండ్రి దేశాంతరగతుడైనప్పుడును, చనిపోయినప్పుడును, వ్యసనములచేత పీడితుడైనప్పుడును, పితృఋణము పుత్రపౌత్రులచేత నీయబడవలయును. ఋణమును అంగీకరింపనియెడల, సాక్షులచేత

(1) 51 మ 246.

నిరూపించబడవలయును. దాయధనమును పొందినవాడు ఋణమును తీర్చవలయును. ధనమును పొందినవాడు లేకపోయినచో ధనముతో కూడ భార్యనుపొందినవాడు తీర్చవలయును. వారిద్దరును లేనియెడల, ధనమును పొందనిపుత్రుడు తీర్చవలయును. అతడను లేనిచో, ధనములేకుండ భార్యనుగ్రహించినవాడు తీర్చవలయును.

ఋణం లేఖ్యం కృతం దేయం పురుషై స్త్రిభిరేవతు ।
ఆధిస్తు భుజ్యతే తావ ద్యావత్త న్నప్రదీయతే.

వ్రాతమూలముగా తీసికొనిన ధనము మూడుతరములవారిచే నీయబడదగినది (మూడుతరములు దాటితే ఈయనక్కరలేదు.) ఆ ఋణము, ఎంతవరకు నివ్వబడదో అంతపర్యంతమును తాకట్టుపెట్టిన సొత్తు అనుభవింపబడుచున్నది.

యాజ్ఞవల్క్యస్మృతి.

ఋణ మాత్మీయవ త్పిత్ర్యం పుత్రై ర్దేయం । విభావితమ్
పైతామహం సమం దేయం । తత్సుతస్య తత్
సాన్నిధ్యేపి పితః పుత్రైః ఋణం దేయం విభావితమ్
జాత్యన్ధపతితో న్మత్తక్షయశ్విత్రాదిరోగిణః ॥

తండ్రి చేసిన రుణమును పుత్రులు తమయప్పులవలెనే తీర్చవలయును. పితామహుని రుణములను అసలు మాత్రమే తీర్చవలయును. ప్రపితామహుని రుణమును తీర్చనక్కరలేదు. తండ్రి జాత్యంధుడైగాని, పతితుడైగాని ఉన్మత్తుడైగాని, క్షయాదిరోగములచే బాధనొందుచున్నవాడైగాని, యున్నప్పుడు సాన్నిధ్యమందున్నను అతని రుణములను పుత్రుడు తీర్చవలయును.

బృహస్పతి.

కామా దభ్యాగతం ప్రాప్తం పుత్రై ర్యన్న ర్ణముద్ధృతమ్।
తస్మై తామహం పౌత్రై స్త చ్ఛతుర్థాన్నివర్తతే॥

స్వేచ్ఛచేత చేసినపైతామహాముగురుణమును పుత్రపౌత్రులు తీర్పవలయును. నాల్గవతరమువారు తీర్చనక్కరలేదు.

నారదుడు.

రిక్థభాజ ఋణాం ప్రతికుర్యుః॥ గౌతముడు.
యే యస్య రిక్థభాజస్తే తదృణం ప్రతికుర్యుః।
దద్యుః పుత్రపౌత్రైస్తు రిక్థాభావేపి దేయమ్॥

హారదత్తమితాక్షరా.

రిక్థభాక్కులగు దాయాదులు తా మెవ్వనిదాయమును పంచుకొననుందురో వారు అట్టివారియొక్కరుణములను తీర్చివేయవలయునని గౌతములు. పుత్రపౌత్రులు రిక్థము (ఆస్తి) లేకపోయినను పితృపితామహుల రుణములను తీర్చవలయునని హారదత్తకృతమితాక్షరావ్యాఖ్యానము.

"యథా సాక్ష్యాదికృత మృణం త్రిభిరేవ దేయం తథా లేఖ్యకృతమ ప్యాహా ర్తృపుత్రతత్పుత్రై స్త్రిభిరేవ దేయం నచతుర్థాదిభి రితి నియమ్యతే. నను పుత్రపౌత్రై ర్ఋణం దేయ మిత్యవిశేషేణ ర్ణమాత్రం త్రిభిరేవ దేయ మితినియమితమేవ బాధమస్యే నోత్సర్గస్య పౌత్రై రాధ ర్ణవిషయే స్మృత్యంతరప్రభవా మపవాద శంకా మపనేతు మిదం వచన మారబ్ధం. తథాహి. పత్రలక్షణ మభిధాయ కాత్యాయనే నాభిహితం ఏవం కాలమతిక్రాంతం పితౄణాం దాప్యతే ఋణ మితి. ఇత్థం పౌత్రైరాధ మృణ మతిక్రాంత కాలమపి

పితౄణాంసంబంధి దాప్యతే- అత్ర పితౄణా మితి
బహువచననిర్దేశా త్కాలమతిక్రాంత మితి వచ
నాచ్చతుర్థాదిభి ర్దాప్యత ఇతి ప్రతీయతే తథా హారీ
తేనాపి॥ లేఖ్యంయస్య భవేద్ధస్తే లాభం తస్య వివి
ర్దిశేదితి అత్రాపి యస్యహస్తే లేఖ్యమస్తి తస్య
ఋణలాభ ఇతి సామాన్యేన చతుర్థాదిభ్యో పృణ
లాభోస్తీతి ప్రతీయతే। అతశ్చైతత దాకంకానివృ
త్త్యర్థ మేతద్వచన మితి యుక్తం వచనద్వయం
తు యోగీశ్వర వచనానుసారేణ యోజనీయం॥

సాక్ష్యముంచిచేయబడినరుణ మెట్లు ముగ్గురివలన నీయబడవల యునో అట్లే దస్తావేజువ్రాసియిచ్చి తెచ్చినరుణమైనను, తెచ్చినవా డును అతనిపుత్రుడును పౌత్రుడును ఈముగ్గురుమాత్రమే యివ్వవల యును. నాల్గవవాడు మొదలుగాగలవారు ఇవ్వనక్కరలేదు. రుణము పుత్రపౌత్రులుమాత్రమే తీర్చవలయునని చెప్పబడియుండగా మరల చెప్పటెందుకనగా పత్రము వ్రాసియిచ్చిన రుణముఏమయునై ఇతర స్మృతులు మరియొకరీతిగా చెప్పినవేమో యనుశంకను నివారించుట కొరకు ఈవచనము ప్రారంభింపబడినది. పత్రలక్షణమును చెప్పుచు కాత్యాయనుడు "కాలముగడచినప్పటికి పితరులయొక్కరుణము తీర్చ దగినది" అని చెప్పియున్నాడు ఇచ్చట పితరులని బహువచన ముప యోగించియుండుటచేతను, కాలముగడచినప్పటికి అని చెప్పియుండుట చేతను, నాల్గవవాడు మొదలుగాగలవారుకూడ ఋణమును తీర్చవల యునని తెలుపబడుచున్నది. ఆ విధముగానే హారీతుడును చెప్పి యున్నాడు పత్రము ఎవనిహస్తముననుండునో ఆలాభము వానికి చెందును. అనగా, ఎంతకాలము పత్రము రుణదాతయొద్దనుండునో అంతకాలమును ఆరుణము తీర్చతగినది. అని చెప్పియుండుటచే నాల్గవ

వాడు మొదలగువారుకూడ రుణమును తీర్చవలయును అని యెంచవలసియున్నది అందుచే ఈశంకను నివారణచేయుటకై ఈవచన ముపయోగింపబడినది. రెండువచనములలోను యోగీశ్వరు లగుయాజ్ఞ్యవల్క్యుల వచనమే యోచింపదగినది.

మితాక్షరి.

విద్యమానేపి రోగార్తే స్వదేశాత్ ప్రోషితేఽథవా।
వింశా త్సంవత్సరా ద్దేయం ఋణం పితృకృతంసుతైః॥

తండ్రి, రోగార్తుడై యున్నను, స్వదేశమునందు ఇరువదిసంవత్సరములు లేకుండనున్నను తండ్రిచే చేయబడినరుణము కుమారులచే నీయబడదగినది.

ఋణంతు దాపయేత్ పుత్రం యదిస్యాన్నిరుపద్రవః।
ద్రవిణార్హాశ్చ ధుర్యశ్చ నాన్యథా దాపయేత్ సుతం॥

కుమారుడు, కష్టములులో లేనివాడైనను, ఆస్తిని పొందుటకర్హుడైనను, తీర్చగలసమర్థుడైనను తండ్రిరుణములను తీర్చవలయును. లేనిచో తీర్చనక్కరలేదు.

కాత్యాయనుడు.

పిత ర్యుపరతే పుత్రా ఋణం దద్యు ర్యథాంశతః।
విభక్తా విభక్తావా య స్తా ముద్వహతే ధురం॥

తండ్రి చనిపోయినప్పుడు, ఆతనిరుణమును విభక్తులైన తనయులు వారివారిభాగముల ప్రకార మీయవలయును. అవిభక్తులైనచో అందరుకలసి యివ్వవలయును.

నారదుడు.

7. పితృపితామహులు, సమష్టికుటుంబావసరము మొదలగు 2, 3, 4 పేరాలలో వ్రాసినకార్యములకొరకు గాకుండ యితరవిధముగాగాని, వారి స్వోపయోగముకొరకుగాని, చేసినరుణములను వారియాస్తి సంక్రమింపకపోయినను, పుత్రపౌత్రులు తీర్చవలయునని స్మృతికర్తలు విధించిన బాధ్యతను ధార్మికబాధ్యతయని యీగ్రంథమున వాడుచున్నాము. దీనిని యింగ్లీషులో Pious duty అని యందురు. ఈధార్మికబాధ్యత యనునది ఒక్క హిందూలాలోమాత్రమే యున్నదిగాని మఱి యెచ్చటను లేదు(1) హిందువులలో పురుషుడు మూడు రుణములతో జన్మించుననియు, నందొకటి పితృరుణమనియు, శాస్త్రములు ఘోషించుచున్నవి. పితృదేవతలకు శ్రాద్ధాదికర్మలను చేయుటవలన, పితృరుణము తీరునని ఆర్యుల యుద్దేశము. ఇంతేకాక పితృపితామహులరుణములను పుత్రపౌత్రులు, ఆస్తియున్నను లేకపోయినను తీర్చి వారికి ఋణముతీర్చకపోవుటవలన కలిగెడు నరకబాధలను లేకుండచేయవలయుననియు, ఇదికూడ చేసినగాని మానవునకు పితృఋణముతీరదనియు స్మృతికర్తల యభిప్రాయము. తండ్రిచేసిన రుణమును వడ్డితో సహా పుత్రునకు తీర్చవలయుననియు, పితామహుని రుణమును పౌత్రుడు అసలుమాత్రమే తీర్చవలయుననియు, ప్రపితామహునిరుణములను ఆస్తి సంక్రమించిననేతప్ప తీర్చనక్కర లేదనియు, కొన్నిస్మృతులు చెప్పుచున్నవి. అయినను ఇప్పుడు కోర్టులలో ఆభేదము గమనింపబడుట లేదు. మఱికొన్నిస్మృతులను, వ్యాఖ్యానములను గమనించి, పితృపితామహప్రపితామహుల రుణములను (అవి యక్రమపు రుణములు కాకపోయినచో) వడ్డితోసహా పుత్రపౌత్రప్రపౌత్రులు

ధార్మికబాధ్యత యనగేమి? Pious duty.

(1). 110 ఇం. కే. (మ) 141.

తీర్చవలసియుండునని, స్పష్టముగా తీర్మానించియున్నారు(1). ఈధార్మికబాధ్యత కేవలము నీతిసూత్రములతో సంబంధించినదిమాత్రమే కాదు. అనగా పితామహులరుణములను పుత్రాదులు తీర్పనిచో వారు పాపాత్ములగుదురనియు, నరకమును పొందుదురనియు, చెప్పి మత సంబంధములగు శిక్షలనుమాత్రమే విధించుటకాదు. ఋణదాతలు పుత్రపౌత్రప్రపౌత్రులపై దావాచేసి వారిభాగములను అమ్మించి, ఆయప్పులను రాబట్టుకొనుటకు హక్కుకలిగియుందురు(2) పితామహుల రుణములలో కొన్నిటికి ధార్మికబాధ్యత యుండదు. ఆవివరములు 10, 13 వ పేరాలలో చెప్పబడును.

ఈ ధార్మికబాధ్యత పితామహులుచేసిన నిజరుణములయందు మాత్రమే కలదు. ఆస్తిని తనఖాయిచ్చిన రుణములకు ధార్మికబాధ్యత లేదు(3).

పితామహులుచేసిన రుణములకు అవి అక్రమములును దుష్ప్రవర్తనచే చేయబడినవియును కాకపోయినచో, సమష్టికుటుంబాస్తియందలి పౌత్రులభాగములను అమ్మించి, ఆబాకీ రాబట్టుకొనవచ్చును(4).

పితృపితామహప్రపితామహులుచేసిన రుణములు పుత్రపౌత్రప్రపౌత్రులలాభముకొరకు కాకపోయినను, కుటుంబముయొక్క పూ

(1). 93 ఇం. కే (పి.కౌ) 1031; 114 ఇం. కే. (లా) 703; 112 ఇం. కే. (జో) 288; 142 ఇం. కే (జో) 503; 86 ఇం కే (పా) 721; 85 ఇం. కే (పా. 791; 83 ఇం. కే (పా) 385; 48 అ 518; 84 ఇం. కే (జో) 501; 119 ఇం. కే (నా) 687; 144 ఇం. కే (జో) 397.

(2). 13 క 21; 44 క 524; 85 ఇం. కే (బొం) 181; 25 ఇం. కే (మ) 896; 36 ఇం. కే (మ) 387; 28 ఇం. కే (అ) 593; 28 అ 288; 78 ఇం. కే. (అ) 656.

(3). 50 అ. 546;

(4). 9 జో. వీ; నో. 1063; 1932 బొం 522;

ర్వపుఋణముల తీర్మానముకొరకు చేయబడినవి కాకపోయినను, సమష్టికుటుంబావసరముకొరకు చేసినవి కాకపోయినను, పుత్రాదులు తీర్చక తప్పదు. దీనినే ధార్మికబాధ్యత యందురు. ఈబాధ్యతనుబట్టి మైనర్లుతాలూకు వాటాలుగల కుటుంబాస్తిని అమ్మించవచ్చును. అయితే యీబాధ్యత దుష్ప్రవర్తనకొరకు చేసినఋణములకును శాస్త్రసమ్మతముకాని ఋణములకును ఉండదు(1).

పితామహుడు జీవించియుండి, అతడు కుటుంబకర్తగానున్నప్పుడు, తండ్రిచేసిన అతని సొంతఋణములకు, అతనికుమాళ్ళపైని ధార్మికబాధ్యత లేదనియును, ఆఋణములకు కుమారులవాటాలు కోర్టువేలములో విక్రయించకూడదనియు, అ. హై. వారు తీర్మానించినారు(2).

తండ్రి జీవించియుండగా కుమారులపైని వారి పితామహుని ఋణములకు ధార్మికబాధ్యత యుండజాలదు(3).

దత్తస్వీకారమైన పిదప, జనకతండ్రియొక్క యప్పులకు ఆ దత్తునిపైని ధార్మికబాధ్యతయుండదు(4).

తండ్రి తీర్చవలసినయప్పులను తీర్చనప్పటినుండియును కుమారులపైని ధార్మికబాధ్యతయుండును(5). కాని తండ్రియొక్క స్వార్జితమును, సమష్టికుటుంబాస్తిలోని యాతనిభాగమును ఆయప్పులకు చాలనప్పుడు ధార్మికబాధ్యత కుమారులమీదపడి, వారిభాగములను అమ్మివేయుటకు వీలు కలుగును(6).

---

(1). 75 ఇం. కే. (పా) 66; 12 పా. లా. ట 741; 180 ఇం. కే (లా) 826.
(2). 130 ఇం. కే (అ) 1;
(3). 67 ఇం. కే (పి. కా) 569.
(4). 35 బొం. 169.
(5). 13 ఇం. కే (అ) 530.
(6). 46 మ 64; 58 ఇం. కే 281, 34 క 785; 13 ఇం కే. క 349.

ఈధార్మిక బాధ్యత యనునది, తండ్రితో సమష్టిబాధ్యతయును కాదు. వ్యష్టిబాధ్యతయును కాదు. హిందూలా ననుసరించి ఏర్పడిన యొకానొక విధమగు బాధ్యతయైయున్నది(1). కుమారునియప్పులకు తండ్రిపైని ధార్మిక బాధ్యతయుండదు.

8. ఈధార్మిక బాధ్యతయనునది పుత్రపౌత్రప్రపౌత్రులమీద మాత్రమే యుండును. కాని సోదరులు, వారిబిడ్డలు పినతండ్రులు పెదతండ్రులు వారిబిడ్డలు మొదలగు వారు సమష్టికుటుంబ మెంబర్లుగానున్నను వారిపైని యుండదు. అట్టివారుకుటుంబ మేనేజరులుగానున్న ను సమష్టికుటుంబావసరముకొరకు కాకుండ తను సొంతముకొరకు చేసిన యప్పులకు తక్కినమెంబర్లమీదగాని, వారివాటాఆస్తులమీద గాని బాధ్యతయుండదు(2).

పుత్రపౌత్రప్రపౌత్రులమీద దప్ప తక్కినవారిపైని ధార్మికబాధ్యతయుండదు.

ఒకకుటుంబమునందు తండ్రియును కుమారుళ్ళును మాత్రమే యున్నసందర్భములో యీధార్మికబాధ్యత యుండును గాని, తండ్రికి సోదరులు, సోదరులకుమాళ్లు, మొదలగువారు కూడ ఆకుటుంబము లో సమష్టిమెంబర్లుగా నున్నప్పుడు ఆకుటుంబముకొరకు చేయబడిన అప్పులకు పుత్రులపైని ధార్మిక బాధ్యత యుండదని అలహాబాదు హైకోర్టువా రొకకేసులో చెప్పియున్నారు(3). కాని మదరాసు హైకోర్టువారి యభిప్రాయము ఇందులకు వ్యతిరేకముగానున్నది(4).

(1). 40 మ 581.

(2). 30 అ 460; 6 పా. లా. జ. 526; 66 ఇం. కే. (పా) 945; 126 ఇం. కే 477; 79 ఇం. కే. (నా) 1002.

(3). 148 ఇం. కే. (అ) 762.

(4) 13 మ 47; 50 మ. లా. జ. 1 (17)

9. ధార్మికబాధ్యతను అమలుజరుపుటలో ననేక ప్రశ్నలు బయలుదేరుచున్నవి అందుకొన్నిటి నిట వ్రాసి వాటికి క్రమక్రమముగా నొక్కొక పేరాలో ప్రత్యుత్తరము లీయబడును.

ధార్మికబాధ్యతను అమలు జరుపుటలో వచ్చెడి సంశయములు.

(1). ఆస్తి సంక్రమింపకపోయినను ధార్మికబాధ్యత యుండునా?

(2). ధార్మికబాధ్యత తండ్రి జీవించియుండగనేవచ్చునా? అనంతరము వచ్చునా?

(3). తండ్రియొక్కడను బదులు తెచ్చినప్పుడు ఆబాకీకి దావా చేయుటలో కుమారులనుకూడ పార్టీలనుగా చేర్చవలయునా?

(4). తండ్రియొక్కనిపైనను దావా తెచ్చి డిక్రినిపొందినప్పుడు అమలుజరుపుటలో కుమారులభాగములను జప్తుచేయించి వేలంవేయించవచ్చునా?

(5). అట్లు వేలంవేయించేయెడల, ఆరుణములు తమను బాధించవని కుమారులు డిక్రి వారంటు అమలుగ్రంథములో వాదించవచ్చునా? కోర్టువారికి, వారంటు అమలులో ఆవాదమును వినుట కవకాశముండునా?

(6). అట్టియవకాశము లేనియెడల, కుమారులు ఆవేలమును రద్దుచేయించుడని వేరుగా దావా తేవచ్చునా?

(7). తండ్రియొక్కనిపైనిపొందిన డిక్రి అమలుజరుగకుండ తండ్రిచనిపోయినచో కుమారులను వారసులనుగాచేర్చి వారంటు అమలుజరుపవచ్చునా? అట్లు అమలుజరుపునెడల, ఆరుణములు కుమారులను బాధించవని వారు వాదించవచ్చునా? లేక వేరే దావాచేయవలయునా?

(8). తండ్రియనంతరము కుమాళ్ళను డిక్రిలో చేర్చినప్పుడు కుమాళ్ళపైని యెంతవరకు బాధ్యతయుండును ?

(9). తండ్రియొక్కనిపైని పొందిన డిక్రివారంటుగ్రంథములో తీర్పు రుణస్థునికి ఉండుకున్నహక్కు బాధ్యతలను వేలము వేసినప్పుడు ఆవేలములో కొన్నక్రియదారునకు తండ్రిభాగమునందు మాత్రమే హక్కు కలిగియుండునా ? కుమారుల భాగములయందు కూడ హక్కు కలుగునా ?

(10). తండ్రియొక్కనిపైనిపొందిన డిక్రివారంటుగ్రంథములో సమష్టికుటుంబాస్తి వేలమయినపిమ్మట ఆడిక్రిరుణము తమను బాధించదనియు, అందుచే ఆవేలము తమవాటాలను బాధించదనియు, కుమారులు వేలములోకొన్న క్రియదారుపైని దావా తెచ్చి తమవాటాలను రాబట్టుకొనవచ్చునా ?

ఆస్తిసంక్రమించనిచో ధార్మిక బాధ్యతలేదు.

**10.** పితృపితామహులరుణములను ఆస్తిలేకపోయినను తీర్చవలయునని స్మృతికర్తలు విధించిన బాధ్యతను, యిప్పుడు న్యాయస్థానములు తప్పించివేసినవి(1). పితృపితామహుల స్వార్జితము, సంక్రమించినప్పుడు, ఆస్వార్జితమును, పుత్రపౌత్రప్రపౌత్రుల భాగములుసహా యావత్తుసమష్టికుటుంబాస్తియును ఆరుణముకు బాధ్యతకలిగియుండును(2). పితృపితామహప్రపితామహుల రుణములకు పుత్రపౌత్రప్రపౌత్రులుగాని, వారిస్వార్జితముగాని, వారి సొంతఆస్తిగాని జవాబుదారీకానేరదు.

(1) 28 ఇం. కే. (ప్రి. కౌ.) 1081; 27 మ. (ఫు. బెం) 243; 121 ఇం. కే. (అ) 257; 71 ఇం. కే. 417; 65 ఇం. కే. (పా) 224; 68 ఇం. కే. (పా) 813; 10 పా 806; 85 ఇం. కే. (లా) 462; 79 ఇం. కే. (నా) 864; 1928 అ 166.

2) 13 మ క. 21; 44. క. 174; 65 ఇం. కే. (బొం) 521;

సమష్టికుటుంబముకొరకు కాకుండ మరియొక కార్యముకొరకు పితాది దులకు ఋణమిచ్చినఋణదాతలు పుత్రాదుల సొంతబాధ్యతపైని డిక్రి యిప్పించుమనిగాని, వారిసొంతఆస్తిని అమ్మించి యిప్పించుమనిగాని న్యాయస్థానములను కోరుటకు హక్కులేదు. వారిని జైలునకు పంపించుటకు హక్కులేదు(1).

తండ్రి, కుమారుల లాభముకొరకు అప్పుచేసినయెడల, ఆరుణమునకు కుమారులపైని సొంతబాధ్యత (Personal liability) యుండును అని పాట్నాహైకోర్టువారొక కేసులో తీర్మానించినారు. ఈకేసులో కుమారులపైనికూడా డిక్రియున్నది(2).

తండ్రిచేసినబాకీకి కాలదోషము పట్టినపిమ్మట కుమారుడు మరల దస్తావేజు వ్రాసియిచ్చెను. ఆబాకీకి సమష్టికుటుంబాస్తి యున్నంతవరకుమాత్రమే డిక్రి యివ్వవలయునని తీర్మానించిరి. కుమారుడు తిరిగి వ్రాసియిచ్చెను కదాయని, కుమారునిపైని సొంతబాధ్యత యుండదని తీర్మానించిరి(3).

(1) 46 మ లా. జ. 590; 1 ఇం. అ. 321; 6 మూ. ఇం. అ. 393; 5 క. 148 (ప్రి.కౌ); 110 ఇం. కే (మ. పు. బొం.) 141; 132 ఇం. కే. (పా) 871; 101 ఇం. కే. (క) 578; 138 ఇం. కే. (నా) 168; 107 ఇం. కే (బొ) 884; 39 ఇం. కే. (పా) 352; 12 పా. లా. టై. 741; 134 ఇం. కే. (పా) 160;

(2) 136 ఇం. కే. (పా) 447.

(3) 119 ఇం. కే. (అ) 109;

11. ఈధార్మిక బాధ్యత తండ్రిజీవిత కాలములో కూడ కుమారులపై నుండునని తీర్మానించినారు. అందుచేతనే తండ్రి సొంతరుణములకు తండ్రిజీవితకాలములో సమష్టికుటుంబాస్తిలోని పుత్రులభాగములుకూడ విక్రయింపబడుచున్నవి(1). కాని కొన్ని కేసులలో తండ్రి జీవించియుండగా ఈధార్మిక బాధ్యత కుమారులపై నుండదని తీర్మానములైనవి(2). అయితే ఈవిషయమును ప్రి. కౌ. వారు ఏడుగురు న్యాయమూర్తులు కూడి విచారణచేసి, తమయభిప్రాయమును మార్చుకొని, తండ్రిజీవితకాలములోను, అనంతరమునను కూడ కుమారులపైని యీధార్మిక బాధ్యత కలదని తీర్మానించిరి(3). ఈ కేసుదరిమిలాను మ. హై. ఫు బెం. కేసులో న్యాయమూర్తి శ్రీనివాసయ్యంగారొక్కరుమాత్రము తండ్రిచేసిన న్యాయములగు రుణములకు పుత్రులభాగములను విక్రయించుహక్కునకును ఈ ధార్మిక బాధ్యతకును భేదమున్నదనియు, హిందూధర్మశాస్త్రములననుసరించి తండ్రియనంతరమునగాని పుత్రులపైని ధార్మిక బాధ్యత యుండదనియు

ధార్మిక బాధ్యత తండ్రిజీవించియుండగనే వచ్చునా ?

(1) 3 క 198; 15 క 717; 17 క 584; 22 మ 49; 27 మ 243; 27 మ326; 15 అ 75; 28 బొం 383; 39 ఇం. కే (ప్రి. కౌ.) 252; 76 ఇం. కే. (నా) 349; 68 ఇం. కే. (పా) 945; 62 ఇం. కే. (మ) 218; 78 ఇం. కే. (అ) 911; 1924 మ 840; 88 ఇం. కే. (పా) 1012; 88 ఇం. కే. (ఔ) 127; 68 ఇం. కే.(ఔ) 283; 137 ఇం. కే. (బొం) 717.

(2) 39 ఇం. కే. (ప్రి. కౌ.) 280; 79 ఇం. కే. (అ) 238; 77 ఇం. కే. (అ) 909; 64 ఇం. కే. (అ) 75; 48 ఇం. కే. 914; 47 ఇం. కే. 679; 76 ఇం. కే. (బొం) 638; 71 ఇం. కే. (అ) 296;

(3) 77 ఇం. కే. (ప్రి. కౌ ) 689.

తనయభిప్రాయము నొసంగియున్నారు(1). ఈయభిప్రాయము సరియైన దనియు, ఇది స్మృతులననుసరించి యున్నదనియు, తలంచుచున్నాము. కాని ప్రి కౌ. వారిచే నీవిషయము నిర్ధారణమైనది కావున నిక నీవిషయమునుగూర్చి మరల నాలోచింపబడి లేదు.

తండ్రి జీవించియున్నను, చనిపోయినను తండ్రి చేసినరుణములు, సమష్టికుటుంబావసరముకొరకైనను కాకపోయినను, అవి అశాస్త్రీయములును దుర్వ్యవర్తనకొరకు చేయబడినవియును కాకపోయినచో, వాటిని కుమారులు తీర్చవలయును. దీనినే ధార్మిక బాధ్యతయందురు(2).

12. పితృపితామహప్రపితామహులు, పుత్రపౌత్రప్రపౌత్రులతో, విభజించుకొనినపిమ్మట చేసినరుణములకు, పైనిచెప్పబడిన ధార్మిక బాధ్యతయుండునా? అనువిషయమాలోచింపదగియున్నది. హిందూధర్మశాస్త్రములను పరికించినచో, ధార్మిక బాధ్యత విభాగానంతరమందును కలదని స్పష్టమగును. కాని బ్రిటిషువారిన్యాయస్థానములు విభజించుకొనినపిమ్మట పితాదులు చేసినరుణములకు ధార్మిక బాధ్యత లేదని తీర్మానించినవి(3).

విభాగానంతరము కూడ ధార్మిక బాధ్యతయుండునా?

విభాగమునకుపూర్వము పితాదులుచేసినరుణములకు విభాగానంతరము ఋణదాతలు దావాచేయునప్పుడు పుత్రాదులను చేర్చి

(1) 110 ఇం. కే (మ) 141.

(2) 36 బొం 68; 49 బొం 112; 35 బొం 169; 47 అ 21; 47 అ 122; 19 ఇం. కే. 378; 1930 పా 827; 1928 లా 815; 69 ఇం. కే. 754; 8 ఇం. కే. 146.

(3) ఈప్రకరణమునందుపితాదులనినప్పుడు పితృపితామహప్రపితామహులనియు పుత్రాదులనినప్పుడు పుత్రపౌత్రప్రపౌత్రులనియు నర్థము. 46 మ 64; 51 మ 361.

దావాచేయవలయును. అట్లుచేర్చకుండ దావాచేసిరేని, ఆరుణము లను తీర్చుటకు పుత్రాదులపైని ధార్మిక బాధ్యత యుండదు. అనగా ఆడిక్రీబాకీకి పుత్రాదులవాటాకువచ్చినఆస్తిపైని అమలుజరుపవీలు లేదు(1). వారినికూడ దావాలోచేర్చిరేని ఆరుణములు అశాస్త్రీయ ములైనవియు, దుర్వ్యవర్తనకొరకుచేసినవియు కాకపోయినచో పుత్రా దులపైనికూడ డిక్రినిపొంది, వారిభాగములనుకూడ వేలము వేయించ వచ్చును(2). పెదవెంకన్న కేసులో విభాగమునకుపూర్వము చేసిన రుణమునకు తండ్రి, విభాగానంతరము మరల ప్రోనోటు వ్రాసియిచ్చె ను. ఆబాకీ కుమాళ్ళను బయిండుచేయదని మ. హై. వారు తీర్మా నించిరి(3). ఈతీర్పననుసరించి దరిమిలాను మరియొక కేసులో మ. హై. వారును, వేరొక కేసులో పా. హై. వారును విభాగమునకు పూర్వము తండ్రిచేసిన రుణములకు విభాగానంతరము కుమాళ్ళను బాధించదని తీర్మానించిరి(4). కాని పెదవెంకన్న కేసునుబట్టి అట్టి జనరలురూలు నొసంగవీలులేదనియు, విభాగమునకుపూర్వము చేసిన రుణములకు విభాగానంతరము పుత్రాదులను దావాలో చేర్చినయెడల వారివాటాలపైనికూడ రాబట్టుకొనుటకు హక్కుకలదని మ. హై. వారు మరల తీర్మానించిరి(5). బొంబాయి, కలకత్తా, హైకోర్టు లును, జౌడ్ చీఫుకోర్టువారును ఇట్టియభిప్రాయమునే వెలిబుచ్చి

---

(1) 22 మ 519; 24 మ 555; 121 ఇం. కే. (అ) 257;

(2) 24 మ 555; 38 మ 1120.

(3) 41 మ 136.

(4) 62 ఇం. కే. (మ) 930; 88 ఇం. కే. (పా) 813.

(5) 80 ఇం. కే. (మ) 228; 51 మ 361; 131 ఇం. కే. (సిం) 386;

యున్నారు(1). అలహాబాదు హైకోర్టువారుమాత్రము ఒకసారి వ్యతిరేకముగాను ఒకసారి అనుకూలముగాను తీర్పులనిచ్చియున్నారు. కాని కడపటితీర్పులలో మద్రాసువారి ఆఖరుఅభిప్రాయముతో నేకీభవించినారు(2).

విభాగమునకు పూర్వము చేసినరుణములకు విభాగానంతరము తండ్రియొక్కనిమీాద డిక్రినిపొందినను, కుమారులు బయిండుఅగుదురనియు ఆడిక్రినిబట్టి కుమారులవాటాలను అమ్మించవచ్చుననియు కొన్నితీర్పులున్నవి(3).

తండ్రికుమాళ్ళు విభజించుకొనునప్పుడు, తండ్రిచేసిన రుణములకు (అన్యాయములైనవికానివాటికి) తగినయేర్పాట్లు చేయుడని కోరుటకు తండ్రికి హక్కుకలదు(4). విభాగముకొరకు దావా వచ్చినప్పుడు, ఆదావాలో రుణదాతలు పార్టీలుగానుండిరేని, వారు వేరే దావా తేనక్కరలేకుండ, ఆవిభాగపుదావాలో ఋణముతీర్మానముకొరకు తగినయేర్పాట్లను కోర్టువారుచేయవచ్చును(5).

తండ్రికుమాళ్లు పంచుకొనునప్పుడు తండ్రివ్రాసియిచ్చినకొన్ని బాకీలు తీర్చెడిబాధ్యత కుమారునివాటాకువచ్చెను. ఆబాకీలు తీర్చనియెడల, తండ్రితీర్చివేసి కుమారునివలన రాబట్టుకొనవచ్చునని పారీఖత్తులో వ్రాసికొనిరి. కుమారుడు తీర్చలేదు. తండ్రితీర్చి, కుమారు

(1) 17 ఇం. కే. (క) 287; 110 ఇం. కే. (బొం) 269; 101 ఇం. కే. 907; 95 ఇం. కే. 857; 102 ఇం. కే. (ఔ) 281;

(2) 84 ఇం. కే. (అ) 790; 104 ఇం. కే. (అ) 406; 122 ఇం. కే. (అ) 678; 121 ఇం. కే. (అ) 248; 51 అ 932;

(3) 155 ఇం. కే. (అ) 159; 141 ఇం. కే. (లా) 424; 119 ఇం. కే. (ఔ) 449; 127 ఇం. కే. (నా) 845;

(4) 1 బొం 561; 3 మ. హై. 8. 177;

(5) 100 ఇం. కే. (మ) 1018; 125 ఇం. కే. (సిం) 39.

నిపై దావా తెచ్చెను. ఋణదాత, తండ్రిపైని చర్యలుజరుపనిదే తండ్రి తీర్చినాడు గనుక తనను బాధించవదని, కుమారుడు వాదించెను. కాని ఆవాదముచెల్లదని తండ్రిపక్షముగా డిక్రియిచ్చిరి(1).

తండ్రిచేసినయప్పులబాధ్యతను, కుమారులు విభాగమును కోరుటవలనగాని, విభజించుకొనుటవలనగాని తప్పిపోవదు. విభాగమునకు ముందు తండ్రియొక్కనిపైనిపొందినడిక్రీని సమష్టిఆస్తిపైని విభాగానంతరముకూడ వారంటుఅమలుజరిపి అమ్మించవచ్చును. అయితే దావాలో కుమారులు పార్టీగా చేరలేదు కావున ఆరుణములు తమను బాధించవనియు, ఆవేలము చెల్లదనియు, కుమారులు దావా తేవచ్చును. అందులో తండ్రిచేసిన రుణములు అక్రమకార్యములకని కుమారులు రుజువుచేసినచో వారిభాగములు జప్తులోనుండియు వేలములోనుండియు విడిపోవును(2).

తండ్రిచేసిన రుణములకు విభాగములో నెట్టియేర్పాట్లును చేయనియెడల, ఋణదాత విభాగానంతరము, కుమారులవాటాలకు వచ్చినఆస్తిపైనికూడ అమలు జరుపవచ్చును(3).

వ్రిజనారాయణుని కేసు(4) లో ప్రి. కౌ. వారు, తండ్రియప్పులకు కుమారులబాధ్యతనుగూర్చి చెప్పునపుడు, విభాగానంతరము, విభాగాత్పూర్వము అనుభేదమును గమనించలేదు(5).

తండ్రిచేసినరుణములకు విభాగకాలమున తగినయేర్పాటులను న్యాయముగాను దగాలేకుండగను చేసి తక్కిన ఆస్తిని పంచుకొనినప్పుడు రుణదాతలు మరల కుమారులపైని ధార్మికబాధ్యత నమలుజరుపకూడదు(6).

---

(1) 114 ఇం. కే. 226; 34 మ 479; 36 మ 348.

(2) 127 ఇం. కే. (నా) 34F; 79 ఇం. కే (నా) 410; 51 మ. (పు. బెం.) 361;

(3) 1931 అ. (పు. బెం) 512.

(4) 77 ఇం. కే. 689.

(5) 125 ఇం. కే. 39.

(6) 1931 అ (పు. బెం.) 512.

13. పితృపితామహప్రపితామహులు చేసినరుణములను పుత్రాదులు తీర్చవలయునని స్మృతులు విధించుచు ఆవిధికి కొన్నిమినహాయింపులను చెప్పియున్నారు. ఆమినహాయింపులలో చేరిన రుణములను తీర్చుటకు పుత్రాదులపైని ధార్మిక బాధ్యతయుండదు. అనగా పిత్రాదులు అట్టిరుణములకు పుత్రాదులభాగములను విక్రయింపజాలరు. తండ్రిచేసిన రుణములను కుమారుడు తీర్చవలయుననుసూత్ర మట్టిరుణములకు వర్తింపదు.

ఎట్టిరుణములకు ధార్మికబాధ్యత లేదు ?

సూ: ప్రతిభావ్య వణి క్శుల్క మద్య ద్యూత దణ్డాః పుత్రా న్నాభ్యాభ వేయుః॥

గౌతములు.

జామీనుఅప్పులు, వర్తకసంబంధమైన యప్పులు; శుల్కము, మద్యమునకైన యప్పులు, జూదపుఅప్పులు, జరిమానాలఅప్పులు వీటిని పుత్రులు తీర్చనక్కరలేదు.

తథాశుల్కః ప్రతిశుత్య వివాహంకృత్వా మృతే తత్పుత్రం న తచ్ఛుల్క మభ్యాభవతి. తథా మూలం దాస్యామీతి మద్యం బహు పీత్వా మృతే న తత్పుత్రేణ దాతవ్యం, తథా ద్యూతం కృత్వా పరాజిత స్తత్పణద్రవ్య మదత్త్వైవ యది మ్రియతే తదా న తత్పుత్రో దాతు మర్హతి. యథా వ్యవహారే పరాజితో రాజ్ఞే దండ మదత్త్వైవ యది మ్రియతే తదా న సోఽపి దణ్డః పుత్రా నభ్యాభవతి.

హారదత్తమితాక్షరా.

శుల్కమిచ్చెదనని వివాహముచేసి యివ్వకుండ చనిపోయినచో నాతనిపుత్రుడు దాని నీయనక్కరలేదు. శుల్కమనగా ఓలి లేక కట్నము. ఖరీదు నిచ్చెదనని కల్లుసారాయలను త్రాగి ఖరీదు నీయకుండ చనిపోయినచో దాని నాతనిపుత్రు డీయనక్కరలేదు.

జూదమందు ఓడిపోయిన ధనము నీయకుండ చనిపోయినచో దాని నాతనిపుత్రు డీయనక్కర లేదు. రాజుచే దండింపబడినవా డాదండన ద్రవ్యము (జరిమానా) నీయకుండ చనిపోయినచో దాని నాతనిపుత్రు డీయ నక్కర లేదు.

సురాకామద్యూతకృతం దండశుల్కావశిష్టకం
వృథాదానం తథైవేహ పుత్రో దద్యాన్నపైతృకం.

కల్లుసారాయిలు, వ్యభిచారము, జూదము వీటికొరకు చేయబడినయప్పులును శుల్కము, దండము, వీటియొక్క శేషమును నిష్ఫలముగా నిచ్చెదమనినదానద్రవ్యమును కుమారుఁ డీయనక్కర లేదు.

యాజ్ఞ్యవల్క్యస్మృతి.

సురాపానేన యత్కృతం ఋణం కామకృతం స్త్రీవ్యసనేన కృతం ద్యూతే పరాజయనిమిత్తం దండశుల్కయో రవశిష్టం వృథాదానం ధూర్తవంది మల్లాదిభ్యో యత్ ప్రతిజ్ఞాతమ్ "ధూర్తే వందిని మల్లేచ కునైద్యే కితవే శఠే। చాడ చారణ చౌరేషు దత్తం భవతి నిష్ఫలమ్" ఇతి స్మరణాత్ ఏతదృణం పిత్రాకృతం పుత్రాదిశౌండికాదిభ్యో న దద్యాత్. అత్ర దండశుల్కావశిష్టక మిత్యవశిష్టగ్రహణాత్ సర్వం దాతవ్యమితి న మంతవ్యమ్ "దండంవా దండశేషంవా శుల్కమ్ తచ్ఛేషమేవవా॥ నదాతవ్యం తు పుత్రేణ యచ్చ నవ్యావహారికమ్" ఇతి ఔశనస్మరణాత్ గౌతమేనా ప్యుక్తమ్.

ఏరుణము సురాపానముచే చేయబడినదో, ఏరుణము స్త్రీవ్యసనముచే చేయబడినదో, ఏరుణము జూదమున పరాజయము నిమిత్తముగా చేయబడినదో, ఏది దండము శుల్కముయొక్క శేషమో ఏది వృథాదానమో, అనగా ధూర్తులకు వందిమాగధులకు మల్లాదులకు యిచ్చెదనని ప్రతిజ్ఞ చేయబడినదో పిత్రాదులచే చేయబడిన ఆరుణమును పుత్రాదులు సురావిక్రయులు మొదలగువారి కీయనక్కర

శేము. ఇచ్చట దండశుల్కావశిష్టకమని చెప్పబడినది కదా యని మొత్తమంతయునైనచో నివ్వబడవలయు నని యోచించకూడదు. దండముగాని, దండశేషముగాని, శుల్కముగాని, శుల్కశేషముగాని, ఏదైన అవ్యవహారికమో అదిగాని పుత్రునిచేత నివ్వబడదగనిది అని ఔశనునిచే చెప్పబడియెను. గౌతముడును అట్లే చెప్పెను.

మితాక్షరి.

పైనవ్రాసిన స్మృతులను పరికించినచో, పుత్రపౌత్రప్రపౌత్రులపైని ధార్మిక బాధ్యతయుండనిరుణములను యీదిగువ తరగతులలో విభజింపవచ్చును.

(i) మద్యపానముకొరకు చేసినవి.

(ii) జూదముకొరకు చేసినవి.

(iii) జరిమానా.

(iv) శుల్కము (సుంకము, ఓలి, కట్నము.)

(v) వృథాదానము

(vi) స్త్రీవ్యసనము కొరకైనయప్పులు.

(vii) వర్తకసంబంధమైన యప్పులు. (Trade debts)

(viii) జామీనుఅప్పులు. (Surity debts)

(ix) అవ్యవహారికరుణములు. (Avyavaharika debts)

మొదటి ఆరుతరగతులరుణములనుగూర్చి ప్రత్యేకముగా విశేషించి చెప్పతగినయంశము లేమియును లేవు. వీటివిషయమున న్యాయస్థానములలో భిన్నాభిప్రాయము లేమియును లేవు. ఈయారుతరగతుల రుణములను మొత్తముమీద నొకవాక్యములో (illegal or immoral debts) అని న్యాయస్థానములును న్యాయవాదులును వాడుచుందురు. వాటినే అక్రమపురుణములనియు, దుష్ప్రవర్తనాముల కైన రుణములనియు నీగ్రంథమున వాడియున్నాము. తక్కిన మూడుతరగతులను

ములను గూర్చి వివరముగా చెప్పవలసియున్నందున ఆవిషయములు తరువాతి పేరాలలో చెప్పబడును. 7-8-9 తరగతుల రుణములనుకూడ, అవి కుమారులను బయిండుచేయతగని సందర్భములలో చేయబడిన వైనప్పుడు, అక్రమపు (illegal) రుణములని వాడుచుందురు. అక్రమపురుణములనియును లేక దుష్ప్రవర్తనాదులకొరకైన రుణములనియును ఏవి నిర్ధారణకాబడునో ఆరుణములకు పుత్రపౌత్రప్రపౌత్రులపైని ధార్మికబాధ్యతయుండదు. అనగా ఆరుణములకు తండ్రిజీవించియుండగా కుమారులభాగములను వినియోగము చేయుటకుగాని, తండ్రియనంతరము కుమారులస్వాధీనములోనున్న సమష్టికుటుంబాస్తిలోని యేభాగమునైనను జప్తుచేసి వేలం వేయించుటకు గాని హక్కులేదు. 27 మ. పు బొం. 243. ధార్మికబాధ్యత లేదని నిర్ణయింపబడిన అక్రమపురుణములకైనను సమష్టికుటుంబాస్తియందు ఆరుణములను చేసిన వారికి గల భాగములను వారిజీవితకాలములో జప్తుచేయించి వేలం వేయించుటకు అభ్యంతరము లేదు. పుత్రపౌత్రులభాగములను మాత్రము విక్రయించకూడదు(1).

గతఫలహాయముకొరకు తండ్రిపైని డిక్రికాబడినప్పుడు ఆబాకీకి కుమారులపైని ధార్మికబాధ్యతయుండును(2).

గతఫలహాయముకొరకు తండ్రిని కుమాళ్ళను కలిపితెచ్చిన దావాలో కుమాళ్ళను తప్పించి తండ్రిపైని డిక్రియిచ్చినను, వారంటు అమలులో కుమారులభాగములపైని కూడ అమలు జరుపవచ్చును(3).

---

(1) 183 ఇం. కే. లా) 120.

(2) 90 ఇం. కే. (చు) 165;

(3) 27 మ లా. జ. 276.

14. పితృపితామహ ప్రపితామహులలో నెవరైనను ఒకరికి జామీనుగా నుండుటచే యివ్వవలసివచ్చిన యప్పులకు పుత్రాదులు బాధ్యులగుదురా? కారా? యను విషయమును యోచింపవలసియున్నది

జామీను అప్పులు.
Surety debts.

"ప్రతిభావ్య" అను పదముచే జామీనుఅప్పులను పుత్రులు తీర్చనక్కరలేదని గౌతములు చెప్పియున్నారు కాని యాజ్ఞవల్క్యులు జామీనుఅప్పులను మూడు విధములుగా నుడివియున్నారు.

దర్శనే ప్రత్యయే దానే ప్రాతిభావ్యం విధీయతే
ఆద్యౌతు వితథే దాప్యౌ వితరస్య సుతా అపి॥
దర్శనప్రతిభూర్యత్ర మృతః ప్రాత్యయికోపి వా
న తత్పుత్రా ఋణం దద్యు ర్దద్యు ర్దానాయ యస్థితః॥
బహవస్స్యు ర్యది స్వాంశై ర్దద్యుః ప్రతిభువో ధనం
ఏకచ్ఛాయాశ్రితేష్వేషు ధనికస్య యథారుచి॥

ఒకనిని హాజరుపర్చుటకును ఒకనినమ్మకమును గూర్చియును ఒకడీయవలసినదాని నిచ్చుటకును జామీను (ప్రాతిభావ్యము) విధింపబడుచున్నది. మొదటిరెండును తప్పిపోయినయెడల, ఆసొమ్మును జామీనునిచ్చినవాడీయవలసియుండును. మూడవదానిని పుత్రులు కూడ యిచ్చుకొనవలయును. ఒకనిని హాజరుపరచుటకు పూచీపడినవాడును ఒకనినమ్మకమునుగూర్చి పూచీపడినవాడును చనిపోయినచో, ఆఋణములను ఆతనికుమారు లీయనక్కరలేదు. ఒకడీయవలసినదానినిచ్చుటకు పూచీపడినవాడు చనిపోయినచో ఆఋణము నాతనిపుత్రు లీయవలయును. చాలమంది జామీనుదారులు గానున్న యెడల, జామీనుధనమును వారివారిభాగములప్రకార మీయవలెయును. ఒక్కొకరు యావత్తుసొమ్మునకును జామీనుపడినయె

డల, ధనమును పొందవలసినవానియొక్క యిష్టానుసారముగా (ఎవరి వలనరావలయునని కోరునో వారు) యివ్వవలయును.

యాజ్ఞ్యవల్క్యస్మృతి.

మనువు, కూడ యాజ్ఞ్యవల్క్యలు చెప్పినట్లే చెప్పెను. బృహస్పతిమాత్రము జామీను నాల్గువిధములని చెప్పియున్నాడు. యాజ్ఞ్యవల్క్యలు చెప్పిన మూడువిధములు గాక నాల్గవవిధము సరకుల నిచ్చెదనని తండ్రియొప్పుకొని, అవి యివ్వకుండనే చనిపోయినచో కొమరులు ఆసరకుల నీయవలయునని చెప్పెను.

ఇప్పుడు న్యాయస్థానములుకూడ జామీనుఅప్పులను నాల్గు విధములుగా విభజించి, మొదటి రెండిటియందును అనగా మనుష్యుని హాజరుపరచుట, యితరునినమ్మకమునకు పూచీబడుట, ఈరెండిటియందును పుత్రాదులకు బాధ్యతలేదనియును మిగిలినరెండిటియందును అనగా సొమ్ముగాని సరకుగాని యిచ్చుటకు పూచీపడినపుడు బాధ్యతకలదనియును తీర్మానించుచున్నవి(1)

తండ్రియైనను, తాతయైనను, ఒకరీయవలసినసొమ్మును తామిచ్చెదమని జామీనుపడినప్పుడు ఆసొమ్మును పుత్రపౌత్రులు లీయవలయును. ఆసొమ్మునకు వారిపైని ధార్మికబాధ్యతకలదు(2). తండ్రి, తనభూములపైని సాలునకు రు 335 శిస్తువచ్చునని చెప్పి ఆభూముల ను రు 5000 కు విక్రయించెను. శిస్తుతక్కువవచ్చునెడల ముజరా యిచ్చెదనని యగ్రిమెంటు వ్రాసియిచ్చెను. తరువాత లెక్కచూడగా

(1) 86 ఇం. కే. 791; 26 అ 611; 23 బొం 451; 10 పా 94; 4 పా. లా జ 309; 182 ఇం. కే. (అ) 561; 41 క 1371; 71 ఇం. కే. (నా) 351; 23 బొం 408; 11 మ 378; 48 ఇం. కే. 76; 51 ఇం. కే. 791; 87 ఇం. కే. 184; 48 ఇం. కే. 76;

(2) 46 ఇం. కే. (పా) 27; 56 ఇం. కే. (పా) 932; 38 మ 1120; 39 క 848; 58 ఇం. కే. 618; 24 మ 555; 1929 అ 72; 1930 అ 87.

రు 303 మాత్రమే శిస్తు వచ్చుచున్నట్లు తేలెను. తక్కిన రు 32 కు ముజరాకొరకు ప్రోనోటుదారు దావా తెచ్చెను. ఈ మొత్తమునకు కుమారులు బాధ్యులని తీర్మానించిరి(1).

చ, బ, వీరిద్దరును విభక్తసోదరులు. చ, వర్తకముకొరకు రు 10000 బదులు తెచ్చెను. పిమ్మట ఇంకను బదులు కావలయునని కోరి ఋణదాతకు చ, బ, లు యిద్దరును కలిసి రు 2800 లకు ప్రోనోటు వ్రాసియిచ్చి, బదులు తెచ్చిరి. పిమ్మట మరి రు 7200 లు బదులు ఏర్పాటుచేసి, ఆసొమ్ము, తరువాత అప్పుడప్పుడు యిచ్చు షరతిని, మొత్తము రు 20000 లకు చ, బ,లు యిద్దరును కలిసి తనఖాదస్తావేజును వ్రాసియిచ్చిరి. అందులో బ, జామీనుదారు అనియే వ్రాసెను. తనఖాదారు దావా తెచ్చెను. బ, యొక్క కుమాళ్లు తనఖా చెల్లదనియు, తండ్రి చేసిన రుణములు తమను బాధించవనియు వాదించిరి, బ, కూడ ఆదావాలో పార్టీగానుండెను.

తన కేసుయొక్క ప్రతిఫలము లేదు. కావున ఈతనఖా తనను బయిండు చేయదని బ, వాదించెను. కాని ఈ వాద మంగీకరింపబడ లేదు. మితాక్షరినిబట్టి ఈ రుణము కుమాళ్ళనుకూడ బయిండు చేయునని తీర్మానించిరి

అదివరకున్న రుణమునకేగాని ముందుయివ్వబోవు అప్పునకు అది వర్తించదని వాదించిరి. కాని అదియును అంగీకరింపబడ లేదు. 26 అ 611; 39 క 843.

అసలుకే జామీను వర్తించును కాని వడ్డీకి జామీను వర్తింపదని ఒకవాదము. అదియును అంగీకరింపబడ లేదు.

(1) 46 ఇం. కే. (పా) 27.

ప్రజనారాయణుని కేసులో ప్రి. కౌ. వారు చెప్పిన మూడవ విధి(1)ని బట్టి బ, తనఖా పెట్టుటకు వీలులేదని కుమారులు చెప్పిన వాదము నంగీకరించి, పూర్వపు రుణము రు 2300 లకు తనఖా చెల్లుననియు, మిగతా మొత్తమునకు తనఖా చెల్లదనియు, అయినను అప్పు మాత్రము బ, యొక్క కుమాళ్ళుకూడ యివ్వకతప్పదనియు తీర్మానించిరి(2).

తండ్రి జామీనుదారుగానుండి, తనయాస్తిని తనఖాయిచ్చెను. ప్రజనారాయణుని కేసులోని 3 వ విధి(1). ఇట్టికేసులకు వర్తించదనియు, తనఖా చెల్లుననియు తీర్మానించిరి(3).

క, అనువాడు చ, అనువానియొద్ద నవ్రుఖరీలో ప్రవేశించెను. ట, అనువాడు జామీనుదారుగానుండి, క, మీరుయొద్ద ప్రవేశించినది మొదలు నవ్రుఖరీ కోనుండి తొలగింపబడవరకును మీతో చేసిన ఖరారుప్రకారము సరిగా ప్రవర్తించనియెడల అందువల్లకలిగేనష్టము నేను మీకీయగలవాడను అని చ, కు బాండు వ్రాసియిచ్చెను. క, కొంతసొమ్ము హరించెను. ఈ బాండు ట, యొక్క వారసులను బయిందుచేయదని తీర్మానించిరి(4).

అశాస్త్రీయములును దుర్వ్యవర్తనకొరకు చేయబడినవి (Illegal and immoral) అనువాటిక్రిందకురాని జామీనుఅప్పులను కుమారులిచ్చుకొనవలయును. వాటిక్రిందకువచ్చెడి జామీనుఅప్పులను కుమారులిచ్చుకొననక్కరలేదు(5).

(1) ఈప్రకరణమందలి 17 వ పేరా చూడుడు.

(2) 119 ఇం. కే (అ) 86.

(3) 120 ఇం. కే (అ) 555.

(4) 144 ఇం. కే (నా) 54.

(5) 38 మ. లా. జ. 402; 56 ఇం. కే 962; 51 ఇం. కే. 791; 50 ఇం. కే. 243;

15. పితృపితామహప్రపితామహులు వర్తకమునకై చేసిన యప్పులకు పుత్రాదులపైని బాధ్యతయుండునా? ఉండదా? అను విషయము నాలోచింపవలసియున్నది. ధార్మికబాధ్యతనుగూర్చి వ్రాసిన 6-13 పేరాలలో నుదాహరింపబడిన స్మృతులను పరికించినచో గౌతములు మాత్రమే వర్తకసంబంధమైన యప్పులను పుత్రాదులు తీర్చనక్కరలేదని చెప్పినట్లు కనబడుచున్నది. తక్కినస్మృతికర్తలును వ్యాఖ్యాతలును పుత్రులు తీర్చనక్కరలేనిరుణములలో వర్తకరుణములనుచేర్చియుండకపోవుటచేతను, హిందువులలో అనేక కుటుంబములు వర్తకముమీదనే ఆధారపడియుండుటవలనను గౌతమస్మృతిని నిరాకరించి, వర్తకసంబంధమైనయప్పులకు పుత్రాదులపై ధార్మికబాధ్యతకలదని న్యాయస్థానములు తీర్మానించినవి. వర్తకసంబంధమైనయప్పులు అవ్యవహారికరుణములక్రిందకు రావనికూడ తీర్మానముల నిచ్చియున్నారు(1).

వర్తకసంబంధమైనయప్పులు.

తండ్రి వర్తకమునకై బదులుతెచ్చి ఫరముపేరుతో నోటు వ్రాసియిచ్చెను. ఆనోటుబాకీకి, ఆతనిసమష్టికుమాళ్ళపైని వారి వాటాలతాలూకు ఆస్తితో సంబంధించినంతవరకును డిక్రి యివ్వవచ్చును(2).

తండ్రి, కుటుంబవర్తకమునకై బదులుతెచ్చినప్పుడు, ఆ బదులువలన కుమారులు లాభమును పొందిరేని, ఆ బదులుమొత్తమునకు సమష్టికుటుంబాస్తిమీదనే కాకుండ కుమారులపైని సొంతబాధ్యత

(1) 90 ఇం. కే. (మ) 165; 92 ఇం. కే. (చు) 977; 102 ఇం. కే. (చు) 680; 56 ఇం. కే. (పా) 879; 167 ఇం. కే. (బొం) 717; 138 ఇం. కే. (నా) 168; 52 బొం 376; 49 మ 211; 32 బొం. లా. రి. 919;

(2) 138 ఇం. కే. (నా) 168;

(Personal liability) కూడ నుండునని పాట్నాహైకోర్టువారొక కేసులో తీర్మానించియున్నారు(1).

సమష్టికుటుంబవర్తకముకొరకు కర్తగాని, తండ్రిగాని చేసిన యప్పులకు మైనరుమెంబర్లుసహా అందరి భాగములఆస్తియును బాధ్యతకలదియగును(2).

అవ్యవహారిక రుణములు.

16. ధార్మికబాధ్యత లేని రుణములనుగూర్చి వ్రాసిన 13 వ పేరాలో మితాక్షరి వ్యాఖ్యానము నుదాహరించి యుంటిమి యాజ్ఞ్యవల్క్యస్మృతిలోని "సురాకామద్యూతం" అనుశ్లోకమునకు వ్యాఖ్యానమును వ్రాయుచు విజ్ఞానేశ్వరుడు తనమితాక్షరిలో ఔశనస్మృతిలోని యొకశ్లోకము నుదాహరించియున్నాడు. అందు "నదాతవ్యంతు పుత్రేణ యచ్చ నవ్యవహారికమ్" అని చెప్పబడియున్నది. అనగా అవ్యవహారిక రుణములుకూడ పుత్రులచే నీయబడసక్కరలేదు. అనియర్థము. అయితే అవ్యవహారికరుణములనగా నెట్టివి? అను ప్రశ్నకు సమాధానము కావలసియున్నది. అవ్యవహారికశబ్దమునకు విజ్ఞానేశ్వరు డేమియు వ్యాఖ్యానము వ్రాయలేదు. ఈశబ్దమునకు దరిమిలావ్యాఖ్యాతలును పండితులును హైకోర్టు న్యాయమూర్తులును ఎవరికితోచినరీతిని వారు తమ యభిప్రాయముల నిచ్చియున్నారు. ఈశబ్దమునకు రూఢియైన యర్థమేర్పడకపోవుటచే అనేకదావాలలో మరల మరల నీ శబ్దార్థవిచారణ జరుగుచు సంశయము కలుగుచునేయున్నది. ఈశబ్దార్థవిచారణకొరకే కక్షిదారులు కోర్టులకెక్కి తమధనము నమితముగా వ్యయము చేయుచున్నారు. శబ్దము చాలసులభమైనది. వ్యవహారశబ్దము పండితపామ

(1932) పా 184.

(2) 49 మ 566; 24 క వీ నో. 968; 34 అ 366; 34 బొం 72.

రులంద తెలిగినదియే. కాని యేఋణములను కూర్చి ఔశనసు శాస్త్ర యాశబ్దము నుపయోగించెనో తెలిసికొనుట కష్టమై ఇన్నిపాట్లు పడు చున్నారు. ఈశబ్దమునకు:—

(1) వీరమిత్రోదయ, స్మృతిచంద్రికకర్తలు మద్యపానమునకై చేయబడిన ఋణములనియును;

(2) వివాదచింతామణికర్త సామాన్యవ్యవహారములో చేరని ఋణ ములనియును;

(3) అపరార్కుడు, అక్రమములైన లేక అన్యాయములైన ఋణము లనియును;

(4) బాలంభట్టు కుటుంబలాభముకొరకు కానట్టి ఋణములనియును;

(5) గిరీశచంద్ర తర్కాలంకారులు జీవితావసరముకొరకు కానట్టి ఋణములనియును;

(6) ఘర్పూరు పండితుడు, న్యాయశాస్త్ర సమ్మతముకాని లేక దానామూలమున రాబట్టదగని ఋణములనియును;

(7) భట్టాచార్యులు అక్రమపురుషులనియును అర్థము చెప్పి యున్నారు.

(8) కోలుబ్రూక్ పండితుడు తన భాషాంతరీకరణమునందు "నత్ప్రవర్తనాసంగత కార్యములకొరకైన ఋణము"లని వ్రాసెను.

(9) బొంబాయి హైకోర్టువారు ఒకకేసులో అసాధారణములైన లేక ఆచారముగాని, శాస్త్రముగాని, అంగీకరించని ఋణము లనియును, గౌరవనీయుడై మర్యాదగల పురుషుడు చేయు నట్టి ఋణముల తరగతిలో చేరనివియు, తండ్రియొక్క దుష్ప్రవర్తనమునకును, దోషములకును, చాపల్యమునకును ఆరోపిం పదగినఋణములనియును తీర్మానించి యున్నారు. 32 బొం. 348;

(10) కలకత్తా హైకోర్టునందు సుప్రసిద్ధ న్యాయమూర్తియైన ముఖర్జీ గారు న్యాయశాస్త్ర సమ్మతముగా నట్టియు, అసాధారణము లైనట్టియు, ఆచారసమ్మతము గానట్టియు రుణములని నుడివి యున్నారు 39 క 862.

(11) మద్రాసు హైకోర్టునందు న్యాయమూర్తి సదాశివయ్యరుగారు న్యాయశాస్త్రానుసారములగు వాదములచే చెల్లదగినవని బల పరుపదగనట్టియు, న్యాయస్థానములలో ఋణదాతల కనుకూలముగా వారిహక్కును స్థిరపరుప వీలు లేనట్టియు రుణములని తీర్మానించియున్నారు. 37 మ 458.

పైన వ్రాసిన వ్యాఖ్యాతలయొక్కయు, న్యాయమూర్తులయొక్కయు అభిప్రాయములను పరికించినచో, ఒకదానికొకటి వ్యతిరేకముగా నున్నట్లు కనపడదు. కాని అవ్యవహారికరుణములను నిర్వచించుటలో సంశయము నివారణ కాకపోవుటచే, సంశయరహితముగ నిర్వచింపవలయునని, ఎవరికివారు ప్రయత్నించినట్లు స్పష్టమగును. అవ్యవహారికరుణములను నిర్ణయించుచు ఉన్నతన్యాయస్థానము లొసంగిన తీర్పులను కొన్నిటిని, ఇట నుదాహరించుచున్నాడను. వాటినిబట్టి ఏవి అవ్యవహారికరుణములగునో ఏవికావో తమతమ కేసులసందర్భమునుబట్టి పాఠకు లూహించుకొనవలయును.

(1) వర్తకముకొరకు పితృపితామహ ప్రపితామహులు చేసిన రుణములు అవ్యవహారిక రుణములుకావు 137 ఇం. కే (బొం) 717.

(2) క్రిమినల్ కేసువిచారణలో విధింపబడిన జరిమానా అవ్యవహారికరుణముక్రిందకు వచ్చును. 139 ఇం. కే. (బొ) 64;

(3) క. అనువాడు ఒకపెట్టెను భద్రముగా కాపాడుటకై చ. చేతికిచ్చెను చ. ఆపెట్టెయందలి వస్తువులను హరించెను. ఆనష్టము నకై క. అనువాడు చ. యొక్క అనంతరమునందు, అతనివార

సులపై నానా తెచ్చెను. ఆసొమ్ము అవ్యవహారికరుణము కావని తీర్మానించిరి. 137 ఇం. కే. (బొ) 217; ఇటువంటి కేసులోనే బొంబాయి హైకోర్టువారు ఆసొమ్ము అవ్యవహారిక రుణముక్రిందకు వచ్చునవియు దానిని పుత్రు డీయవక్కరలేద నియు తీర్మానించిరి. 1?6 ఇం కే (బొం) 173.

(4) ఒకడు ట్రస్టీగానుండి ట్రస్టుతాలూకు సొమ్మునకు సరిగా లెక్క చెప్పలేకపోయెను కాని అతడు దానిని హరించినట్లు రుజువులేదు. ఆసొమ్ము అవ్యవహారికరుణము కాదనియు దానిని కుమారులిచ్చుకొనవలయుననియు తీర్మానించిరి. 51 ఇం. కే (బొం) 612.

(5) తండ్రి ఒకకంపెనీలో షరాబుగానుండి కొంతద్రవ్యమును హరించి యామొత్తమునకు స్వతుష్టికుటుంబాస్తిని తనఖాయిచ్చెను. ఆతనఖా కుమారులభాగములను బాధించదని తీర్మానించిరి. 27 మ. 71.

(6) తండ్రి, యొకనిని కొట్టెనని వచ్చిన క్రిమినల్ కేసులో ముద్దాయిగానుండి ఆకేసులో వాదించుటకు రు 43-0-0 ఖర్చుపెట్టి ఆసొమ్మునకు తనఖాపెట్టెను ఆతనఖా కుమారులను బయిండు చేయును కాని, ఆకేసులో తనతోడిముద్దాయిలకు విధించినజరిమానా తాను చెల్లించెను. అందుకొరకు పెట్టిన తనఖా కుమారులను బయిందుచేయదు. 39 ఇం. కే. (పా) 861

(7) దగా, మోసము, నమ్మకద్రోహము, ద్రవ్యాపహరణము మొదలగు క్రిమినల్ కోర్టులచే శిక్షింపబడదగిన నేరములతో సంబంధించి తండ్రి యివ్వవలసినసొమ్మును కుమారు లిచ్చుకొనవక్కరలేదు. ఒక మైనరుకు గార్డియనుగానుండి ఆసొమ్మును లెక్కచెప్పక హరించుట, దాచనిచ్చినసొమ్మును హరించుట,

మొదలైనవి ఈతరగతిలోనికి వచ్చును. 43 బొం 612; 1931 బొం 229; 48 అ 9; 6 అ 234; 31 మ 472; 161; 19 మ. లా. జ. 759; 51 ఇం. కే. 791; 138 ఇం. కే (పా) 414.

(8) హరించవలయుననునుద్దేశము తండ్రికి లేనప్పుడు, ఇతరుల తాలూకు తండ్రియొద్దనున్న ద్రవ్యమును ఆతనికుమారు లిచ్చు కొనవలయును. 87 ఇం. కే (జొ) 1327.

(9) దేవస్థానపుకమిటిమెంబరు తగాదాతో సంబంధించిన వ్యవహారములలో తండ్రిచేసినయప్పు అవ్యవహారికరుణముకాదు. ఆరుణములను కుమారులు తీర్చవలయును. 23 మ. లా. జ. 61.

(10) ఒకకాలువకు ఆటంకము కలుగచేసినందులకు నష్టమునకై తండ్రిపైని కాబడిన డిక్రీబాకీని కుమారు లీయవలయును. అది అవ్యవహారిక రుణముకాదు. 39 క 862.

17. పైన చెప్పబడినధార్మిక బాధ్యత, న్యాయశాస్త్ర సంబంధమైన దైనను, పితృపితామహప్రపితామహులరుణములకు పుత్రాదుల భాగములపైని బాధ్యతయున్నను, తండ్రియొక్కనిపైని పొందిన డిక్రీకి కోర్టుద్వారా పుత్రాదులభాగములతో సహా సమష్టికుటుంబాస్తిని వేలంవేయించుట శాస్త్రసమ్మతమే యైనను, అంతమాత్రముచే పితృపితామహప్రపితామహులు తమ సొంతయప్పులకు, పుత్రపౌత్రప్రపౌత్రులభాగములను వినియోగము చేయజాలరు.

ధార్మికబాధ్యత యున్నను పిత్రాదులుచేసిన వినియోగముల నాక్షేపించవచ్చును.

పిత్రాదులరుణములను పుత్రాదులు తీర్చవలయునని విధించినధార్మిక బాధ్యతకును పిత్రాదులు తమ సొంతయప్పులకు పుత్రాదులభాగములను వినియోగముచేయుటకును భేదమున్నది. పితృపితామహప్రపి

తామహులచే సమష్టికుటుంబావసరముకొరకు చేయబడినవినియోగములు పుత్రాదులభాగములపైని బయిండు అగుటకు ఆటంకముండదు. కాని వారిసొంతయప్పులకు చేయబడినవినియోగములు పుత్రాదులను బాధించవు. వినియోగములు బాధించవు కాని, ఆఋణములు మాత్రము న్యాయములైన వైనచో పుత్రాదులు తీర్చక తప్పదు.

ఎంతవివరముగా చెప్పినను, ఆలోచించి చూచినప్పుడు ఇందేవియో పరస్పరవిరుద్ధములైన ధర్మములు రెండు ఇమిడియున్నట్లు పాఠకులకు గోచరింపకమానదు స్మృతులను పరిశీలించినప్పుడు పరస్పరావరోధములైన యీవిధులను స్మృతికర్తలే యేర్పరచినట్లు తోచును. కొందరు హిందూలాగ్రంథకర్తలు, స్మృతులలో పరస్పరవిరుద్ధధర్మములు లేవనియును, పుత్రాదులపై ధార్మికబాధ్యతను విధించినను, అంతమాత్రముచే సమష్టికుటుంబాస్తిని తండ్రివిక్రయించుట కధికారము లేదనియు, కోర్టులద్వారా బలవంతముగా ఆ స్తిని విక్రయించుట కధికారమిచ్చుసూత్రములు స్మృతులలో లేవనియు, ఇప్పటి న్యాయస్థానములు యుక్తినిబట్టి సాధించి, తండ్రికిని కోర్టులకును అధికారములను వృద్ధిచేసిరనియు నుడువుచున్నారు.

(1) స్మృతులలో పరస్పరవిరుద్ధములుగా గనపడుచున్నవని చెప్పునట్టి ధర్మములు రెండు:—

స్మృతులలోని పరస్పరవిరుద్ధములగు రెండువిధులు.

మొదటిది:—సమష్టికుటుంబమెంబర్లలో నెవరును గూడ సమష్టికుటుంబావసరముకొరకు ఆపత్కాలములయందు దప్ప, సమష్టికుంబాస్తిని విక్రయించుటగాని, కుదువబెట్టుటకాని చేయకూడదు(1). (తండ్రికూడా ఏకకుటుంబమెంబర్లే గనుక ఈవిధి వారికి అన్వయించును.)

(1) 71 ఇం. కే. (నా) 17;

రెండవది:—తండ్రి చేసిన యప్పులను కుమారులు ఆస్తి లేకపోయినను తీర్చవలయును. (ఆస్తి లేకపోయినను తీర్చవలయునన్నచో ఆస్తియున్నచో దానిని విక్రయించియైనను తీర్చవలసియుండునని స్మృతికర్తల యభిప్రాయమైనట్లు ఊహించుట యసంగతము కాదు.)

ఈ రెండును వేరువేరుగా సూచినంతవరకు పరస్పర విరోధము గన్పట్టదు. తండ్రి చేసిన యప్పులను తీర్చవలయునని విధించినప్పుడు వారు తీర్చనిచో నేమిచేయవలయును ? అను ప్రశ్నకు స్మృతులలో ప్రత్యక్షముగా సమాధానము గానరాదు కాని యితరములగు నప్పులను గూర్చినవిధులను దీనికికూడ వర్తింపచేసినచో రాజు, కుమారుల వలన ఆ స్తిని అమ్మించియైనను ఋణమును తీర్చునట్లు చేయవలయునని సమాధానము వచ్చును. అందసంగతమేమియును లేదు. లేనిచో స్మృతికర్తలు విధించిన యీధార్మికబాధ్యతకు అర్థమే యుండదు. రాజుపై స్మృతికర్తలు విధించినవిధినే యిప్పుడు న్యాయస్థానములు అమలు జరుపుచు తండ్రి చేసినరుణములకు కుమారులభాగములతో సహా సమష్టికుటుంబాస్తిని వేలములో విక్రయించుచున్నారు. రెండవ విధిని అమలు జరుపుటకై సూత్రములో స్పష్టముగా కనపడకున్నను మనమొకసోపానమును ఎక్కవలసివచ్చినది. ఇక మరియొకసోపానమునుగూడ ఎక్కవలసినయవసరము కనపడుచున్నది. ఎట్లనగా ! కుమారులభాగములను న్యాయస్థానములు విక్రయింపగలుగునట్టి ఋణములను తండ్రి చేయుటకు శక్తికలవాడయ్యేనేని, ఆరుణములకు ఆభాగములను ఆతడు కుదువయుంచుటగాని, విక్రయించుటగాని ఏల చేయకూడదు ? ఆరుణములకే తండ్రి విక్రయించకూడదు కాని కోర్టులువిక్రయించవచ్చునా ? కొన్ని సందర్భములలో కోర్టులకంటె తండ్రియే లాభకరముగ విక్రయింపగలడుకదా! అట్టిచో తండ్రికి ఆయధికా

రము లేదని భావించుట సమంజసముగా గాన్పించదు. కుమారులు తీర్చ వలసిన యప్పును తండ్రి చేసెనను కొందము. అది వడ్డీతో పెరిగి పెరిగి ఎన్నియో కోట్లుగా ఆస్తిని మించునప్పటికి విశేషమొత్తమై ఆస్తియావత్తును పోవుటకంటె, ఎట్లును తప్పనప్పుడు తండ్రియే కొలది యాస్తిని విక్రయించి ఆఋణమును ఎత్తివేయుటమంచిది కాదా! అందు చే ధార్మికబాధ్యతయుండునని చెప్పబడినరుణములకు సమష్టిఆస్తిని తండ్రివిక్రయించుట కర్హుడని యీరెండవసూత్రములో నిమిడియున్న గ్రహింపకతప్పదు (27 మ. ప్ర. బొం. 243)

అయినను, ఈ రెండునూ పరస్పర విరోధములైన విధులవలె కన్పట్టును.

(అ) పరస్పరావిరోధములగు నీనిబంధనలను స్మృతికర్త లేర్పరచుటకు కారణము లేకపోలేదు.

వాటికిగల కారణములు.

(i) సమష్టికుటుంబాస్తి, సమష్టికుటుంబము యొక్క సంరక్షణకొరకేర్పడినది కావున దానిని సులభముగా వినియోగము చేయుట కెవరికిని హక్కు గలిగియుండకూడదు. అట్టినిబంధనయే లేకపోయినచో సమష్టిఆస్తి సులభముగా కుటుంబమునుండి జారిపోయి కుటుంబపోషణము దుస్సాధ్యమగును. ఆపత్కాలమున కుటుంబావసరముకొరకు దానిని విక్రయించుటకు లేక కుదువపెట్టుట కధికారమీయబడియేయున్నది

ii ఋణములు తెచ్చువిషయమున తండ్రికి కొంతస్వాతంత్ర్యమును నమ్మకమును ఉండవలయును. తండ్రి, బజారునకుపోయి యవసరమునకు కావలసినసామగ్రులు తెచ్చునప్పుడు నమ్మకముండినగాని బదులుపుట్టదు. కుటుంబపోషణము దుర్ఘటమగును. తండ్రిచేయు ప్రతియప్పును కుటుంబముయొక్క అవసరము కొరకు చేసెనని ఋజువు చేయవలయుననియు, లేనిచో అట్టి

ఋణము చెల్లదనియు, నిర్ణయించినచో ఋణదాత బదులిచ్చుటకు సాహసింపఁడు. అందుచే తండ్రి చేయు నప్పులను తనయులు ఆస్తి లేకపోయినను తీర్చవలయునని కఠిననియమమేర్పరచిరి. ఇట్టి నియమమే లేకపోయినచో తండ్రికి ఋణదాత బదులివ్వనే యివ్వఁడు. కుటుంబపోషణమే జరుగదు. అయితే తండ్రియైనను సమష్టికుటుంబముకొరకు చేసిన యప్పులను కుమారులు తీర్చవలయునని విధించుట ధర్మము కాని, తన సొంతముకొరకు చేసిన యప్పులను కుమారులేల తీర్చవలయునని ప్రశ్నింతురేమో! అప్పు సమష్టికుటుంబముకొరకు అడిగెనో, సొంతముకొరకడిగెనో, ఋణదాత కెట్లు తెలియును? ఇట్టిభేదమే కనుపర్చినచో ప్రతిపద్దును ఋజువుచేయవలసిన భారము ఋణదాతపై పడదా? అట్టి భారమతనిపై మోపినచో అప్పునిచ్చునా? యివ్వఁడు. అందుచే తండ్రి చేసిన ఋణముల కీభేదమును తీసివేసిరి. అయినచో నీయధికార మొక్క తండ్రికే కాకుండ కుటుంబమేనేజరైన ప్రతిమెంబరునకును కూడ అవసరముకాదా? అందురేమో! తండ్రి సామాన్యముగా తన కుమారులను పాడుచేయ నిచ్ఛగింపఁడు. అని యొక నమ్మకము. అందుచేతనే తండ్రి కీస్వాతంత్ర్య మీయఁబడినది. కుటుంబమేనేజరు తండ్రిగాక మరియొకరైనచో నాతని కీస్వాతంత్ర్యము లేదు. లోకములోని తండ్రులందరును సరియైనవారేనా? వారికి మాత్రమీస్వాతంత్ర్యమేల? అని ప్రశ్న రావచ్చును. అందుకనియే, తండ్రి దురభ్యాసములకులోనై కాని, యవ్యవహారజ్ఞుఁడై గాని యనవసరఋణములను చేయునేమోయని, అట్టి పనులకు ఋణదాతలు బదులివ్వకుండ నుండుటకై ఆ ఋణములను పుత్రులు తీర్చనక్కరలేదని విధులనేర్పరచిరి.

(3). పరస్పరావరోధములగు నీరెండువిధులను సమన్వయింప జేయుటలో న్యాయస్థానములు భిన్నాభిప్రాయముల నొసంగియు, కొన్నిచోట్ల స్మృతులకు వ్యతిరేకము చేసియు, కొన్నిచోట్ల నిదమిత్థమని నిర్ణయింపలేకయు, ననేక విధములుగాతీర్మానించియున్నవి. సమష్టికుటుంబము తోసంబంధించిన 'లా'లో, నిది ప్రి కౌ. వారుకూడ

రాజనారాయణుని కేసులో ప్రివికౌన్సి లువారేర్పరచిన విధులు.

ఒక్కసారిగా నిదమిత్థమని స్పష్టముగా తీర్మానింపలేనంతక్లిష్టసమస్యమై న్యాయస్థానముల కిప్పటికికూడ తీరనిపని యొసంగుచున్నది. 1917 సంవత్సరమున ప్రి. కౌ. వారొకమారు పొరబాటుఅభిప్రాయము నొసంగి(1). దానిని సవరించుటకై 1924 సంవత్సరమున ఏడుగురు న్యాయమూర్తులు కలసి, యీవిషయమునగల స్మృతులను, తీర్పులను కూలంకషముగా పరిశీలించి యీదిగువవ్రాసిన యయిదుముఖ్యవిధుల నేర్పరచిరి(2).

i సమష్టికుటుంబముయొక్క మేనేజుగుమెంబరు (కర్త) అవసరముకొరకుతప్ప సమష్టికుటుంబము యొక్కఆస్తిని వినియోగము చేయుటకుగాని, తనఖాపెట్టుటకుగాని హక్కులేదు.

ii అతడు, (కర్త) తండ్రియై, కుటుంబము లోని యితరమెంబర్లు కుమార్లయినయెడల, తండ్రి, దుష్కార్యములకొరకు కాకుండ చేసినయప్పుల నిచ్చుటకై పొందినడిక్రికి సమష్టికుటుంబాస్తిపైని, వారంటు అమలుజరుపవచ్చును.

iii తండ్రి, ఆస్తిపైని తనఖాబాధ్యత కలుగచేసినయెడల, అది పూర్వపుఋణములను తీర్మానించుటకొరకయిననేతప్ప, కుటుంబాస్తిని బయిండు చేయదు.

(1) 89 ఇం. కే. (ప్రి కౌ) 280.
(2) 77 ఇం. కే. (ప్రి. కౌ.) 689.

iv పూర్వపుఋణమనగా ఏవినియోగము చెల్లకూడనిదని తగాదా వచ్చినదో, ఆవ్యాపారముతో సంబంధించినది కాకుండ, అంతకు పూర్వము చేయబడినదని యర్థము.

v ఋణము చేసినట్టియు లేదా తనఖాపెట్టినట్టియు, తండ్రి జీవించి యున్నప్పుడును చనిపోయినపిమ్మటను కూడ పైవిధులు వర్తించును.

పరస్పరవిరుద్ధ ధర్మములను ప్రి. కౌ. వారు సమన్వయించిరా?

(4). పరస్పరవిరుద్ధములుగ గన్పట్టుచున్న పైనవ్రాసిన రెండు ధర్మములను ప్రి. కౌ. వారు పైనవ్రాసిన అయిదు విధులలోను ఎట్లు సమన్వయించిరో పరిశీలింతము.

i సమష్టికుటుంబాస్తిని, సమష్టికుటుంబావసరము కొరకుతప్ప వినియోగింపకూడదను ప్రధాన సూత్రమును మొదటివిధిలో స్పష్టపరచిరి.

i తండ్రియొక్క ఋణములను కుమారులు తీర్చవలయునను బాధ్యతను రెండవవిధిలో చెప్పిరి. అనగా తండ్రిఋణములకు ఋణదాతలు కుమారులభాగములతోసహా సమష్టికుటుంబాస్తిని జప్తుచేయించి వేలము వేయించవచ్చునని నిర్ణయించిరి.

ఇవి రెండును పరస్పరవిరుద్ధధర్మములు. ఇకను వాటిని సమన్వయము చేయుటకై మూడవవిధిని ఏర్పరచిరి.

iii తండ్రి, పూర్వపుఋణముల తీర్మానముకొఱకు సమష్టికుటుంబాస్తిపైని బాధ్యతను కలుగచేయవచ్చును.

ఈవిధిమూలమున ప్రధానసూత్రమునందలి కాఠిన్యము తగ్గి, అందలినియమమునకు భంగము వాటిల్లినది. తండ్రి, తనకు అప్పుడు కావలసినసొమ్మునకు ఆస్తిని వినియోగము చేయుటకు హక్కులేకుండ చేసి, ప్రధానసూత్రమునందలి ధర్మమును కాపాడినది. పూర్వపు

(5) ఈసమన్వయము చాలకాలముక్రిందటనే చేయబడి అప్పటినుండియు అమలు జరుగుచునే యున్నది(1). కాని ఈనడుమ సాహురామచంద్రుని కేసులో(2). ప్రి కౌ. వారు ఆకేసును తీర్పుచేయుట కనవసరములైన కొన్నివాక్యములను తమతీర్పునందు వ్రాయుటచే నీవిషయమున ననేకసంశయములు పుట్టు క్రొత్తతగవులు విశేషముగావచ్చినవి.

సాహురామ చంద్రుని కేసు.

ఆకేసుయొక్క వివరములివి:—భూపసింగు అనునతడు, సమష్టికుటుంబాస్తిని రు 200 లకు తనఖాపెట్టెను నె 1 కి రు 1-8-0 చొ॥ మూసవారి కాంపౌండువడ్డి. ఆతనఖాహక్కు దరిమిలాను సాహురామచంద్రునకు చెందెను. అతడు 27 సం॥రములకు పిమ్మట భూపసింగును, అతనికుమాళ్లను పార్టిలనుగా చేర్చి దావా తెచ్చెను దావా తేదీనాటికి బాకిమొత్తము రు 22131-9-0 లు తేలెను. రు 15000-0-0 లకు దావా తెచ్చి తక్కినది వదలుకొనియెను భూపసింగు రు 200-0 0 లును తనఖాదస్తావేజు వ్రాసిననాడే పుచ్చుకొనియెను. తనఖాదారు, ఆరుణము న్యాయమయిన అవసరముకొరకుగాని, పూర్వపురుణములను తీర్చుటకుగాని చేయబడినట్లు రుజువు చేయలేకపోయెను. క్రిందికోర్టులు రెండును ఆకారణముచే తనఖా కుమాళ్లను బయింద్ చేయదని తీర్మానించిరి. సాహురామచంద్రుడు ప్రి. కౌ. నకు అప్పీలుచేసెను. అప్పీలును కొట్టివేయుచు ప్రి. కౌ. వారు అప్పీలును కొట్టివేయుటకుండు కారణములను చెప్పుటలో నీదిగువయర్థమునిచ్చు వాక్యముల నుదాహరించియుండిరి.

---

(1) 6 మా. ఇం. అ. 393; 5 క 148; 13 క 21 (ప్రి. కౌ;) 29 మ 200; 31 అ 176; 15 అ. వు. బెం. 75.

(2) 29 ఇం. కే. (ప్రి. కౌ.) 280.

i　తండ్రి జీవించియుండగా అతని సొంతరుణములకు కుమారులు బాధ్యులు కారు. ఏమంటే తండ్రి తనజీవితకాలములో ఆరుణములను తీర్చివేయవచ్చును. లేదా అతనియనంతర మాతని స్వార్జితముగాని ప్రత్యేకపుఆస్తిగాని యుండవచ్చును. కావున ఆరుణము లాయాస్తిమీద జయింపగును. అందుచే తండ్రిచేసిన రుణములకు కుమారులపైని అతని జీవితకాలములో బాధ్యత లేదు.

ii　సమిష్టి కుటుంబాస్తిని తండ్రి వినియోగము చేయకూడదను ప్రధానసూత్రమునకు, పూర్వపు రుణములకు తండ్రి వినియోగము చేయవచ్చుననునియమము ఒక మినహాయింపు అయియున్నది.

(ఈనియమము రెండు పరస్పరవిరుద్ధములైన ధర్మములను సమన్వయింపచేయుటకై ప్రధానసూత్రమునకు చేర్చిన యుపసూత్రముగా ప్రి. కౌ. వారు భావింపలేదు.)

iii　ఈమినహాయింపులో చెప్పబడినపూర్వపు రుణములు, కాలమునుబట్టి పూర్వమునందు చేయబడినవేకాకుండ సమిష్టి కుటుంబాస్తితో నెట్టి సంబంధమును లేనివై యుండవలయును.

(6). ఈ వాక్యములతో నదివరకున్న 'లా' యంతయు తలక్రిందైనట్లు గన్పట్టెను. మొదటివాక్యము ననుసరించి, తండ్రి జీవించియుండగా, తండ్రిచేసిన యప్పులకు కుమాళ్లపైని దావా తేరాదనియు, కుమాళ్ల భాగములను విక్రయింపవీలు లేదనియు, వాదములు బయులుదేరెను(1). మూడవ వాక్యమునుబట్టి పూర్వపురుణము తనఖారుణమైనచో, దానితీర్మానముకొరకు చేసిన దరిమిలాతనఖారుణము కుమా

సాహురామచంద్రునికేసుయొక్క ఫలితము.

(1) 48. ఇం. కే. (మ) 225; 52 ఇం. కే (బొ) 108;

ళ్లను బయిటకు పంపరాదని తీర్మానించిరి(1). మ॥ ఫు॥ బె॥ వారు ఈ విషయమును పూర్తిగ విచారణచేసి, ప్రి. కౌ. వారు సాహూరామచంద్రప్రసాదు కేసులో అనవసరముగ వ్రాసిన వాక్యములనుబట్టి అదివరకు చిరకాలమునుండి అమలులోనున్న 'లా' ను మార్చనక్కరలేదనియు, పూర్వపురుషునియొక్కయప్పు తన ఋణమైనను కుమారులను బాధించుననియు తీర్మానించిరి(2). అ. హై. వారు దీనికి వ్యతిరేకముగా తీర్మానించిరి(3).

బ్రజనారాయణుని కేసు.

(1) ఈయభిప్రాయభేదములను నివారించుటకై పెద్దగురు న్యాయమూర్తులకు కూడ యీవిషయములను సమర్పించి అ. హై. వారి తీర్పును రద్దుపరచి, మ. హై. వారి యభిప్రాయముతో నేకీభవించుచు, పైన వ్రాసిన అయిదువిధులను తమతీర్పులో పొందుపరచిరి(4). ఈతీర్పువలన తండ్రి జీవితకాలములో కుమారులకు బాధ్యతలేదను నియమము రద్దు అయినది. పూర్వపురుషఋణము తనఋణమైనను, పితృఋణమైననుకూడ పూర్వపురుషఋణముగానే యెంచబడి, కుమారులను బయిండు చేయునని స్థిరపరుపబడినది.

---

(1) 48 ఇం. కే (మ) 289; 52 ఇం. కే (పా) 108.

(2) 52 ఇం. కే (మ) 525; 78 ఇం. కే (లా) 11

(3) 50 ఇం. కే (అ) 101

(4) 77 ఇం. కే ప్రి. కౌ. 689

(8) ప్రి. కౌ. వారేర్పరచినవిధులకు వ్యతిరేకముగా నది వరకుకొన్నితీర్పులున్నవి. కాని యవి రద్దుపడినట్లెంచవలయును. సమష్టికుటుంబఋణములతో సంబంధించినవ్యవహారము లన్నియు, నీ పైవిధులలో నిమిడియుండునని చెప్పవలనుపడదు. ఈ విధులు సంపూర్ణముగా వర్తించు కేసులన్నియు నీరీతిగానే యవులు జరుగవలయును. తక్కినవాటివిషయములో ప్రి కౌ. తీర్పునందలి విధులలో పొందుపరుపబడినప్రధానసూత్రములకు భంగములేకుండ ఆయాకేసుల సందర్భములనుబట్టి యితరతీర్పుల నన్వయింపచేయుచు తీర్మానింపవలసి యుండును.

ప్రి. కౌ. వారి విధులు సమగ్రములు కావు.

పైనవ్రాసిన 2 వ విధికి అర్థముచెప్పుచు అ. హై. వారొక కేసులో ఈవిధముగా తీర్మానించియున్నారు(1).

రామదత్తు కర్త. మధురప్రసాదు అతనికొడుకు. మధురప్రసాదుకు ముగ్గురు మైనరుకుమాళ్లు. కర్తతో సంబంధములేకుండ, మధురప్రసాదు అప్పులనుచేసెను. అతనిపైని డిక్రిపొంది, ఋణదాత, అతని సగమువంతును జపుచేసి వేలమునకు తెచ్చెను. అప్పుడు మైనర్లు అభ్యంతరము చెప్పిరి. అది పూర్తిగా విచారణకాకుండ మధురప్రసాదుయొక్క హక్కుబాధ్యతలు వేలము వేయబడవలయునని తీర్మానించెను. ఆవేలములో ఋణదాతయే కొని, సగంవంతునకు స్వాధీనముకొరకు దావా తెచ్చెను. మధురప్రసాదు ఎనిమిదవవంతునకుమాత్రమే హక్కుగలదనియు వాది ఆ యెనిమిదవవంతుమాత్రమే కొనినట్లు యెంచవలయుననియు మైనర్లు వాదించిరి ప్రి కౌ. వారి రెండవవిధిలో "ఆతడు తండ్రియై" అనియుంచుటచేత మేనేజింగు మెంబరు తండ్రియైన

(1) 180 ఇం. కే. (అ) 1

ప్పుడుమాత్రమే సమష్టికుటుంబాస్తిపైని వారంటు అమలును జరుప వచ్చునుకాని కర్త యొకనొకడైనప్పుడు ఆవిధి వర్తించదనియు, ఈకేసులో రామదత్తు జీవించియుండగా మధురప్రసాదు కర్తకాడు కావున మధురప్రసాదు చేసినయప్పులకు అతనిభాగముమాత్రమే వేలము వేయవచ్చునుకాని మైనర్లభాగములను వేలము వేయరాదనియు తీర్మానించి ఎనిమిదవవంతునకుమాత్రమే డిక్రి నిచ్చియున్నారు. ఈతీర్పు, "తండ్రిచేసిన యప్పులకు కుమారులపైని ధార్మికబాధ్యతయుండు"నను సూత్రమునకు పితామహుడు జీవించియుండగా "తండ్రిచేసినయప్పులకు కుమారులపైని ధార్మికబాధ్యత యుండదు" అనునొక క్రొత్త యపవాదము (మినహాయింపు)ను తెచ్చిపెట్టుచున్నది. ఈ క్రొత్తమినహాయింపునకు స్మృతులలో ఆధారము కన్పట్టదు. బాగుగా పరిశీలించినచో స్మృతులు ఈమినహాయింపునకు వ్యతిరేకముగా నుండునేమో యని సంశయముగనున్నది. ప్రి. వి. కౌన్సిలువారు రెండవవిధిలో "అతడు తండ్రియైనయెడల" (If he is the father) అని వ్రాయుటచేత అ. హై. వారిట్లు తీర్మానించుట కవకాశము చిక్కినది. "అతడు" (If he) అనుటకు బదులుగా "ఋణస్థుడు" (if the debter) అని వ్రాసియుండినచో అ. హై. వారి కాయవకాశముండదు. ఇంతకును ఆశబ్దము నుపయోగించుటలో ప్రి. కౌ. వారి యుద్దేశమేమైయుండునో యోచింపవలసియున్నది. ఈవిషయమై యితర హైకోర్టులలో ఇంకను తీర్పులు వచ్చియున్నట్లు కనపడదు.

ఈరెండవవిధికే యర్థముచెప్పుచు, అ. హై. వారు మరియొక కేసులో ఒకకుటుంబములో తండ్రియు, కుమారులును మాత్రమే యున్నప్పుడు ఈరెండవవిధి వర్తించుననియు, ఆకుటుంబములో ఆతండ్రియొక్క తమ్ములు, వారికుమాళ్లు మొదలగువారు కూడ నున్నప్పుడు, ఈవిధివర్తించదనియు, ఆసందర్భములో మొత్తము సమష్టికుటుం

బాస్తిపైని వారంటు అమలుజరుపదలచుకొన్నప్పుడు, ఆతండ్రిచేసిన రుణము, సమష్టికుటుంబావసరముకొరకు చేయబడినట్లు మామూలు కర్తవిషయములోవలెనే ఋణదాత రుజువుచేయవలసియుండుననియు తీర్మానించినారు(1).

తండ్రి అమితవ్యయము చేయువాడయ్యేనేని ఆతడుచేయు రుణములబాధనుండి తప్పించుకొనుటకు ఆతనితో విభజించుకొనుటతప్ప కుమారులకు వేరుమార్గము లేదు(2).

ప్రి. కౌ. వారితీర్పులోని 3 వ విధి స్వాధీనపుతనఖాకుకూడ అన్వయించును(3).

18. సాధారణముగా నుండు రేటుకంటె హెచ్చువడ్డీకి బదులు తెచ్చుటకు కర్త కధికారము లేదు. అట్లు తెచ్చినయెడల, కర్తనేగాని తక్కినమెంబర్లను బయిండు చేయదు(4).

అధికవడ్డీ.

మామూలు రేటుకంటెహెచ్చువడ్డీకి కర్త బదులు తెచ్చినప్పుడు, అప్పటిస్థితిగతులను బట్టియును, కుటుంబముయొక్క పరిస్థితుల ననుసరించియును, అంతహెచ్చువడ్డీకి బదులుజేయవలసినయవసరమప్పుడుండెనని, ఋణదాత రుజువుచేయవలయును. ఆరుజువుభారము ఋణదాతపై విశేషముగానున్నది(5).

(1) 143 ఇం. కే. (అ) 762;
(2) 60 ఇం. కే. (ప్రి) 219;
(3) 84 ఇం. కే. (ప్రి) 501.
(4) 171-176 పేజీలు.
(5) 56 బొం. 86; ఈపుస్తకములోని 171-176 పేజీలు.

కర్త యధికారములో లేనిరీతిగా అధికవడ్డీకి కర్త అప్పుతెచ్చిన యెడల, ఆవడ్డీని తగ్గించుటకు కోర్టున కధికారము కలదు ఋణమును తీర్చక కాలయాపనముచేయుటచే తిరిగి వ్రాయుచుండుటవలన పెరిగినవడ్డీని కోర్టులు తగ్గింపచూడకూడదు(1).

19. సమష్టికుటుంబాస్తిని సమష్టికుటుంబావసరము కొరకు తప్ప తండ్రి వినియోగము చేయకూడదు. ఇది ప్రధానసూత్రము. ఆ స్తిని తనఖాపెట్టి బదులు తెచ్చుటకూడ వినియోగములో చేరును. కావున నీసూత్రము తనఖాకు కూడ అన్వయించును*.

తండ్రి సమష్టి కుటుంబాస్తిని ఎప్పుడు తనఖా పెట్టవచ్చును.

పై ప్రధానసూత్రమునకు ఒక ఉపసూత్రము కలదు. తండ్రి పూర్వఋణములకు ఆ స్తిని తనఖాపెట్టినయెడల అది కుమారుల భాగములనుకూడ బయిండు చేయును. పూర్వఋణములతీర్మానము కొఱకుగాక, తనఖాపెట్టునపుడే తనసొంతముకొరకు బదులుపుచ్చుకొన్న యెడల ఆతనఖా కుమారులభాగములపైని చెల్లదు. పూర్వఋణములనగా ఈతనఖావ్యవహారముతో సంబంధము లేకుండ అంతకు పూర్వము మఱియొకప్పుడు చేసినవై యుండవలయును.

(1) 171-176 పేజీలు; 44 మ. లా. జ. 615; 36 మ. లా. జ. 521; 35 మ లా. జ. 614; 48 మ. లా. జ. 584; 47 మ. లా. జ. 329; 23 క. వీ. నో 180; 11 క. 379.

Note:*—సమష్టికుటుంబావసరముకొరకు తనఖా పెట్టినప్పుడు కుమారులభాగములు కూడ బయిండుచేయును. ఈవిషయమునుగూర్చి ఆఱవ ప్రకరణమున విశేషముగా చర్చింపబడినది కావున ఆవిషయము మిట ప్రస్తావింపబడదు. ఇచ్చట తండ్రిచేసిన తనసొంతయప్పులకు తనఖా పెట్టవచ్చునా అనువిషయమును గూర్చి తెలుపబడును.)

ఈ ఉపసూత్రమునే ప్రి కౌ. వారు బ్రజనారాయణకేసు(1)లో 3-5 పిథులలో నిర్వచించియున్నారు తండ్రిచేసిన పూర్వపురుషార్జితములతమాత్రము కుమారుల భాగము తెలబడియుండు కావలయునని ప్రశ్నరావచ్చును. పుత్రులపైనున్న ధార్మిక బాధ్యతననుసరించి ఆరుణములు కుమారులు తీర్చవలసిన వేకదా! అందుచే ఆస్తిపైని బాధ్యతకలుగ చేయుటకు తండ్రికి హక్కు కలదు. కావున పూర్వపురుణములనుగూర్చిన యీ యుపసూత్రము, "ధార్మికబాధ్యతతో సంబంధించిన మరియొకసూత్రముపై" నాధారపడియున్నట్లు భావింపవలయును.

పూర్వపురుణములుగాని, సమష్టికుటుంబావసరముగాని, లేకుండ తండ్రి, సమష్టికుటుంబాస్తిని తనఖా పెట్టెనుకొనును. ఆతని ఖాబాకీనిగురించి, పుత్రులను పౌత్రులను చేర్చి దావా తెచ్చిరి. కాని పౌత్రులను తప్పించి, తండ్రిమీాస్తిమీాద డిక్రీ యిచ్చిరి. ఆడిక్రీవారంటు గ్రంథములో పౌత్రులపైని అమలుజరుపవచ్చునాయని ప్రశ్నరాగా పౌత్రులపైని దావా కొట్టివేయుబడినది. కావున ఈకేసుయొక్క ప్రత్యేకసందర్భములనుబట్టి పౌత్రులమీాద డిక్రీ అమలుజరుప వీలులేదనిరి(2).

తండ్రి కుటుంబాస్తిని తనఖా యిచ్చెను. ఆయప్పులు పూర్వపురుణములును కావు. కుటుంబావసరము కొరకు చేయుబడినవియునుగావు. అక్రమపురుణములును కావు. అట్టిసందర్భములో కుటుంబాస్తిలోని కుమారుల భాగములపై తనఖా చెల్లదని రద్దుచేయుచు, తండ్రిభాగము అమ్మబడినమీాదట తనఖాబాకీ తీరనిచో మిగిలిన

(1) 77 ఇం. కే. ప్రి. కౌ. 689.

(2) 144 ఇం. కే. (బొ) 897.

బాకీకి కుమారుల భాగములను జప్తుచేయించి వేలం వేయించవచ్చునని కొన్ని తీర్పులున్నవి(1).

తండ్రియిచ్చిన తనఖా చెల్లదని తోచినప్పుడు ఋణదాత తన ఖాను వదలుకొని విడిడిక్రీనిపొంది ఆరుణము అక్రమము కాకపోయినచో ఆడిక్రీని బట్టి కుమారుల భాగములతోసహా సమష్టికుటుంబాస్తిని వేలం వేయించవచ్చును(2).

తండ్రిపెట్టిన తనఖా కుమారులను బయిండు చేయవలయునన్నచో, అది కుటుంబావసరము లాభము, వీటికొరకైనను పెట్టియుండవలయును. లేదా పూర్వపురుణతీర్మానముకొరకైనను పెట్టియుండవలయును. లేనిచో ఆతనఖా కుమారుల భాగములను బయిండు చేయదు(3).

తండ్రిపెట్టిన తనఖా ఎప్పుడు చెల్లదు? చెల్లనప్పుడు రుణదాత ఏమిచేయవలయును?

**20.** పితృపితామహ ప్రపితామహులు సమష్టికుటుంబాస్తిని తనఖాపెట్టినప్పుడు, అది చెల్లకపోవుటకు కారణములు మూడు.

(i) ఆసొమ్ము సమష్టికుటుంబావసరముకొరకు కాకపోవుట.

(ii) ఆతనఖా పూర్వపురుణతీర్మానమునకు కాకపోవుట.

(iii) ఆతనఖారుణము అక్రమపుకార్యములకొరకు చేయబడుట.

(1) 55 ఇం. కే. (మ) 320; 69 ఇం. కే. (లా) 552; 116 ఇం. కే. (లా) 180; 85 ఇం. కే. (అ) 31; 79 ఇం. కే. (బొ) 1008; 125 ఇం. కే. (సిం) 89; 124 ఇం. కే. (పా) 844.

(2) 125 ఇం. కే. (సిం) 89.

(3) 40. ఇం. కే. (ప్రి. కౌ.) 234; 42 ఇం. కే. (పా) 456; 43 ఇం. కే. (బొ) 291; 66 ఇం. కే. (లా) 408;

తండ్రి సమష్టికుటుంబాస్తిని తనఖాపెట్టి బదులుతెచ్చినప్పుడు, ఆసొమ్ము, సమష్టికుటుంబముయొక్క అవసరముకొరకైనచో సరియే, దానినాక్షేపించుట కెవరికిని హక్కులేదు. తండ్రి తనసొంతముకొరకు చేసినయప్పులకు తనఖాపెట్టినను, అది పూర్వపురుణతీర్మానమునకైనచో అదియును చెల్లును. దానినికూడ కుమారులు ఆక్షేపింపజాలరు.

తండ్రి తన సొంతముకొరకు సమష్టికుటుంబాస్తిని తనఖాపెట్టి క్రొత్తగా అప్పుడే బదులు తెచ్చినచో ఆతనఖా కుమారులభాగములమీద బయిండుకాదని మ. హై. వారు తీర్మానించిరి(1). కాని దరిమిలాను కొన్నితీర్పులలో ఆభేదమును గమనింపబని లేదనియు తండ్రిచేసినరుణములు అన్యాయములైనవి కాకపోయినచో, వాటిని తీర్చవలసినబాధ్యత కుమారులపైని యుండగా పూర్వపురుణమును తీర్చినచో తనఖా చెల్లుననియు లేనిచో చెల్లదనియు తీర్మానించుట సరిగా లేదనియు, కొన్నితీర్పులు పుట్టినవి(2). కాని వ్రిజనారాయణుకేసు(3). లో ప్రివికౌన్సిలువా రేర్పరచినవిధులనుబట్టి యీసంశయము తీరిపోయి, పూర్వపురుణములకైననే తప్ప, తండ్రిపెట్టిన తనఖా చెల్లదని స్థిరపరుపబడినది కావున ఇక సంశయింపబని లేదు. దీనితో పైనచెప్పినతీర్పులు రద్దుఅయినట్లెంచవలయును.

తనఖారుణము అక్రమపురుణమైనచో అది, తండ్రివాటామీద తప్ప కుమారులభాగములమీద బయిండుకాదు. ఇది సుప్రసిద్ధవిషయము. అట్టి రుణముల నిచ్చినరుణదాత చెడవలసినదేగాని యేమియును చేయజాలడు. అక్రమపురుణములకు కుమారులపైని ధార్మిక

(1) 21 మ 28.

(2) 21 మ 222; 22 మ 207; 28 క 517; 24 అ 459; 2 బొం, లా. 8 450

(3) 77 ఇం. కే. (ప్రి. కౌ.) 689.

బాధ్యతకూడ లేదు. అందుచే ఋణదాత కుమారులభాగములమీద గాని కుమారులమీదగాని అమలు జరుపజాలడు. అట్టిరుణములకు తనఖారద్దుచేసి తండ్రిపైని విడి డిక్రియిచ్చినసందర్భములో ఆవిడిడిక్రిని బట్టి కుమారులభాగములను జప్తుచేయించకూడదనియు, తండ్రివాటా జప్తుచేయించి వేలంవేయించవచ్చుననియు అ హై. వారు తీర్మా నించిరి(1).

తండ్రిపూర్వపు అప్పులుతీర్చుటకు తనఖాపెట్టెను. కుటుంబా దాయము చాలహెచ్చుగానున్నదనియును ఋణములు చేయవలసిన యువసరము లేదనియు కుమాళ్ళు వాదించిరి. కాని అవి అక్రమపు రుణము లనువాదము లేదు. అందుచే, ఆదాయములో సంబంధించిన విచారణచేయవలసిన యువసరము లేదని తీర్మానించిరి(2).

తండ్రిచేసినరుణములకు కుమారులపైని ధార్మికబాధ్యత యున్నదికదాయని, తండ్రిపెట్టినతనఖా యితరకారణములచే చెల్లక పోయినను, ధార్మికబాధ్యత కారణముచే కుమారులను బయిండు చేయునని చెప్పకూడదు(3)

అక్రమపురుణములు, దుర్వ్యవర్తనకొరకు చేయబడినరుణ ములు, అశాస్త్రీయరుణములు వీటికొరకు పెట్టినతనఖా, తండ్రిభాగ మునేకాని, కుమారులభాగములను బయిండుచేయదు(4).

(1) 89 ఇం. కే. (అ) 480
(2) 120 ఇం. కే. (నా) 326
(3) 1922 అ. 50
(4) 62 ఇం. కే. 111

యీరుణము 2 వ విధికిక్రిందకు వచ్చునేని, వారంటుగ్రంథములో కుమారులఆస్తిని విక్రయించుటకు అధికారముకలదు కావున, అట్లు విక్రయించకూడదని చెప్పువారిపైని (అనగా కుమారులపైని) ఋజువు భారముండును. డిక్రీ అయినను, ఇది తనఖారుణము గనుక, 3 వ విధికిక్రిందకు వచ్చునందురేని ఋజువుభారము ఋణదాతపై నుండును ఈవిషయము అ. హై. ఫు బెం. కేసులో పూర్ణముగా విమర్శింపబడి, 2 వ విధిలో చెప్పబడిన రుణము తనఖారుణము కాదనియు, విడి రుణములకు పొందబడిన డిక్రీవిషయముననే అది వర్తించుననియు, తనఖారుణమునకు డిక్రీ అయినపిమ్మటకూడ, ఆస్తి వేలము కాకుండా ఉన్నంతవరకు 3 వ విధియే వర్తించుననియు తీర్మానించియున్నారు(1).

23. తనఖాఆస్తి వేలమయినపిమ్మట ఆవేలము చెల్లనేరదని కుమారులు దావా తెచ్చిరేని, తనఖారుణము అక్రమమయినదనియు, ఆసంగతి వేలములోకొన్నవాడు యెరిగియున్నాడని యు ఋజువుచేసినకాని వేలము రద్దుకాజాలదు. కోర్టువేలములో కొన్న క్రియదారునకు, వారంటు గ్రంథములోని విషయములు తప్ప అంతకుపూర్వపువిషయములన్నియు, విమర్శింపవలసిన యావశ్యకము లేదు. కావున అట్టికేసులలో రుజువుభారము కుమారులపై నుండును(2).

తనఖాఆస్తి వేలమయిన పిమ్మట ఋజువుభారమెవరిది?

ఒకవేళ తనఖాదారుడే, వేలములో కొన్నప్పటికిని, వేలమయినపిమ్మట కుమారులు దావా తెచ్చునప్పుడు రుజువుభారమంత

(1) 11ర ఇం. కే (అ. ఫు. బెం.) 77ర; See also 124 ఇం. కే 1120;
(2) 1:5 ఇం. కే (అ. ఫు. బెం.) 77ర; 5 క 148 (ప్రి. కౌ); 15 క 717 (ప్రి. కౌ)

యును కుమారులదే గాని తనఖాదారుపై నుండదని, పైకేసులోనే తీర్మానించిరి.

విడిఋణములను గూర్చిన రుజువు భారము.

24. సమష్టికుటుంబాస్తిపైని డిక్రిని పొందగోరునట్టి ఋణదాత, కర్తకిచ్చినను, ఇతరమెంబరునకిచ్చినను, సమష్టికుటుంబావసరముకొరకు తాను బదులునిచ్చితిననియు, ఆసొమ్ము కావలసినయవసర మాకుటుంబమున కప్పుడు కలదనియు రుజువుచేయవలయును(1).

పితృపితామహ ప్రపితామహులకు బదులిచ్చినప్పుడు, ఋణదాత, రుణమిచ్చినట్లు రుజువుచేసిన చాలును.

సమష్టికుటుంబాస్తిపైని డిక్రిని యివ్వకూడదని వాదించువారు:—

(1) ఋణదాత బదులు యివ్వనేలేదని;

(2) ఋణదాత సమష్టికుటుంబావసరముకొర కివ్వలేదనియు; సమష్టికుటుంబమునకు న్యాయమైనయవసరము లేదనియు, న్యాయములైనయవసరములకు ఖర్చుపడ లేదనియు ఋజువుచేయవలయును(2).

(3) పితృపితామహ ప్రపితామహుల రుణములైనచో పుత్రపౌత్రప్రపౌత్రులు తమబాధ్యతను తప్పించుకొనవలయునన్నచో (అ) ఋణము లేదని (ఆ) సదరురుణములు ధార్మికబాధ్యత లేని కార్యములకు (Illegal and immoral) అనగా న్యాయశాస్త్రసమ్మతములు కానట్టివియు దుష్ప్రవర్తనకొరకు అయినట్టివియు నగు కార్యముల కొరకు చేయబడిన రుణములని స్పష్టముగా రుజువుచేయవలయును. అట్లు రుజువుచేయ లేనియెడల ఆబాధ్యత తప్పదు(3).

(1) 39 ఇం. కే. (పా) 352.

(2) 127 ఇం. కే. (బొం) 507.

(3) 70 ఇం. కే. 941; 60 ఇం. కే. 137; 57 ఇం. కే. 86.

కుటుంబమునకు వర్తకమున్నదనియు, ఆవర్తకమునకై అప్పు అవసరమనియు, తనదర్యాప్తులో తెలియవచ్చెనని ఋణదాత రుజువు చేయవలయును. న్యాయమైనదర్యాప్తు చేసినట్లును ఆదర్యాప్తులో తెలిసినసంగతులు నిజమని తాను నమ్మినట్లును ఋణదాత సరిగా రుజువు చేసినప్పుడు, ఆసొమ్ము వర్తకమునకింద ఖర్చుపడకపోయినను రుజువు చేయవలసినబాధ్యత ఋణదాతపైని యుండదు(1).

25. పితృపితామహప్రపితామహులుచేసిన ఋణములు తమను బయింటుచేయవని పుత్రాదులు వాదించుటకు రెండుహేతువులు మాత్రమే కలవు.

ఋణములుదుష్ప్రవర్తనకొరకుచేయబడెనని రుజువు చేయుటెట్లు?

1. దుష్ప్రవర్తనకొరకు చేయబడినవని చెప్పుట.
2. న్యాయశాస్త్రసమ్మతము కాని కార్యములకు అప్పులు చేయబడెనని వాదించుట.

తండ్రి ప్రవర్తనము సరిగా లేకపోయినంతమాత్రమున ఆతడు చేసినయప్పులన్నియు, అందుకొరకే చేసినట్లు భావింపవలనుపడదు. కుటుంబముకొరకుకూడ ఆతడు అప్పులను చేసియుండవచ్చును. కావున ఏఋణములనుగూర్చి తగవువచ్చినదో ఆఋణములు, న్యాయశాస్త్రసమ్మతములు కానివనిగాని, దుష్ప్రవర్తనకొరకు చేయబడినవనిగాని స్పష్టముగా కుమారులు రుజువుచేయవలయును. ఈరుజువుభారము సర్వదా కుమారులపైనుండును. తండ్రికి మద్యపానాభ్యాసముకలదనిగాని రిజాలాగాతిరుగుచున్నాడనికాని, జూదమాడుననిగాని జనరలుగారుజువుచేసినచాలదు. ఆదుష్ప్రవర్తనకును ఈఋణమునకును

(1). 132 ఇం. కే. (పి. కా.) 61. 8

యు ఋజువుచేసినచో ప్రతిపన్నుడు దుర్వినియోగమునకై ఖర్చుపడిన దని రుజువుచేయనక్కరలేదు(1).

26. పితృపితామహప్రపితామహులు చేసినపూర్వపురుణము లకు న్యాయస్థానములు ఒకవిధమయిన పవిత్రతను తెచ్చిపెట్టినవి. పూర్వపురుణము లనగా నేమి? ప్రజనారాయణకేసు(2)లో ప్రి కౌ. వారు నుడివిన వాక్యములవలన వీటికి గౌరవము మరింత హెచ్చినది.

(1). పిత్రాదులు తమ పూర్వపురుణములకు సమష్టిఆస్తిలోని పుత్రాదులభాగములను వినియోగముచేయవచ్చును.

(2). పూర్వపురుణములకు వినియోగముచేసినప్పుడు ఆరుణముల స్వభావమునుగూర్చి వినియోగమును పొందినవాడు రుజువు చేయనక్కరలేదు. అవి అక్రమపురుణములని పుత్రులే స్పష్ట ముగా రుజువుచేయవలయును.

పూర్వపురుణముల కిట్టిగౌరవ మిచ్చియుండుటచే పూర్వపు రుణములనగా నెట్టివియో తెలిసికొనవలసియున్నది. పూర్వము అని చెప్పునప్పుడు, ఏదియోయొక కాలము నిర్ధారణచేసి అంతకుపూర్వము అనిచెప్పవలసియుండును. ఈశబ్దము సామాన్యముగా ఆస్తిని వినియో గముచేయుసందర్భమున వచ్చుచుండును; కావున ఆస్తిని వినియోగ ము చేయుటకుపూర్వము అనియర్థము. అయితే ఆ స్తివినియోగము చేయుటకొకగంటకుపూర్వమో ఒకరోజునకుపూర్వమో రుణముచేసి ఆరుణములకు వినియోగముచేయుచు అది పూర్వపురుణమని చెప్ప వచ్చునాయని సంశయము కలుగవచ్చును. అందుకనియే ప్రి. కౌ. వారు పైనచెప్పినకేసులో ఏవినియోగమును గూర్చి తగవువచ్చినదో

(1) 31 ఇం. కే 476.

(2) 77 ఇం. కే (ప్రి. కౌ.) 689; 67 ఇం. కే 569; 39 ఇం; కే 280;

అనినియోగముతో సంబంధించియుండరాదనియు, అంతకు పూర్వము మరియొక ప్రారబ్ధములో చేయబడినఋణము అయియుండవలయుననియు స్పష్టపరచియున్నారు(1). ఆ ప్రివికౌన్సిలు కేసునకు పూర్వమును దరిమిలానుకూడ ఏదిపూర్వపుఋణమో ఏదికాదో అనువిషయమున చాలవాదములుబయలుదేరి హైకోర్టులలోచాలతీర్పులుపుట్టియున్నవి. అందు ముఖ్యములగు కొన్నిటిసారము దిగువవ్రాసెదను. అయితే ఈ పూర్వపుఋణము అనుగౌరవము, పితృపితామహప్రపితామహులుచేసి నఋణములకేగాని, యితరకర్తగాని, యితరమెంబర్లుగాని చేసినఋణము లకుండదు. ఇతరకర్త, ఇతరమెంబర్లు చేసినఋణములను గూర్చి విచారణచేయునప్పుడు, న్యాయమైనఅవసరమా? కాదా? యను ప్రశ్నయే గాని, పూర్వపుఋణమా అనుప్రశ్న రానేరాదు(2).

(1). సమష్టిఆస్తిని తనఖాపెట్టుటకు పూర్వము 2 దినములక్రిందట ఒకభూమిని కొని ఆభూమిఅమ్మినవానికి యిచ్చుటకొరకు బదులు చేసి ఆబదులునకే తనఖావ్రాసియిచ్చెను. 2 రోజులకు పూర్వము బదులు తెచ్చెను కదా యని అది పూర్వపుఋణముకా నేరదు. 116 ఇం. కే. (పా) 313.

(2). అదివరకున్న ప్రామిసరీనోటుఋణములకును ఒకతనఖాబాకీకిని తండ్రి సమష్టిఆస్తిని విక్రయించెను. ఆతనఖా పూర్వపుఋణమునకు పెట్టబడినదికాదు. కావున ఆతనఖాబాకీకి చేసిన యాక్రయము చెల్లనేరదని వాదించిరి. కాని కోర్టువారు ఆవాదమును అంగీకరింపక యాక్రయమునకు ఆతనఖారుణము పూర్వపుఋణమే యగునని తీర్మానించిరి. 140 ఇం. కే. (బాం) 256.

---

(1) 46 అ 96; 77 ఇం. కే 689; (1924) అ. ప్రి. (కా.) 50.

(2) 46 అ 95; 1928 నా 151; 150 వ పేజీ; 187-189 పేజీలు.

ఆబాకీకి చ, తనఖాదస్తావేజు వ్రాసియిచ్చెను. క, చ. లకు అంతకుపూర్వము ఋణదాత, ఋణస్థుడు అనుసంబంధము లేదనియు, అందుచే ఆసొమ్ము అదివరకు ఋణముగా పరిగణింపబడుటలేదనియు చ, వ్రాసియిచ్చినతనఖా పూర్వపుఋణమునకు వ్రాసియిచ్చినట్లెంచరాదనియు తీర్మానించిరి (1931 మ. వీ. నో. 467.)

27. కర్త ప్రామిసరినోటు వ్రాసి బదులుతెచ్చినప్పుడు, ఆబాకీ సమష్టికుటుంబావసరముకొరకైనచో, తక్కిన మెంబర్ల భాగములనుకూడ బయిండుచేయునని, 121—122 పేజీలలో వ్రాయబడినది. కర్త నోటును ఎట్లువ్రాయవలయుననువిషయమున హైకోర్టులలో భిన్నాభిప్రాయములున్నవి. కర్త వ్రాసియిచ్చెడిప్రోనోటులో "సమష్టికుటుంబకర్త అయిన ఫలానా" అని వ్రాసియుండవలయుననియు లేనిచో వ్రాసియిచ్చినవాడు కర్తయగునో కాదో సమష్టికుటుంబముకొరకు అప్పుచేసెనో అతనిసొంతముకొరకు చేసెనో ప్రోనోటునుబట్టి తెలియదనియు, నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంటుఆక్టుయొక్క 26—27 సెక్షనులనుబట్టియును ప్రి. కౌ. వారి 50 ఇం. కే. 216 తీర్పునుబట్టియును ప్రోనోటులో లేనివిషయములను ఉన్నట్లూహించి తక్కినమెంబర్లపైని డిక్రీ యివ్వకూడదనియు బొం. హై. వారును, క. హై. వారును తీర్మానించిరి(1). అ. హై. వారు దీనికి వ్యతిరేకముగా తీర్మానించి

కర్త ప్రామిసరి నోటుపైని బదులుతెచ్చినప్పుడు తక్కినమెంబరులను బయిండు చేయునా ?

(1) 72 ఇం. కే (బొం) 242; 128 ఇం. కే (బొం) 48; 88 ఇం. కే (క) 1025; 144 ఇం. కే (నా) 411;

వారు(1). మ. హై. వారు స్పష్టముగా చెప్పియుండ లేదు(2). నోటులో అట్లు సమష్టికుటుంబకర్త అని వ్రాసియుండనప్పుడు ఆనోటును వదలి పెట్టి అసలుఅప్పుకొరకు దావా తెచ్చి అందరుమెంబరులపైని డిక్రీని పొందవచ్చును.

తండ్రి, యొక్కడును ప్రోనోటువ్రాసియిచ్చినప్పుడు, కుమారులను పార్టీలనుగా చేర్చకుండ తండ్రియొక్కనిపైని డిక్రీనిపొంది ఆడిక్రీజాకీకి కుమారులవాటాలతోసహా సమష్టిఆస్తిపైని వారంటు అమలుజరుపుటకు పైనచెప్పిన బొంబాయి కలకత్తా తీర్పులడ్డమురావు. కుమారులను పార్టీలనుగాచేర్చినప్పుడుమాత్రము వారిమీద డిక్రీ యివ్వవచ్చునా? లేదా? యని ప్రశ్నవచ్చి అప్పుడు ఈతీర్పులు వర్తింపవచ్చును.

తండ్రిగాక కర్తయొక్కడును ప్రోనోటు వ్రాసియిచ్చినప్పుడు కర్తయొక్కనిపైని డిక్రీనిపొందినయెడల ఆడిక్రీని అమలుజరుపుటలో కొన్నిచిక్కులు రావచ్చును. (128-129 పేజీలు చూడుము.)

ఎట్లయినను, సమష్టికుటుంబముతరఫున ప్రోనోటును వ్రాసియిచ్చునప్పుడు "ఫలానిమెంబర్లుగల సమష్టికుటుంబమునకు కర్తయైన ఫలానావ్రాసియిచ్చినది" అని ప్రోనోటులో నుదహరించుట చాల మంచిది.

---

(1) 44 అ 393.

(2) 23 మ 597.

28. పితృపితామహప్రపితామహులు చేసినవిడిరుణములకు దావాను చేయునప్పుడు, పుత్రపౌత్రప్రపౌత్రులను దావాలలో తప్పకుండ పార్టీలనుగా చేర్చవలయుననునియమము లేదు. చేర్చి యావత్తుసమష్టికుటుంబాస్తి వలనను బాకీ రాబట్టుకొనుటకు డిక్రీని పొందవచ్చును(1). కాని తండ్రి జీవించియుండగా తండ్రి చేసినయప్పులకు తండ్రినివిడచి కుమారునిమీదమాత్రమే దావా చేయకూడదు(2). పుత్రాదులను దావాలో పార్టీలనుగా చేర్చినచో ఆరుణములు అక్రమపురుణములని కుమారులు వాదించదలచుకొనినయెడల, ఆదావాలోనే వాదించి తీర్పును పొందవలసియుండును. కుమారులను పార్టీలనుగా చేర్చనియెడల, ఆరుణములు అక్రమపురుణములని, వాదించుటకు వారికిగలహక్కు ఆదావాలో విచారింపబడనందున దరిమిలాను అట్టివాదమును మరియొక దావాలో చేయవచ్చును. పార్టీలుగా చేర్చుటలోను చేర్చకపోవుటలోను గల భేదమింతియే.

తండ్రిచేసిన రుణములకు దావాచేయునప్పుడు కుమారులను పార్టీలనుగా చేర్చవలయునా?

తండ్రిచేసిన బాకీలకు కుమాళ్ళను పార్టీలుగా చేర్చినప్పుడు, సమష్టికుటుంబాస్తిలోని పుత్రులభాగములమీదమాత్రమే డిక్రి యివ్వవలయును. కాని పుత్రులసొంతబాధ్యతపైని డిక్రి యివ్వకూడదు(3). ఒకవేళ డిక్రీలో "పుత్రులభాగములతోసహా సమష్టికుటుంబాస్తిపైని" అని వ్రాయక తండ్రిమీదను కుమాళ్ళమీదను డిక్రీ

(1) 22 మ 49; 23 మ 292;

(2) 46 మ. లా. జ. 590 (593); 35 ఇం. కే (మ) 918;

(3) 139 ఇం కే (బొం) 205; 171 ఇం. కే (పా.) 451; 134 ఇం. కే. (లా) 102.

యిచ్చినట్లు డిక్రిలో వ్రాయబడినచో ఆడిక్రిని అమలుజరుపునప్పుడు కుమారులసొంతబాధ్యతపైనకూడ డిక్రిని అమలుజరుపవచ్చును. డిక్రీని అమలుజరుపు కోర్టువారికి ఆడిక్రి న్యాయమైనదా? కాదా? అని విమర్శచేయుట కధికారము లేదు. అని తీర్పులున్నవి(1).

కాని, తండ్రిచేసినరుణములకు పుత్రులను దావాలో చేర్చినప్పుడు, ఆరుణములు తమను బయిండుచేయవని కుమారులు వాదించకపోయినను, డిక్రీలో "పుత్రులవాటాల ఆస్తిసహా సమష్టిఆస్తిపైని" అనివ్రాయకుండ, తండ్రితోపాటు కుమారులపైనికూడ జాయంటుగా డిక్రీ యిచ్చినను, డిక్రీని అమలుజరిపెడికోర్టువారు ప్లయింటువగయిరా రికార్డులనుచూచి కుమారులవాటాలమీదమాత్రమే అమలుజరుపవలయుననియు, కుమారులసొంతఆస్తిపైని గాని, కుమారులసొంతబాధ్యతపైనిగాని అమలుజరుపరాదనియు పాట్నాహైకోర్టువారు తీర్మానించిరి(2).

29. తండ్రియొక్కనిమీాదను డిక్రీనిపొందినప్పుడు ఆరుణము అక్రమమును దుర్వ్యవర్తనకు చేయబడినదియును కాకపోయినచో, ఆడిక్రీని అమలుజరుపునప్పుడు, వారంటుగ్రింథము లో తండ్రియొక్కయు, కుమాళ్ళయొక్కయు సమష్టికుటుంబాస్తిని తండ్రిజీవితకాలములోనే వేలము వేయించవచ్చునని ప్రి. కౌ. వారు విర్ధారణచేసియున్నారు. కావున నీవిషయమున నిక సందేహ

తండ్రియొక్కని మీాదను డిక్రీని పొందినప్పుడు రుణదాతకు గల హక్కులు.

(1) 121 ఇం. కే (పా) 451; 184 ఇం. కే (లా) 102.

(2) 132 ఇం. కే (పా) 871; 65 ఇం. కే (పా) 221; 62 ఇం. కే (పా) 905;

ములు లేవు(1). ఆతీర్పును చాలకేసులలో హైకోర్టులు అనుసరించుచున్నవి(2).

తండ్రి చేసిన యప్పులకు కుమాళ్ళను కలిపి తెచ్చిన దావాలో కుమాళ్ళను తప్పించివేసి తండ్రి యొక్కనిపైనను డిక్రీనిచ్చినను, ఆడిక్రీని అమలుజరుపునప్పుడు ఆఋణములు అక్రమములు కానిచో కుమారుల భాగములనుకూడ జప్తుచేయించి వేలము వేయించవచ్చునని తీర్మానించిరి(3).

తండ్రి ఋణములు నిశేషముగా చేసెను. తండ్రిపైని ఋణదాతలు దావాలనుచేసి డిక్రీలనుపొంది సమష్టిఆస్తిని వేలమునకు తెచ్చిరి. కుమారులు విభాగమునిమిత్తము దావాను తెచ్చి, అందు ఆఋణదాతలను పార్టీలనుగా జేర్చి, వేలమును ఆపుచేయుటకు ఇంజక్షను

(1) 5 క 148; 13 క 2; 77 ఇం. కే 689.

(2) 126 ఇం. కే (సిం) 577; 121 ఇం. కే (బొం) 435; 71 ఇం. కే (మ) 153; 116 ఇం. కే (మ) 360; 69 ఇం. కే (అ) 754; 68 ఇం. కే (అ) 794; 73 ఇం. కే (అ) 653; 64 ఇం. కే (పా) 121; 61 ఇం. కే (క) 25; 119 ఇం. కే (ఔ) 458; 100 ఇం. కే (పా) 17; 121 ఇం. కే (అ) 257; 93 ఇం. కే (800); 75 ఇం. కే (అ) 597; 76 ఇం. కే 778; 69 ఇం. కే (లా) 486; 139 ఇం. కే (బొం) 205; 132 ఇం. కే (అ) 563; 118 ఇం. కే 141; 116 ఇం. కే (లా) 182; 110 ఇం. కే 730; 101 ఇం. కే (ఔ) 907; 50 బొం 793; 91 ఇం. కే (బొం) 934; 79 ఇం. కే (ఔ) 21; 120 ఇం. కే (మ) 375; 67 ఇం. కే (అ) 931; 58 ఇం. కే (మ) 648; 47 ఇం. కే (ఔ) 679; 43 ఇం. కే 678; 130 ఇం. కే (లా) 836; 46 అ 95; 8 ఔ. వీ. నో 1021; 1 ఇం. కే (బొం) 459; 51 ఇం. కే (బొం) 612; 127 ఇం. కే (బొం) 507; 39 ఇం. కే (పి; కా.) 252; 71 ఇం. కే (అ) 417; 80 ఇం. కే 17; 79 ఇం. కే 1055;

(3) 100 ఇం. కే (ను. ఫు. బెం.) 1018; 121 ఇం. కే (మ) 863; 25 ఇం. కే (మ) 333; 115 ఇం. కే (మ) 330; 23 ఇం. కే (అ) 593;

కోరిరి. తండ్రి అక్రమమైయున్నరుణమును చేసిననేతప్ప కుమారులు తీర్చవలసియుండుననియు, ఆరుణములు అక్రమపురుణములని కోర్టు వారికితృప్తికరముగులాగున రుజువుచేసిన నేతప్ప యింజంక్షను ఉత్తరువు నీయవీలులేదనియు, వేలములో కొన్నవానినికూడ, ఆభాగపుదావాలో దరిమిలాను పార్టీగా చేర్చవచ్చుననియు, అరుణములు కుమారులను బయిండుచేయువని తీర్మానించినమొదల, ఆ వేలము, కుమారులవాటాలమీద బయిండుకాదనియు తీర్మానించిరి(1).

తండ్రి పూర్వపురుణములకు సమష్టికుటుంబాస్తిని తనఖాయిచ్చినప్పుడు తనఖాదారు తండ్రియొక్కనిమీదను దావాతెచ్చి డిక్రీ పొంది కుమారులభాగములుసహా ఖదరుఆస్తిని వేలము వేయించి తన ఖాబాకీని రాబట్టుకొనవచ్చును.

తండ్రిపైని, భూమిస్వాధీనముకొరకు దావాచేసి డిక్రీనిపొందిన పిమ్మట ఆతడుచనిపోయెనేని, కుమాళ్ళను వారంటుగ్రంథములో పార్టీలనుగా జేర్చి, ఆడిక్రీని అమలుజరుపవచ్చును. తండ్రిపైనిచేసిన దావా కుమారులపైనికూడ చేసినట్లే యెంచబడవలయును. (46 మ. లా. జ. 471; 43 మ. 487; 1911 మ. వీ. నో. 534.)

30. ఋణదాత, విడిరుణములకు తండ్రియొక్కనిపైని డిక్రీని పొంది, వారంటుగ్రంథములో కుమాళ్ళభాగములనుకూడ జప్తు చేయించినప్పుడు, ఆజప్తు చెల్లకూడదని కుమాళ్ళు వారంటుగ్రంథములో ఆటంకపెట్టుటకు హక్కుకలదా ? హక్కులేనిమొడల, ఆరుణములు అక్రమపురుణములని వాదించుటకుగలహక్కును కుమాళ్లు ఏవిధముగా ఉపయోగించుకొనవలయును?

తండ్రియొక్కని మీదనుడిక్రిపొంది అమలుజరుపునప్పుడు కుమారులు ఆటంకపెట్టవచ్చునా?

(1) 127 ఇం. కే (నా) 345

వారంటు గ్రంథములో కుమాళ్ళు తమ వాటాలను జప్తు చేయకూడదని కోర్టులో పిటిషను పెట్టవచ్చును. ఆపిటిషను విచారణలో కోర్టువారు తండ్రి చేసిన ఋణముల స్వభావమును గూర్చి విచారణ చేసి, కుమారుల భాగములను తప్పించి వేయవచ్చును. అట్లు తప్పించుటకు నిరాకరించిన యెడల, నిరాకరించిన తేదీ మొదలు 1 సం॥రములోపున కుమాళ్లు దావా తేవచ్చును. పిటిషను పెట్టకుండ, మొదటనే తండ్రి చేసిన ఋణములు తమను బంధింపవని నిర్ధారణ చేయుటకు కోర్టులో ఋణదాతలపైని దావా తేవచ్చును(1).

అయితే ఇట్టి దావాలలో ఋజువు భారమంతయును కుమారులపైననే యుండును. తండ్రి చేసిన ఋణములు తమను బాధించవని చెప్పుటకు రెండే కారణములుండును. (1) ఋణము లేనే లేదని యొక వాదము. (2) అక్రమపు ఋణములని రెండవ వాదము. ఈ రెండు వాదములను కుమారుడే పూర్తిగా ఋజువు చేయవలయును.

31. తండ్రియొక్క మీద డిక్రీ పొంది వారంటు గ్రంథములో తీర్పు ఋణస్తుని తా॥ ఆస్తి అని వేలం వేసినప్పుడు, కుమారుల భాగములు కూడ వేలమయిపోయినవనియే యర్థము. "కుమారుల భాగములు సహా" అని యిస్తిహారులో వ్రాయక పోయినను, కుమారుల భాగములు కూడ, ఆ వేలములో చేరియున్నట్లే భావింపవలయును(2). అయితే ఇస్తిహారులో "తీర్పు ఋణస్థుని Judjement-debter భాగము" అని వ్రాసియున్న యెడల మాత్రము తండ్రియొక్క భాగము అని యనుకొనవలయును.

తండ్రిమీద పొందిన డిక్రీ వారంటు గ్రంథములో తీర్పు ఋణస్తుని తా॥ ఆస్తి వేలం వేసినప్పుడు కుమారుల భాగములుకూడ వేలమయినవని యర్థమా?

(1) 1931 మ 824.

(2) 39 ఇం. కే (పి). కౌ) 252; 132 ఇం. కే (అ) 568; 120 ఇం. కే (మ) 375; 73 ఇం. కే (బొం) 402, 50 బొం 793; 98 ఇం. కే (మ) 81; 84 ఇం. కే (పి). కౌ) 888

అట్లుదామారింపనప్పుడు కుమారులభాగములుకూడ చేరినట్లుగ్రహింప వలసియుండును. ఈసందర్భమున వేలముసర్టిఫికెట్లును మాత్రమే చూచి యూరకుండరాదు. మొత్తము వారంటురికార్డు అంతయును చూడ వలయును(1).

ఇట్టికేసులలో శబ్దార్థమును బట్టిమాత్రమే నిర్ణయించకూడదు. ఆఋణములు కుమారులను బయిండుచేయునవి కాకపోయినచో, కుమారులభాగములు వేలమయినట్లెంచరాదు(2).

తండ్రిపైనిపొందినడిక్రీబాకీకి ఋణదాత సమష్టికుటుంబాస్తిని జప్తుచేయించగా కుమారులు ఆటంకము తెచ్చిరి. అప్పుడు ఋణదాత తండ్రికిగలహక్కు-బాధ్యతలు వేలం వేయించుచున్నానని జవాబు చెప్పెను. కోర్టువారారీతిగనే వేలం వేసిరి. ఈకేసులో వేలమయినది తండ్రిభాగముమాత్రమే అని తీర్మానించిరి(3).

తండ్రిమీదను పొందినడిక్రీ వారంటుగ్రంథములో పుత్రులభాగములు కూడ వేలమయి పోయినప్పుడు కుమారులు వేలము రద్దుచేయుడనిదావా తేవచ్చునా ?

32, తండ్రిమీద పొందినడిక్రీవేలములలో పుత్రులభాగములు కూడ వేలమయిపోయినప్పుడు, ఆడిక్రీబాకీ అక్రమమయినదనియు, అది తమను బయిండుచేయదనియు, తమభాగములపైనికాబడినవేలములు రద్దు చేయవలయుననియు కుమారులు దావా తేవచ్చునా? అనువిషయమును యోచింపవలసియున్నది.

తండ్రిమీదపొందినడిక్రీ తండ్రిజీవితకాలములోనే అమలుజరిగి అప్పుడే పుత్రులభాగములు వేలమయినయెడల, కుమారులు వేరుగా దావాతెచ్చి వేలమును రద్దుచేయిం

(1) 120 ఇం. కే (మ) 375; 78 ఇం. కే (బొం) 402.

(2) 39 ఇం. కే 252; 17 క 584; 5 క. లా. 8. 477;

(3) 130 ఇం. కే (అ) 1.

చుకొనవచ్చును(1). కాని ఆదావా వేలమయిన తేదీమొదలు ఒకసంవత్సరములోపుగా తేవలయును.

తండ్రియనంతరము డిక్రి అమలుజరుపునెడల కుమారులను వారంటుగ్రంథములో వారసులనుగా చేర్చెదరు. కావున కుమాళ్లు వేరుగాదావా తేకూడదు. సివిల్ ప్రొసీజరుకోడ్డు 47 వ సెక్షనుప్రకారముగా పిటిషనుపెట్టి ఆగ్రంథములో తండ్రిచేసినరుణములస్వభావమునుగూర్చి విచారణచేయించి తీర్పుపొందవలయును(2).

వేలమును రద్దుచేయించవలసినదనికోరి కుమారులుతెచ్చెడి దావాలలో తండ్రిపైనికాబడినడిక్రీని విడచిపెట్టి ఆరుణములస్వభావమునుగూర్చి విచారణ జరుపవచ్చును(3).

తండ్రియొక్కని మీదను పొందిన డిక్రి, తండ్రియనంతరము కుమాళ్ళను వారసులనుగాచేర్చి అమలు జరుపవచ్చునా ?

33. తండ్రియొక్కసిమీాదను డిక్రినిపొందినప్పుడు ఆడిక్రిబాకీయివ్వకుండగనే తండ్రి చనిపోయినయెడల, ఆతనియనంతరము కుమారులను వారసులనుగా చేర్చి, డిక్రి అమలుజరుపవచ్చునని 1908 వ సంవత్సరములో సివిల్, ప్రొసీజరుకోడ్డునందు క్రొత్తగా 53 వ సెక్షనును చేర్చియున్నారు. కాబట్టి, కుమారులను వారసులనుగా చేర్చి వారంటుఅమలు జరుపవచ్చును. ఆరుణములు అక్రమపురుణములనియు, అవి తమను బాధించవనియు, కుమారులు వాదించదలచుకొనిరేని ఆకోడ్డుయొక్క 47 వ సెక్షనుప్రకారముగా వారంటుఅమలులోనే విచారణచేసి ఆవిషయమును కోర్టువారు తీర్పు నీయవచ్చును. 53 వ సెక్షను

(1) 78 ఇం. కే (బొం) 402.

(2) 11 ఇం. కే (బొం) 987.

(3) 38 ఇం. కే 161.

చేర్చకుండనున్న కాలములో, కుమారులను వారసులనుగా చేర్చినను సమష్టికుటుంబాస్తిపైని అమలుజరుపరాదనియు, అట్లు అమలుజరుప దలచుకొన్నప్పుడు ఋణదాత కుమారులపైని తిరిగి దావా తేవలసి యుండుననియు, భిన్నాభిప్రాయములతో కొన్ని తీర్పులుపుట్టబడినవి(1). కాని ఈక్రొత్తసెక్షనుమూలముగా ఆబాధ తొలగిపోయినది.

తండ్రియనంతరము కుమారులను వారసులుగా చేర్చి వారం టుగ్రంథము జరుపుచున్నప్పుడు తండ్రిచేసినరుణములయొక్క స్వభావ మునుగూర్చి 47 వ సెక్షనుక్రింద విచారణజరుగవలయును. అట్టిసంద ర్భములో కుమారులు ఆరుణములు తమను బయిండు చేయవని వేరు గా దావా తేనక్కరలేదు. దావా తేకూడదు(2).

**34. పుత్రపౌత్రప్రపౌత్రులపైని ధార్మికబాధ్యతను అమలు జరుపుటకు ఆరుసంవత్సరములు కాలదోషము.**

పుత్రాదులపైని ధార్మికబాధ్యతను అమలుజరుపుటకు కాలదోషము.

ఈవిషయమున ఇండియన్ లిమిటేషను ఆక్టుయొక్క 120 వ ఆర్టికిలు వర్తించును. ప్రితాదులు ఋణమీయవలసినవాయిదా తేదీమొదలు ఆరుసంవత్సరములు లెక్కింపవలయును(3).

తండ్రిపైని అతనిసొంతబాధ్యతను అమలు జరుపుటకు కాల దోషము పట్టినయెడల, కుమారులపైని అమలు జరుపుటకుకూడ కాలదోషముపట్టును(4).

---

(1) 23 మ 292; 27 మ 243; 8 బొం 1.

(2) 11 ఇం. కే (బొం) 987; 1931 మ 824.

(3) 13 ఇం. కే (అ) 530; 27 క 762; 42 క 1068.

(4) 1928 అ 86.

35. సమష్టికుటుంబకర్త, కాలదోషముపట్టినయప్పులకు తిరిగి దస్తావేజు ప్రోనోటు, మొదలయినవి వ్రాసియిచ్చుటగాని, కాలదోషముపట్టినయప్పులకు సమష్టికుటుంబాస్తిని వినియోగము చేయుటగాని జరిగించకూడదు. అట్లు చేసినయెడల ఆయప్పు, వ్రాసియిచ్చినవారి నేగాని తక్కిన మెంబర్లనుగాని, వారి వాటాలనుగాని బయిండు చేయదు(1).

కాలదోషము పట్టిన అప్పులు.

పితృపితామహులుమాత్రము, కాలదోషముపట్టినయప్పులకు తిరిగి వ్రాసి యివ్వవచ్చుననియు, ఆస్తిని వినియోగము చేయవచ్చుననియు కొన్నితీర్పులున్నవి(2). ఒకకేసులో కాలదోషముపట్టినయప్పునకు తండ్రి తిరిగి వ్రాసియిచ్చినయెడల, అది కుమారునిబయిండుచేయదని అ. హై. వారు తీర్మానించినారు(3).

తండ్రి వ్రాసియిచ్చినయప్పులకు కాలదోషము పట్టినపిమ్మట తండ్రి తిరిగి వ్రాసియివ్వకుండ నుండెనేని ఆయప్పులను కుమారులు తీర్చనక్కరలేదు. అట్టియప్పులకు పుత్రులపైని ధార్మికబాధ్యత లేదు, అని కొన్నితీర్పులున్నవి. కొన్నితీర్పులు దీనికి వ్యతిరేకముగా నున్నవి(4). కాని తండ్రిచేసినయప్పులను కాలదోషము పట్టినపిమ్మట కుమారులు తీర్చినను తీర్చుటకు తిరిగి వ్రాసియిచ్చినను అది శాస్త్రసమ్మతమే యగును(5).

---

(1) 61 ఇం. కే (పా) 20; 1925 మ 453.

(2) 1931 పా 40; 46 అ 384; 44 అ 628; 33 మ. 808; 1932 బొం 522; 50 మ. లా. జ 144; 46 అ 775;

(3) 63 ఇం. కే (అ) 25; 39 ఇం. కే (బొం) 23;

(4) 99 ఇం. కే (బొ) 215; 5 పా 746; 79 ఇం. కే (నా) 1002; 20 మ. లా. జ. 633; 25 ఇం; కే 488; 20 ఇం కే 590.

(5) 52 మ 465; 119 ఇం. కే (అ) 109; 1928 మ 1201.

తండ్రి వ్రాసియిచ్చిన ప్రోనోటుబాకీకి తండ్రిపైని దావాచేయుటకు కాలదోషము పట్టినయెడల కుమారులపైనికూడ కాలదోషము పట్టినట్లే యగును(1).

తండ్రిచేసిన యప్పులకు కాలదోషము పట్టినపిమ్మట కుమారులు తిరిగి వ్రాసియిచ్చినప్పుడు ఆబాకీకి సమష్టికుటుంబాస్తిమాత్రమే బాధ్యతకలది యగునుగాని, కుమారులు వ్రాసియిచ్చినారుకదాయని వారిపైని సొంతబాధ్యత యుండదు(2).

సమష్టి కుటుంబలాభముకొరకు కర్తయప్పునుచేసి, అది కాలదోషముపట్టినపిమ్మట తిరిగి వ్రాసియిచ్చెను. ఈలోపున తక్కిన మెంబర్లు విభాగముకొరకు దావాతెచ్చిరి. ఆబాకీకి తక్కినమెంబర్లు బాధ్యులుకారు. కాని కర్తకు న్యాయతః కంట్రిబ్యూషను నిచ్చుకొనవలసియుందురు(3).

---

(1) 1931 బొం 542; 33 మ 308; 28 మ 292; 5 పా 746;

(2) 51 అ 933.

(3) 26 ఇం. కే (మ) 2 5.

## ఎనిమిదవ ప్రకరణము.

---

### విభాగము (Partition.)

1. విభాగలక్షణమును మితాక్షరియందు విజ్ఞానేశ్వరు డిట్లు నిర్వచించియున్నాడు.

విభాగలక్షణము

"విభాగోనామ ద్రవ్యసముదాయ విషయాణా మనేకస్వామ్యానాం తదేకదేశేషు వ్యవస్థాపనం."

పలువురకు ద్రవ్యసముదాయమందు స్వత్వము కలిగియుండగా అందు కొందరిస్వత్వము కొన్నిద్రవ్యములయందును, మరికొందరి స్వత్వము మరికొన్నిద్రవ్యములయందును, ఉండున ట్లేర్పరచుకొనుటయే విభాగ మనబడును. అనగా సమష్టికుటుంబమునకు చెందియుండెడిగృహ భూధనాదులయందును, పశుపంచ లోహాదుల యందును తదితరవస్తుసామగ్రియందును సమష్టికుటుంబమెంబర్లందరకును సమష్టి హక్కు కలిగియుండును; అట్టి సమష్టిహక్కును లేకుండజేసి, ఒక్కొకరికి ప్రత్యేకముగా హక్కు కలిగియుండునట్లు గృహభూధనపశు పంచలోహ వస్తుసామగ్రులను వేరుగ నేర్పరచుకొనుటయే విభాగమనబడును. విభాగమైనతోడనే సమష్టికుటుంబలక్షణములనమష్టిహక్కు బాధ్యతలు నశించిపోవును. విభాగమైనతోడనే మృతశేషత్వధర్మము కూడ నశించిపోవును.

2. విభాగకాలము అనగా విభాగము నెప్పుడు చేసికొనవలయునను విషయమున స్మృతికర్తలు భిన్నాభిప్రాయముల నిచ్చియున్నారు.

విభాగకాలము.

"ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్యభ్రాతర స్సమమ్
భజేరన్ పైతృకం రిక్థ మనీశాస్తేహిజీవతోః

తల్లిదండ్రుల యనంతరమున సోదరులు విభజించుకొనవలయును.

మనువు.

"ఊర్ధ్వం పితుః పుత్రా రిక్థం విభజేరన్.
నివృత్తే రజసి మాతు ర్జీవతి శేచ్ఛతి"

తండ్రియనంతరము పుత్రులు విభజించుకొనవలయును. తండ్రి జీవించియుండగానే విభజించుకొనవలయునని తలంచినచో తండ్రి యనుమతినిపొంది తల్లి ప్రసవముడిగినపిమ్మట విభాగము చేసికొనవలయును.

గౌతముఁడు.

"పితరి రిక్థవిభాగో వృద్ధే విపరీతచేతసి రోగిణిచ"

తండ్రి వృద్ధుడైనను, మతిమాలినవాడైనను రోగియైనను పుత్రులు విభజించుకొనవలయును.

శంఖుఁడు.

"అతఊర్ధ్వం పితుః పుత్రా విభజేయు ర్ధనం సమం"

తండ్రియనంతరము కుమారులు ధనమును సమముగా పంచుకొనవలయును.

నారదుఁడు.

"విభాగంచే త్పితా కుర్యా దిచ్ఛయా విభజే త్సుతాన్
జ్యేష్ఠంవా శ్రేష్ఠభాగేన సర్వేవాస్యు స్సమాంశినః"

తండ్రి తనయిష్టము వచ్చినప్పుడు కుమాళ్లకు పంచియిచ్చినచో జ్యేష్ఠునకు శ్రేష్ఠభాగమును తక్కినవారికి సమానముగను యివ్వవలయును.

యాజ్ఞ్యవల్క్యుఁడు.

ఇవిమొదలుగా ననేకస్మృతులను విమర్శించి, విజ్ఞానేశ్వరుడు, మితాక్షరిలో విభాగకాలములు నాలుగని నిర్ధారణ మొనర్చియున్నాఁడు.

(1). తండ్రి యిష్టమువచ్చినప్పుడు.

(2). తండ్రి జరారోగాదులచే నసమర్థుడైనప్పుడు.

(3). తండ్రి కిఁక సంతానము కలుగదని నిర్ధారణమైనప్పుడు.

(4) తండ్రి యనంతరము

స్మృతులిట్లు చెప్పుచున్నను, దేశ కాల భేదములనుబట్టియును, స్మృతికారులును వ్యాఖ్యాతలును అచ్చటచ్చట చూపుచువచ్చిన యభిప్రాయముల ననుసరించియును సమష్టికుటుంబ మెంబర్లలో నెవరి కయినను కుటుంబములోనుండి విడిపోవలయుననుని చ్ఛకలిగిన-చో, విడిపోవచ్చుననియు, ఇతర మెంబరులు ఆటంకపరుపజాలరనియు, కోర్టులు తీర్మానించినవి. తండ్రి జీవించియుండగా, అతడు అతనిసోదరులతో గాని, అతనితండ్రితో గాని విభజించుకొనకుండ సమష్టిగానున్నప్పుడు అతని కుమారులు భాగమును కోరకూడదనియు, తండ్రి అతనిసోదరులతోను, అతనితండ్రితోను విభజించుకొనియున్నప్పుడు, అతనికుమారులు విభాగమును గోరవచ్చుననియు, బొంబాయి హైకోర్టువారొక్కించుక భేదమును జూపిరి(1). కాని యితర హైకోర్టులు ఆభేదము నంగీకరింపలేదు(2). బొం. హై. వారైనను మితాక్షరిలోని యొక శంకను సూచించెడివాక్యములను విజ్ఞానేశ్వరునియభిప్రాయముగా భావించుటచే నట్లుతీర్మానించిరి "అనేకపితృకాణాంతు పితృతో భాగకల్పనా" యను శ్లోకమునకు వ్యాఖ్యానముర్వాసి, తరువాతివచ్చునట్టి "భూర్యా పితామహోపాత్తా" అను శ్లోకమునకు వ్యాఖ్యానము చేయుటకుముందు అదివరకు చెప్పబడినశ్లోకములలో కలిగినశంకను "అధునా విభక్తే పితర్యవిద్యమానభ్రాతృకే వా పౌత్రస్య పైతామహే ద్రవ్యే విభాగో నాస్తి-ధ్రియమాణే పితరి పితృతో భాగకల్పనేత్యుక్తత్వా ద్భవతువా స్వార్జితవత్పితురిచ్ఛయే వేత్యాశంకిత ఆహ॥"

(1) 16 బొం. 29 (న్యా. రేనెడీగారు భిన్నాభిప్రాయమునిచ్చెను.)

(2) 18 మ 179; 31 క 111; 5 అ 480; 67 ఇం. కే (అ) 156; 101 ఇం. కే (సిం) 438.

అనుమాటలచే శంకించుకొని విజ్ఞానేశ్వరుఁడు ఆశంకను నివారించుటకై తరువాతశ్లోకమునకు వ్యాఖ్యానమొనర్చెను. ఆశంకితవాక్యములనే విజ్ఞానేశ్వరునియభిప్రాయముగా తీసికొనిరి.

తండ్రి జీవించియుండగా కుమారులు ఆతనియిష్టమునకు వ్యతిరేకముగా విభాగమును చేయుమని యాతనిని నిర్బంధింపజాలరని లాహోరుహైకోర్టువారు తీర్మానించిరి. అయితే అది పంజాబుదేశములోని ఆచారము ననుసరించి చేయబడినది. కాని స్మృతుల ననుసరించికాదు(1). తండ్రి కిష్టము లేకపోయినను, కుమారులు తండ్రితో విభజనము చేసికొనవచ్చునని మ. హై. తీర్మానించి యున్నారు(2).

పౌత్రులు, పితామహునిపైని విభాగముకొరకు దావాచేయవచ్చును(3). తండ్రి కింకను కుమారులు కలుగుదురను కారణముపైని మేజరైనకుమారునకు భాగమును పంచి యివ్వనని చెప్పవీలు లేదు(4).

తండ్రి, కుమాళ్లకు పంచియివ్వవచ్చునా ?

3. తండ్రి, తనయిష్టమువచ్చినప్పుడు కుమాళ్లకు ఆస్తిని విభజించి యిచ్చివేయవచ్చునని స్మృతులలో చెప్పబడినది. ఇష్టమువచ్చినప్పుడు అని చెప్పుటచేత కుమారులు విభాగమునకు యిష్టపడకపోయినను, తండ్రి విభాగమును చేయవచ్చునని స్పష్టమగుచున్నది.

"విభాగంచేత్పితా కుర్యా దిచ్ఛయా విభజేత్సుతాన్
జ్యేష్ఠంవా శ్రేష్ఠభాగేన సర్వేవాస్యు స్సమాంశినః"

యాజ్ఞవల్క్యస్మృతి.

---

(1) 1928 లా 911; 1928 లా 256.

(2) 110 ఇం. కే (మ) 141; 40 ఇం. కే (పా) 131;

(3) 67 ఇం. కే (అ) 156;

(4) 40 ఇం. కే (ప్రి. కౌ.) 286.

"యథా విభాగం పితా చికీర్షతి తదేచ్ఛయా విభజేత్ పుత్రాన్ - ఇచ్ఛయా నిరంకుశత్వా దనియమప్రాప్తౌ నియమార్థమా హ- అయంచ విషమో విభాగ స్స్వార్జితద్రవ్యవిషయః. పితృక్రమా యాతేతు సమస్వామ్యస్య వక్ష్యమాణత్వా న్నేచ్ఛయా విషమో విభాగో నయుక్తః"          మితాక్షరి.

"న్యూనాధికవిభక్తానాం ధర్మ్యః పితృకృతః స్మృతః"

యాజ్ఞవల్క్యుడు.

"న్యూనాధికవిభాగేన విభక్తానాం పుత్రాణా మసౌ న్యూనాధికవిభాగో యది ధర్మశాస్త్రోక్తో భవతి తదాసౌ పితృకృతః కృతఏవ ననివర్తత ఇతి మన్వాదిభిః స్మృతః। అన్యథాతు పితృకృతోపి నివర్తత ఇత్యభిప్రాయః"          మితాక్షరి.

"వ్యాధితః కుపితశ్చైవ విషయాసక్తమానసః
అన్యథా శాస్త్రకారీచ నవిభాగే పితా ప్రభుః"

నారదుండు.

ఈవాక్యములనుబట్టి తండ్రి తనయిష్టమువచ్చినప్పుడు కుమారులకు పంచిపెట్టవచ్చుననియు, పిత్రార్జితమునందు వాటాలు సమముగా నుండవలయుననియు, తండ్రిస్వార్జితమునందు హెచ్చుతగ్గులుండవచ్చుననియు, పిత్రార్జితమునందు ధర్మశాస్త్రముచే చెప్పబడినరీతిగాతప్ప, హెచ్చుతగ్గులున్నయెడల, తండ్రిచేసినవిభాగము చెల్లదనియు అట్టియసమవిభాగమును రద్దుపర్చుమని కోరవచ్చుననియు తేలుచున్నది. మితాక్షరియందలివాక్యములకు తండ్రి తనవాటాను విభజించుకొనవచ్చునేగాని, కుమాళ్లు అందరకును వారిలోవారికి భాగములను పంచియివ్వజాలడని యర్థము చెప్పజూచిరి. కాని యది యంగీకరింపబడలేదు. తాను విభాగమగుటయేగాక, కుమాళ్ళలో వారిలోవారికి కూడ విభాగముచేయ నర్హుడని తీర్మానింపబడినది.

ఈ కేసులో పారీఖత్తును తండ్రియొక్కడే వ్రాసి, అందు ఏకుమారున కేవాటావచ్చినదియు నిర్ణయించెను(1).

తండ్రి, తనకుమారులసమష్టిస్థితిని వ్యష్టిగామార్చుటకును న్యాయముగా పంచిపెట్టుటకును హక్కుకలదు. ఆవిభాగము కుమారులను బయిండు చేయును. కాని యీహక్కు తండ్రికిమాత్రమే కలదు. పితామహుడు మొదలగువారికి లేదు. తండ్రి అసమవిభాగమును చేసినప్పుడు కుమారు లందులకంగీకరించిరేని, అది కుటుంబసెటల్‌మెంటుక్రిందకువచ్చి కుమారులను బయిండుచేయును(2). తండ్రి, కుటుంబయజమానిగానున్నను మరణశాసనరూపమున విభాగమును చేయజాలడు(3). కుటుంబమెంబరు కానివానికి భాగమునీయజాలడు(4).

కుమారులయంగీకారము లేకపోయినను, కుటుంబాస్తిని కుమారులలో పంచిపెట్టుటకు తండ్రికి హక్కుకలదు(5). పితామహుడు తనకును తనపౌత్రులకును చేసినవిభాగము న్యాయముగానున్నచో చెల్లును(6).

తండ్రి, తనజీవితకాలములో మైనరుకుమాళ్ళలో వారిలో వారికికూడ విభాగమును చేయవచ్చును(7).

తండ్రి అసమవిభాగమును చేసెనేని, అది రద్దుచేయుటకు కుమారులకు హక్కుకలదు(8).

---

(1) 126 ఇం. కే (అ) 337; 2 మ 317; 23 బొం 386; 31 మ. లా. జ. 147. 87 ఇం. కే (అ) 647; 1929 అ 963; 131 ఇం. కే (పా) 209.

(2) 19 ఇం. కే (ప్రి. కౌ.) 826;

(3) డిటో; 45 ఇం. కే 162.

(4) 20 ఇం. కే 958 (ప్రి. కౌ); 40 క 966.

(5) 31 మ. లా. జ. 147; 45 ఇం. కే (మ) 535.

(6) 40 ఇం. కే (మ) 205;

(7) 93 ఇం కే 213

(8) 78 ఇం. కే (నా) 1045.

4. సమష్టికుటుంబమెంబర్లందరును విభాగమును కోరుట కర్హులుకారు(1). సమష్టికుటుంబమెంబర్లలో భాగానర్హులని మొదటి ప్రకరణములో నిర్ధారణ మొనర్చినవారుగాక మిగిలిన సమష్టికుటుంబమెంబర్లు అందరును విభాగమును కోరుటకర్హులు(2). మదరాసురాష్ట్రమున స్త్రీలు ఆస్తియందు భాగమును కోరుటకు అర్హులుకారు(3). తక్కినరాష్ట్రములయందైనను పురుషులు విభజించుకొనునప్పుడు భాగమునకు స్త్రీలు అర్హులైయుందురుకాని విభాగమును చేయుమని స్త్రీలు కోరుట కధికారము లేదు(4). భాగానర్హులని నిర్దేశింపబడినవారి పుత్రపౌత్రులకు విభాగమును కోరుటకు హక్కుగలదు(5). ఔరసునివలెనే దత్తపుత్రుడుకూడ తనభాగమును పంచియిమ్మనికోరుటకు హక్కుకలిగియుండును(6). సమష్టికుటుంబమెంబర్లలో నొకడు తనభాగమునంతనుగాని కొంతనుగాని, దానమిచ్చుటగాని, విల్లుద్వారాదఖలుపర్చుటగాని చేయజాలడు. కావున అట్టిదానమును పొందినవాడుగాని విల్లుద్వారా హక్కును పొందినవాడు గాని భాగమును కోరుటకు హక్కుదార్లు కానేరరు(7). కోర్టు వేలములోగాని ప్రయివేటుగాగాని, సమష్టికుటుంబమెంబర్లలో ఒకని భాగమును క్రయమును

విభాగమునుకోరుటకర్హు లెవరు?

(1). 10 అ 272.

(2). 10 అ 272.

(3). 1వ ప్రకరణము 7వ పేరా.

(4). 1వ ప్రకరణము 6వ పేరా.

(5). 1వ ప్రకరణము 32వ పేరా.

(6). 4 క 125; 7 మ 253; 1 మ. హై. 8 45.

(7). 7 మ 357; 9 మ 273; 11 మ 216; 27 మ 162; 5 బొం 48; 19 బొం 808; 58 ఇం. కే (అ) 607; 29 బొం 351; 8 మ. హై. 8. 6.

పొందినవాడు ఆభాగమును విభజించి యిమ్మని కోరుటకు హక్కు కలిగియుండును(1).

అనిర్దిష్టభాగమును తనకుభాపట్టినవాడును కప్పులునకు పుచ్చుకొన్నవాడును గూడ విభాగముకొరకు దావా తేవచ్చునని కొన్ని తీర్పులున్నవి(2).

పైన చెప్పిన నియమములకు లోబడి సమష్టికుటుంబమెంబర్లకందరకును తనయిష్టమునను సరించి విభాగమును కోరుటకు హక్కు కలదు(3).

**5.** సమష్టికుటుంబమెంబర్లలో కొందరు మైనర్లుగా నున్నారను కారణముచే విభాగ మాగిపోనక్కరలేదు మైనరుతరఫున తగినవారిని గార్డియనుగా నేర్పరచి, వారితో విభాగము చేసికొనవచ్చును. తాను మైనరుగా నుండగా విభాగముజరిగినది కావున దానిని రద్దుచేయుమని కోరుటకు మైనరునకు హక్కుఉండదు. అట్టి హక్కుయున్నచో విభాగ మెన్నటికిని జరుగనే జరుగదు. అదియునుగాక తనయిష్టమువచ్చినప్పుడు కుటుంబమునుండి విడిపోవుట కధికారము కలదని చెప్పెడిహక్కు మేజరు మెంబరునకు లేకుండపోవును(4). కాని

కొందరు మైనర్లున్నప్పుడు విభాగముచేయవచ్చునా?

(1). ఈప్రకరణమందలి 8వ పేరా.

(2). 11 బొం. హై. రి 72; 3 అ. లా. జ 474; 27 మ 361; 144 ఇం. కే (బొం) 456.

(3). 30 క 738 (ప్రి. కౌ.); 39 మ 159; 51 అ 1; 5 అ 430; 56 ఇం. కే (లా) 478; 3 అ 88; 33 అ 118; 16 క 758; 31 క 262; 13 క 389; 31 క 1065; 34 అ 505; 44 ఇం. కే (పా) 146.

(4). 8 బొం. లా. రి. 363; 30 క 738 ప్రి.కౌ; 19 బొం 593; 20 ఇం. కే (నా) 583; 31 అ 412; 139 ఇం. కే (బొం) 820; 33 ఇం. కే (మ) 961; 80 ఇం. కే (మ) 929.

ఆవిభాగము న్యాయముగా లేనప్పుడును, మోసము జరిగినప్పుడును, నిష్పక్షపాతముగాను క్రమముగాను జరిగినదని చెప్పుటకు వీలులే నట్లుగా జరిగినప్పుడును, ఆవిభాగము రద్దుచేయవలసినదని మైనరు తాను యుక్తవయస్సువచ్చినపిమ్మట కోరవచ్చును(1).

కుటుంబములోని మెంబర్లకుగాక యితరులకు భాగమును పంచిపెట్టినప్పుడు, ఆభాగము తనను బంధముచేయదని మైనరు దావా వేయవచ్చును(2).

మైనరుతరఫున విభాగమును కోరవచ్చునా ?

6. సమిష్టికుటుంబములోని యితరమెంబరులు, ఆస్తిని పాడు చేయుచున్నప్పుడును, దుర్వ్యయము చేయుచున్నప్పుడును, మైనరున కుండు హక్కులు నిరాకరించబడుచున్నప్పుడును, మైనరు సంరక్షణకు దగినద్రవ్యము నొసంగకయు, మైనరువిషయమున జాగ్రత్తతీసికొనకయు, నుపేక్షించుచున్నప్పుడును, విభజించుటవలన మైనరునకులాభమున్నదని తోచి నప్పుడును మైనరుతరఫున విభాగమును గోరవచ్చును. అట్టిసందర్భములలో న్యాయస్థానములు మైనరుభాగమును విభజించుటకు డిక్రీని యివ్వవచ్చును(3). కాని అట్టిసందర్భములు లేనప్పుడు, మైనరు తాటా విభజించుటకు హక్కు లేదు(4).

కుటుంబము విడిపోవుటకంటె, కలిసియున్నచో ఆదాయ మెక్కువయగును విభాగమైనచో, మృతశేషత్వధర్మము నశించి మైనరునకు లాభముపోవును కాబట్టి ఆపదగాని, విభజనమువలన

(1). 19 బొం 593; 17 బొం 271; 2 మ. హై. రి 182; 4 బొం. హై. రి 159.
(2). 43 ఇం. కే (మ) 833; 101 ఇం. కే (మ) 828.
(3). 19 బొం 93; 29 అ 373; 12 మ 401; 8 క 537; 50 ఇం. కే (మ) 552; 69 ఇం. కే (పి). కౌ) 273.
(4). 29 బొం 51; 42 ఇం. కే (మ) 860; 31 బొం 373 పి). కౌ.

అభివృద్ధియగునను నాళగాని, లేనప్పుడు మైనరుపక్షమున విభాగమును గోరరాదు(1) మైనరుతరఫున గార్డియను విభాగము నిమిత్తము దావా తెచ్చినప్పుడు, కోర్టువారు తమకు న్యాయమని తోచినరీతిని, విభాగమునుచేయుటగాని నిరాకరించుటగాని చేయవచ్చును(2). మైనరుసంరక్షకుడు విభాగమును కొంతవరకు జరిపి మిగిలినదానికి కోర్టునకు వచ్చినపుడు, కోర్టువారు ఆవిభాగమును నిరాకరింపజాలరు(3). తండ్రి అమితవ్యయముచేయువాడై, ఆస్తిని పాడుచేయుచున్నప్పుడును, మైనరుయొక్క యభివృద్ధికి వ్యతిరేకముగా నున్నప్పుడును, మైనరుకుమారునితరఫున మరియొకరు సంరక్షకులుగా నేర్పడి విభాగమును కోరవచ్చును(4).

సమష్టిగానున్నచో ఆకుటుంబమునందింకను జననము లెక్కువగుటమూలమున మైనరునకు వాటా తక్కువయగుననియు కావున మైనరునకు విభాగము లాభకరమనియు చెప్పుట సరియైనకారణము కాజాలదు(5).

7. సమష్టికుటుంబ మెంబర్లలో నెవరయినను, దేశాంతరగతుడైనను, నివాసాదులు తెలియకుండ నున్నను, అట్టివాడు వచ్చువరకును, విభాగమును నిలిపియుంచనక్కరలేదు. అట్టివానిభాగము న్యాయముగా తీసి వేరుగానుంచి, దానిమీదవచ్చెడి యాదాయముతో సహా ఆమెం

దేశాంతరగతుడైన వానివిషయము.

(1). 3 మ. హై. కో. 94.

(2). 31 బొం 373; 50 ఇం. లే 552; 42 ఇం. లే (మ) 860; 42 అ 461; 52 మ 845.

(3). 123 ఇం. లే (మ) 806.

(4). 139 ఇం. లే (బొం) 820; 1927 అ 60.

(5). 50 ఇం. లే (మ) 552.

బరు తిరిగివచ్చినపిదప, వాని కిచ్చివేయవలయును. ఆతఁడెప్పుడును రానియెడల, అది యాతనివారసులకు చెందును. ఆభాగమును రాబట్టుకొనుటకు ఏడుతరములవరకును అధికారము కలిగియుండునని స్మృతులు చెప్పుచున్నవి. కాని ప్రస్తుతమున కాలదోషశాసనము అమలులో నుండుటచే, స్మృతులలో చెప్పినట్లమలు జరుగనేరదు.

అనిర్దిష్టభాగమును కొన్నక్రియదారు విభాగమును కోరవచ్చునా?

8. సమష్టికుటుంబాస్తిలోని ఒకమెంబరుయొక్కగాని, కొందరుమెంబర్లయొక్కగాని, భాగమునుగాని, భాగములనుగాని, ఒక ప్రతిలోని భాగమునుగాని, కొన్నిప్రతులలోని భాగములనుగాని, కోర్టువేలములో కొన్న క్రియదారు తాను క్రియమునుపొందినభాగమును పంచియిమ్మని కోరుటకు హక్కు కలిగియుండును. కోర్టువేలములోగాక, ప్రయివేటుగా క్రియమును పొందినవాడు బొంబాయి మదరాసు రాష్ట్రములలో, విభాగమును కోరవచ్చును. బెంగాలు మొదలగు కొన్నిరాష్ట్రములలో, అట్లు విభాగమునుకోరుటకు హక్కులేదు. ఆరాష్ట్రములలో యితరమెంబర్లసమ్మతి లేనిదే, యేమెంబరును తనయనిర్దిష్టభాగమును విక్రయింపజాలడు. కావున క్రియదారు విభాగమును కోరుటకు ఆరాష్ట్రములలో హక్కు లేదు. విభాగవిషయమున క్రయదారుయొక్క హక్కుబాధ్యతలను గూర్చి ఆరవప్రకరణమున విశేషముగా చర్చింపబడినది. కావున అచ్చట చూడవలయును(1).

---

(1). 177—187 పేజీలు.

9. విభాగకాలమునాటికి, తల్లి గర్భవతియైయుండి, విభాగమయినపిమ్మట కుమారుడు కలిగెనేని, అతనిభాగమువిషయ మేమికావలయును?

విభాగకాలమునాటికి గర్భస్థుడై యున్నవానివిషయము.

దృశ్యాద్వా తద్విభాగస్స్యాదాయవ్యయవిశోధితాత్. యాజ్ఞవల్క్యస్మృతి.

తస్య పితరి ప్రేతే, భ్రాతృవిభాగసమయే అస్పష్టగర్భాయాం మాతరి భ్రాతృవిభాగోత్తరకాలముత్పన్నస్య విభాగః కుత ఇత్యత ఆహ-దృశ్యాద్భ్రాతృభిర్గృహీతాద్ధనాత్-దృశ్యాదాయవ్యయవిశోధితాత్- ఆయః ప్రతిదివసం ప్రతిమాసం ప్రత్యబ్దం వా యదుత్పద్యతే- వ్యయః పితృకృతర్ణాపకరణం తాభ్యామాయవ్యయాభ్యాం యచ్ఛోధితం తస్మాదుద్ధృత్య తద్భాగో దత్తస్స్యాత్ -ఏతదుక్తం భవతి- ప్రాతిస్వికేషు భాగేషు తదుత్థమాయం ప్రవేశ్య పితృకృతంచర్ణమపనీయావశిష్టేభ్యో భాగేభ్యస్స్వేభ్యః కించిత్కించిదుద్ధృత్య విభక్తజస్య భాగస్స్వభాగసమః కర్తవ్యఇతి- ఏతత్సవిభాగసమయే భ్రాతృభార్యాయామప్రజస్యాఽస్పష్టగర్భాయాం విభాగాదూర్ధ్వముత్పన్నస్య వేదితవ్యం- స్పష్టగర్భాయాంతు ప్రసవం ప్రతీక్ష్య విభాగః కర్తవ్యః। యథాహ వశిష్ఠః అథ భ్రాతౄణాం దాయవిభాగో యాశ్చానపత్యాః స్త్రియస్తాసా మాపుత్రలాభా దితి. గృహీతగర్భాణా మాప్రసవా త్ప్రతీక్షణీయ మితి యోజనీయం. మితాక్షర.

తల్లి అస్పష్టగర్భయైయుండగా తల్లి గర్భిణియని తెలియక తండ్రి మృతినొందగానే భ్రాతలు పంచుకొన్నపక్షమందు అట్లు పంచుకొన్నపిమ్మట తల్లికి కొడుకు పుట్టెనేని, ముందు భ్రాతలు పంచుకొనియున్న తండ్రిధనమును, పిమ్మట దానినుండి యభివృద్ధియైనధనమును జేర్చి, యామొత్తములో తండ్రిచేసినయప్పులున్నపక్షమున ఆయప్పులను తీర్చివేసి, మిగిలిన ద్రవ్యములోనుండి యెత్తి తమభాగము

లకు సమముగనట్లు తమ్మునకు భాగ మీయవలయును. విధవయు సపుత్రయునగు భ్రాతృభార్య గర్భిణి యని తెలియకుండ భ్రాతలు పంచుకొనినపిమ్మట నామెకు పుత్రుడు గల్గెనేని, యీన్యాయమే ప్రవర్తించును. గర్భము స్పష్టముగా నున్నపక్షమున ప్రసవమగువఱకును విభాగము చేయకూడదు. ఇట్లు వశిష్టునిచే చెప్పబడినది.

కుమారుడు తల్లిగర్భమునందుండగా విభాగము జరిగెనేని, విభాగమునాటి కాతడుపుట్టియున్నచో విభాగమునం దెట్టిహక్కులుండునో అట్టిహక్కులనే కలిగియుండుననియు, విభాగమున నాతని భాగమును వేరుగా యుంచనిచో, ఆవిభాగమును రద్దుపర్చి తిరిగి విభాగముచేసి అందాతనికి భాగమీయవలయుననియు న్యాయస్థానములు తీర్మానించినవి(1). అనగా, తండ్రియును, అతని యిరువురు కుమాళ్ళును, విభజించుకొనునప్పుడు తల్లిగర్భవతియని తెలిసినచో, ఆస్తిని నాల్గుభాగములు చేసి విభజించుకొని, వారుముగ్గురును మూడు భాగములను తీసికొని ఒకభాగమును వేరుగా నుంచవలయును. కుమారుడుకలిగినచో, నాభాగ మాతనికిచేరును. కుమార్తెకలిగినచో, ఆభాగమును మరల తండ్రియును కుమారులిరువురును పంచుకొనవలయును. తల్లి గర్భవతియని తెలియక పంచుకొనినప్పుడు, కుమారుడు కలిగెనేని, ఆస్తిని మరల నాల్గుభాగములు చేసి, విభజించుకొనవలయును.

తండ్రియును కుమాళ్ళును విభజించుకొన్నపిమ్మట తండ్రికి కలిగెడి కుమారులవిషయము.

10. తండ్రియును కుమాళ్ళును పంచుకొనినపిమ్మట తండ్రికి కుమారుడుకలిగెనేని, వానివిషయమున నెట్లుజరుగవలసినదియు తెలుపుస్మృతివచనము లీదిగువ నుదాహరింపబడుచున్నవి.

“విభక్తేషు సుతో జాత స్సవర్ణాయాం విభాగభాక్”

యాజ్ఞ్యవల్క్యుడు.

---

(1). 4 మ. హై. రి 207; 2 బెం. లా. రి 108; 12 బొం 105 (108-109)

" ఊర్ధ్వం విభాగా జ్జాతస్తు పిత్ర్యమేవ హరేద్ధనమ్
సంసృష్టా స్తేన వా యేస్యు ర్విభజేత స తైస్సహ"

మనువు.

" విభాగోత్తరకాలముత్పన్నస్య పుత్రస్య కథం విభాగకల్ప నేత్యత ఆహ- విభక్తేషు పుత్రేషు పశ్చాత్సవర్ణాయాం భార్యాయా ముత్పన్నో విభాగభాక్- విభజ్యతి ఇతి విభాగ స్తం భజత ఇతి విభాగభాక్- పిత్రో రూర్ధ్వం తయో రంశం లభత ఇత్యర్థః - మాతృభాగంచాసత్యాం దుహితరి మాతుర్దుహితర శ్శేష మిత్యుక్తత్వాత్ -అసవర్ణాయా ముత్పన్నస్తు - స్వాంశ మేవ పిత్ర్యా ల్లభతే - మాతృకంతు సర్వమేవ-ఏతదేవ మనునోక్తం - ఊర్ధ్వం విభాగా జ్జాతస్తు పిత్ర్యమేవ హరే ద్ధనమితి - పిత్రో రిదం పిత్ర్యమితి వ్యాఖ్యేయం - అనీశః పూర్వజః పిత్రో ర్భ్రాతుర్భాగే విభక్తజ ఇతి స్మరణాత్ -విభక్తయో ర్మాతాపిత్రోర్భాగే విభాగా త్పూర్వ ముత్పన్నో న స్వామీ విభక్తజశ్చ భ్రాతుర్భాగే న స్వామీత్యర్థః -తథాహి విభాగోత్తరకాలం పిత్రా యత్కించి దార్జితం తత్సర్వం విభక్తజ స్యైవ - పుత్రైస్సహ విభక్తేన పిత్రా యత్స్వయమార్జితం. విభక్తజస్య తత్సర్వ మనీశాః పూర్వజా స్మృతా ఇతిస్మరణాత్ - యేచ విభక్తాః పిత్రా సహసంసృష్టాస్తైస్సార్థం పితురూర్ధ్వం విభక్తజో విభజేత్ . యథాహ మనుః - సంసృష్టా స్తేన వా యేస్యు ర్విభజేత స తైస్సహేతి.

మితాక్షరి.

తండ్రి కొడుకులతో విభాగించుకొన్నపిమ్మట, సమానజాతీయురాలైన భార్యయందు కొడుకు పుట్టినయెడల వాడు తనతండ్రి గతించినపిమ్మట నతనిభాగమును, తల్లికి కుమార్తెలు లేనిపక్షమందు ఆమె గతించినపిమ్మట నామెభాగమును పొందవలయును. భిన్నజాతీయురాలగు భార్యయందు బుట్టినవాడు, తండ్రిధనమందు తనభాగము

మసమాత్రమే పొందును. కూతులు లేనిపక్షమందు తల్లిసొమ్ము నంత యును బొందును. ఇట్లు మనువచనమున్నది. విభాగమైనపిమ్మట తండ్రి సంపాదించినదేమియున్నను, విభాగమునకు తరువాతపుట్టినవాడే పుచ్చుకొనవలయునుగాని, విభాగమునకు ముందుపుట్టినవాడు పుచ్చుకొనకూడదని స్మృతియున్నది. విభక్తులైనపుత్రులలో నెవరైన తండ్రితోఁగూడ సంసృష్టులైనపక్షమందు, వారును విభాగానంతరమున పుట్టినవారును కలిసి విభాగించుకొనవలయును. ఇట్లని మనుస్మృతి యందు చెప్పబడియున్నది.

మితాక్షరి.

తండ్రియును కుమాళ్లును పంచుకొనినప్పుడు తండ్రి తనభాగ మును తీసికొనెనేని, విభాగానంతరము తండ్రికి కలిగినపుత్రులు అదివరకు జరిగినవిభాగమును రద్దుపరచి తమకుకూడ వాటా యిమ్మని యడుగుటకు హక్కులేదు. తండ్రియనంతర మాతనివాటాకు వచ్చిన యాస్తియును దానినిబట్టి యభివృద్ధిచెందినదియును కూడ విభాగా నంతరమున కలిగినపుత్రులకే చెందును. కాని విభక్తులైనకుమాళ్లకు చెందదు(1).

తండ్రి తనవాటాకు వచ్చినఆస్తిని అంతయును వినియోగము చేసివేసినప్పుడుకూడ విభాగానంతరజనితపుత్రుడు ఊరకొనవలసినదే గాని, అదివరకు చేయబడినవిభాగమును రద్దుచేయుడని చెప్పజా లడు. విభక్తసోదరులను భాగము నిమ్మని కోరజాలడు(2).

విభాగమునందు తండ్రి భాగమును తీసికొనకపోయినచో విభా గానంతరము తండ్రికి కలిగిన పుత్రులు, అదివరకు జరిగిన విభాగమును రద్దుచేయుమని కోరుటకును, విభాగము నాటికున్నట్టియు, దానిని

(1). 4 అ 427; 2 బెం. లా. ర 103; 82 ఇం. కే (బొ) 10.

(2). 38 బొం 267.

బట్టి యభివృద్ధిచెందినట్టియు, ఆస్తులలో భాగమును బొందుటకును హక్కుకలిగియుందురు(1).

దావా తేదీకి దరిమిలాను ప్రిలిమినరీడిక్రీకి పూర్వము వాదితండ్రికి మరియొక కుమారుడు గర్భోత్పత్తియై, జన్మించినను వాదివాటా తగ్గిపోవదు(2).

విభాగపుదావా పెండింగులో నుండగా వాది చనిపోయిన యెడల, అతనిభాగము ఆతని వారసునకు చెందును. గాని మృతశేషత్వధర్మముచే తక్కిన మెంబర్లలో లీనముకాదు(3).

**11.** తండ్రియును కుమారులలో కొందరును విభజించుకొని, కొందరుకుమాళ్లు తండ్రితో కలసియున్నయెడల, తండ్రివాటాయును, ఆవాటాయాస్తినిబట్టి వృద్ధినొందినదియును సహా, తండ్రియనంతరము, ఆతనితో కలిసియున్నపుత్రులకు మాత్రమే వచ్చును. కాని, అదివఱకు విభజించుకొనియున్నపుత్రులకు రాదు. కారణమేమనగా మృతశేషత్వధర్మము, విభాగానంతరము వర్తింపదు. కావున తండ్రియాస్తి విభక్తపుత్రులకు రానేరదు. తండ్రిభాగము అవిభక్తపుత్రులలో మృతశేషత్వధర్మముచే లీనమయిపోవును(4).

తండ్రియును కుమాళ్లలో కొందరును విభజించుకొన్నప్పుడు.

తండ్రియును కుమారులలో కొందరును పిత్రార్జితమును విభజించుకొని తండ్రిస్వార్జితమును విభజించుకొనక యుంచినప్పుడు గాని విభాగానంతరము తండ్రి స్వార్జితముగా సంపాదించినప్పుడుగాని తండ్రియనంతర మాతనిస్వార్జిత మాతనితో కలిసియున్నపుత్రులకే వచ్చునా?

(1). 20 మ 75.
(2). 48 మ 465.
(3). 43 క 1031 (ప్రి. కౌ.)
(4). 33 బొం 267; 28 బొం 636; 22 బొం 101; 32 మ 377.

విభక్తపుత్రులకు కూడ వచ్చునా యనువిషయమున భిన్నాభిప్రాయములున్నవి. (తండ్రి, తనస్వార్జితవిషయమున నెట్టి యేర్పాటులును చేయకుండ చనిపోయినప్పుడు మాత్రమే యిట్టిప్రశ్న వచ్చుచుండును). బొంబాయి మదరాసు హైకోర్టులు విభక్తపుత్రులకు తండ్రిస్వార్జితము రానేరదని తీర్మానించినారు(1). అ. హై వారు విభక్తపుత్రులకును అవిభక్తపుత్రులకునుకూడ వచ్చునని తీర్మానించినారు(2).

బొంబాయి మద్రాసు హైకోర్టులు విభాగానంతరము మృతశేషత్వధర్మము వర్తింపను కావున మృతశేషత్వధర్మము వర్తించెడి అవిభక్తపుత్రులకు తండ్రియొక్క స్వార్జితము చెందునని కారణము చెప్పియున్నారు.

అ. హై. వారు చెప్పినకారణ మేమనగా, స్వార్జితమునందు, సర్వైవరుషిప్పు లేదని కొన్ని కేసులలో(3) ప్రి. కౌ. వారు చెప్పియున్నారు. కావున తండ్రి స్వార్జితమునందు విభక్తపుత్రులకును అవిభక్తపుత్రులకును కూడ మృతశేషత్వధర్మము వర్తింపదు. తండ్రియనంతరము కుమారులందరును సమానవారసులే కావున విభక్తావిభక్తభేదము లేకుండ నందఱకును సమానముగా వచ్చునని చెప్పియున్నారు.

తండ్రియును కొందరుకుమారులును విభజించుకొన్నప్పుడు, మిగిలినకుమారులును తండ్రియునుకూడ విభజించుకొన్నట్లు తలంపరాదు(4).

---

(1). 22 బొం 101; 32 మ 377; 62 ఇం. కే (మ. ఫు. బెం) 944.

(2). 49 ఇం. కే (అ) 620; 123 ఇం. కే (ఔ) 861.

(3) 9 మూ. ఇం. అ 539; 20 అ 267 (ప్రి. కౌ.)

(4). 35 ఇం. కే (మ) 52.

కుమాళ్లతో పంచుకొనిన తండ్రియొక్క హక్కులు.

**12.** కుమాళ్లతో విభాగమైనపిమ్మట, తండ్రివాటాకు వచ్చిన ఆస్తిని అతని యిష్టమువచ్చినట్లు వినియోగము చేసికొనవచ్చును(1).

తండ్రియును కుమాళ్లును విభజించుకొని, పారీఖత్తులో తండ్రివాటా అతనును అతని రెండవ భార్య (విభక్తకుమారులకు సవతితల్లి) యును సంపూర్ణహక్కులతో అనుభవింపవలసినదని వ్రాయబడెను తండ్రివాటా అతని యనంతరము కుమారులకు రాదనియును, భార్యాభర్తలు భాగస్వాములు (Tenants in Common) గా ఆయాస్తిని అనుభవించిరనియు అందుచే తండ్రియనంతరము అతనివాటా అతనిభార్యకు వచ్చుననియును తీర్మానించిరి(2).

తండ్రి, కుమాళ్లతో విభజించుకొన్నపిదప అతడు తనవాటాను ఎట్టివినియోగమును చేయకుండ చనిపోయెనేని అతనియనంతర మాయాస్తి విభక్తులైయున్నను పుత్రపౌత్రప్రపౌత్రులకు చెందును. కాని భార్యకు చెందదు. భార్యకు ఆయాస్తియందు జీవితకాలపుహక్కు కూడ దఖలుపడదు. కాని ఆమెకు పుత్రపౌత్రాదులు జీవనాంశమియ్యవలసియుందురు. తండ్రి విభక్తుడైనాడు కదాయని అతనివాటా భార్యకే వచ్చుననియు, విభక్తపుత్రులకు రాదనియు తలంపరాదు. ఈసందర్భమున సోదరులకును తండ్రికిని భేదమున్నది.

తండ్రిస్వార్జితము నాతడు తనయిష్టమువచ్చినరీతిని విల్లుద్వారా కూడ వినియోగించుకొనవచ్చును. పుత్రు లేవిధముగాను దాని నాటంకపరుపజాలరు(3).

---

(1). 120 ఇం కే (లా) 168 మనుమనికి దానమిచ్చెను; 45 ఇం. కే (ఒకకుమారునకు) 585.

(2). 27 మ 498.

(3). 12 మ 126; 22 మ 9; 123 ఇం. కే (మ) 806.

13. ఏ మెంబరైనను సమష్టికుటుంబమునుండి విడిపోవలయునని యిచ్ఛ పుట్టినతోడనే విడిపోవచ్చునని 2 వ పేరాలో తెలుపబడినది. అందుచే విభాగమునకు ఉద్దేశము ప్రధానమని స్పష్టమగుచున్నది. అయితే ఈ ప్రకరణముయొక్క 1 వ పేరాలో వ్రాసిన విభాగలక్షణమును బట్టి చూచినచో ఆస్తిని భాగములననుసరించి విడదీసి, ఎవరివాటా కేభాగము వచ్చునదియు, హద్దులు కొలతలతోసహా యేర్పరచినగాని విభాగస్థితి యేర్పడదని తోచుచున్నది. కొంతకాలము అదియే వాస్తవమని తలంపబడుచుండెడిది. సమష్టికుటుంబమెంబర్లు తమలో తాము విభాగము చేసికొనుటకు ఏర్పరచుకొనినప్పుడును విభాగమునిమిత్తము దావా చేసినప్పుడును తప్ప విభాగస్థితి యేర్పడదని కొంతకాలము తలంపబడుచుండెడిది. విభాగస్థితి యెప్పుడేర్పడును? అను విషయము చాలముఖ్యమైనది. విభాగస్థితి యేర్పడిననాడే సమష్టికుటుంబమను మాటపోయి వ్యష్టికుటుంబమను మాట వచ్చును. విభాగస్థితి యేర్పడిన తేదీ మొదలు:—

విభాగస్థితి.
Severance of status.

1. విభాగమును కోరినమెంబరు, మరణశాసనము వ్రాసికొనుటకధికారము కలిగియుండును.

2. సమష్టికుటుంబమెంబర్లలో దరిమిలాను కలుగు జననమరణములవలన హెచ్చుతగ్గులు కలుగకుండ ఆనాటికున్న మెంబర్ల సంఖ్యను బట్టి అతనికి వచ్చెడి భాగమునకు హక్కుకలిగియుండును.

3. అతనిభాగము విడిపోయినట్లెంచబడి, అది యతని ప్రత్యేకపుటాస్తియై, మృతశేషత్వధర్మము వర్తింపక యతనివారసులకు సంక్రమించును.

4. సమష్టి కుటుంబకర్తగాని, యితరమెంబర్లుగాని చేయు ఋణములు విని యోగములు అతనిని బాధింపవు.

5 కర్తకును, తండ్రికిని, గలయధికారము విభాగస్థితి యేర్పడిన తోడనే అంతమొందును 112 ఇం. కే (మ) 541.

ఈరీతిగా హక్కుబాధ్యతలు మారిపోవును. కాబట్టి యీవిభాగస్థితి యెప్పుడేర్పడును? ఎట్లేర్పడును? అనువిషయములనుగూర్చి ముఖ్యముగా ఆలోచింపవలసి యున్నది.

విభాగస్థితి యేర్పడిన తేదీమొదలు ఆస్తివిభాగము కొరకు 12 సంవత్సరములలోపున దావా తేవలయును. 53 ఇం. కే. 248.

14. విభాగస్థితి యేర్పడుటయు, విభాగమును జరిగించుకొనుటయు, రెండును వేఱువేఱు విషయములను సంగతి ముఖ్యముగా నెఱుంగవలయును. విభాగోద్దేశమును స్పష్టపరచుటయే విభాగము. ఆనాడే విభాగస్థితి యేర్పడును. వాటాలను విడదీయుట, మెంబర్లసమ్మతిమీఁదగాని మధ్యవర్తుల నెన్నుకొనుటమూలమునగాని తుదకు న్యాయస్థానసాహాయ్యము నపేక్షించుటవలనగాని మఱియొకప్పుడు జరుగవచ్చును. సమష్టికుటుంబమునుండి విడిపోయి, తనభాగమునకు తాను ప్రత్యేకాధికారిని కావలయునను తనకోర్కెను వెల్లడించుటయే విభాగమనబడును. విభాగమునకు ఉద్దేశమే ప్రధానమగుటచే తనదృఢనిశ్చయమును స్పష్టముగను నిస్సందేహముగను వెల్లడింపవలయును. అట్లు వెల్లడించినచో, ఇతరమెంబర్ల యంగీకారముతో నిమిత్తములేకుండ

విభాగోద్దేశ ప్రకటనమే విభాగము

ఆనాటితో విభాగస్థితి యేర్పడును(1). కొంతఆస్తిని విభజించుకొని కొంత విభజించుకొనకుండ నున్నను మొదటివిభాగమునాడే విభాగ స్థితి యేర్పడును(2). సమష్టికుటుంబమెంబర్లలో ఎవరైనను విభాగము కావలయునని తనయుద్దేశమును వెల్లడిచేసినప్పుడు అట్లు చేయరాదని యెవరును ఆటంకపరుపజాలరు. విభాగము పూర్తియగువరకును కొన్ని దినములు కలిసియున్నను విభాగస్థితి విభాగోద్దేశమును స్పష్టపరచిన నాడే యేర్పడును.

విభాగోద్దేశమును తక్కిన మెంబర్లకు తెలియచేయవలయును. లేనిచో విభాగోద్దేశమును ప్రకటించినట్లు కానేరదు. అందువలన విభాగస్థితి రానేరదు(3).

విభాగము అనుశబ్దములో పైన వ్రాసినవిషయములనుబట్టి కొల్లలు హద్దులతో విభజించుకొనుటయును, విభాగోద్దేశమును స్పష్ట

(1). 28 ఇం. కే (మ) 625 రిజస్టరుకాని పారీఖత్తు; 37 ఇం. కే (ప్రి. కౌ.) 321; 40 ఇం. కే (ప్రి.కౌ.) 286; 56 ఇం. కే (ప్రి కౌ.) 293, 306; 18 ఇం. కే (ప్రి.కౌ.) 30; 112 ఇం. కే (మ) 184; 76 ఇం. కే (మ) 881; 70 ఇం. కే (పా) 846; 54 మ 269; 1929 పా 164; 11 మూ. ఇం. అ. 75; 5 క 148; 30 క 725 & 738; 31 అ 412; 5 బొం 48; 29 క 797; 3 ఇం. కే (ప్రి.కౌ.) 9; 28 ఇం. కే (క) 580; 10 ఇం. కే (మ) 108; 43 ఇం. కే (మ) 833; 68 ఇం. కే (ప్రి.కౌ.) 451; 77 ఇం. కే (క) 450; 77 ఇం. కే 515; 119 ఇం. కే (బొ) 872; 132 ఇం. కే (ప్రి.కౌ.) 733; 35 అ 80; 4 క 434, 425; 5 క 474; 30 క 231; 35 క. వీ. నో. 815; 80 ఇం. కే 475; 98 ఇం. కే 303; 45 ఇం. కే 62; 40 ఇం. కే 36; 53 ఇం. కే 866; 110 ఇం. కే 886; 104 ఇం. 587.

(2). 73 ఇం. కే (బొం) 369.

(3). 71 ఇం. కే (మ) 274; 54 ఇం. కే (మ) 146; but see 78 ఇం. కే (బొ) 256.

ముగా ప్రకటించుటయును కూడ నిమిడియున్నవి. ఈరెండిటిలో నేది చేసినను విభాగమైనట్లే(1).

15. విభాగోద్దేశమును తక్కినమెంబర్లకు నోటీసుపూర్వకముగ తెలియచేయవచ్చును(2). రిజష్టరునోటీసు నిచ్చినప్పుడు, ఇతరమెంబర్లసమ్మతియక్కర లేకుండ విభాగస్థితి యేర్పడినదనుమాట నిశ్చయమే. కాని, దరిమిలాను ఇతరమెంబర్లప్రోత్సాహమువలనగాని, బంధువుల ప్రోత్సాహమువలనగాని, విభాగముకొరకు పోరాడక తిరిగి కలిసియుండినట్లు, రుజువయ్యేనేని విభాగస్థితి యేర్పడదు. మొదటినోటీసును రద్దుచేసికొనినట్లు ఎంచతగియుండును. లేదా భయముపెట్టుటకు మాత్రమిచ్చిననోటీసుగా నెంచవలయును. ఒకసారి విభాగస్థితి యేర్పడినపిమ్మట, మరల సమష్టి అయ్యెనందురేని యది సంసృష్టికిందకు రాదా ? అని ప్రశ్నింపవచ్చును. సంపూర్ణవిభాగమైనపిమ్మట మరల కలసికొనిరేని యది సంసృష్టిక్రిందకు వచ్చును. కాని, నోటీసునిచ్చి రద్దుపర్చుకొనినచో నది సంసృష్టియనిపించుకొనదు. ఒకమారు విభాగోద్దేశమును స్పష్టపరచినప్పుడు, విభాగస్థితి యేర్పడుటకు విడువకుండ పనిజరుగవలయును. కాని అది మరల వదలుకొనబడినట్లు దరిమిలాచర్యలవలన స్పష్టమైనచో మొదటినోటీసుతో విభాగస్థితి రానేరదు(3).

విభాగోద్దేశమును వెల్లడిచేయుటెట్లు ?

i విభాగమునిమిత్తము దావాచేయుట,

---

(1). 1927 ప్రి.కౌ. 224; 1929 బొం 24; 1928 అ 422.

(2). 37 ఇం. కే (ప్రి. కౌ.) 321; 101 ఇం. కే (అ) 868.

(3). 141 ఇం. కే (లా) 434; 116 ఇం. కే (అ) 285; 87 ఇం. కే (ప్రి. కౌ.) 338; 132 ఇం. కే (ప్రి.కౌ.) 733; 101 ఇం. కే (అ) F54; 142 ఇం. కే (లా) 693.

ii విభాగముకొఱకు మెంబర్లు అందరును కలసి మధ్యవర్తి నేర్పరచుకొనుట, మధ్యవర్తి తీర్పు యివ్వకపోయినను సరియే(1).

iii తమలోతాము విభాగమును జేసికొనుట కంగీకరించుట.

ఈ మూడుకార్యములను చేయుటకూడ విభాగోద్దేశమును స్పష్టముగాను నిస్సందేహముగాను వెల్లడించుటయగును. కావున నీపనులుచేసినవాటినుండియును విభాగస్థితి యేర్పడును.

దావాచేయుటతోడనే విభాగోద్దేశము స్పష్టమగును. కావున ఆనాటినుండియును విభాగస్థితి యేర్పడును డిక్రీ యెప్పుడిచ్చినను, విభాగము పూర్తి కాకపోయినను, దావా తేదీ మొదలు విభాగస్థితి యేర్పడును(2). కాని విభాగోద్దేశమున్నట్లు రుజువైనను విచారణకు పూర్వము దావాను విత్డ్రా చేసికొన్నచో విభాగస్థితియేర్పడదు(3). దావాచేయుటతోడనే విభాగస్థితి యేర్పడినట్లెంచరాదనియు, డిక్రి అగువరకును విభాగస్థితి యేర్పడదనియును, కొన్నితీర్పులున్నవి(4).

(1). 119 ఇం. కే (పా) 817; 111 ఇం. కే (అ) 33.

(2). 18 ఇం. కే (పి.కా.) 30; 37 ఇం. కే (పి.కా.) 321; 40 ఇం. కే (పి. కా.) 286; 77 ఇం. కే (పి.కా.) 1041; 68 ఇం. కే (పి.కా.) 451; 33 ఇం. కే (మ. పు. బెం) 858; 121 ఇం. కే (పా) 451; 88 ఇం. కే (అ) 422; 101 ఇం. కే (అ) 868; 35 ఇం. కే (మ) 858; 55 ఇం. కే (అ) 38; 50 ఇం. కే 357; 39 మ 159; 1927 అ 60; 125 ఇం. కే (అ) 754; 117 ఇం కే 868

(3). 32 అ 415: 87 ఇం. కే (పి.కా.) 333; 48 ఇం. కే (మ) 838; 57 ఇం. కే (మ) 800, but see 51 అ 519; 1927 అ 465.

(4). 2 న 83; 30 క 231; 19 మ 345; 24 బొం 182; 86 బొం 550; 85 మ 239; 43 క 1031; 39 అ 293; 14 క. వీ. నో. 985.

కాని పై నివ్రాసినదరిమిలాతీర్పులనుబట్టి మైనర్లవిషయమునతప్ప యీయభిప్రాయము సరియైనదికాదని తేలుచున్నది. డిక్రీవలన కావలసినపని భాగనిర్ణయమును ఆస్తిపంపకమును అయియున్నది. కావున విభాగస్థితి డిక్రీకిముందే దావాతోడనే యేర్పడును(1). మదరాసుహైకోర్టువారొకకేసులో, దావాదాఖలుకాగానే విభాగస్థితి యేర్పడదనియు, దావానోటీసు ప్రతివాదికి అమలుజరిగినపిమ్మట, విభాగస్థితి దావా తేదీలగాయతు ఏర్పడుననియు, తీర్మానించిరి(2). తండ్రివిభాగము నిమిత్తము కుమారునిపై దావా చేసి, దావానోటీసు అమలుజరుగకముందే తనసగంవంతు మరణశాసనము వ్రాసి చనిపోయెను. నోటీసు అమలుజరుగకపోయినను, దావా తేదీమొదలు విభాగస్థితి యేర్పడుననియు, సదరువిల్లు చెల్లుననియు మ. హైకోర్టువారు తీర్మానించిరి(3).

విభాగముయొక్క పద్ధతులను నిర్ణయించుటకై ఒకమధ్యవర్తి నేర్పరచుకొనుటతో విభాగస్థితి వచ్చును(4).

ఒకమెంబరు చనిపోవునప్పుడు, సోదరునితో తనయర్ధభాగమును తనభార్యకీయవలయునని చెప్పుచు తనభార్యను దత్తత చేసికొనవలసినదని చెప్పెను. ఈమాటలు విభాగోద్దేశమును స్పష్టముగాను నిస్సందేహముగాను ప్రకటించుట కాదనియు, అందువలన విభాగస్థితి యేర్పడదనియు తీర్మానించిరి(5). ఒకకేసులో మ. హై.

(1). 68 ఇం. కే (ప్రి.కౌ.) 578; 130 ఇం. కే (మ) 756; 37 ఇం. కే 111; 1931 మ 324.

(2). 122 ఇం. కే (మ) 167.

(3). 130 ఇం. కే (మ) 756.

(4). 50 క 74; 1932 బొం 498.

(5). 1932 బొం 410.

వారు సమష్టికుటుంబ మెంబరు విల్లువా)యుచు, అందులో నేను సమష్టికుటుంబమునుండి విడిపోవుట నాయభీష్టమైయున్నది; అందుచే విడిపోవుచు ఈవిల్లు వ్రాయుచున్నాను అని వ్రాసినను ఆవిల్లువ్రాసినకాలమునుండియు నాతనికి విభాగస్థితివచ్చునని సూచించియున్నారు. (1927 మ 1066) కాని ఈసూచన సరియైనదగునా ? యని సంశయము కలుగుచున్నది సమష్టికుటుంబమెంబరు తనయుద్దేశమును బహిరంగముగాను స్పష్టముగాను తెలుపవలయునుకదా ! అట్లు తెలిపిన పిమ్మటగాని విభాగస్థితిరానేరదు. మఱియు సమష్టికుటుంబ మెంబరు విల్లువ్రాయకూడదను నియమమున కిది భంగకరము.

తండ్రి తనయాశదాస్తిని దత్తతకుమారునకు దత్తతనాడు దానపట్టా వ్రాసియిచ్చెను. దానివలన తండ్రికుమాళ్ళకు విభాగస్థితి యేర్పడదు. జీవనాంశ మేర్పరచుకొనినను విభాగస్థితి యేర్పడదు(1).

ఇతర మెంబర్ల యంగీకారముతో ఒకడు తనభాగమునుగూర్చి మరణశాసనము వ్రాసెనేని, దానితో విభాగస్థితి యేర్పడునని మ. హై తీర్మానించిరి(2).

విభాగోద్దేశమును, కుటుంబములో మైనర్లున్నయెడల, వారి గార్డియనులకు తెలియజేయవలయును(3).

సమష్టికుటుంబమెంబర్లు తమతమభాగ మెంతెంతయో వివరించుచు ఒకరిజష్టరు యగ్రిమెంటును వ్రాసికొని కొంతకాలము అవి

(1). 116 ఇం కే (మ) 360.

(2) 56 ఇం. కే (అ) 293; 104 ఇం. కే (మ) 650.

(3). 33 మ. లా. జ. 746.

కారముగా అమలుజరుపుకొని యున్నప్పుడు, ఆయగ్రిమెంటు తేదీ మొదలుకొని, ఆకుటుంబము విభాగ్తమైనట్లెంచబడవలయును(1).

సమష్టికుటుంబమెంబర్లు యితరమెంబర్లయంగీకారముతో తమ వాటాలను వేరుగా వ్యవహరించుకొనుచుండిరేని, ఆకుటుంబము విడిపోయినట్లెంచదగును(2).

కొంత ఆస్తిని పంచుకొని తక్కినఆస్తిని సమష్టిగా నుంచుకొనిన మొదటివిభాగము నాఁడే విభాగస్థితి యేర్పడును(3).

ఇద్దరుసోదరులలో నొకఁడు తండ్రివద్దనుండి కొంతయాస్తిని పుచ్చుకొని మిగిలినయాస్తి పూర్వార్జితమైనను అది తండ్రియొక్క స్వార్జితమనియు, అది తండ్రివ్రాసిన విల్లుప్రకారము తనసోదరునకు చెందవచ్చుననియు దస్తావేజు వ్రాసియిచ్చెను. ఈదస్తావేజుతో విభాగస్థితిరానేరదని తీర్మానించిరి(4).

సమష్టికుటుంబ మెంబర్లు తమ భాగములను నిర్ధారణచేసికొని వారు కలసియుండిన యుండవచ్చుననియు లేదా వేరుగా నుండవచ్చుననియు వ్రాసికొనిరి. వారికి విభాగస్థితివచ్చినదని తీర్మానించిరి(5).

---

(1) 35 అ. (ప్రి. కౌ); 41; 81 అ 412 (ప్రి. కౌ); 1927 మ 126.

(2). 29 క. లా. జ. 207.

(3). 130 ఇం. కే (క) 897.

(4). 52 బొం 8.

(5). 1928 లా 122.

16. విభాగస్థితిని స్పష్టము చేయునట్టి యితరవిషయములు కొన్ని కలవు. వాటిలో కొన్ని యిచ్చట తెలుపబడును.

విభాగస్థితిని స్పష్టపరచెడి యితర విషయములు.

(1) తండ్రి యిన్సాల్వెంటు అయిన యెడల, తండ్రికి మాత్రము విభాగస్థితివచ్చును. కుమారులు సమష్టిగానున్నట్లే యెంచబడుదురు. (62 ఇం కే (మ) 376)

(2) కుటుంబాస్తిలోని తనవాటానంతను విక్రయించినప్పుడట్టి మెంబరునకు విభాగస్థితివచ్చును. (179; 180 వ పేజీలు.)

(3) మతాంతరమును గైకొనినప్పుడు అట్టివానికి విభాగస్థితివచ్చును. (26 వ పేజీ. 10 ఇం. కే (పి కౌ.) 477; 17 ఇం. కే. (ప్రి. కౌ.) 257)

(4) ప్రత్యేకవివాహశాసనమునను సరించి, వివాహము చేసికొనినవారికి విభాగస్థితివచ్చును. (1872 సం॥ న 3 రు ఆక్టు; 1923 సం॥ న 30 రు ఆక్టు.)

(5) ఏదయినకొంతసొమ్ము పుచ్చుకొని హక్కువిడుదలదస్తావేజు వ్రాసియిచ్చెనేని, అతడు సమష్టికుటుంబమునుండి విడిపోయినట్లగును. (54 ఇం. కే (మ) 146.)

17. మైనరునకు లాభకరమైననేతప్ప, సంరక్షకుడు విభాగమును కోరరాదనియు, అట్లు కోరినను, లాభకరముకాదని తోచినచో, కోర్టువారు విభాగమును చేయక నిరాకరింపవచ్చుననియు, 6 వ పేరాయందు తెలుపడినది. మైనరు గార్డియను విభాగోద్దేశమును స్పష్టపరచినంతమాత్రమున విభాగస్థితి యేర్పడునా? కోర్టువారు నిరాకరించినచో, ఏర్పడినవిభాగస్థితి ఏమగును? అను విషయములు విచారణీయములు.

మైనరు మెంబరు తరఫున గార్డియను విభాగోద్దేశమును స్పష్టపరచినచో విభాగస్థితి యేర్పడునా?

మ. హై. వారు ఒకఫుల్ బెంచికేసులో, విభాగముకొరకు మైనరుతరఫునగార్డియను తెచ్చినదావాలో విభాగము మైనరునకు లాభకరమేయని కోర్టువారు నిర్ధారణచేసినయెడల, విభాగస్థితి దావా దాఖలుచేసినతేదీమొదలు ఏర్పడుననియు, కోర్టువారు విభాగమును నిరాకరించినయెడల, విభాగస్థితి యేర్పడదనియు తీర్మానించిరి (1).

ఈకేసులో గార్డియను విభాగోద్దేశమును స్పష్టపరచినంతమాత్రమున విభాగస్థితి యేర్పడునా ? లేదా ? యనువిషయము స్పష్టముగా విచారణకాబడి తీర్మానింపబడలేదని యెంచుచు, మ. హై. వారే చెలిమిసెట్టికేసు (2) లో విభాగస్థితి దావా తేదీమొదలుగా యేర్పడదని తీర్మానించిరి. ఈతీర్పును కృష్ణస్వామికేసు (3) లో అంగీకరించిరి. కాని తీర్పునిచ్చుటలోమాత్రము దావాదరిమిలాను ఒక సోదరుడు జన్మించుటచే మైనరునకు వాటాతగ్గిపోకుండుటకై దావా తేదీనాటికి ఎంతవాటావచ్చునో అంతవాటాకును తీర్పుయిచ్చిరి. అందు మైనరునకు దావాతేదీనాటికుండు భాగమునకు దరిమిలాను కలిగిన జననమరణములతో నిమిత్తములేకుండ హక్కుకలిగియుండునని చెప్పియున్నారు. ఈకృష్ణస్వామి కేసులోని తీర్మానమును పాట్నాహైకోర్టువా రంగీకరింపక మదరాసు ఫుల్ బెంచితో యేకీభవించినారు(4). దరిమిలాను యెనుముల అక్కన్న కేసులో మ. హై. వారు చెలిమిశెట్టి, కృష్ణస్వామి కేసులను విమర్శించి వాటితో నేకీభవింపక ఫుల్ బెంచికేసును అనుసరించి, విభాగోద్దేశమును స్పష్టపరుచుటలో మేజరు మెంబరువలెనే మైనరుసంరక్షకునకుకూడ హక్కుకలదని తీర్మానిం

(1). 33 ఇం. కే (మ) 858.

(2). 42 ఇం. కే. (మ) 860.

(3). 88 ఇం. కే (మ) 424; 104 ఇం. కే (మ) 472.

(4). 44 ఇం. కే (పా) 146.

చిరి. కాని యీతీర్పు ఒకన్యాయమూర్తి యిచ్చినదగుటచే, ఇద్దరు న్యాయమూర్తులిచ్చిన చెలిమిసెట్టి, కృష్ణస్వామికేసులు పూర్ణవిమర్శకు లోనుగావయ్యెను(1). మైనరు ప్రతివాదిగానున్నప్పుడు, గార్డియను స్టేటుమెంటుపెట్టి తనభాగము తనకిమ్మని వ్రాసినచో, అది విభాగోద్దేశమును స్పష్టపరచుటయనియు, స్టేటుమెంటు తేదీ మొదలు, విభాగస్థితి యేర్పడుననియు నీతీర్పులో నుదాహరించిరి.

మైనరుతరఫున గార్డియను, విభాగమునిమిత్తము దావా తెచ్చినప్పుడు, కోర్టువారు సదరువిభాగము మైనరునకు లాభకరమనియెంచి, విభాగమునంగీకరించిన కేసులో విభాగస్థితి దావా తేదీనుండి వచ్చుననుమాట నిశ్చయమేమైనను, అంతమాత్రముచేత ప్లయింటు తేదీనుండి, అన్ని కేసులలోను విభాగస్థితి యేర్పడదనియు, దావా చేసినపిమ్మట, విత్డ్రా చేసికొనుట కవకాశము కలదనియు, అందుచే విభాగస్థితి దావా తేదీనుండి యేర్పడదనియు మ. హై. వారియభిప్రాయము(2). ప్రి. కౌ. వారియభిప్రాయముతో నేకీభవించుచు, దావా విత్డ్రా చేయునెడల, విచారణ ప్రారంభింపకముందు చేయవలయుననిరి(3).

తండ్రి 1 వ వాదిగానుండి, తనమైనరుకుమాళ్లను 2, 3 వాదులనుగా చేర్చి, కర్తను తక్కిన మెంబర్లను ప్రతివాదులనుగా జేర్చి విభాగమునిమిత్తము దావా తెచ్చి దావామధ్యస్థమందు చనిపోయెను. 2 వ వాది మేజరై దావాను నడిపించెను. 3 వ వాదితల్లి మైనరునకు విభాగ మక్కర లేదనియెను. తండ్రి, విభాగముకొరకు దావా

(1). 123 ఇం. కే (మ) 806.

(2). 57 ఇం. కే (మ) 800; 83 ఇం. కే (మ) 84; 52 మ 845; 121 ఇం. కే (అ) 257; 63 ఇం. కే (నా) 594.

(3). 87 ఇం. కే 333; 97 ఇం. కే (సిం) 505.

తెచ్చిననాడే విభాగస్థితి యేర్పడినదని వాదించిరి. కాని, కోర్టువారా వాదమును నిరాకరించి మైనరునకు విభాగ మంగీకరింపలేదు(1).

తండ్రిపైని విభాగముకొరకు దావా తెచ్చినయిద్దరుసోదరులలో ఒకడు మేజరు, రెండవవాడు మైనరు. మైనరుతరఫున అన్న గార్డియను. దావామధ్యస్థమందు మైనరు చనిపోయెను. దావాతేదీ నుండి విభాగస్థితి యేర్పడినదనియు, మైనరును తానును సమష్టిగా నుంటిమి, కావున మైనరువాటా తనకు రావలయునని అన్నవాదించెను. కోర్టువారావాదము నంగీకరింపక మేజరునకుమాత్రమే విభాగస్థితి యేర్పడినదనియు, కోర్టువారి డిక్రికాలేదు కావున మైనరునకు విభాగస్థితి యేర్పడదనియు చెప్పి, మైనరువాటా తండ్రిలో మృతశేషత్వ ధర్మముచే లీనమైనదని తీర్మానించిరి(2).

మైనరుతరఫున దావా చేయుటతో విభాగస్థితి యేర్పడదనియు, కాని మేజరయినపిమ్మట ఆదావాను నడిపించినయెడల దావాస్థితి యేర్పడుననియు, అ. పు. బొం. వారు ఒకకేసులో తీర్మానించినారు(3).

18. దాసీపుత్రులననెట్టివారో మొదటి ప్రకరణమున తెలుపబడినది(4).

దాసీపుత్రులవిషయమున స్మృతి వచనములు.

జాతోపి దాస్యంశూద్రేణ కామ తోంశహరో భవేత్ । మృతే పితరి కుర్యు స్తం భ్రాతర స్త్వర్ధభాగికం అభ్రాతృకో హరే త్సర్వం దుహితౄణాంసుతే దృతే॥

(1). 122 ఇం. కే (మ) 167.

(2). 121 ఇం. కే (మ) 887.

(3). 58 ఇం. కే (అ) 667.

(4). 31-34 పేజీలు.

శూద్రునివలన దాసీయందు పుట్టినవాడు తండ్రియిష్టప్రకారముగా భాగమును తీసికొనవలయును. తండ్రి చనిపోయినయెడల, ఆతని భార్యయందుపుట్టినవారు, దాసీపుత్రునకు తమభాగమునం దర్ధభాగము నీయవలయును. భార్యయందు పుట్టినసోదరులు (తండ్రికి భార్యయందుకలిగినకుమారులు) లేని దాసీపుత్రునకు, తండ్రికికలిగిన కుమార్తెలుగాని, ఆకుమార్తె కుమారులు గాని లేనిచో, తండ్రియొక్క యావదాస్తిని తీసికొనవలయును. యాజ్ఞవల్క్యస్మృతి.

అధునా శూద్రధనవిభాగే విశేష మాహ॥. శూద్రేణదాస్యాం సముత్పన్నః పుత్రః కామతః పితురిచ్ఛయా భాగం లభతే. పితురూర్ధ్వంతు యది పరిణీతాపుత్రాస్సంతి తదా తే భ్రాతర స్తం దాసీపుత్రం అర్ధభాగికం కుర్యు స్స్వభాగా దర్ధం దద్యు రిత్యర్థః॥ అథ పరిణీతా పుత్రా నసంతి తదా కృత్స్నం ధనం దాసీపుత్రో గృహ్ణీయాత్ యది పరిణీతా దుహితర స్తత్పుత్రా వా నసంతి తత్సద్భావే త్వర్ధభాగిక ఏవ దాసీపుత్రః॥ అత్రచ శూద్రగ్రహణా ద్ద్విజాతినా దాస్యాముత్పన్నః పితురిచ్ఛయా ప్యంశం నలభతే నాప్యర్ధాంశం దూరత ఏవ కృత్స్నం- కిం త్వనుకూలశ్చే జ్జీవనమాత్రం లభతే॥

శూద్రధనవిభాగమున విశేషమును చెప్పుచున్నాడు. శూద్రునకు దాసీయందు పుత్రుడు కలిగినచో, తండ్రియిష్టానుసారముగా భాగము లభించును తండ్రియనంతరమున తండ్రివివాహముచేసికొనిన భార్యయొక్క పుత్రులున్నయెడల, వారు దాసీపుత్రునకు స్వభాగమున సగ మీయవలయును. అట్టిపుత్రులును, భార్యయందు కలిగిన కుమార్తెలును, ఆకుమార్తెలకుమారులును లేనియెడల, యావత్తుధనమును దాసీపుత్రునకు చెందును. కుమార్తెలును, దౌహిత్రులు నున్నయెడల, యర్ధభాగము దౌహిత్రులకు వచ్చును. ఈనియమము శూద్రునకుకలిగినదాసీపుత్రులకుమాత్రమే వర్తించును.

తక్కినయూడువర్ణములలోను పైనచెప్పినవిధములలో యేభాగమునకు కూడ దాసీపుత్రుడర్హుడుకాడు. సర్వాధికారము మొదలే లేదు. అనుకూలుడై యున్నచో, జీవితాంశమును మాత్రమును పొందును.

మితాక్షరి.

దాస్యాం వా దాసదాస్యాం వా యశ్శూద్రస్య సుతోభవేత్
సోఽనుజ్ఞాతో హరేదంశ మితి ధర్మో వ్యవస్థితః॥

దాసియందుగాని, దాసదాసియందుగాని, శూద్రుని కేపుత్రుడు పుట్టునో అతడు వివాహముచేసికొన్నవారిపుత్రులతో సమభాగియని చెప్పబడెనేని, వారితో సమానభాగియగునని శాస్త్రమర్యాదకలదు. మనుస్మృతి.

దాసీపుత్రులతో సంబంధించిన స్మృతివాక్యములను, వాటిపైని వ్యాఖ్యాతలయభిప్రాయములను కలకత్తాహైకోర్టువారొకఫుల్ బెంచికేసులో సంపూర్ణముగా విమర్శించియున్నారు(1). అందు తాత్కాలికప్రధానన్యాయమూర్తియైన ఆషుతోషుముఖర్జీగారు తమతీర్పునందు సంస్కృతభాషలో స్మృతివాక్యములను వ్యాఖ్యాతలవాక్యములను పురాణవాక్యములను వ్రాసి, వాటికి ఇంగ్లీషుభాషాంతరీకరణము నొసంగియున్నారు. ఈకేసులో దాసీపుత్రులహక్కులవిషయమై సంపూర్ణచర్చ జరిగియున్నది. ఈసందర్భమున స్మృతివాక్యములనుగూర్చి మదరాసుహైకోర్టువారొకకేసులో సంపూర్ణమగు చర్చను గావించియున్నారు(2). ఒకడు, ఔరసపుత్రుడు లేకుండ వివాహమాడినభార్యగాని ఆభార్యవలనకలిగిన కుమార్తెగాని, దౌహిత్రుడుగాని యుండగా, అతనికి దాసీపుత్రులుండి చనిపోయెనేని స్త్రీలకు భాగార్హతలేని మద్రాసురాష్ట్రమునసైతము దాసీపుత్రు

(1). 63 ఇం. కే 50.
(2). 127 ఇం. కే (మ) 126.

లకు సగమును తక్కినభార్య, పుత్రిక, దౌహిత్రులకు సగమును వచ్చును. ఈభాగమును పంచుటకు సూత్రమెట్లనగా దాసీపుత్రుని ఔరసపుత్రునిగా భావింపుము. అప్పుడు మొత్తమంతయును అతనికి వచ్చును. ఔరసునిభాగములో దాసీపుత్రునకు సగమువచ్చును. కావున సగము నాతడు గ్రహింపవలయును. మిగిలినది భార్యమొదలగు వారికివచ్చును(1).

దాసీపుత్రులు భాగమును కోర వచ్చునా?

**19.** శూద్రులలోనైనను, పూర్వార్జితమునందు దాసీపుత్రునకు జన్మముచేత హక్కు కలుగదు(2). అందుచే తండ్రి జీవించియుండగా దాసీపుత్రుడు, పూర్వార్జితమునందుగాని, స్వార్జితమునందుగాని, భాగమును కోరజాలడు(3) కాని తండ్రి, తనజీవితకాలములో ఔరసునకువలెనే దాసీపుత్రునకుకూడ భాగమును పంచియివ్వవచ్చును(4).

దాసీపుత్రుడు, తండ్రియనంతరమున తనభాగమును పంచియిమ్మని ఔరససోదరులను కోరవచ్చును. కాని తండ్రియొక్కసోదరులు, సోదరపుత్రులు, మొదలగువారిని, తనభాగమును బంచియిమ్మని కోరుటకుహక్కు లేదు ఎందుచేతననగా దాసీపుత్రునకు తనతండ్రితోమాత్రమే సంబంధమున్నదిగాని తదితరులతో సంబంధము లేదు. కావున తండ్రియనంతరమున సమష్టికుటుంబాస్తిలోని తండ్రిభాగమును తనకిమ్మని తండ్రితండ్రిని, తండ్రిసోదరులను, తండ్రిసోదరపుత్రులను

(1). 71 ఇం. కే (ప్రి. కౌ.) 643; 33 మ 226.

(2). 13 క 151; 9 రం 266.

(3). 4 బొం 37; 12 మ 401; 28 మ 16.

(4). 28 మ 16.

ఈ మొదలగు వారిని కోరజాలడు. జీవనాంశమును పొందుటకు మాత్ర మర్హుడై యుండును(1).

మ. హై. లో ఒక కేసులో తండ్రియనంతరమునందు ఔరస పుత్రుడు లేని సందర్భమున ఆతని సమష్టిసోదరపుత్రులపైని, అతని భార్య పైని, తండ్రి వాటాను రాబట్టుకొనుటకు దావా చేసి అట్లు రాబట్టుకొనుటకు తనకు హక్కు కలిగియున్నదని చెప్పుటకు ఈక్రింది కారణముల ను చూపెను.

(1). మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతులననుసరించి ద్విజులకు ద్వాదశవిధపుత్రులు- శూద్రులకు దాసీపుత్రుడు త్రయోదశవిధపుత్రుడు. కావున శూద్రులలో దాసీపుత్రుని పుత్రునిగానే భావింపవలయును.

(2). మితాక్షరియందు దాసీపుత్రునిగూర్చి వ్రాసిన వాక్యములన్నియు; అప్రతిబంధదాయమును గూర్చి వ్రాసినవి ఆవాక్యములను సప్రతిబంధదాయమునందు వర్తింపజేయరాదు.

(3). సప్రతిబంధదాయమందు దాసీపుత్రునకు తనతండ్రివివాహమాడిన భార్యకంటెను ఆభార్యకుకల్గినకుమార్తెకంటెను ఆ కుమార్తెకుమారునకంటెను ఎక్కువహక్కులుకలవు.

(4). తండ్రికి ఔరసపుత్రుడున్నప్పుడు తండ్రికి వివాహసంబంధమైన భార్య, కుమార్తె, దౌహిత్రుడు ఉన్నను, వారికి భాగార్హత లేక ఔరసపుత్రునితోపాటు దాసీపుత్రునకు భాగమున్నదనియును, తండ్రిజీవించియున్నప్పుడు దాసీపుత్రునకు భాగార్హత కలదనియును మితాక్షరి యంగీకరించుచున్నది.

(5). దాసీపుత్రుడు నిస్సంతుగా చనిపోయెనేని, అతనియాస్తి తండ్రికి సంక్రమించును.

(1). 21 ఇం. కే (మ) 724; 44 బొం 185; 131 ఇం. కే (ప్రి.కౌ.) 1084.

(6). ఈపైసందర్భములను బట్టిచూచినప్పుడు, దాసీపుత్రుడు తండ్రికి స్మృతులంగీకరించిన యొకానొకవిధమైనపుత్రుడే కావున తండ్రిచాటాను తండ్రియొక్క సమష్టిసోదరులు మొదలగువారియొద్దనుండి రాబట్టుకొనవచ్చును. బాలంభట్టువ్యాఖ్యానమిందుల కనుకూలముగా నున్నది.

మ. హై. వారీ వాదము నంగీకరింపక అదివరకున్న యభిప్రాయములనే స్థిరపరచి బాలంభట్టువ్యాఖ్యానము దక్షిణహిందూదేశమున ప్రమాణము కాదని తీర్మానించిరి(1).

ఔరససోదరులు పంచుకొనునప్పుడు దాసీపుత్రునకు భాగమీయవలయునని స్మృతులు విధించుచున్నవి, కాని అంతమాత్రముచే దాసీపుత్రుడు ఔరససోదరులను వారు అవిభక్తులుగానున్నప్పుడు తన భాగమునకై నిర్బంధింపజాలడని మ. హై. వారు మొదటతీర్మానించిరి. కాని దరిమిలాతీర్పులలో దాసీపుత్రుడు తనభాగమునకు ఔరససోదరులను నిర్బంధింపవచ్చునని నిర్ణయింపబడినది(2).

తండ్రి, సమష్టికుటుంబమునుండివిడిపోయి, వేరుగానున్నప్పుడు పూర్వార్జితమునందును, తండ్రిస్వార్జితము వేరుగానున్నప్పు డాస్వార్జితమునందును కూడ ఔరసపుత్రునితో దాసీపుత్రుడు సమష్టికుటుంబమెంబరగునని తీర్మానింపబడినది(3).

దాసీపుత్రుడు శూద్రులలో సమష్టికుటుంబమెంబరగునని చెప్పినంతమాత్రమున సమష్టికుటుంబమెంబర్లకున్న యావత్తుహక్కు బా

---

(1). 127 ఇం. కే (మ) 126.

(2). 7 మ 407; 8 మ 557; 10 మ 334; 21 ఇం. కే (మ) 724; 107 ఇం. కే (మ) 419; 12 మ 401.

(3). 33 మ 366; 134 ఇం. కే (పి. కౌ.) 1084; 142 ఇం. కే (మ) 597; 4 బొం 37; 21 అ 99; 15 మ 429; 27 మ 82.

ధ్యతలును దాసీపుత్రునకుండునని తలంపరాదు. కొన్నివిషయము లలో సమష్టికుటుంబమెంబర్లుగా నెంచవచ్చునని ఆతీర్పులయర్థమని తలంపవలసియున్నది.

తండ్రియనంతర మాతనియాస్తి, ఔరసునకును దాసీపుత్రునకునుకూడ సంక్రమించును కావున వారిద్దరికిని మృతశేషత్వధర్మము వర్తించును. వారిరువురును సమష్టికుటుంబమెంబర్లగుదురు. ఒక ఔరసుడును, ఒకదాసీపుత్రుడును కలిగినపిమ్మట తండ్రిచనిపోయెనేని ఆతనియాస్తి కాపుత్రులిరువురును వారసుదారులగుదురు. అందొకడు విభాగమునకు పూర్వము పురుషసంతానము లేకుండ చనిపోయెనేని, చనిపోయినవానిభాగము మృతశేషత్వధర్మముచే రెండవవానికి చెందును(1).

దాసీపుత్రునకు సంక్రమించినయాస్తి, ఆతనిపుత్రపౌత్రులకు వంశపారంపర్య వచ్చును, కాని ఆతని కొక్కనికిమాత్రమే యనుభవసీయమై మరల తండ్రివారసులకు పోదు. మఱియును క, యను తండ్రి జీవించియుండగా చ, యను దాసీపుత్రుడు చనిపోయెను. అప్పటి కాతనికి (దాసీపుత్రునకు) ట, యను కుమారుడుండెను. చ, కు రావలసినభాగ మాతనిపుత్రుడైన ట, కు వచ్చును. కాని చ, కు ట, వివాహమాడినభార్యయందు గాక, చ, యొక్క ఉంపుడుకత్తెయందు జన్మించినచో ట, కు క, యొక్క యాస్తిలో భాగము వచ్చునా? రాదా? యనువిషయము నిర్ధారణకాలేదు(2).

తండ్రికి, దాసీపుత్రుడు వారసు అయినట్లే, దాసీపుత్రుడు, తనకు తల్లి, భార్య, సంతానము, లేకుండ చనిపోయెనేని ఆతనియాస్తికి ఆతండ్రి వారసు అగును(3).

---

(1). 18 క 181; 11 క 702; 4 బొం 67.

(2). 25 మ 619.

(3). 42 ఇం. కే (మ. పు. బెం) 556.

20. విభాగము చేయునాటికి కుటుంబమునకున్న ఆస్తిని అప్పులను లెక్కవేయవలయును. పంచుకొనెడివారు పుత్రులైనచో, అప్పటికి, తండ్రి తనస్వోపయోగమునకు చేసిన అన్యాయములు కానిరుణములనుకూడకుటుంబరుణములలో చేర్చి వాటినితీర్చుటకు మార్గమును చూపవలయును. (7 లా. 376).

విభాగమునకు లెక్కలను తేల్చు విధము.

ఏదయిన దగా, మోసము ఉన్నదని రుజువు చేసిననేతప్ప, కర్తను అదివరకు చేసిన వ్యవహారముల కంతకును జమాఖర్చు చెప్పుమని విభాగమునాడడుగుట కేమెంబరునకును హక్కులేదు(1)

ఒక మెంబరుయొక్క కుటుంబమున కెక్కువఖర్చుపడినది, కావున ఆమెంబరు ముజరాయివ్వవలయుననికాని; ఒక మెంబరునకు తక్కువఖర్చుపడినది కావున, ఆతనికి ముజరా యివ్వవలయుననికాని విభాగమునాడు లెక్కలను చూడకూడదు(2).

సమష్టికుటుంబమునందు మెంబరైయుండి, కుటుంబద్రవ్యములోనుండి ఎప్పుడును, లేశమును దీసికొనకుండ వేరుగా జీవితమును గడపుచుండెనేని, ఆతనిభాగమునకురావలసిన గతఫలసాయము విభాగమునాడు లెక్కచెప్పవలసియుండును(3). సమష్టికుటుంబాస్తిలో కొంతగాని, అంతయునుగాని, ఒక్కమెంబరు తనప్రత్యేకపుటాస్తిగా యనుభవించుచుండెనేని, అతడు గతఫలసాయమును లెక్కచెప్పి తక్కినమెంబర్ల భాగముల నీయవలసియుండును(4). సమష్టికుటుంబ మెంబర్లు తమలోతాము ఆస్తులను అనుభవించుటకు పద్ధతులను యే

(1). 3 వ ప్రకరణము.

(2). 5 బెం. లా. రి. 347.

(3). 2 మ 128; 5 మ 236; 7 మ 564.

(4). 19 బొం 532.

ర్పాటు చేసికొనియుండినప్పుడు, అందెవరైన నాయేర్పాటులకు భంగముగా మరికొంతఆస్తిని అనుభవించుచుండిరేని, వారుకూడ అట్టియాస్తిపైని వచ్చుగతఫలసాయమును లెక్కచెప్పి యివ్వవలసియుండును(1) ఈపై నిర్వాసిన కేసులలో తప్ప గతఫలసాయమును ఏమెంబరును విభాగప్రదావాలో కోరకూడదు అప్పుఆస్తులను మాత్రమే పంచుకొనవలసియుండును(2).

గతఫలసాయముమీద వడ్డీనికూడ రాబట్టుకొనతగియుండును(3).

తండ్రి తనసోదరులతో లెక్కలను తేల్చుకొని విభజించుకొన్నప్పుడు, ఆలెక్కలు సరియైనవికావనియు, తమను బయిండు చేయవనియు, ఆక్షేపించుటకు కుమారులకు హక్కులేదు(4).

విభాగము చేసికొనునప్పుడు మొట్టమొదట:—

i అప్పులను మెంబర్లు పంచుకొనుటగాని, లేదా అప్పులను తీర్చుటకుతగినయాస్తిని వేరుగానుంచుటగాని చేయవలయును(5).

ii కుటుంబాస్తినుండి పోషింపబడదగిన స్త్రీలకును, భాగానర్హులని నిర్దేశింపబడినవారికిని పోషణకుదగిన జీవనాంశమున కేర్పాటుచేయవలయును(6).

---

(1). 16 క 397.

(2). 14 క 493 (ప్రి కౌ.); 1 బొం 561; 5 బొం 589; 10 బొం 528; 28 బొం 201; 83 ఇం. కే. (క) 190; 70 ఇం. కే. (మ) 337.

(3). 74 ఇం. కే (మ) 804

(4). 121 ఇం. కే. (అ) 243.

(5). 1 బొం 561; 3 మ. హై. రి. 177.

(6). 84 ఇం. కే. (పా) 168; 18 క 836; 78 ఇం. కే. 265; 1927 మ 88.

iii వివాహముకాని ఆడపిల్లల వివాహవ్యయమునకు తగిన యేర్పాటులను చేయవలయును(1).

iv విభజించుకొనువారు సోదరులై వితంతువైనతల్లి జీవించియున్న యెడల ఆమెపోషణకును, ఆమె శ్రాద్ధకర్మలకును తగిన యేర్పాటులను చేయవలసినవిధియున్నది(2).

ఇవి చేసినపిమ్మట మిగిలెడి యాస్తిని విభజించుకొనవలసియుండును.

తండ్రియనంతరము కుమారులు పంచుకొనునప్పుడు తమసోదరీలవివాహవ్యయమునకు యేర్పాటు చేయవలయును(3).

తండ్రియును కుమారులును విభజించుకొనునప్పుడు తండ్రికి కలిగియున్న కుమార్తెలవివాహవ్యయమునకు తండ్రియే కాకుండ కుమారులుకూడ బాధ్యులగుదురు. కావున అవివాహితలుగానున్న వారికి అగువ్యయము అందరును సమానముగా యిచ్చుకొనవలయును. ఈవ్యయమునకు సమష్టికుటుంబాస్తిపైని ఛార్జికూడ ఉండును. కుమారులకు కుమార్తెలున్నప్పుడు ఆకుమార్తెల వివాహవ్యయమును తక్కినవారు భరించనక్కరలేదు(4). సోదరీలవివాహవ్యయమునకు పితృపితామహధనముపైని ఛార్జియుండునుగాని సోదరుల సొంతఆస్తిపైని జవాబుదారీయుండదు(5).

సమష్టికుటుంబమునందుండెడి ఉపనయనము కానట్టియు వివాహితులు కానట్టియు పురుషులకు ఉపనయనవివాహవ్యయములనిమి త్త

(1). 84 ఇం. కే. (పా) 168.
(2). 32 మ 191; 57 మ. లా. జ. (పు. బెం.) 826; 1931 మ. వీ నో. 215.
(3). 6 అ 682; 23 మ 512.
(4). 121 ఇం. కే. (మ. పు. బెం.) 118.
(5). 133 ఇం. కే. (నా) 390.

ము విభాగకాలమున కొంతయేర్పాటు చేయవలయునని కొన్ని తీర్మానములైనవి(1). కాని ప్రి కౌ. వారు నాటినిరద్దుచేసి, వివాహము, ఉపనయనము, గర్భాధానము ఈమూడిటికొఱకును పురుషులకు యేర్పాటుచేయనక్కఱలేదని తీర్మానించిరి. విభాగమునాటికి కొందఱకు వివాహములై యున్నను అందువిషయమున తక్కినవారు ముజరాకోరుటగాని, తమకు అందుకొఱకగుఖర్చులకొఱకు కొంతసొమ్ము ప్రత్యేకించుడని యడుగుటకుగాని హక్కులేదు. విభాగముకొఱకు దావాచేసిన తేదీ మొదలు విభాగస్థితి యేర్పడును. కావున దావా తేదీ మొదలు డిక్రీతేదీలోపల వివాహములు చేసికొనినమెంబరునకైన వ్యయము వాతను భరింపవలయునేకాని, సమష్టికుటుంబవ్యయములో నుండి యివ్వనక్కఱలేదు(2). ఈ ప్రి. వి. కౌన్సిలు తీర్పు ఆడపిల్లల వివాహమువిషయమున వర్తింపదు(3).

సమష్టికుటుంబమెంబర్లలో నొకరుచనిపోయి, అతనిభార్యను పిల్లలను పోషించుటకును, ఆడపిల్లలకు వివాహముచేయుటకును, సమష్టికుటుంబాస్తి నభివృద్ధిపరచుటకును, సమష్టికుటుంబద్రవ్యములో నుండికాక మెంబర్లలో నెవరైన తమసొంతసొమ్ము ఖర్చుపరచియున్న యెడల, విభాగకాలమున వారిద్రవ్యము వాతనికిచ్చివేయవలయును(4).

(1). 31 బొం 51; 23 ఇం. కే. (మ) 264; 31 ఇం. కే. (మ) 574; 54 ఇం. కే. (బొం) 115; 86 ఇం. కే. (మ) 428; 38 మ 556; 1928 బొం 211; 17 ఇం. కే. 308; 45 మ 642; 40 మ 632.

(2). 68 ఇం కే. (ప్రి.కౌ.) 451; 78 ఇం. కే. (ఔ) 574; 1928 నా 198; 113 ఇం. కే. (బొం) 620; 108 ఇం. కే. (నా) 447; 105 ఇం. కే. (బొం) 720; 84 ఇం. కే (పా) 169; 71 ఇం. కే. (మ) 177.

(3). 121 ఇం. కే. (మ. ఫు. బెం.) 113.

(4). 84 ఇం. కే (లా) 133; 48 అ 84; 32 క. వీ. నొ. 1199.

తల్లికి స్త్రీధనము లేకయుండి, అవి యామె పుత్రికలకు సంక్రమించుచున్నను, హిందూధర్మశాస్త్రము ననుసరించి తల్లిశ్రాద్ధమును కుమారులు చేయవలయును. కావున విభాగకాలమున నందులకు తగినయేర్పాటు చేయవలయును(1). అట్లు చేయనియెడల, కుమారులలో నొకరు ఆవ్యయము నుచుచేసి, తక్కినవారివద్ద వారిభాగములకయినసొమ్మును రాబట్టుకొనవచ్చును(2).

విభాగపుదావాలలో తండ్రియప్పులను తీర్చుటకు తగినయేర్పాటును చేయవలయును. కుమారులపై బాధ్యతయుండెడి తండ్రియప్పులను తీర్చివేసి మిగతా ఆస్తిని విభజించుకొనునట్లు డిక్రీని యివ్వవలయును కాని, కుమారునిపైని ఋణదాత దావాతెచ్చునెడల, తండ్రి తనవాటాను కంట్రిబ్యూషనుగా నివ్వవలయుననుపద్ధతిని డిక్రీ నివ్వకూడదు(3).

విభాగము న్యాయమైనదిగా నుండవలయుననగా భాగములు సరిగానుండవలయుననిమాత్రమే యెంచరాదు ఋణదాతల విషయమునకూడ అది న్యాయముగా నుండవలయును. తండ్రిచేసిన రుణములను తీర్చివేసిగాని లేదా తీర్చుటకు తగినయేర్పాట్లు చేసిగాని పిమ్మట కుమారులు పంచుకొనవలయును. ఎట్టి యేర్పాట్లను చేయకుండ చేసికొనినవిభాగము న్యాయమయినదని చెప్పవీలు లేదు. అట్టియేర్పాటులను చేయకుండ విభాగమును చేసికొనిరేని, రుణదాతలు సమష్టికుటుంబరుణములకు విభాగముచేసికొనిన భాగములమీద కూడ అమలుజరుపవచ్చును(4).

(1). 32 బొం. 26.

(2). 32 మ 191.

(3). 55 మ 558; 100 ఇం. కే. (క. ఫు. బెం), 1018.

(4). 1931 అ 512 (ఫు. బెం.)

21. కర్తయేదయినను దగాచేసినాడనిగాని, కుటుంబాస్తిని మరియొకవిధముగా మార్చి చేసినాడనిగాని, కుటుంబద్రవ్యమును అపహరించినాడనిగాని రుజువుచేసిననేతప్ప కుటుంబము

జమాఖర్చు.

తాలూకు గతవ్యవహారములన్నిటికిని జమాఖర్చులెక్కలను చెప్పుమని కోరుటకు యితరమెంబరులకు హక్కులేదు. విభాగమునాడు అప్పటికి కుటుంబమునకున్న అప్పుఆస్తులను మాత్రము లెక్కచెప్పుట కాతడు బాధ్యుడైయుండును. కాని బాగుగా వ్యవహరించినచో నెంతలాభము వచ్చునో అంతకును లెక్కచెప్పవలసిన బాధ్యత లేదు(1). కాని, కర్త ఖర్చుపెట్టినట్లు చెప్పినసొమ్మును ఖర్చుపెట్టలేదనిగాని, కర్త లెక్కచెప్పినయాస్తికంటె ఎక్కువయాస్తి యున్నదనిగాని చూపుటకు ప్రతిమెంబరునకును హక్కుగలదు(2).

కర్తయొద్దకు వసూలయినసొమ్మునకు వడ్డీ లెక్కచెప్పుమని గాని, లాభము, శిస్తులు, మొదలైనవాటికి లెక్కచెప్పుమని గాని, కోరకూడదు. లెక్కచెప్పించుమని దావా తేకూడదు. అట్లు కోరుట ప్రతిసంవత్సరమును ఎవరిభాగము వారికిమ్మని కోరుటవంటిదగును. కాని విభాగముకొరకు దావా చేసినప్పటినుండియు, కర్త అట్టివాటికి లెక్కచెప్పవలసియుండును(3). కుటుంబమునకు రావలసినయప్పులకు

(1). 61 ఇం. కే. (ప్రి. కౌ.) 690; 62 మ 271; 28 బొం 201; 17 బొం 271; 10 బొం 528; 5 బొం 589; 54 ఇం. కే. (బొం) 115; 33 ఇం. కే. (క) 190; 69 ఇం. కే. (క) 476; 120 ఇం. కే. (పా) 770; 22 మ 470; 104 ఇం. కే. (మ) 472; 50 మ 866; 48 ఇం. కే. (ఔ) 548; 11 క 681; 9 మూ. ఇం అ. 123; 3 ఇం. కే. 241; 14 ఇం. కే. 769; 3 ఇం. కే. 878; 43 క 459; 78 ఇం. కే. (మ) 536; 59 మ. లా. జ. 782; 70 ఇం. కే. (పా) 810; 70 ఇం. కే. (మ) 146; 61 ఇం. కే. (మ) 772.

(2). 70 ఇం. కే. (మ) 887; 33 ఇం. కే. (క) 190.

(3). 126 ఇం. కే. (పా) 872.

కాలదోషము పట్టించుట, అనవసరముగా కొన్నిపద్దులు ఖర్చుపెట్టుట, గవర్నమెంటుపన్నులు మొదలగువాటికి వప్పుచర్లు లేకపోవుట, ఇట్టి వాటికి కర్తను బాధ్యునిగా చేయుమని నిర్బంధింపకూడదు. దగా, అపహరించుట ఇవి రుజువు చేసినవే గాని, పైనివ్రాసిన వాటినిగూర్చి కర్తను బాధ్యునిగా జేయకూడదు(1).

కర్తచేయువ్యవహారములో అవివేకము, అసమర్థత, అశ్రద్ధ చూపినయెడల, కర్తయొక్క మేనేజిమెంటు యితర మేజరుమెంబరులకు తృప్తికరముగా లేకపోయినచో, వెంటనే విభాగముకోరి తమభాగములను తాము విడదీసికొనుటకు ప్రయత్నింతురు. అట్టిప్రయత్నము లేకపోయినచో, కర్తచేయుచున్న మేనేజిమెంటు వారికి అంగీకారమైనట్లే యెంచబడును. అందుచేతనే గతవ్యవహారమునకు జమాఖర్చు చెప్పుమనియడుగుటకు హక్కులేదని తీర్మానింపబడినది. దగా, అపహరణము, మొదలైనవి చేసినట్లు మేజరుమెంబరులకైనను తెలియును. కావున అట్టివి జరిగినప్పుడు వాటినిగూర్చి ప్రశ్నింపవచ్చును. కర్త మేనేజిమెంటు సరిగా లేకపోయినను, కుటుంబములోని మైనరు మెంబర్లు తమయసంతృప్తిని కనబరచుటకుగాని, విభాగమును కోరుటకుగాని వీలులేదు. కావున మైనర్లు తమమైనారటీ వదలినపిమ్మట తమమైనారటీకాలములో కర్త, తమకు నష్టము కలుగజేసినయెడలను, వ్యవహారమునందు బొత్తిగా అశ్రద్ధచూపినందులకును కూడ కర్తను సమాధానమడిగి రాబట్టుకొనవచ్చును. కాని ఆవిషయములు స్పష్టముగా ఋజువు చేయవలయును. లేనియెడల, కర్త విభాగము నాడిచ్చినలెక్కలను బట్టియే విభాగమును జరుపవలసియుండును(2).

(1). 126 ఇం. కే. (పా) 872.

(2). 17 బొం 271; 9 వీ. రి. 483.

కర్త, జమాఖర్చు చెప్పవలయునని సమష్టికుటుంబమెంబర్లు యగ్రిమెంటు వ్రాసికొనియున్నయెడల, అట్లు చెప్పుటకు బాధ్యుడై యుండును(1).

విభాగమునిమిత్తము కాకుండ కుటుంబముయొక్క అప్పుఆస్తులను తెలిసికొనుటకుగాను, కర్తను ఏమెంబరైనను లెక్క చెప్పుమని కోరవచ్చును. అట్లు చెప్పనియెడల, లెక్కలను చెప్పించుమని దావా తేవచ్చునని బొం. హై. వారొకకేసులో తీర్మానించియున్నారు(2).

కర్తను జమాఖర్చులెక్క చెప్పించవలసినదని ప్లయింటులో వ్రాసినను, అక్కవుంటుదావావలె పూరాగా స్టాంపుపెట్టనక్కరలేదు. విభాగపుదావావలెనే, వాది తనయిష్టమువచ్చినకిమ్మతుపైని స్టాంపుపెట్టవచ్చును. అందులో కొంతసొమ్ము కర్త వాదికియివ్వవలసివచ్చినను అందుపైని స్టాంపుపెట్టనక్కరలేదు(3).

సమష్టికుటుంబమెంబరు భాగముకొరకు దావాచేయుటలో ప్రతిసంవత్సరమును ఖర్చులుపోగా ఎంతెంత నిలువచేయబడినో లెక్కచెప్పుమని కర్తను కోరవచ్చును. (100 ఇం. కే. (పా) 632).

గతఫలసాయము లెక్క చెప్పుమని కర్తను కోరుటకు వీలు లేదు (79 ఇం. కే. (నా) 19; 46 మ 47.)

తండ్రిని విభాగకాలమున అంతఃపూర్వపులెక్కల నడుగుటకు హక్కులేదుగాని, అప్పటికి రావలసినబాకీ లెన్నియున్నవో బాకీలు వసూలుచేసినబాపతు ఎంతసొమ్మునిలవయున్నదో లెక్క చెప్పుమని యడుగవచ్చును. (1931 మ. వీ. నో. 215)

---

(1). 22 మ (ప్రి కౌ.) 473.

(2). 5 బొం. లా. రి. 247; 6 మూ. ఇం. అ. 526.

(3). 120 ఇం. కే. (పా) 770.

22. సమష్టికుటుంబమునుండి ఒకరుగాని, కొందరుగాని, ఒక శాఖగాని శాఖలుగాని విడిపోవుట కెట్టి యాటంకమునుండదు. కాని విడిపోయినప్పుడు మిగిలియున్నవారు సమష్టిగా నెంచబడవలయునా? వ్యష్టిగా నెంచబడవలయునా? సంసృష్టిమెంబర్లుగా నెంచబడవలయునా? అను ప్రశ్న రాగలదు. అటు పిమ్మట ఆస్తి సంక్రమించువిషయమున నీప్రశ్న ముఖ్యమగును. విడిపోయినవారుగాక మిగిలినవారు సమష్టిగానుండుట కేర్పరచుకున్నారని వ్రాతమూలకమున్న యెడల బాధలేదు. కాని అట్టిదేమియు లేనిచోట భావన యెట్లు వచ్చును? సామాన్యముగా హిందూకుటుంబము సమష్టియని భావన కలదు. అందు కొందరుమెంబర్లు విభజించుకొనునప్పుడు మొత్తము కుటుంబమెంబర్లు ఎందరుండిరో, ఎవరికెంతెంత భాగము వచ్చునో స్థారణచేసినగాని విభాగముకోరుమెంబర్ల కెంతభాగమువచ్చునో తెలియదు. కావున మొత్తముకుటుంబమంతయు ఆనాటితో విభాగమయినట్లే భావింపవలయుననియు, విడిపోవగా మిగిలిన మెంబర్లు సంసృష్టిమెంబర్లుగా నెంచబడవలయుననియు, మొట్టమొదట క. హై. కో., మ. హై. కో. తీర్మానించియున్నవి(1). కాని దరిమిలాను ఆహైకోర్టులే, ఒక మెంబరు విడిపోయినప్పుడు, మిగిలినమెంబర్లు విడిపోయినట్లు భావనలేదనియు, వారు సమష్టిగానున్నారని యెంచవచ్చుననియు, తీర్మానించియున్నారు(2). ఒక మెంబరు విడిపోయినప్పుడు, తక్కినవారు సమష్టిగానున్నారనిగాని, లేదా తక్కినవారు తిరిగి సమష్టిగానుండుటకు ఏర్పరచుకొనిరనిగాని చెప్పేయెడల, అట్లుచెప్పువారు ఆవిషయమును స్పష్ట

ఒకరుగాని కొందరుగాని విడిపోయినప్పుడు మిగిలినవారు సమష్టియా? వ్యష్టియా?

(1). 2 మ 83; 5 క 474; 15 పీ. రి. 200; 11 పీ. రి. 308; 27 ఇం. కే. (మ) 726; 17 ఇం. కే. (మ) 642; 20 పీ. రి. 197.

(2). 31 మ 482; 25 మ 149 (157); 9 క 817; 46 మ. లా. జ. 404.

ముగా బుజువుచేయవలయుననియు కొన్నితీర్మానములున్నవి(1). ఒక మెంబరు విడిపోయినప్పుడు తక్కిన వారందరును విడిపోవలయునను నియమమును లేదు. అట్లువిడిపోయిరని భావించుట న్యాయమే యైనను, ఆ భావన సాక్ష్యముచే మార్పుకావచ్చును. కావున, అందరును విడిపోయిరా? లేదా? యనునంశమును సాక్ష్యమునుబట్టి నిర్ధారణచేయవలయునని మ. హై. కో. తీర్మానించిరి(2). ఒకసమష్టికుటుంబములో రెండుమూడు శాఖలున్నప్పుడు ఆశాఖలు విడిపోయినను దానితోపాటు ఆశాఖలకున్నయుపశాఖలు అనగా, ఆతండ్రికిగలపుత్రులువిడిపోయినట్లు భావనచేయవీలులేదని తీర్మానములయినవి(3). ఒకమెంబరువిడిపోయినతోడనే కుటుంబమంతయు విడిపోయినట్లెంచవలయునని, మొదట బొంబాయి హైకోర్టువారు తలంచుచుండిరి(4). కాని దరిమిలాను ఆయభిప్రాయమును మార్చుకొనిరి(5). ఈవిషయమై ప్రి. వి. కౌన్సిలువారు ఏమిచెప్పినది యీక్రిందవివరింపబడును.

(1) 30. క. 231. ఒకమెంబరు కుటుంబమునుండి విడిపోవునప్పుడు మిగిలినమెంబర్లు కలిసియుండుటకు అభ్యంతరములేనట్లుగా, ఆతని భాగమును పంచియివ్వవచ్చుననియు, అట్టిసందర్భములలో ఆతడొక్కడే విడిపోయినట్లెంచవచ్చుననియు సూచించిరి. 50 ఇం. కే (అ) 357.

(2) 30. క. 725. ఈకేసులో ముగ్గురుసోదరులు, వారికి పిత్రార్జితమైనషాపు ఉండెను. అందొకడు రు 11000- లు పుచ్చు

(1). 30 క 284; 45 మ. లా. జ. 355; 121 ఇం. కే. (అ) 243; 40 క 823.
(2). 31 మ. లా. జ. 472.
(3). 48 మ. లా. జ. 236.
(4). 61 ఇం. కే. (బొం) 761.
(5). 100 ఇం. కే. (బొం) 147.

కొని వారితో విడిపోయి, వేరుగా ఒకషాపు పెట్టుకొనెను. మిగిలినమెంబర్లు కలిసియున్నారను భావన లేదనియు, వారు కలిసియున్నారనిగాని, లేదా తిరిగిసంసృష్టియైరనిగాని చెప్పిన ప్పుడు ఇతరవిషయములవలెనే యిదికూడ ఋజువుచేయవల యునని తీర్మానించిరి.

(3) 3౦. క. 733. ఈకేసులో పినతండ్రిపెదతండ్రిబిడ్డలు నల్గురు, వారు ఎవరెవరి కేభాగమువచ్చినదియు నిర్ధారణచేసికొనిరి. అందుకొందరు తమభాగములను కలసి యనుభవించుచుండిరి. అంతమాత్రముచేత వారుసంసృష్టియని యెంచవీలు లేదనియు, వ్యష్టియనియు తీర్మానించిరి. ఈతీర్మానమును బట్టి, తండ్రులు పంచుకొనినప్పుడు వారి కుమారులుకూడ తండ్రులతో పంచు కొనినట్లెంచరాదని యభిప్రాయమిచ్చిరి. 85 ఇం కే. (పి. కౌ.) 2.

(4) 74. ఇం. కే. 462. ఈకేసులో నలుగురుసోదరులు. వారు కుటుంబాస్తిని నాల్గుభాగములుగా చేసికొనిరి. ఒక్కరుమా త్రము తనభాగమును దీసికొని విడిపోయిరి. మిగిలినముగ్గురు తమవ్యాపారమును కలిసిచేసికొనుచుండిరి. కాని లాభనష్టము లను వేరువేరుకాతాలలో చూపుచుండిరి. ఇది వ్యష్టికుటుంబ మని తీర్మానించిరి.

(5) 83. ఇం. కే. 418. సోదరులిరువురు పంచుకొనిరి. ఇద్దర కును చెరియొకకుమారుడునుండెను. సోదరులపంపకమువలన, వారికుమాళ్లుకూడ తండ్రులతో పంచుకొన్నట్లెంచరాదని యు, అట్లెంచుట మితాక్షరధర్మశాస్త్రము వర్తించు హిందూ సమష్టికుటుంబధర్మములలో నొకప్రాథమికధర్మమును తెచ్చి

పెట్టుటయునియు చెప్పియున్నారు. 101 ఇం. కే. (ప్రి. కౌ.) 249.

(6) 87. ఇం. కే 333. సమష్టికుటుంబమెంబర్లలో నొకడు తన భాగమును లెక్కతేల్చి పంచుకొనుటకు హక్కుకలిగి యున్నాడనియు, వేరే తమలోతాము యగ్రిమెంటు చేసికొనవక్కరలేకుండ తక్కిన మెంబర్లు సమష్టిగానుండి సమష్టిగా ఆస్తిని అనుభవించుచుండవచ్చుననియు, అట్టిసందర్భములో, సమష్టియా? వ్యష్టియా? యని తగవువచ్చెనేని, కుటుంబములోనుండి విడిపోయిన మెంబరు, విడిపోయినపిమ్మటమిగిలిన మెంబర్లు తమవ్యవహారములను నిర్వహించుచున్న పద్ధతులను బట్టి వారు సమష్టిగానుండిరని యూహింపవచ్చుననియు, కాని ఆ విషయమును స్పష్టముగా ఋజువుచేయవలసియుండుననియు తీర్మానించిరి; 132 ఇం. కే (ప్రి కౌ.) 733 లో ఈవిషయమును మరియొకసారి స్పష్టపరచియున్నారు.

ప్రి. కౌ. వారితీర్మానముల ననుసరించి, తేలినవిషయములు:—

(1) ఒకరుగాని, కొందరుగాని విడిపోయినప్పుడు, తక్కిన మెంబర్లు విడిపోయిరని భావన లేదు. సమష్టిగానున్నారని భావనయును లేదు.

(2) తక్కిన మెంబర్లు విడిపోకుండ సమష్టిగానుండుటకై ఏమియును వ్రాసికొననక్కరలేకుండగనే సమష్టిగా నుండవచ్చును.

(3) ఒకరువిడిపోయినపిమ్మట తక్కినవారు విడిపోయినదియు లేనిదియు, వారిప్రవర్తనమును బట్టి యూహింపవచ్చును.

(4) ఒకరుగాని కొందరుగాని విడిపోయినప్పుడు తక్కినవారు విడిపోయిరనిగాని కలిసియున్నారనిగాని ఎవరువాదించెదరో వారు ఆవిషయమును ఋజువుచేయవలయును.

(5) ఇట్టి కేసులలో యేకేసున కాకేసు సందర్భములనుబట్టి తీర్మానింపవలసియుండును.

ప్రస్తుతమున హైకోర్టులన్నియును ఈవిధులను అనుసరించి తీర్మానించుచున్నవి(1).

తండ్రియును, ఇద్దరు కొమరుకుమాళ్లును కలుగు మైనర్లుయిద్దరును తండ్రిపైని దావాచేసి, తమ ⅔ వంతును విభజించుకొని స్వాధీనముచేసికొనిరి ఆవిభాగమువలన మైనర్లుయిద్దరును తమలోతాము కూడ విభజించుకొనినట్లెంచరాదనియు, అందొకడు చనిపోయినచో, సర్వైవరుషిప్పుద్వారా వానిభాగము రెండవవానికి వచ్చుననియు తీర్మానించిరి(2).

ముగ్గురుమెంబర్లు వాదులుగా చేరి విభాగముకొరకు దావాతెచ్చి, తమ ⅗ భాగమును పంచుకొనిరి. ఈడిక్రియొక్క ఫలితమేమి అని దరిమిలా హైకోర్టులో ప్రశ్నరాగా, ఈముగ్గురిలోను విభాగమైనదా లేదా యనువిషయము ఆడిక్రివలన నిర్ణయముకాలేదు కాని దరిమిలా చర్యలను విచారించి, వారిలో వారుకూడ విభాగము అయినట్లు స్థిరపరచిరి(3).

---

(1). 114 ఇం. కే. (అ) 881; 114 ఇం. కే. (మ) 229; 114 ఇం. కే. (బొం) 392; 140 ఇం. కే. (ఔ) 592; 143 ఇం. కే. (అ) 706; 143 ఇం. కే. (అ) 456; 100 ఇం. కే. (బొం) 147; 135 ఇం. కే. (నా) 283; 100 ఇం. కే. (ఔ) 689; 104 ఇం. కే. (ఔ) 315; 105 ఇం. కే. (ఔ) 337; 121 ఇం. కే. (ఔ) 882; 127 ఇం. కే. (బొం) 510; 1932 అ.లా.జ. 1018; 73 ఇం. కే. (లా) 281; 27 నా.లా.రి. 343; 1931 బొం 481; 134 ఇం. కే. (నా) 257; 1927 మ 792; 22 ఇం. కే. 134; 20 ఇం. కే. 562; 35 క. వీ. నో. 315; 51 క.లా.జ. 592; 66 ఇం. కే. (క) 765; 60 ఇం. కే. (మ) 690; 78 ఇం. కే. (అ) 828.

(2). 78 ఇం. కే. (మ) 927.

(3). 30 క (ప్రి.కౌ.) 231.

ముగ్గురుసోదరులలో ఒకరికుమారుడు ఇంకొకనికి దత్తతగా నివ్వబడెను. దత్తతతండ్రి చనిపోయినపిదప, జనకతండ్రి, దత్తుని, రెండవసోదరుని ప్రతివాదులనుగా చేర్చి విభాగముకొరకు దావా తెచ్చి రాజీపడిరి. అందులో సదరువిధముగా ముగ్గురమును రాజీపడి నాముగనుక యికముందు ఒకరినొకరు ఏవిధముగాను తగాదా చేయ కూడదు అని వ్రాసికొనిరి. దరిమిలాను దత్తుడు చనిపోయెను. దత్తుని భార్య దావా తెచ్చెను. జనకతండ్రి, తనతో దత్తుడు విడిపోలేదనియు, కోర్టుఫీజు తగ్గుటకై తాను దత్తుని ప్రతివాదిగా జేర్చితినే కాని, విడి పోలేదనివాదించెను. కాని ఆవాదము అంగీకరింపబడలేదు. వారు వ్యష్టియని తీర్మానించి భార్యకు డిక్రియిచ్చిరి(1).

ఒకమెంబరువిడిపోయినను, తక్కినవారు సమష్టిగానుండవచ్చు ననిమాత్రమే ప్రి. కౌ. వారు చెప్పినారు. కాని, అట్లుకావలెనచేయు డని చెప్పియుండలేదు(2).

ఒకమెంబరు దావా తెచ్చి తనభాగమునకుమాత్రము డిక్రిపొం దినకేసులో తక్కినమెంబర్లమధ్యకూడ విభజనమాయెనా లేదా యనువిషయము డిక్రిలో వ్రాయబడినసంగతులనుబట్టి నిర్ధారణమొన ర్పవలయును(3).

ఒకకుటుంబములో ఒకటికంటెఅధికశాఖలున్నప్పుడు, ఆశాఖ లుమాత్రము విడిపోయి, అంతటితో విభాగము వాపిచేసి ఒక్కొక

(1). 119 ఇం. కే. (మ) 247.
(2). 4 మూ. ఇం. అ 137; 11 మూ. ఇం. అ. 369; 8 క 198; 48 మ. లా. జ. 83.
(3). 43 ఇం. కే. (మ) 833; but see 50 ఇం. కే. (అ) 857.

శాఖలోని మెంబర్లు వారిలోవారు సమష్టిగానుండుట కభ్యంతరము లేదు(1).

ఒకడు, తనతండ్రిని, తనకుమారుని సమష్టిగానుంచి, తన భాగమునుమాత్రము విభజించుకొనుట కభ్యంతరము లేదు(2).

23. సమష్టికుటుంబాస్తిలో కొంతపంచుకొని, మిగతా ఆస్తి పంచుకొనకుండ సమష్టికుటుంబాస్తిగానే ఉంచుకొనుటకు యేర్పాటు చేసికొనవచ్చును. అట్టియేర్పాటున్నప్పుడు అది సమష్టికుటుంబాస్తిగానే అమలుజరుగును(3). వారిప్రవర్తనవలనకూడ అట్టియేర్పాట్లుకలవని యూహింపవచ్చును. ఈవిషయమున ఏకేసుయొక్క సందర్భములనుబట్టి ఆకేసులో అట్లు యూహింపవలసియుండును. ఈసందర్భములో పార్టీలయొక్క యుద్దేశమే ప్రధానము. మొదటి భాగమునాడు ఎట్టియేర్పాట్లనుచేసికొనిరో ఆయేర్పాట్లప్రకారమే జరుగును.

భాగ విభాగము.

కొంతఆస్తిని విభజించుకొన్నప్పుడు, తక్కినయాస్తిని మెంబర్లు విభజించుకొన్నట్లు భావన రాదు. కాని, సమష్టికుటుంబాస్తిగానుంచుకొనినారని వాదించువారు ఆయంశమును స్పష్టముగా రుజువు చేయవలయును(4).

సమష్టికుటుంబమెంబరు కొంతఆస్తిని విభజించుకొని, కొంత విభజించుకొనకుండ నున్నప్పుడు, విభజించుకొనకుండనున్నయాస్తికి వారు సమష్టిగా భావింపబడుదురని బొం. హై. వారు మొదట యభి

(1). 87 ఇం. కే. (బొం) 986; 29 అ 91.

(2). 53 ఇం. కే. (మ) 590.

(3). 11 మూ. ఇం. అ 75; 72 ఇం. కే (లా) 742; 45 మ 489.

(4). 68 ఇం. కే (పి. కా) 451.

ప్రాయపడిరి(1). కాని దరిమిలా కేసులలో వారాతీర్పును రద్దుచేసి, మొదటివిభాగము నాడే విభాగస్థితి యేర్పడుటచే, వారు విభజించుకొననియాస్తికి సమష్టిమెంబర్లు కారనియు, జాయింటుటెనెంట్సుగా నుండవలయునని యగ్రిమెంటు ఉండినచో తప్ప వారు ఆయాస్తికి సామాన్యభాగస్వాములగుదురనియు తీర్మానించిరి(2). వారు ఇండియన్ కాంట్రాక్టుఆక్టు ప్రకారమేర్పడిన భాగస్వాములు (Partners) కారని లా. హై. వారు తీర్మానించినారు(3).

సమష్టికుటుంబాస్తిని పంచుకొని, వారసత్వరీత్యా సంక్రమించినయాస్తిని పంచుకొనకుండనుంచుకొని అందుపైని వచ్చెడిమూదాయము సమానముగా కాకుండ హెచ్చుతగ్గుగా పుచ్చుకొనుచుండిరి. అయినను, ఆయాస్తిని పంచుకొనునప్పుడు, మొదటివిభాగములోని వాటాలరీతిని పంచుకొనవలయునని తీర్మానించిరి(4).

సమష్టికుటుంబమెంబర్లలో నొకడు తక్కినవారితో తగవులాడి, కొంతయాస్తిని స్వాధీనముచేసికొని, వేరుగా కాపురమున్నంత మాత్రమున విభాగస్థితియేర్పడినదని చెప్పిన జెప్పవచ్చును కాని, సంపూర్ణవిభాగమైనదని యెంచవీలులేదు. అయినను, చిరకాలము తదట్లేయుండి, యితరమెంబర్లు మిగిలినఆస్తిని స్వేచ్ఛగా అనుభవించుచున్నప్పుడును వినియోగములు చేసినప్పుడును, ఆతఁడు తీసికొనిన

(1). 18 బొం 611.

(2). 73 ఇం. కే (బొం) 869; 77 ఇం. కే (బొం) 914; 119 ఇం కే (బొం) 779; 121 ఇం. కే (బొం) 439; 73 ఇం. కే (లా) 894; 166 ఇం. కే (ఔ) 702; 180 ఇం. కే (క) 897; 59 ఇం. కే (బొం) 357; 54 బొం 616.

(3). 77 ఇం కే (లా) 532.

(4). 121 ఇం. కే 439.

యాస్తి ఆతనివిభాగమునకు తక్కువయని సాక్ష్యము లేనప్పుడును అది సంపూర్ణ విభాగమేయగును(1).

కొంతవిభాగముజరిగినదని అంగీకరించినప్పుడుగాని లేక రుజువుచేసినప్పుడుగాని సంపూర్ణవిభాగము జరిగినట్లే భావన వచ్చును. సమష్టికుటుంబాస్తికొంత ఆవిభాగములో చేరకుండ ఒకమెంబరు స్వాధీనములో నున్నదని వాదించువారు ఆవిషయమును రుజువుచేయవలయును(2).

కొంతఆస్తి విభజించుకొనినప్పుడు, మిగతాఆస్తి జాయింటుగా నున్నదని గాని, మొత్తమంతయు విభాగమైనదనిగాని భావన లేదు. భాగవిభాగము జరిగినదని రుజువైనప్పుడు తక్కినయాస్తినిగూర్చి అప్పుడేమి యుద్దేశింపబడియెనో సాక్ష్యమునుబట్టి తీర్మానింపవలసి యుండును(3).

కొంతఆస్తిని విభజించుకొనినపిమ్మట తక్కినఆస్తి ఒకమెంబరు స్వాధీనములో పండ్రెండు సంవత్సరములకు మించియున్నను ఆవిషయము తక్కినమెంబర్లకు స్పష్టముగా తెలిసియుండిననేతప్ప వ్యతిరేకభుక్తముచే స్వాధీనమును కలిగియున్నమెంబరునకు హక్కు పట్టదు(4).

---

(1). 77 ఇం. కే (బొ) 391.

(2). 55 మ 483; 76 ఇం. కే (లా) 852; 49 ఇం. కే (అ) 344; 12 పా. లా. టు. 582; 27 ఇం. కే (మ) 736; 31 ఇం. కే 674; 99 ఇం. కే (లా) 592; 109 ఇం. కే 714; 72 ఇం. కే (క) 680; 71 ఇం. కే (నా) 43; 70 ఇం. కే (మ) 748; 68 ఇం. కే (లా) 297; 32 మ 191; 88 ఇం. కే (పా) 1012; 85 ఇం. కే (మ) 52.

(3). 138 ఇం. కే (పా) 401.

(4). 114 ఇం. కే (మ) 387; 74 ఇం. కే (మ) 1018.

24. సమష్టికుటుంబమెంబర్లు తమలో తాము ఆస్తిని యెన్నడు పంచుకొనకుండ యేర్పాటుచేసికొనిరేని, వారిమధ్య అట్టియేర్పాటు చెల్లుననియు, కాని వారిపుత్రాదులకు బయిండు చేయనేరదనియు కలకత్తా, అలహాబాదు హై. కో. తీర్మానించినారు. అయితే అట్టియేర్పాటులో, వారివాటాలు యితరులకు వినియోగము చేయకూడదనికూడ వ్రాసికొనియుండిననేతప్ప, లేనిచో అందొకమెంబరు తనవాటాను వినియోగముచేసినప్పు డట్టివినియోగమును పొందినవాడు విభజించుకొనవచ్చును(1). సమష్టికుటుంబమెంబర్లు పంచుకొనకుండ యగ్రిమెంటు చేసికొనినను, వారినికూడ అదిబయిండు చేయదనియు ఆయగ్రిమెంటుకు వ్యతిరేకముగా పిమ్మట ఆస్తిపంపకమునిమిత్తము దావా చేయవచ్చునని బొం. హై. కో. తీర్మానించిరి(2).

ఆస్తినిపంచుకొనకుండ యగ్రిమెంటు.

ఇద్దరుసోదరులు విభజించుకొని, పురుషసంతానము లేకపోయినచో ఒకరియనంతర మొకరికి మృతశేషత్వధర్మముచే ఆస్తి సంక్రమింపవచ్చునని యేర్పాటుచేసికొనవచ్చును(3). కాని, తమయనంతరము వారసత్వ మెట్లు సంక్రమింపవలయునో దానిని నిర్ణయించుటకు వారికి హక్కు లేదు(4). కాలనియమము నేర్పరుపకుండ, ఆస్తిపంపకముచేసికొనరాదని మరణశాసనములో వ్రాసినను అది చెల్లనేరదు(5).

---

(1). 6 క 106; 28 క 769; 12 క.వీ.నో 793; 58 ఇం. కే (అ) 632; 33 ఇం. కే 33.

(2). 7 బొం 538; 110 ఇం. కే (బొ) 886; 42 అ 30.

(3). 33 అ 414; 8 క 138.

(4). 79 ఇం. కే (అ) 514.

(5). 77 ఇం. కే (క) 523; 15 క 409 (ప్రి.కౌ); 1 క 104.

సమష్టికుటుంబమెంబర్లు ఆస్తులను విభజించుకొని ఒక గ్రామము మాత్రము విభజించుకొనకుండ నుంచుకొని అందుపై వచ్చుఆదాయములో కర్త వద్దనుండి తనభాగమును పుచ్చుకొనుటకు ఖరారు చేసికొనిరి. పిమ్మట ఆగ్రామమును పంచియిమ్మని దావా తెచ్చెను. అట్లు పంచుకొనుటకు, ఆఖరారునామా ఆటంకపెట్టజాలదని మ. హై. కో. తీర్మానించిరి(1).

సమష్టికుటుంబమునకున్న ఇల్లును పంచుకొనునప్పుడు, ముందెప్పుడైన మెంబర్లలో నెవనికైనను కాపురముండుటకు యిష్టములేనిచో ఇంతసొమ్మునకు తక్కిన మెంబర్లకు యిచ్చివేయవలయునని వ్రాసికొన్నచో అది చెల్లును(2).

ముగ్గురుసోదరులు పంచుకొనుచు ఒకభాగమునకు బదులుగా సాలునకు అతనికి రు 100-0-0 చొప్పున యిచ్చుచుండవలయుననియు, అట్లివ్వకపోయినచో అతనిభాగము నాతడు రాబట్టుకొనవచ్చుననియు దస్తావేజు వ్రాసికొనిరి. సొమ్మియ్యలేదు. ఆసోదరుడు తన భాగమును మరలరాబట్టుకొనవచ్చునని తీర్మానించిరి(3).

తండ్రి కొంతద్రవ్యమునో, కొంతభూమినో, పుచ్చుకొనిగాని, లేదా తనకుజీవనాధారమునిమిత్తము సంవత్సరమునకు కొంతద్రవ్యము నిచ్చుచుండుటకు యేర్పరచుకొనిగాని, సమష్టికుటుంబాస్తిలోని తనభాగమును వదలుకొనినచో అంతటనుండియును తండ్రి సమష్టికుటుంబమెంబరుగా నెన్నబడడు. విభజించుకొనినవానివలెనే యెంచబడును(4).

---

(1). 25 మ 585.

(2). 25 మ 585.

(3). 47 మ. లా. జ. 605.

(4). 46 మ. లా. జ. 590.

ముగ్గురుసోదరులు పంచుకొనిరి. ఇందులో ఎవరికైనను పురుషసంతానము లేనియెడల, వారిపాటా పురుషసంతానమున్నవారికి చెందవలయునని, వ్రాసికొనిరి కాని అదిచెల్లదని తీర్మానించిరి(1)

25. సమష్టికుటుంబాస్తిలో భాగమునకు హక్కు కలిగియున్న వారిలో నెవరైనను తనభాగమును పంచియిమ్మని తక్కినవారిని కోరినప్పుడు అట్లు చేయరేని, ఆతడు విభాగముకొరకు దావా చేయవచ్చును(2).

విభాగము కొరకు ఎవరు దావా చేయవచ్చును.

మైనరుతరఫున విభాగముకొరకు దావాచేయవచ్చునా? కూడదా ? యనువిషయము 6 వ పేరాలో తెలుపబడినది. కావున అచ్చట చూడవలయును. సమష్టికుటుంబాస్తిలోని యొకభాగమునుగాని, యొకని భాగమునుగాని కోర్టువేలములోగాని క్రయివేటుగాగాని కొన్నక్రియదారు దావా తేవచ్చునా ? అనువిషయము 8 వ పేరాలో చర్చింపబడినది. మఱియు, 180-186 పేజీలనుకూడ చూడవలయును.

సమష్టికుటుంబాస్తియొక్క భుక్తమునుండి తొలగింపబడిన మెంబరు అట్లు తొలగింపబడిన 12 సంవత్సరములలోపున దావా తేవలయును. లేనిచో కాలదోషము పట్టును.

విభాగపుదావాలో మైనరుకుమూళ్ళతరఫున తండ్రి గార్డియనుగానుండి పనిచేయవచ్చును. తండ్రికికూడ భాగముండునుకదాయని మైనర్లకు వ్యతిరేకమైనలాభము తండ్రికి కలదని చెప్పకూడదు(3).

ఒకమెంబరు కొంతఆస్తిని యితరునకు విక్రయించినప్పుడు తక్కినమెంబర్లు ఆయాస్తిలోనితమభాగములను విభాగించి వేరుచేయుటకొరకు ఆక్రియదారునిపైని దావా తేవచ్చును.

(1). 117 ఇం. కే (పా) 38.

(2). 18 క 157.

(3). 87 ఇం. కే (మ) 42.

విభాగపు దావాలో ఎవరెవరు పార్టీలుగా నుండవలయును?

26. విభాగముకొరకు తేబడు దావాలలో యీ క్రిందివారు ప్రతివాదులుగా నుండవలయును.

(1). సమష్టికుటుంబాస్తియందు అప్పుడు భాగమును పొందుటకు హక్కు కలిగియున్న సమష్టికుటుంబ మెంబర్లు అందఱును. (12 పి. రి. 256)

(2). అవిభక్తభాగమును కొన్న క్రయదార్లును తనఖాపట్టిన తనఖాదార్లును.

(3). పోషణకుగాని వివాహవ్యయమునకుగాని హక్కు కలిగియున్న స్త్రీలు.

(4). బొంబాయి మొదలగు రాష్ట్రములలో భాగమునకు హక్కు కలిగియున్న భార్య, తల్లి, తండ్రితల్లి, (మద్రాసు రాజధానిలో అక్కరలేదు.)

తండ్రియును కుమాళ్లును పంచుకొనునప్పుడు ఆకుమారుల కుమారులు పార్టీలుగా నుండనక్కరలేదు పార్టీలుగా చేర్చినను తప్పులేదు(1).

కుటుంబమెంబర్లలోగాక ఇతరులతో విభాగము చేసికొనునప్పుడు, సమష్టికుటుంబమునకు తరపున కర్త లేక తండ్రి పార్టీగా నుండెనేని, వారిపుత్రపౌత్రాదులు పార్టీలుగా నుండనక్కరలేదు(2).

రెండుశాఖలు విభజించుకొనునప్పుడు ఆయాశాఖలలోనున్న యజమానులు (heads) పార్టీలుగా చేరినచాలును. ఆయాశాఖలలో నున్నట్టివారిపుత్రపౌత్రులు చేరనక్కరలేదు(3).

---

(1) 67 ఇం. కే (పా) 156.

(2). 124 ఇం. కే (సిం) 377.

(3). 141 ఇం. కే (లా) 45, 567; 121 ఇం. కే (పా) 830.

విభాగపుదావాలలో ఋణదాతలు పార్టీలుగాచేరి తమబాకీల తీర్మానముకొరకు ఆస్తిపైని రిసీవరును అప్పాయంటు చేయించవచ్చును(1).

వాది విభాగమునకు దావాతెచ్చినప్పుడు ఒకప్రతివాది తక్కినప్రతివాదులతో తనభాగమును విభజింపుమని కోరవచ్చును(2).

విభాగపుదావాలలో ఆస్తియంతయునుచేరవలయునా? కొంతకుదావా తేవచ్చునా?

27. విభాగముకొరకు తెచ్చెడిదావాలలో అప్పటికి కుటుంబమునకున్నయావదాస్తియును అప్పులును చేరవలయును. కొంతఆస్తికి దావాతెచ్చి కొంత విడిచిపెట్టబడరాదు(3).

పొరబాటునగాని, మరచిపోవుటవలనగాని,దగావలనగాని ఏదేని కొంతఆస్తి మొదటిదావాలోచేరనిచో, దానివిభాగముకొరకు మరల దావాతేవచ్చును(4) మొదటి విభాగము రద్దుచేయనక్కరలేదు.

కొంతఆస్తివిభాగమునకుమాత్రమే తెచ్చినదావా కొట్టివేయబడవలయును(5).

సమష్టికుటుంబాస్తిలో కొంతభాగమును కోర్టువేలములోగాని ప్రయివేటుగాగాని కొన్నక్రియదారుడు మొత్తమువిభాగమునకు

(1). 119 ఇం. కే (నా) 687.

(2). 61 ఇం. కే 596.

(3). 85 ఇం. కే (మ) 508; 35 ఇం. కే 370; 14 క 122; 77 ఇం. కే (క) 790; 1929 (జో) 162; 16 మ 97; 35 ఇం. కే 545; 131 ఇం. కే (లా) 209; 23 బొం 144; 12 క 566; 7 బొం 272.

(4). 138 ఇం. కే (నా) 186; 98 ఇం. కే (మ) 538; 40 అ 374; 12 క. వీ. నో. 127; 13 క. వీ. నో. 309; 46 ఇం. కే 226; 110 ఇం. కే (క) 60.

(5). 120 ఇం. కే (లా) 544; 141 ఇం. కే (లా) 434.

దావా తేవలయునా? కొన్న ఆస్తికొరకు విభాగపుదావా తేవలయునా? అనువిషయమునుగూర్చి ఆరవప్రకరణములో తెలుపబడినది(1). కావున అచ్చట చూడవలయును.

దావాలో మొట్టమొదట ఆస్తియంతయును పొరబాటున చేర్చకపోయినను ప్లయింటును సవరించుటమూలముగా ఆస్తినంతనుచేర్చవచ్చును(2) కానికొంతఆస్తికి దావాతెచ్చి తక్కినదానికి ముందు విభాగపుదావా తెచ్చుకొనబడునని వ్రాసినను ఆదావా చెల్లదు(3).

వాది ప్లయింటులో చేర్చకుండవిడిచిపెట్టిన ఆస్తులను ప్రతివాది స్టేటుమెంటులో తెలుపవలయును. అట్లు తెలుపనియెడల వాదిదావా కొట్టివేయకూడదు(4).

కొంతవిభాగమైనపిమ్మట, మిగిలినసమష్టిఆస్తికి వారు సామాన్యభాగస్వాములగుదురు. కావున కేసు వేరుగా దావాచేయవచ్చును(5).

సమష్టికుటుంబము, యితరులతో భాగస్వామిగానున్నప్పుడును, కొందరుమెంబర్లుమాత్రమే కొంతయాస్తియందు హక్కును కలిగియున్నప్పుడును ఆయాస్తులకుమాత్రము ప్రత్యేకముగా దావా తేవచ్చును(6).

సమష్టికుటుంబములోనియొక మెంబరు కొంతఆస్తిలోని తన భాగమును విక్రయించినప్పుడు తక్కినమెంబర్లు ఆయాస్తిలోని తమ

(1). 181, 182, 183 పేజీలు; 14 క 122; 16 మ 98.

(2). 1 పా. లా. జ. 693; 117 ఇం. కే (బొ) 412; 85 ఇం. కే 370; 58 ఇం. కే 276; 25 మ 867; 14 క 122; 825.

(3). 1927 మ 218.

(4). 1929 బొ 257=118 ఇం. కే 87; 58 ఇం. కే 275 (అ)

(5). 119 ఇం. కే (బొం) 779.

(6). 34 మ 269; 14 ఇం కే 524; 28 బొం 597.

వాటాలను పంచియిమ్మని దావా తేవచ్చును(1). అవిభక్తభాగమును కొన్నక్రియదారుకూడ తక్కినమెంబర్లు అభ్యంతరము చెప్పకపోయినచో తాను కొనినయాస్తిలోని తనభాగమునకు వేరుగా దావా తేవచ్చును.

వేరు వేరు జ్యూరిస్‌డిక్షనులలో నున్నయాస్తులన్నిటిని ఒకే దావాలో చేర్చనక్కర లేదు. ఆయాకోర్టులలో వేరువేరుగా దావాలు చేసికొనవచ్చును(2).

మొదటి విభాగములో కొంతఆస్తి చేరలేదని దావా తెచ్చునెడల, ఆసంగతిని స్పష్టముగా వాదియే రుజువు చేయవలయును(3).

సమష్టికుటుంబము, యితరులతో జాయంటుగా కొంత ఆస్తిని కలిగియున్నప్పుడు ఆయాస్తిని వాది మొత్తపు విభాగపుదావాలో చేర్చనక్కర లేదు. ఆయాస్తికొరకు వేరుగ దావా తెచ్చుకొనవచ్చును(4).

కుటుంబముతాలూకు ఆస్తి కొంత అక్రమముగా యితరుల స్వాధీనములో నున్నప్పుడు, దానిని విడచిపెట్టి మిగిలినదానికి విభాగపుదావా చేయవచ్చును. విడిచిపెట్టినదానినిగూర్చి మరల దావా తెచ్చుకొనవచ్చును(5).

---

(1). 28 అ 50; 19 మ 267; 22 ఇం. కే 44.

(2). 82 ఇం. కే 428; 77 ఇం. కే (క) 790; 28 మ 216; 74 క 885; 22 బొం 922.

(3). 71 ఇం. కే 48; 72 ఇం. కే (క) 680.

(4). 46 ఇం. కే 255; 1923 క 501; 84 మ 269; 15 మ 284.

(5). 28 బొం 597; 134 ఇం. కే (సిం) 895; 7 బొం 272.

కుటుంబముతాలూకు కొంతఆస్తి తనఖాలో నున్నప్పుడు, అది గాక మిగిలినఆస్తికి దావా తేవచ్చును. తనఖా వదలినపిమ్మట ఆయాస్తికి మరల దావా తేవచ్చును(1).

నిలవయున్న సొమ్మును పంచిపెట్టించుమని తెచ్చినదావాలో భాగవిభాగమని శంకింపకుండ ప్రి. కౌ. వారు నిలవసొమ్మును విభజించి తక్కిన యాస్తుల విభాగవిషయమై తరువాత విభాగములో నిర్ణయింపవలయునని తీర్మానించినారు(2).

విభాగపుదావాలలో ఖర్చులు.

**28.** విభాగపుదావాలలో దావా దాఖలు అగుట కయ్యేడి ఖర్చులుమాత్రము పార్టీలు అందరును సమానముగా వహింపవలయును. తక్కిన ఖర్చులను ఎవరివి వారే వహింపవలయును. ఇది ప్రధానసూత్రము(3).

విభాగపుదావాలలో ప్రిలిమినరీ డిక్రి యగునంతవరకును ఎవరి ఖర్చులను వారే భరింపవలయునని పాట్నా, కలకత్తా హైకోర్టులు తీర్మానించినవి. వాది విభాగము చేయుమని ప్రతివాదుల నడిగినప్పటికి వారు అంగీకరించలేదనేకారణముమీద ప్రతివాదులను ఖర్చులను భరించుమని చెప్పుట న్యాయముకాదు(4).

---

(1). 23 మ 608; 12 బొం. హై. రి. 148.

(2). 55 క 944.

(3). 77 ఇం. కే (బొం) 914.

(4). 125 ఇం. కే (పా) 129; 34 క 878; 28 ఇం. కే (క) 446; 6 ఇం. కే (..) 100

**29.** ఏవరెవరి కెంతెంత భాగము రావలసియుండు ననువిష యమున స్మృతివచనము లివి:—

భాగనిర్ణయవిష యమున స్మృతి వచనములు.

అనేక పితృకాణాంతు పితృతో భాగకల్పనా ।
విభజేరం త్సుతాః పిత్రో రూర్ధ్వం రిక్థ మృణం సమం॥
భూర్యా పితామహోపాత్తా నిబంధో ద్రవ్య మేవవా।
తత్రస్యా త్సదృశం స్వామ్యం పితుః పుత్రస్య చైవహి॥

పినతండ్రులు పెదతండ్రులు గలవారికి తండ్రులభాగప్రకారముగా భాగముయొక్క యేర్పాటు చేయవలయును. తల్లితండ్రుల యనంతరమునందు కుమారులు ఆస్తిని ఋణమును సమముగా విభజించుకొనవలయును. పితామహులచేత సంపాదింపబడినభూమి, సువర్ణాదిద్రవ్యము, మిరాసి, వీటియందు తండ్రికిని కుమారునకును సమానముగా హక్కు అగుచున్నది.

యాజ్ఞ్యవల్క్యులు.

ఇదానీం పైతామహే పౌత్రాణాం విభాగే విశేష మాహ॥ యద్యపి పైతామహే ద్రవ్యే పౌత్రాణాం జన్మనా స్వత్వం పుత్రైర్విశిష్టం తథాపి తేషాం పితృద్వారేణైవ పైతామహద్రవ్యవిభాగకల్పనా। నస్వస్వాపేక్షయా। ఏతదుక్తం భవతి. యదా అవిభక్తాభ్రాతరః పుత్రానుత్పాద్య దివంగతా స్తత్రైకస్య ద్వౌపుత్రా వన్యస్య త్రయోఽపరస్య చత్వార ఇతి పుత్రాణాం వైషమ్యే తత్ర ద్వావేకం స్వపిత్ర్యంశం లభేతాం। అన్యే త్రయో ప్యేక మంశం పిత్ర్యం చత్వారో ప్యేకమేవాంశం పిత్ర్యం లభంత ఇతి. తథా కేషుచి త్పుత్రేషు ధ్రియమాణేషు కేషుచి త్పుత్రా నుత్పాద్య వినష్టేష్వ ప్యయమేవ న్యాయం. ధ్రియమాణా స్స్వాంశాన్ లభంతే వినష్టానామపి పుత్రాః పిత్ర్యా నేవాంశాన్ లభంత ఇతి॥

పితామహద్రవ్యమందు పౌత్రులకు విభాగవిషయమున విశేష
ము చెప్పుచున్నాడు. పితామహద్రవ్యమందు పౌత్రులకు జన్మము
చేతనే హక్కుకలుగుచున్నదని చెప్పబడినది ఆద్రవ్యవిభాగము
యొక్క యేర్పాటు తండ్రిద్వారాగామాత్రమే చేయవలయునుగాని,
పౌత్రులనుబట్టి కాదు. అనగా అన్నదమ్ములు విభాగము చేసికొనక,
గతించినపక్షమందు వారిలో నొకనికొక్క కొడుకును, మరియొకని
కిద్దరు కొడుకులును, ఇంకొకనికి ముగ్గురు కొడుకులును ఇంకెందరు
కొడుకులు ఉండినను, వారు తమతమ తండ్రియొక్క యొకభాగమునే
పొందుదురు. కాని తమసంఖ్యకు సరియైన భాగములను పొందజాలరు.
అన్నదమ్ములలో కొందరు జీవించియుండి కొందరు మృతులైనపక్ష
మందు, జీవించియుండువారును గతించినవారి పుత్రులును జేరి పంచు
కొనునపుడు జీవించియుండువారు తమతమభాగములను మృతులైన
వారిపుత్రులు తమతండ్రిభాగమును పొందుదురని తాత్పర్యము.

వ్యా॥ అధునా విభక్తే పితర్యవిద్యమానభ్రాతృకే నా
పౌత్రస్య పైతామహే ద్రవ్యే విభాగో నాస్తి, ధ్రియమాణే పితరి పితృ
తో భాగకల్పనేత్యుక్తత్వా ద్భవతు నామ స్వార్జితవత్పితురిచ్ఛయైవేత్యా
శంకిత ఆహ। భూరితి॥ భూశ్శాలిక్షేత్రాదికా, నిబంధ ఏకస్య పర్ణభార్య
స్యేయంతి పర్ణాని తథైకస్య క్రముకఫలభార స్యేయంతి క్రముకఫలా
నీత్యాద్యుక్తలక్షణః, ద్రవ్యం సువర్ణరజతాది యత్పితామహేన ప్రతి
గ్రహవిజయాదిలబ్ధం తత్ర పితుః పుత్రస్యచ స్వామ్యం లోకప్రసిద్ధ
మితికృత్వా విభాగోస్తి, హి యస్మాత్తత్సదృశం సమానం తస్మాన్న
పితురిచ్ఛయైవ విభాగో నాపి పితుర్భాగద్వయం. అతశ్చ పితృతో
భాగకల్పనే త్యేతత్స్వామ్యే సమేపి వాచనికం-విభాగంచే త్పితాకు
ర్యా దిత్యేత త్స్వార్జితవిషయం-తథా ద్వావంశౌ ప్రతిపద్యేత విభజ
న్నాత్మనః పితే త్యేతదపి-స్వార్జితవిషయం జీవతో రస్వతంత్రస్స్యా జర

యాపిసమన్విత- ఇత్యేతదపి పారతంత్ర్యం మాతాపిత్రార్జిత ద్రవ్యవిషయం-తథా అనీశా స్తే హిజీవతో రిత్యేతదపి-తథాచ-పరజస్కాయాం మాతరి సస్పృహేచ పితరి విభాగ మనిచ్ఛత్యపి పుత్రేచ్ఛయా పితామహద్రవ్య విభాగో భవతి-తథా అవిభక్తే నపిత్రా పైతామహేద్రవ్యే దీయమానే విక్రీయమాణేవా- పౌత్రస్య నిషేధేప్యధికారః పిత్రార్జితేతు ననిషేధాధికార స్తత్పరతంత్రత్వాదనుమతి స్తుకర్తవ్యా-తథాహి పైతృకే పైతామహేచ స్వామ్యం యద్యపి జన్మనైవ-తథాపి-పైతృకే పితృపరతంత్రత్వా త్పితుశ్చార్జకత్వేన ప్రాధాన్యా త్పిత్రాదినియుజ్యమానే స్వార్జితద్రవ్యే పుత్రాణా మనుమతిః కర్తవ్యా-పైతామహేతు ద్వయో స్స్వామ్య మవిశిష్టమితి నిషేధాధికారో ప్యస్తీతి విశేషః- మనురపి-పైతృకంతు పితాద్రవ్య మనవాప్తం యదాప్నుయాత్। న తత్పుత్త్రై ర్భజేత్సార్ధ మకామ స్స్వయమార్జిత మితి- యత్పితామహార్జితం కేనా ప్యపహృతం పితామహే నానుద్ధృతం యది పితోద్ధరతి తత్ స్వార్జితమేవ పుత్రై స్సార్ధమకామ స్స్వయంనవిభజే దితివద్ధ పితామహార్జిత మకామోపి పుత్రేచ్ఛయా పుత్రైస్సహ విభజే దితి దర్శయతి॥

తా॥ తండ్రివిభాగప్రకారము పితామహద్రవ్యమును పౌత్రులు పొందవలయునని చెప్పుటచేత తండ్రి విభక్తుడయిగాని భ్రాతలు లేనివాడయిగాని యున్నపక్షమున దతడు జీవించియుండగాఁ బైతామహద్రవ్యమందుఁ బౌత్రునకు విభాగము లేదనియు స్వార్జితమందువలెఁ దండ్రియిచ్ఛచేత విభాగము కలుగవలయుననియు శంకకలుగగా దత్పరిహారము చేయబడుచున్నది. పితామహుడు సంపాదించిన భూమి, మిరాసిద్రవ్యము, వీనియందు బౌత్రునకుఁ దనతండ్రితోడ సమానమైన స్వామ్యముగలదు గనుక దండ్రికి

పితామహద్రవ్యమునందు పౌత్రునకుఁ దన తండ్రితో సమానమైన స్వాతంత్ర్యము గలదు.

విభాగేచ్ఛ లేకున్నను విభాగము కలుగును. తండ్రి యిచ్ఛచేత బుత్రులకు విభాగము చేయవలయుననునదియు, విభజించుకొనునపుడు తండ్రి రెండు భాగములఁ బొందుననునదియు, తల్లిదండ్రులు జీవించియుండునపుడు కొడు కెంతవయస్సు వెళ్లినవాఁడైనను స్వతంత్రుడుగాడనునదియు తండ్రియొక్క స్వార్జితద్రవ్యవిషయము కాబట్టి తల్లికి ముట్టుడుగకయున్నను, తండ్రి ద్రవ్యస్పృహగలవాఁడైయున్నను, విభాగము నిచ్ఛగింపక యుండినను, పుత్రుడు ఇచ్ఛగించుటచేతనే పితామహద్రవ్యమందు విభాగము కలుగును. అట్లే విభక్తుడైన తండ్రి పితామహార్జితద్రవ్యమును దానముగాని విక్రయముగాని చేయునపుడు పుత్రునకు నిషేధింప నధికారము గలదు. తండ్రి స్వార్జితద్రవ్యమును దానవిక్రయాదులు చేయునపుడు పుత్రునకు నిషేధింప నధికారము లేదు. కనుక అట్టివిషయమై అనుమతింపవలయును. మనువచనమందు బిత్రుక్రమాయాతమయి యన్యాక్రాంతమయిన దానినుద్ధరించిన తండ్రి కది స్వార్జితమగుచున్నది గనుక నతని కిష్టములేనిపక్షమందు దానిఁ గొడుకులకుఁ బంచి యీయనక్కరలేదనియున్నది గనుకఁ బితామహార్జితమునందు ఇష్టము లేకున్నను గొడుకులు కోరినపుడు పంచి యీయవలయుననియే తెలియవచ్చుచున్నది.

30. సమష్టి కుటుంబమెంబర్లు విభజించుకొనునప్పుడు ఎవరెవరి కెంతవాటా రావలయును అను విషయమున నీదిగువ నిబంధనలను గమనింపవలయును.

భాగ నిర్ణయము.

(1). తండ్రియును కుమారులును పంచుకొనునప్పుడు ప్రతికుమారుడును తండ్రితో సమానవాటాకు హక్కు కలిగియుండును. ఒకనికి నలుగురు కుమారులున్నారనుకొనుడు అప్పుడు ఆస్తి

అయిదు పాలాలుగా చేయబడి, తండ్రికొక పాలాయును కుమారులకు తలకొక పాలాయును వచ్చును

క, తండ్రి. చ, ట, లు కుమారులు. త, చ, యొక్క కుమారుడు. ప, ట, యొక్క కుమారుడు. కుటుంబమాస్థితిలో నున్నప్పుడు, ఆ స్తిని మూడుభాగములు చేసి క, చ, ట, లు ముగ్గురును తలయొక భాగమును దీసికొనవలయును. చ, యొక్క మూడవవంతులో సగము, త, కును; ట యొక్క మూడవవంతులో సగము ప, కును వచ్చును. ఇట్లే మిగతా విషయములను ఊహించుకొనవలయును.

(2). సోదరులు విభజించుకొనునప్పుడు, అందరును సమానముగా హక్కుకలిగి యుందురు. జ్యేష్ఠునకు ఉద్ధారాంశము (జ్యేష్ఠ భాగము) నీయవలయునని చాల స్మృతులలో చెప్పబడియున్నది. కాని యిప్పుడు న్యాయస్థానములలో జ్యేష్ఠభాగము నిప్పించుట లేదు. వారిలో వారు ఇచ్చినను అది మైనరును బయిండు చేయదు(1). జ్యేష్ఠభాగమునకు హక్కు లేదనికూడ తీర్పులున్నవి. అందుచే ఆస్మృతుల నిట నుదాహరించలేదు. అగ్రజునకు? చినవానికి రెండు భాగముల నిచ్చుపద్ధతియు నమలులో లేదు.

(3) ఒకకుటుంబవృక్షమున, ఒకటికంటె నెక్కువ శాఖాకుటుంబము లున్నప్పుడును, వాటికి ఉపశాఖాకుటుంబములున్నప్పుడును తండ్రులనుబట్టి భాగము తేర్పడుచుండును. కాని మెంబర్ల సంఖ్యనుబట్టి భాగము తేర్పడవు.

ఉదా:—ఒక కుటుంబమున ముగ్గురు సోదరులున్నారనుకొనుడు. మొదటివానికి ఒకకుమారుడును, రెండవవానికి ముగ్గురుకు

(1). 71 ఇం. కే (మ. ఫు. బెం.) 177; 57 ఇం. కే (మ) 18; 47 ఇం. కే (మ) 716

మారులును, మూడవవానికి నల్గురుకుమారులును ఉన్నారను కొనుడు. తండ్రులనుబట్టి ఆ స్తిని మూడుభాగములనుచేసి మొదటివానికుమారున కొకవాటాయును, రెండవవానికుమా ళ్లు ముగ్గురును కలిసి యొకవాటాయును, మూడవవానికుమా ళ్లు నల్గురును కలసి యొకవాటాయును పుచ్చుకొనవలయును గాని, ఆ స్తిని ఎనిమిదివాటాలుగా చేసి తలయొకవాటాయును పుచ్చుకొనకూడదు. ఈరూలు, సమష్టికుటుంబా స్తిని పంచు కొనునప్పుడే వ ర్తించును. కాని, వారసత్వముచేవచ్చిన సప్ర తిబంధదాయము మొదలగువాటికి ఈరూలువ ర్తించదు. దౌహి త్రులకును ఇది వ ర్తించదు.

(4). సమష్టికుటుంబమెంబర్లలో ఒకడు చనిపోయెనేని అతనిభాగ ము ఆతనికి పుత్రసంతతి యుండెనేని, ఆపుత్రసంతతిలో లీనమ గును. పుత్రసంతతి యనగా పుత్రపౌత్రప్రపౌత్రులని యర్థము. మూడుతరములకుపిమ్మట ప్రప్రపౌత్రులు మొదలగువారు మాత్ర మిందులో చేరరు. అట్టిపుత్రసంతతిలేనప్పు డాతనిభా గము తక్కినమెంబర్లలో లీనమగును.

(5). ద త్తస్వీకారమైనపిదప ఔరసుడు జన్మించెనేని, కుటుంబా స్తి యందు ఒక ఔరసున కెంత భాగమువచ్చునో, ఆభాగములో నాల్గవవంతు దత్తునకు వచ్చును. ఎట్లనగా:—క 'తండ్రి' చ. దత్తుడు. ట త, లు ఔరసపుత్రులు వీరందరును విభజించు కొనునెడల, ఆ స్తిమొ త్తములో పదుమూడవవంతు దత్తునకు వచ్చును. క, చనిపోయినపిమ్మట విభజించుకొనిరేని, దత్తు నకు తొమ్మిదవవంతువచ్చును. ఈనియమము బ్రాహ్మణక్షత్రి యవైశ్యులకు మాత్రమే వ ర్తించును. శూద్రులలో మాత్ర ము దత్తుడు తండ్రితోను ఔరసపుత్రులతోను సమభాగము

నకు వాక్కు కలికియుండును (1) అయితే దత్తపుత్రుని ఔరసునిగా నెంచినచో ఎంతభాగము ఏర్పడునో అందులో నాల్గవవంతుమాత్రమే దత్తునకు వచ్చునని యొకవాదమున్నది. ఆవాదము ననుసరించినచో పైనచెప్పిన కేసులో పదుమూడవవంతునకు బదులుగా పదునారవవంతును తొమ్మిదవవంతునకు బదులుగా పండ్రెండవవంతును వచ్చును. దాసీపుత్రుల నుగూర్చి ప్రి. కౌ. వారు 71 ఇం. కే. 643 లోను, మ. హై. వారు 48 మ 1 లోను చెప్పిన వాక్యములు దత్తపుత్రునకుకూడ వర్తింపచేసిరేని, యీవాదము న్యాయమైనదే యగును. ఈ వాదమునకు మితాక్షరిలోనే యాధారమున్నది. భాగమును లెక్కకట్టుటకై స్మృతులకర్థము తీయుటలో నీభేదము వచ్చును. అయినను,

(6). దాసీపుత్రులును ఔరసపుత్రులును గలకుటుంబములో ఒక ఔరసపుత్రునకెంతభాగము వచ్చునో, అందులో సగము భాగము దాసీపుత్రునకు వచ్చును. తండ్రి జీవించియుండగా దాసీపుత్రుడు భాగమును కోరజాలడు. కావున నిచ్చుట తండ్రిఇష్టము ప్రస్తావింపబడలేదు. ఈభాగమును ఎట్లులెక్క కట్టవలయునో ఉదాహరణగా చూపబడును.

ఉదా:—ఒక కుటుంబములో ఒక ఔరసుడును ఆరుగురుదాసీపుత్రులును గలరు. ఆరుగురను ఔరసులనుగానే భావింపవలయును. అప్పుడు, ఆస్తి 7 వాటాలగును. అందులో సగమనగా ఒక్కొ

(1). 32 ఇం. కే (ప్రి.కౌ.) 418; 61 ఇం. కే (ప్రి.కౌ.) 690; 49 బొం 672; 17 బొం 100. 43 మ 398; 55 ఇం. కే (మ) 371; 31 ఇం. కే (మ) 574; 38 ఇం. కే (మ) 244; 89 ఇం. కే (బొం) 984.

కనికి $\frac{1}{14}$ వచ్చును. అనగా దాసీపుత్రులందరికిని కలిపి $\frac{3}{7}$ వంతును ఔరసునకు $\frac{4}{7}$ వంతును వచ్చును(1).

ఒక కుటుంబమున రెండుమూడు శాఖలున్నప్పుడు ఒకశాఖలోని యొకమెంబరు తనభాగమును పంచుకొనిపోయినపిదప తక్కిన అన్నిశాఖలలోని మెంబర్లందరును సమష్టిగానుండి మరికొంతకాలమునకు వారు విభజించుకొను సందర్భమున మొదటవిభజించుకొనిన వానివాటా లెక్కలోనికి తీసికొని ఆశాఖకు ఆవాటాపోగా మిగిలినదే పంచిపెట్టవలయునా? లేక ఆవాటా లెక్కలోనికి తీసికొననక్కరలేదా? అనువిషయమున బొంబాయి మదరాసు హైకోర్టులలో భిన్నాభిప్రాయములున్నవి.

విభాగపుదావా తేదీనాటికి కుటుంబముయొక్క స్థితిననుసరించి యుండవలయుననునది ప్రధానసూత్రము. అయితే ఈసూత్రము మొదటివిభాగమునకే అన్వయించునుకాని రెండవవిభాగమున కన్వయించదని మదరాసువారి యభిప్రాయము. రెండువిభాగములకును అన్వయించునని బొంబాయివారియభిప్రాయము.

ఉదా:—ఒకకుటుంబమున క, చ, ట, యను మూడుశాఖలున్నవి. అందు ట, యను శాఖలో నల్గురు మెంబర్లున్నారు. అందొకడు తన $\frac{1}{12}$ వంతు విభజించుకొనిపోయెను. తక్కినవారందరును సమష్టిగా నుండిరి. మరికొంతకాలమునకు వారు విభజించుకొనుచుండిరి. అప్పటికున్నయాస్తిని మూడుశాఖలును సమానముగా పుచ్చుకొనవలయునని బొం. హై. వారియభిప్రాయము(2).

---

(1). 48 మ 1.

(2). 30 ఇం. కే (బొం) 918.

ట, కు రావలసిన $\frac{1}{3}$ లో, అదివరకు తీసికొనిన ౼ పోగా మిగిలిన $\frac{1}{4}$ వంతు ట, శాఖకును $\frac{3}{8}$ క, శాఖకును $\frac{3}{8}$ చ, శాఖకును వచ్చునని మ. హై. వారియభిప్రాయము(1).

**31.** సమష్టికుటుంబాస్తియందు తనకు భాగమక్కర లేదని ఏమెంబరయినను వదలివేయునెడల ఆతని భాగము తక్కిన మెంబర్లందరకును చెందునని యిదివరలో చెప్పబడినది(2). తక్కిన మెంబర్లందఱకొరకును తన భాగము నీయగలిగినప్పుడు అందు ఒకనికిగాని కొందరకుగాని తన భాగము నిచ్చుట కేలయభ్యంతరముండునని మొంచి మ. హై. వారొక కేసులో అట్లీయవచ్చునని తీర్మానించినారు(3). కాని ఒక మెంబరు తనవాటాహక్కును వదలుకొనుటకును తనభాగము నింకొకనికిచ్చుటకును భేదమున్నది. ఇచ్చుటయనినతోడనే అది దాన మనిపించుకొనును. సమష్టికుటుంబమెంబరు తనయవిభక్తభాగములోని యేభాగమును దానమీయజాలడని యిదివరలో చెప్పియే యున్నాము(4).

భాగమును వదలుకొనుట విషయమై — భాగమును వదలుకొనినవాని విషయము.

భాగమును వదలుకొనుట విషయమై స్మృతివచన మిది.

"శక్తస్యానీహమానస్య కించిద్దత్వా పృథక్క్రియా॥"

ఆర్జనశక్తిగలిగి భాగమందిచ్ఛలేనివానికి కొంచె మిచ్చి విభాగము చేయవచ్చును.

యాజ్ఞ్యవల్క్యస్మృతి.

---

(1). 5 మ 362; 58 మ (పు. బెం) 1.

(2). 179 వ పేజీ.

(3). 11 మ 406.

(4). 177 వ పేజీ.

"స్వయమేవ ద్రవ్యార్జనసమర్థస్య పితృద్రవ్యమనీహమానస్యా నిచ్ఛతో యత్కించిదసారమపి తత్స్వాపృథక్క్రియా విభాగః కర్తవ్యః పిత్రా తత్పుత్రాదీనాం దాయజిఘృక్షా మాభూదితి॥"

పితృద్రవ్యమును గోరనివానివిషయమై చెప్పుచున్నాడు. ద్రవ్యమార్జింపసమర్థుడై పితృద్రవ్యమును గోరకున్న కొడుకునకేదైన గొంచెమిచ్చి వేఱుపరుపవలయును కొంచెమిచ్చి వేరుపరచుట యతనికొడుకు మొదలగువారు పిమ్మట నవిభక్తులమని వ్యవహారము తేకుండుటకని యోచింపబడుచున్నది. మితాక్షరి.

ఒకడు సమష్టికుటుంబమునందు తనకుగలహక్కును తండ్రికి వదలివేసెను ఆవదలివేయుటవలన కలిగినలాభము కుటుంబమునంతకును చెందుననియు, అందు అట్లు వదలివేసినవాని కుమారునకుకూడ హక్కుఉండుననియు బొం. హై. వారొకకేసులో తీర్మానించియున్నారు(1)

ఒకమెంబరు తనకు రావలసినభాగముకంటె తక్కువభాగమును పుచ్చుకొని తక్కినది వదలివేయుట కర్తవ్యాంతరము లేదు(2).

32. విభాగమైనదని యంగీకరింపనప్పుడు విభాగమైనదా లేదాయని తెలిసికొనుటను గూర్చి స్మృతికర్తలు వ్రాసినవిషయము లివి:—

విభాగమునుగూర్చిన రుజువు విషయమున స్మృతివచనములు.

విభాగనిహ్నవే జ్ఞాతిబంధుసాక్ష్యభిలేఖితైః ।
విభాగభావనాజ్ఞేయా గృహక్షేత్రైశ్చ యౌతకైః॥

విభాగము నంగీకరించని విషయములో జ్ఞాతిబంధులిఖితసాక్ష్యముల చేతను, గృహక్షేత్రాదులు వేరు వేరుగా నుండుట చేతను, విభాగమైనట్లు గ్రహింపవలయును. యాజ్ఞ్యవల్క్యస్మృతి.

(1). 33 బొం 267.
(2). 78 ఇం. కే (నా) 1045.

ఏవం విభాగముక్త్వా తత్సందేహే నిర్ణయమాహ । విభాగస్య నిహ్నవే అపలాపే జ్ఞాతిభిః పితృవ్యాదిభి ర్బంధుభి ర్మాతులాదిభి స్సాక్షిభిః పూర్వోక్తలక్షణై ర్లేఖ్యేన చ విభాగపత్రేణ, విభాగనిర్ణయో జ్ఞేయో జ్ఞాతవ్యః తథా యౌతకైః పృథక్కృతై ర్గృహక్షేత్రైశ్చ కృష్యాదికార్యప్రవర్తనం పృథక్పృథక్పంచమహాయజ్ఞానుష్ఠానాంచ నాందేనాపి విభాగలింగముక్తం॥ విభాగధర్మసందేహే దాయాదానాం వినిర్ణయః జ్ఞాతిభి ర్భాగలేఖ్యేన పృథక్కార్యప్రవర్తనాత్॥ భ్రాతౄణా మవిభక్తానా మేకో ధర్మః ప్రవర్తతే విభాగేసతి ధర్మోఽపి భవేత్తేషాం పృథక్పృథక్॥ తథాపరాణ్యపి విభాగలింగాని తేనైవోక్తాని॥ సాక్షిత్వం ప్రాతిభావ్యంచ దానంగ్రహణ మేవచ విభక్తా భ్రాతరః కుర్యు ర్నావిభక్తాః కథంచనేతి॥

ఇట్లు విభాగమును జెప్పి యావిభాగవిషయమున సందేహము గలిగిన పక్షమందు నిర్ణయించుటకు గారణముల జెప్పుచున్నాడు. విభాగవిషయమై సంశయము కలిగినపక్షమందు పినతండ్రి పెదతండ్రి మొదలగు దాయాదులచేతను, మేనమామ మొదలగు చుట్టాలచేతను, ముందు చెప్పబడిన లక్షణములుగల సాక్షులచేతను, విభాగపత్రము చేతను, చదివింపులు మొదలగునవి వేఱువేఱుగా జరిగించియున్నపక్షమందు వానిచేతను, ఇండ్లు భూములు వేఱువేఱుగా బెట్టుకొనియున్న పక్షమందు వానిచేతను, అతిథిపూజాదులు వేఱువేఱుగా జరిగింపుచున్న పక్షమందు వానిచేతను, విభాగముయొక్క నిశ్చయము దెలియవలయును. ఇక నారదులు చెప్పియున్న విభాగనిశ్చయహేతువులు దెలుపబడుచున్నవి. విభాగధర్మమందు సంశయముగలిగినప్పుడు జ్ఞాతులచేతను విభాగపత్రముచేతను వేర్వేరు వ్యాపారములయందు ప్రవర్తించుటచేతను నిశ్చయముచేయవలయును. మఱియు విభాగము చేసికొనని భ్రాతలకు ధర్మమొకటిగానుండును. విభాగము చేసికొని

నపిమ్మట నది వేఱుగానుండును. భ్రాతలు విభక్తులైనవా రొకరి కొకరు సాక్షులగుదురు, పూటకాపులగుదురు, ఇచ్చెదరు, పుచ్చు కొందురు. ఈకార్యము లవిభక్తులకు జరుగవు. కనుక నిట్టికార్యముల చేతను విభాగనిశ్చయమును దెలియవలయును.

33. విభాగమైనదని కొందరును కాలేదని కొందరును వాదించుచున్నప్పుడు, సామాన్యముగాహిందూకుటుంబము సమష్టియనిభావనయున్నది కావున ఋజువుభారము, విభాగమైనదని వాదించువారిపై నుండును(1). విభాగమైనదని రుజువు చేయుటకు ముఖ్యమైనది రిజస్టరుకాబడిన పారీఖత్తు.

విభాగవిషయమున రుజువుభారము.

పారీఖత్తులో నిర్దిష్టములైనమాటలలో పార్టీలు తమతమభాగములను పంచుకొనినట్లు వ్రాసికొనియున్నప్పుడును, ఆపారీఖత్తువలన పార్టీలయొక్క విభాగోద్దేశము స్పష్టముగా తెలియుచున్నప్పుడుచు ఆప్రకారము నిజముగా విభాగము జరిగినదను సాక్ష్యము లేకపోయినను, పార్టీలను విభక్తులనుగానే యెంచవలయును. విభాగము నిజముగా జరిగినదని రుజువు చేయనక్కఱలేదు(1).

కుటుంబము సమష్టియా ? వ్యష్టియా ? యని తగవువచ్చినప్పుడు, ఏకేసునకాకేసు సందర్భములనుబట్టి నిర్ణయింపవలయునేగాని జనరలుగా ఒకసూత్రమును నిర్ణయించుట కష్టము(2).

విభాగమైనట్లు రుజువుచేసిన చాలును. విభాగమైన తేదీని రుజువుచేయనక్కఱలేదు(3).

---

(1). 108 ఇం కే (అ) 419; 136 ఇం. కే (నా) 233; 50 అ 815.

(2). 13 ఇం. కే (పి. కౌ.) 80; 78 ఇం. కే (పా) 472; 46 ఇం. కే 252.

(3). 62 ఇం. కే (నా) 246.

విభాగముకొరకు వాది దావా చేసినప్పుడు విభాగము అదివర కేజరిగినదని ప్రతివాది వాదించునెడల ఆవాదమును ప్రతివాదియే రుజువుచేయవలయును(1)

ఏదైన కొంతఆస్తి సమిష్టికుటుంబాస్తికాదని ప్రతివాది వాదించునెడల ఆయాస్తి సమిష్టికుటుంబాస్తియని వాదియే రుజువుచేయవలయును(2).

రిజస్టరు కాని పారీఖత్తులు సాక్ష్యముగా ఉపయోగించునా ?

**34.** విభాగముగాని సెటల్‌మెంటుగాని వ్రాతపూర్వకమయిన దస్తావేజు ద్వారాగానుండిననేగాని చెల్లదను నిర్బంధములేదు(3) కాని పారీఖత్తులుగాని, వాటాలజాబితాలుగాని వ్రాసికొనినయెడల అవి క్రమమైన స్టాంపుమీద వ్రాయబడిరిజస్టరు చేయబడిననేగాని అవి కోర్టులలో సాక్ష్యముగా అంగీకరింపబడకూడదు(4).

ఎవరెవరికేయే వాటాలు వచ్చినది తెలియునట్లు వాటాలు జాబితాలుగా వ్రాసికొని అందుపైని సంతకములును సాక్షిసంతకములును చేయబడియెను. ఇది విభాగస్థితిని రుజువుచేయుటకై సాక్ష్యముగా నంగీకరింపవచ్చునని తీర్మానించిరి(5). కాని, అదియే విభాగమును రుజువుచేయుటకు ఏర్పరచుకొనిన కడపటి దస్తావేజు (final document)

(1) 1925 (ప్రి.కౌ.) 182; 60 ఇం. కే 482; 48 ఇం. కే 755.

(2). 130 ఇం. కే (నా) 108; 118 ఇం. కే (ప్రి.కౌ.) 897.

(3). 126 ఇం. కే (బొం) 891.

(4). 1928 రం 196; 52 మ 83.

(5). 71 ఇం. కే (మ) 274; 79 ఇం. కే (మ) 2; 117 ఇం. కే (మ) 720; 108 ఇం. కే (మ) 281.

గా నుండవలయునని యెంచితేమాత్రము అది రిజష్టరు కావలయును గనుక సాక్ష్యముగా నంగీకరింపకూడదని తీర్మానించిరి(1).

రిజష్టరుకాని పారీఖత్తు విభాగస్థితిని రుజువుచేయుటకు పనికి వచ్చునుకాని అది స్థిరాస్తియందు హక్కును రుజువు చేయుటకు సాక్ష్యముగా అంగీకరింపరాదని తీర్మానించిరి(2)

విభజించుకొనుటకు యగ్రిమెంటు వ్రాసికొనినచో అది రిజష్టరుచేయించనక్కరలేదు. కాని అదియే విభాగమును చేయునదియైనచో రిజష్టరు కావలయును(3).

35. విభాగమును రుజువు చేయుటకు వ్రాతమూలములైన పారీఖత్తులు లేనప్పుడు, ఈదిగువవ్రాసినయంశములనుబట్టి విభాగమైనట్లూహింపవచ్చును.

పారీఖత్తులేనప్పుడు విభాగమును రుజువుచేయునట్టి యంశములు.

(1) వేఱుగా భోజనములు చేయుచుండుట.

(2) వేఱువేఱుగా కాపురములుండుట.

(3) కొంతయాస్తి యొకరిపేరను కొంతయాస్తి వేరొకరి పేరను ఉండుట.

(4) ఆదాయమును వేరువేరుగా పుచ్చుకొనుచుండుట.

(5) పిత్రాదుల యాబ్దికములను వేఱువేఱుగా పెట్టుచుండుట.

(6) పన్నులను వేఱువేఱుగా చెల్లించుచుండుట.

(7) ఇతరులవద్ద వేరువేరుగా బదుళ్లు తెచ్చుచుండుట.

(8) వేరుగా వ్యవసాయము చేసికొనుచుండుట.

(9) భూములను వేఱువేఱుగా అమరకము చేసికొనుచుండుట.

---

(1). 69 ఇం. కే (మ) 562.

(2). 87 ఇం. కే (మ) 285.

(3). 69 ఇం. కే (ప్రి.కౌ.) 128; 40 ఇం. కే (బొం) 83.

(10) వేరుగా లెక్కలుంచుకొనుట.

(11) ఆస్తులను వేరుగా అనుభవించుచుండుట.

(12) సమష్టికుటుంబమెంబర్లలో ఒకరికొకరు బదుళ్లనిచ్చుట. ఒకరి యాస్తి మరియొకరికి ట్రాన్సుఫరు చేయుట కర్జులునకిచ్చుట.

(13) పశువులు, సవుఖర్లు, మొదలగువారు వేరువేరుగానుండుట.

పైనవ్రాసినవాటిలో విభాగోద్దేశము స్పష్టముగా రుజువుపడిననేతప్ప 1-2-3 కార్యములవలన విభాగమైనట్లెంచరాదు. కారణాంతరములవలన సమష్టికుటుంబమెంబర్లు ఆకార్యములను వేరువేరుగా చేయవచ్చును. అయితే వేరువేరుగా ఒక్కొక్కటి తీసికొనినప్పుడు, ఆకార్యములవలన విభాగము రుజువు కాదు. కానియితరకార్యములతో కలిపి చూచినప్పుడు యివి విభాగమును సూచించును(1).

రివిన్యూలెక్కలలో ఎవరెవరిభాగమెంతయో తెలుపబడినంతమాత్రమున విభాగమైనట్లెంచరాదు(2).

భోజనములు వేరుగా చేయుచు, రివిన్యూలెక్కలలో వేరుగా చూపబడి, కొంతఆస్తి పంపకమైనదని రుజువైనప్పుడు దరిమిలాను కొన్ని క్రియలు జాయింటుగా నున్నను, కోర్టు వ్యవహారములలో

(1). 19 మ. లా. జ. 517; 29 ఇం. కే (బొ) 438; 4 మూ. ఇం. అ 137; 18 ఇం. కే (పి్రి కా) 30; 2 మ 19; 26 ఇం. కే (మ) 32; 51 మ 1; 28 ఇం. కే 580; 31 క 262; 31 ఇం. కే (మ) 833; 1928 (లా) 569; 108 ఇం. కే (మ) 760; 97 ఇం. కే (నా) 730; 86 ఇం. కే (నా) 505; 72 ఇం. కే (లా) 742; 72 ఇం. కే (మ) 545; 67 ఇం. కే (క) 300; 94 ఇం. కే (అ) 944; 61 ఇం. కే 869; 84 ఇం. కే 714; 12 పా. లా. టై. 582.

(2). 56 ఇం. కే (పి్రి. కా.) 306.

జాయింటుకుటుంబమని చెప్పినను, అది సమష్టికుటుంబము కానేరదని యును వ్యష్టికుటుంబమనియును తీర్మానించిరి(1).

ఒక్కొకరికింత భాగమని సమష్టికుటుంబమెంబర్ల పేర్లతో రివిన్యూలెక్కలలో నమోజుచేయబడినను అంతమాత్రమున విభాగమైనట్లెంచరాదు. పన్నులు చెల్లించుటనుబట్టి విభాగమైనట్లు గాని, కానట్లు గాని నిర్ధారణచేయవీలు లేదు(2).

పైనచెప్పినకార్యములలో 6 మొదలు 11 వరకుగలవిషయములను రుజువుచేసినప్పుడు విభాగమైనట్లు ప్రత్యేకముగ ఋజువుచేయ నవసరము లేదు(3).

చనిపోయినవాని భార్యపేర రివిన్యూలెక్కలలో నమోజుచేసి నంతమాత్రమున నామెభర్త విభక్తుడైన ట్లెంచరాదు(4).

సమష్టికుటుంబమెంబర్లలో ఒకరికొకరు బదుళ్లు ఇచ్చిపుచ్చుకొనుటలు జరుగుచున్నట్లు రుజువైనచో అదిఆకుటుంబము విభక్తమైనట్లు ప్రబలమైన సాక్ష్యమగును(5).

భాగములు నిర్ణయింపబడి ఎవరికి వారు వేరుగా వ్యవహారము జరుపుచున్నచో అది వ్యష్టియనుటకు తగినసాక్ష్యముగానుండును(6).

(1). 121 ఇం. కే (నా) 662; 123 ఇం. కే (మ) 166.

(2). 49 మ. లా. జ (పిృ.కా ) 55; 48 మ. లా. జ. 88; 51 క. లా. జ. 592; 17 క. వీ. నో. 1045 (పిృ.కా.); 111 ఇం. కే (అ) 88; 110 ఇం. కే (అ) 25; 119 ఇం. కే (పా) 817; 86 ఇం. కే 122; 83 ఇం. కే (ప్రి) 568; 79 ఇం. కే 725.

(3). 1928 ప్రి 509; 1930 మ 51; 17 ఇం. కే 766; 5 అ 512.

(4). 45 అ 729; 36 ఇం. కే 44; 48 ఇం. కే (ప్రి) 153.

(5). 78 ఇం. కే (పా) 472.

(6). 65 ఇం. కే (పా) 687; 58 ఇం. కే (ప్రి) 608.

తండ్రిపేరనున్న భూములకు లెక్కలలో ఆపేరునుమార్చి కొన్నిటికి తండ్రిపేరును, కొన్నిటికి కుమారునిపేరును నమోజు చేసినచో తండ్రికుమారులిద్దరును పంచుకొన్నట్లు భావింపవలయును(1).

విభాగమైనట్లెంచవలయునా ? కానట్లెంచవలయునా ? యని సంశయముకలిగినప్పుడు, పారీఖత్తులు, యగ్రిమెంట్లు, మెంబర్లయొక్క యితరచర్యలు మొదలగునవి విమర్శించి చేయవలయును ఈవిషయములు కొన్నిప్రివికౌన్సిలుకేసులలో చక్కగా విమర్శింపబడినవి(2).

చాలకాలము వేరుగా కాపురమున్నట్లు రుజువయ్యేనేని, ఆకుటుంబము విభాగమైనదని యెంచవచ్చును(3). మెంబర్లు అందరును కలసి వ్రాసియిచ్చిన ముక్త్యారునామాలో తాము విభక్తులమైనట్లు వ్రాసియుండిరేని విభాగస్థితియేర్పడినట్లు రుజువగును(4).

36. సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే।
సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృత్ ॥

విభాగమును రద్దుచేయుడని ఎట్టిసందర్భములలో దావా తేవచ్చును?

పితాదులధనవిభాగము సోదరులకు న్యాయముగా ఒక్కమారే చేయదగినది. మరలమరలమార్చి చేయరాదు. తండ్రిమొదలగువారిచే నొకకన్య నొకనికి యొకమారే యివ్వబడును. అట్లే గోవులు మొదలైనవి ఒకనికి ఒకమారే యివ్వబడును. ఈమూడును సజ్జనులొక్కమారు చేయుదురుగాని మరలమరల చేయరు. మనుస్మృతి.

(1). 75 ఇం. కే (బొ) 227.

(2). 31 క 262; 11 మూ. ఇం. అ. 75; 14 మూ. ఇం అ 412; 4 మూ. ఇం. అ 187; 128 ఇం కే 689; 18 బెం. లా. రి. 255; 18 ఇం. కే 30.

(3). 44 మ 1; but see 90 ఇం. కే 722.

(4). 1926 మ 388.

అన్యోన్యాపహృతం ద్రవ్యం విభక్తే యత్తు దృశ్యతే।
తత్పునస్తే సమైరంశై ర్విభజేరన్నితి స్థితిః॥

విభాగకాలమందు భాగస్వాములలో ఒకరివలన నపహరింప బడిన ద్రవ్యమేదైనఁ గనఁబడునేని దానిని వారు మరల సమానభాగము లుగా విభజించుకొనవలయును.   యాజ్ఞవల్క్యస్మృతి.

పరస్పరాపహృతం సముదాయద్రవ్యం విభాగకాలే చాజ్ఞాతం విభక్తే పిత్ర్యధనే యద్దృశ్యతే తత్సమైరంశైర్విభజేరన్నితి స్థితి రేవం శాస్త్రమర్యాదా. అత్ర సమైరంశైరితి వదతోద్ధారవిభాగో నిషిద్ధః। విభజేరన్నితి వదతా యేనదృశ్యతే తేనైవ న గ్రాహ్యమితి దర్శితం. ఏవంవచన సామర్థ్యాన్న సముదాయద్రవ్యాపహారే దోషా భావ పరత్వం. నను మనునా జ్యేష్ఠస్యైవ సముదాయద్రవ్యాపహారే దోషా దర్శితో నకనీయసాం. యో జ్యేష్ఠో వినికుర్వీత లోభా ద్భ్రాతౄన్యవీయసః। సజ్యేష్ఠ స్స్యాదభాగశ్చ నియంతవ్యశ్చ రాజభిరితివచ నాత్. నైతత్ యతః పుంభాపితస్వాతంత్ర్యస్య పితృస్థానీయస్య జ్యేష్ఠ స్యాపి దోషం వదతా జ్యేష్ఠపరతంత్రాణాం కనీయసాం పుత్రస్థానీయా నాం దండాపూపికరీత్యా సుతరాం దోషో దర్శిత ఏవ। తథా చావిశే షేణైవ దోషశ్శ్రూయతే. యో వైభాగినం భాగాన్నుదతే చయతే నైనం సయది చైనం నచయతే అథ పుత్రం పౌత్రంచ యత ఇతి. యోభాగినం భాగార్హం భాగాన్నుదతే భాగాదపాకరోతి భాగం తస్మై నప్రయచ్ఛతి- స భాగాన్నున్నవినముహనోత్తారం చయతే నాశయతి దోషిణం కరోతి- యది తం ననాశయతి తదా పుత్రం పౌత్రంవా నాశయతీతి జ్యేష్ఠవిశేషమంతరేణైవ సాధారణద్ర వ్యాపహారిణో దోష శ్రుతః- అథ సాధారణద్రవ్యమాత్మనోపి స్వం భవతీతి స్వబుద్ధ్యా గృహ్ణతాం నదోషమావహతీతి మతం- తదసత్- స్వబుద్ధ్యా గృహీతేపి వర్జనీయతయా పరస్వమపి

గృహీతమేవేతి నిషేధానుప్రవేశాద్దోష మావహత్యేవ- యథా మాద్గేచరా విపన్నే సదృశతయా మాషేషు గృహ్యమాణే ష్వయజ్ఞీయా వై మాషా ఇతి నిషేధో న ప్రవిశతి- ముద్గావయవబుద్ధ్యా గృహ్యమాణత్వాదితి పూర్వపక్షిణోక్తే ముద్గావయవేషు గృహ్యమాణేషు వర్జనీయతయా మాషావయవా అపి గృహ్యంత ఏవేతి నిషేధః ప్రవిశత్యేవేతి రాద్ధాంతి నోక్తం తస్మాద్వచనతో న్యాయతశ్చ సాధారణద్రవ్యాపహారే దోషోస్త్యేవేతి స్థితం॥

పిత్రృధనమును విభజించుకొనినపిమ్మట, విభాగకాలమందు తెలియకుండనున్నట్టియు అన్యోన్యమపహరింపబడినట్టియు సముదాయద్రవ్య మేదికనపడునో దానిని సమానభాగములుగా విభజించుకొనవలయును ఇది శాస్త్రమర్యాదయైయున్నది. ఇచ్చట సమానభాగములని చెప్పుటవలన ఉద్ధారవిభాగము (ఒకనికెక్కువయిచ్చుట) లేదని యర్థము. విభజించుకొనవలయునని చెప్పుటచేత కనిపెట్టినవాడొక్కడే పుచ్చుకొనకూడదని యర్థము. ఈవాక్యములవలన సముదాయద్రవ్యాపహారణమందు దోషము లేదని యర్థముకాదు. అయితే సముదాయద్రవ్యాపహారణమందు దోషము జ్యేష్ఠునకుమాత్రమే కలదుగాని, కనిష్ఠునకు లేదని మనుస్మృతియందు "యోజ్యేష్ఠో" అను శ్లోకమునందు చెప్పబడియున్నది యనియందురేమో! అట్లుకాదు. పిత్రృస్థానీయుడై, పూజనీయుడై, స్వాతంత్ర్యమును గలిగియున్న జ్యేష్ఠునకే దోషమున్నదని చెప్పినపుడు, దండాపూపికాన్యాయముచేత పుత్రస్థానీయులైన కనిష్ఠులకు అధికదోషముండుట స్పష్టము. గౌతములుకూడ యీయర్థమునే "యావై భాగినం" ఇత్యాదివాక్యములచే చెప్పి ఎవరికిని భేదమునుగాని దోషము లేదనిగాని చెప్పియుండలేదు.

సాధారణద్రవ్యమందు తనకుకూడ హక్కుకలదని - యెంచి తానాద్రవ్యమును తనదిగానే తీసుకొనుట హరించుట కాదనియు

అందుచే దోష మూవహింపదనియు చెప్పెదరేమో ! అది న్యాయము కాదు. ఇతరద్రవ్యమును హరింపకూడదని విధించియుండుటచే నిషేధ వస్తువును పరిగ్రహించుటలో తనదియనుబుద్ధిచే పరిగ్రహించినను దోషమావహించును. పెసలు లభింపనప్పుడు సాదృశ్యముగలవగుటచే మినుములను గ్రహించునప్పుడు యజ్ఞయాగాదులయందు మినుముల నుపయోగింపకూడదను నిషేధము వర్తింపదు. అయితే పెసరపప్పు అను బుద్ధితో నిషేధింపబడినదైనను మినపపప్పు గ్రహించుటవలన దోషము లేదని చెప్పరాదు. మినపపప్పును గ్రహింపరాదను నిషేధమిచ్చట వర్తించునని నిర్ణయింపబడినది(1). అందుచే, పై వాక్యముల ననుసరించియును, న్యాయమునుబట్టియును సాధారణద్రవ్యహరణమందు దోషమున్నదనియే చెప్పవలయును.

ఒకసారి విభాగమైనప్పుడు, మరల విభాగముకొరకు దావా తేకూడదు. ఇది ప్రధానవిషయము. 21. క. లా. జ. 23.

మొదటివిభాగములో దగా మోసము జరిగినదనుకారణముచే దానిని రద్దుచేయుమని దావా తేవచ్చును. కాని అట్లు కోరువానిపైని రుజువుభారము అధికముగానుండును. స్పష్టమైన సాక్ష్యముండిననేగాని విభాగమును రద్దుచేయకూడదు(2).

కుటుంబమునకు రావలసినబాకీలను కర్త వసూలుచేసినప్పుడు అవి విభాగమునాడు లెక్కలో చేరకపోయినచో ఆసొమ్ములోని తమ వాటాకొరకు మూడుసంవత్సరములలోపున దావా తేవలయును. లేనిచో కాలదోషము(3).

---

(1). ఈహేతువాదము మీమాంసాశాస్త్రములోనిది.

(2). 114 ఇం. కే (పి.కౌ.) 568; 23 బొం 385; 52 అ 596; 30 క 738; 31 క 262.

(3). 77 ఇం. కే (బొ) 697; 18 ఇం. కే (బొ) 882; 32 మ 191.

ఏ భాగము నాటికి గర్భస్థుఁడై యుండి పిమ్మట జన్మించినవాఁడును, విభాగములో తండ్రి, భాగమును తీసికొనకుండనున్నప్పుడు, అతనికి దరిమిలాను జన్మించినకుమారుఁడును అదివఱకు జరిగిన విభాగమును రద్దుచేయుటకు హక్కు కలిగియుందురు కుటుంబమునకు చెందని యితరులఆస్తిని కుటుంబాస్తియనుకొని దానిని అసమముగా విభజించుకొని నప్పుడు, యితరులకు తనఖా యిచ్చినఆస్తిని అందరును సమముగా పంచుకొనక కొందరివాటాలోనికి వచ్చునట్లు పంచుకొనినప్పుడు, ఇంకను ఇట్టివేవయిన పొరబాటులను కనిపెట్టినయెడల ఒకరికొకరు ముజరాలనిచ్చుటమూలమున సవరించుకొనవచ్చును. లేదా మొదటి విభాగమును అవసరమునను సరించి రద్దుచేసికొనవచ్చును(1).

తండ్రి ఋణములను చేయుచున్నాఁడనేకారణముచే విభజించుకొనినప్పుడు అది న్యాయమైనదైనచో దానిని రద్దుచేయుడని కోరుటకు వీలులేదు(2).

**37.** సమష్టికుటుంబాస్తియని యేది మూడవప్రకరణమున తెలుపబడియెనో అదియే విభజించుకొనదగిన యాస్తి. స్వార్జితము, ప్రత్యేకపుటాస్తి ఇవి భాగార్హములు కావు. అవి భాజ్యపుజమీందారీలు పంచుకొనుట కవకాశము లేదు. తండ్రితో పూర్వార్జితసంబంధమయిన చరాస్తి పంచుకొనరాదని కొంతకాలము తలంపబడుచుండెడిది గాని యిప్పుడది యమలులో లేదు. చరస్థిరాస్తులను తండ్రితో విభజించు

విభాగార్హమైన యాస్తి.

(1). 21 బొం 333; 23 బొం 385.

(2). 62 ఇం. కే (మ) 983

కొనుటకు పుత్రులకు హక్కుకలదు(1). తనఖాయిచ్చినఆస్తి కూడ అమ్మకమైపోవువరకును విభాగార్హమే(2).

38. ఆస్తియొక్క స్వభావమునుబట్టి విభజించుకొనుటకు వీలు లేనివాటి విషయమున నేమిచేయవలయును ?

విభాగానర్హమైన యాస్తి.

ఈవిషయమున స్మృతివచనములివి.

ఉదకయోగక్షేమకృతాన్నేష్వవిభాగః॥
స్త్రీషుచ సంయుక్తాయాం॥

బావులు చెరువులు మొదలగు జలాధారములను, ఇష్టాపూర్తములు మొదలగు యోగక్షేమకార్యములందును, పక్వముచేయబడిన యన్నాదులను విభజించుకొనకూడదు. దాసీలు, ఉంపుడుకత్తెలు మొదలైనవారిని విభజించుకొనుటలో ఎవరెవరు, ఎవరెవరితో మొదటినుండియు, ఉపభోగమును చేయుచున్నారో వారువారు, వారివారి భాగములుగానే యుండవలయుననియు, అందరికిని కలసి యొక్కతెయే దాసీయున్నచో దానిచే వంతులుప్రకారముగా పనిచేయించుకొనవలయుననియు నర్థము.

గౌతములు.

వస్త్రంపత్రి మలంకారం కృతాన్నముదకంస్త్రియః।
యోగక్షేమం ప్రచారంచ నవిభాజ్యం ప్రచక్షత॥

వస్త్రములు, వాహనములు, అలంకారములు, పక్వముచేసిన అన్నము, నూతులు, పరిచారికలు, పురోహితులు, మంత్రిలు, గోవులు మొదలగు వెళ్ళేడిమార్గము ఇవి విభాగార్హములుకావు. ఎవరెవరికడనుండునవి వారే యనుభవింపవలయును. అలంకారములు మొదలైనవి చాలవిలువకలవేని వాటిని విభజించుకొనవచ్చును.

(1). 10 బొం 528; 12 బొం 280; 5 క 148.
(2). 1929 క 697.

పత్యౌ జీవతి యః స్త్రీభిరలంకారో ధృతో భవేత్
న తం భజేరన్ దాయాదా భజమానాః పతంతి తే॥

భర్తజీవించియుండగా భర్తయంగీకారముతో నాతని భార్య లేయలంకారములను ధరించుచుందురో వాటిని భర్తయనంతరము దాతనిపుత్రులు మొదలగువారు విభజించుకొనకూడదు.

మనుస్మృతి.

వస్త్రాలంకారశయ్యాది పితుర్యద్వాహనాదికం
గంధమాల్యైస్సమభ్యర్చ్య శ్రాద్ధభోక్త్రే తదర్పయేత్॥

తండ్రియుపయోగించుకొనిన వడి వస్త్రాలంకారశయ్యాదులు, శ్రాద్ధమందు భోక్తల కీయవలయును. బృహస్పతి॥

యోగక్షేమములనగా శ్రేయస్సును పొందుటకు హేతుభూతమైనయజ్ఞకర్మ యోగమనబడును పొందబడినదానిని గాపాడుకొనుటకు హేతుభూతమైనబహిర్వేది దాన తటాకవన ప్రతిష్ఠాదికర్మలు క్షేమమనబడును. ఇట్టియోగక్షేమములు పిత్రార్జితములైనను, పితృద్రవ్యవ్యయము చేసిసోదరులలో నొకనిచేసంపాదింపబడినవైనను విభజించుకొనదగినవికావు. ఇట్లుయోగక్షేమశబ్దముల కర్థమును వివరించి యోగక్షేమములను శయనాసనములును విభాగార్హములు కావని లౌగాక్షి చెప్పియున్నాడు యోగక్షేమములనగా యోగక్షేమకారులగురాజ మంత్రిపురోహితాదులని కొందరును ఛత్రచామరశస్త్రపాదుకాదులని కొందరును చెప్పుదురు.

ఇల్లు, తోట మొదలగువానికిగలద్వారమును బంచుకొనగూడదు. విభజించుట కనుకూలింపనిబావి మొదలగు జలాధారములను వంతులవరుబడి ననుభవింపవలయును గాని క్రియము నిర్ణయించి విభజించుకొనకూడదు. వండినవంటకమును భుజింపదగునుగాని పంచుకొనకూడదు. కొత్తవస్త్రములను దాపుడుసొమ్ములను అశ్వాదుల

వ్యాపారము చేయుచుండిరేని వారు ఆయశ్వాదులను విభజించుకొన వచ్చును. మితాక్షరి.

నూయి, బావి, మొదలగునవి సమష్టిగా నుపయోగపర్చుకొనుట కేర్పాటు చేసికొనవచ్చును. లేదా వంతుల ప్రకార ముపయోగపర్చుకొనవలయును. కట్టుసామానులు పశువులు మొదలగునవి ఒకటి యొకరికిని, వేఱొకటి యింకొకరికిని వాటాలు పెట్టుకొనవచ్చును. లేదా కిమ్మతుకట్టి, ఎవరైన నొకరుపుచ్చుకొని ఆసొమ్మును వాటాలవెంబడిని పుచ్చుకొనవచ్చును(1).

నూతులు, బావులు, పశువులు.

అందఱికిని ఉమ్మడిగా నుంచుకొనినదారి అందఱు సమష్టిగా నుపయోగించుకొనవలయును, కాని విభజించుకొన కూడదు(2) విభాగకాలమున నెవరివాటాకైన వచ్చినదని ఋజువుచేసిననే తప్ప మార్గమున కుపయోగించుప్రదేశము లు సమష్టిగా నున్నవని భావన వచ్చును(3).

త్రోవ.

దేవతావిగ్రహములు దేవతార్చనగృహములు వీనిని విభజింపరాదు. వంతుల ప్రకారము వానిని స్వాధీనము కలిగియుండున ట్లేర్పాటుచేయవలయును. కుటుంబములోని పెద్దవానిస్వాధీనమునందుంచి తక్కిన మెంబర్లందరకును, పూజాకార్యములు జరిగించుకొనుట కనువుపడునట్లు చేయుటకు కోర్టువారు ఏర్పాటు చేయవచ్చును(4).

దేవతావిగ్రహములు.

---

(1). 36 బొం 275

(2). 68 ఇం. కే (బొం) 682.

(3). 36 బొం 379.

(4). 17 బొం 271; 14 బెం. లా. రి 166; 87 ఇం. కే (ప్రి.కౌ.) 305; 84 ఇం. కే 909.

అర్చకత్వము (దేవునిపూజించువృత్తి) విభాగార్హమైనదికాదు. దానియందు హక్కుకలవారు వంతులప్రకారము నెరవేర్చుకొనవలయును(1).

అర్చకత్వము.

సమష్టికుటుంబమెంబర్ల భార్యలకీయబడినఅలంకారములు స్త్రీధనము. కావున వాటిని విభజించుకొనరాదు(2).

అలంకారములు.

విభాగమువలన ఏయాస్తియొక్కగాని భాగముయొక్కగాని విలువ తగ్గిపోవునో అట్టియాస్తిని విభజించుకొనకుండ సమష్టిగా నుంచవలయును. లేదా దానికి కిమ్మతుకట్టి ఒకరుపుచ్చుకొని ఆకిమ్మతును తక్కినవారికి పంచి యివ్వవలయును(3).

**39.** విభజించుటకువీలులేనిఆస్తిని గురించి ఏమిచేయవలయును? ఈవిషయమున ఇండియాగవర్నమెంటువారు 1893 సంవత్సరము నె 4 రు ఆక్టును చేసియున్నారు. అందు 10 సెక్షనులు కలవు. విభాగమునకు వీలులేనిఆస్తిని ఎట్లు విభజింపవలయు ననుటను గూర్చి ఈయాక్టును దీనిపైని తీర్పులను చూడవలయును. ఈయాక్టునుబట్టియే కాకుండ విభజింపదగనియాస్తినిగూర్చి న్యాయమైన యేర్పాట్లనుచేయుటకు కోర్టువారికి ప్రత్యేకముగా అధికారము కలదు. (61 మ. లా. జ. 552) కోర్టులో విభాగపుదావా షయిలయినప్పుడుమాత్రమే ఈయాక్టు వర్తించును.

విభజించుటకు వీలులేని ఆస్తిని గూర్చి ఒకఆక్టు.

ఆస్తియొక్క స్వభావము ననుసరించిగాని, పాటాదార్ల సంఖ్య ననుసరించిగాని, మరియేవైన ప్రత్యేకసందర్భముల ననుసరించిగాని,

---

(1). 87 ఇం. కే (ప్రి.కా.) 305.

(2). 61 ఇం. కే 772 (మ)

(3). 10 క 675.

న్యాయముగాను సౌకర్యముగాను ఆస్తిని విభజించుటకు వీలుగా లేనప్పుడును, ఆ స్తిని విక్రయించి విక్రయములో వచ్చిన సొమ్మును విభజించుకొనుట ఎక్కువ లాభకరమని తోచినప్పుడును, ఒక భాగమును గాని అంతకంటె ఎక్కువ భాగములను గాని కలిగియున్న యొక భాగస్వామిగాని, కొందరు భాగస్వాములు కాని దరఖాస్తు చేసినమీదట కోర్టువారు ఆయా స్తిని విక్రయించి, వచ్చిన ద్రవ్యమును భాగస్వాములకు విభజించి యిచ్చుటకు ఆర్డరు వేయవచ్చును (2 వ సెక్షను)

ఇట్టి దరఖాస్తులను దావాలో మొట్టమొదటనే చేయవలయునను నియమము లేదు. దావా యేస్థితిలో నున్నప్పుడైనను చేయవచ్చును(1) కాని మొదటికోర్టులో దావావిచారణలోనే ఇట్టి దరఖాస్తులను చేయవలయును గాని అప్పీలులో చేయకూడదు(2). మొదటి కోర్టులో దరఖాస్తు చేసినప్పుడు, ఆకోర్టు అంగీకరింపనిచో అప్పీలుకోర్టు వారు పైన వ్రాసిన ప్రకారము విక్రయించుటకు ఆర్డరీయవచ్చును(3). ఇట్టి దరఖాస్తులలో దరఖాస్తుదారు తనవాటాను యితర భాగస్వాములలో ఎవరు హెచ్చు సొమ్మిచ్చెదరో వారికి విక్రయింపవలసిన దని వ్రాయకూడదు. అట్లు వ్రాసినచో ఆదరఖాస్తు యీ ఆక్టు క్రింద చేసినట్లు భావింపకూడదు(4).

విభాగము చేయుటవలన ఏయాస్తి యొక్క విలువ తగ్గిపోవునో అట్టిఆస్తి విభజించుకొనకూడదు(5) విభాగపుదావాలో డిక్రీఅయిన

(1). 1930 లా 689.

(2). 1923 అ 293.

(3). 32 బొం 108; 38 ఇం. కే 810; 24 మ 689; 5 క. వీ. నో. 128.

(4). 116 ఇం. కే (అ) 851.

(5). 108 ఇం. కే (అ) 867.

పిమ్మటకూడ ఏపార్టీ అయిననను విభాగము చేయుటలో అసౌకర్యము న్నట్లు కనిపెట్టినయెడల, 2 వ సెక్షనుక్రింద దరఖాస్తు చేయవచ్చును(1).

2 వ సెక్షనుననుసరించి, దరఖాస్తుచేయబడినమీాదట కోర్టు వారు, ఆ స్థిని క్రియమునకు ఆజ్ఞాపించినసందర్భములో దరఖాస్తు చేసినవారి భాగములను, కొనుటకు యేయితర భాగస్వామియైనను దర ఖాస్తుచేసిన యెడల, కోర్టువారు వారికి ఉచితమనితోచినరీతిని ఆ భాగ ము లేక భాగములను కిమ్మతు కట్టుటకు ఆజ్ఞరీయవచ్చును మరియు ఆవి ధముగా నిర్ణయింపబడినకిమ్మతునకు (కొనుటకై దరఖాస్తుచేసిన 91 ఇం. కే 516) దరఖాస్తుదారునకు యిచ్చివేయుటకు అవసరమ యిన క్రియమగు యుత్తరవులను జారీచేయవచ్చును(2). ఒకవేళ అట్లు కొనుటకు దరఖాస్తులను వేరు వేరుగా ఇద్దరుగాని అంతకంటె యెక్కు వమందిగాని చేసినయెడల, అందు కోర్టువా రేర్పరచినకిమ్మతును మించి అత్యధికమొత్తము నెవ్వరు ఇవ్వనంగీకరింతురో వారికి ఆ భాగము లేక భాగముల నమ్మవలయును(3) కోర్టువా రేర్పరచిన కిమ్మతునకు కొనుటకు అట్టి భాగస్వామి యెవరును అంగీకరించనియె డల,దరఖాస్తుదారు లేక దరఖాస్తుదారులు ఆదరఖాస్తు లేక దరఖాస్తు లకయ్యేడుఖర్చుల నిచ్చుకొనుటకు బద్ధులై యుందురు(4)

3 వ సెక్షనుప్రకారము ఆ స్తినికొనుటకు చేయు దరఖాస్తులు ఆ స్తిని విక్రయించుటకై 2 వ సెక్షను ననుసరించి కోర్టువారు ఆర్డరు వేసినపిమ్మట చేయవలయును(5). ఆ భాగమును కొనుటకు ఒకరి

(1). 66 ఇం. కే (లా) 885; 1922 అ 185.

(2). 3 (1) వ సెక్షను.

(3). 3 (2) వ సెక్షను; 108 ఇం. కే (అ) 367.

(4). 3 (3) వ సెక్షను.

(5). 49 మ 920.

కంటె అధికభాగస్వాములున్నప్పుడు మాత్రమే 3 (2) వ సెక్షను వర్తించును(1).

2 వ సెక్షను ప్రకారము ఆస్తిని విక్రయించుమని దరఖాస్తుచేసినవాడు యితరభాగస్థులభాగములను కొనెదనని దరఖాస్తు చేయకూడదు(2). విక్రయమునకు అంగీకరించినపార్టీ తన అంగీకారమును విత్‌డ్రా చేసికొనవచ్చును. కాని కోర్టువారిఅర్డరు అగులోపున చేయవలయును(3).

ఈయాక్టుక్రింద క్రయవిక్రయములను గూర్చి మ. హై. వారి యభిప్రాయమునకై 61 మ. లా. జ 552 ను చూడవలయును.

సమష్టికుటుంబమునకు చెందియున్న కాపురముండునట్టి యింటిలోని యొకభాగము ఆకుటుంబములో మెంబరు కానట్టియేమనుష్యునకైనను ట్రాన్సుఫరు చేయబడి, అతడు విభాగముకొరకు దావా తెచ్చినప్పుడు, అతని భాగమును కుటుంబములోనియే మెంబరైనను కొనుటకు యిష్టపడినయెడల, కోర్టువారు తమకు యుక్తమనితోచినవిధముగా ఆభాగమునకు కిమ్మతు కట్టుటయును, ఆకిమ్మతునకు ఆమెంబరునకు ఆభాగమును విక్రయించుటయును, అందులకవసరమయినయుత్తరవులను యిచ్చుటయును చేయవలయును(4). కుటుంబములోనిమెంబర్లలో ఇద్దరు లేక అంతకంటె యెక్కువమంది అట్టిభాగమును ప్రత్యేకముగా కొనుటకు సిద్ధపడినయెడల, కోర్టువారు 3 వ సెక్షను 2 వ సబుసెక్షనులో చెప్పబడినట్లు చేయవలయును(5).

(1). 97 ఇం. కే (క) 690.

(2). 24 ఇం. కే (సిం) 273; but see 61 మ. లా. జ. 552.

(3). 62 ఇం. కే 780.

(4) 4 (1) సెక్షను.

(5). 4 (2) సెక్షను.

4 వ సెక్షను క్రింద చర్యజరుపుటకు యీ క్రింద చెప్పబడిన వాలు గును ఉండిననే గాని వీలు లేదు.

(క) ఇల్లు సమష్టికుటుంబమునకు చెందినదై యుండవలయును.

(చ) కుటుంబములోని మెంబరువలన కుటుంబములో మెంబరు కానట్టివానికి ట్రాన్సుఫరు చేయబడి యుండవలయును.

(ట) క్రయదారు విభాగముకొరకు దావా చేసియుండవలయును.

(త) కుటుంబములోని యొక మెంబరు, ఆ భాగమును కొనుటకు సిద్ధపడవలయును(1).

అదివరకే విభాగమయిపోయినను విభక్తుడైన మెంబరు ఒక యింటిలోని భాగమును విక్రయించునెడల యీ సెక్షనుక్రింద చర్య జరుపవచ్చును(2).

1-2 వాదులు సమష్టికుటుంబముతో లూకు ఇంటిలో ఒక అవిభక్తభాగమును కొని విభాగపుదావాను తెచ్చిరి. అందులో ప్రతివాదులు యీ సెక్షను యొక్క లాభమును కోరలేదు. పిమ్మట మరియొక భాగమును కొనివారే మరల దావా తెచ్చిరి. అందులో ప్రతివాదులు యీ సెక్షనుయొక్క లాభమును పొందగోరిరి. మొదటదావాలో కోరలేదుకదా యని రెండవదావాలో కోరకూడదని చెప్పకూడదని తీర్మానించిరి. మొదటిదావాలో సమష్టి అనుమాట పోయినదని వాదించిరికాని కోర్టువారావాదమును అంగీకరించలేదు. సెక్షనులో సమష్టికుటుంబమని వ్రాయబడినదికదా యని హిందువులకుమాత్రమే యీ సెక్షను వర్తించునని తలంపరాదు. తురకలు మొదలగువారికిని, సామాన్యభాగస్వాములకును జాయింటుహక్కుగలవారందర

(1). 119 ఇం. కే (అ) 523; 61 మ. లా. జ. 552.

(2). 119 ఇం. కే (అ) 523; 123 ఇం. కే (అ) 337.

కునుకూడ వర్తించును(1). సెక్షనులో "క్రయదారు దావా చేసినయెడల" అనియున్నను, కుటుంబమెంబరు విభాగపుదావా తెచ్చి అందులో కూడ యీ సెక్షనుప్రకారము చర్యజరుపుటకై కోరవచ్చును(2). ఈ సెక్షనుప్రకారముగా దావావ్యాజ్యములో గాని, ప్రిలిమినరీడిక్రి అయినపిమ్మటగాని, అప్పీలులోగాని చర్యజరుపుమని కోరవచ్చును(3). ట్రాన్సుఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టుయొక్క 44 వ సెక్షను విభాగమును సూచించుచున్నను అది పైన చెప్పబడిన యీ 4 వ సెక్షను ప్రకారము చర్యజరుపుటకు అభ్యంతరమును కలుగచేయదు(4). సాధ్యమైనంత వరకు అదివరకు స్వాధీనమును కలిగియున్నవానిని తప్పించకుండ నుండుటకై యీ సెక్షను ఉద్దేశింపబడినది(5).

కాపురముండుయిండ్లలోనికి వెళ్ళుమార్గములు, మండువాఇవి జాయంటుగా నుండవలయునుగాని విభజించుకొనకూడదు(6).

కాపురముండుయిల్లు అనుమాటలో ఇల్లు దానినిచేరియున్న పెరడు యితరబంగాళాలు కూడ చేరును(7).

---

(1). 90 ఇం. కే (క) 121; 7 ఇం. కే (క) 436; 97 ఇం. కే 416; 30 అ 324; 30 ఇం. కే (సిం) 936; 53 మ 417; 119 ఇం. కే (అ) 523; 29 అ 808; 109 ఇం. కే 167; 109 ఇం. కే 67.

(2). 116 ఇం. కే 161.

(3). 45 ఇం. కే (క) 604; 24 మ 639; 10 క.లా.జ. 503; 5 క.వీ.నో. 128 32 బొం 103; 45 క 873; 1922 క 129; 12 క. లా. జ. 525.

(4). 7 ఇం. కే (క) 436; 64 ఇం. కే 917; 116 ఇం. కే 161.

(5). 73 ఇం. కే 548.

(6). 24 ఇం. కే 273.

(7). 109 ఇం. కే 67.

మైనర్లు మొదలగు అశక్తులతరపున గార్డియనులు ఈయాక్టు క్రింద అమ్మకమునకుగాని కొనుటకుగాని దరఖాస్తులను చేయవచ్చును. కాని క్రయవిక్రయములు వారికి లాభములని తోచినప్పుడు తప్ప అట్టి దరఖాస్తులను అంగీకరించుటకు కోర్టువారు బద్ధులుకారు(1).

కోర్టువారు ఆస్తిని యీయాక్టుక్రింద చర్యనుజరుపునప్పుడు, మొదటిపాట నేర్పరచుటకును దానిని మార్చుటకును, ఆపాటలలో భాగస్థులు పాడుకొనుటకును, పాటమొత్తములను డిపోజిట్టుచేయకుండగాగాని లెక్కలలో ముజరాచూచుకొనుపద్ధతినిగాని కోర్టువారికి యుక్తమనితోచినషరతులను నిర్ణయించుటకును, కోర్టువారికి అధికారముకలదు భాగస్వామియును ఇతరులును పాటదారులుగానుండి అందరును సమానమొత్తములకే పాడినప్పుడు, భాగస్వామిపాటను పాటగా తీసికొనవలయును(2).

2,3,4 సెక్షనులక్రింద ప్యాసుచేసినఆర్డరులు డిక్రీలుగాయెంచబడి అప్పీలు చేసికొనవచ్చును(3).

ఈయాక్టుక్రింద వ్యవహారములను జరుపదలచినవారు దీనితో సంబంధించిన ఈదిగువతీర్పులను చూడవలయును(4).

---

(1). 5 వ సెక్షను.

(2). 6 వ సెక్షను; 1930 క 616.

(3). 8 వ సెక్షను; 116 ఇం. కే (క) 161; 118 ఇం. కే 530.

(4). 41 ఇం. కే 867; 1926 క 1190; 1926 క 95; 40 ఇం. కే 817; 1922 క 129; 1924 క 541; 1926 క 95; 34 ఇం. కే 587; 12 లా. వీ. 439; 64 ఇం. కే 949; 1924 లా 325; 1928 క 221.

సమష్టి కుటుంబములోని ఒకమెంబరు దివాలాతీసిన యెడల ?

2. సమష్టికుటుంబములోని ఒకమెంబరు దివాలాతీసినయెడల, ఆతడుమాత్రమే ఇన్సాల్వెంటు అగును. తక్కినమెంబర్లు ఇన్సాల్వెంట్లు కారు ఇన్సాల్వెంటు అయిన వానిభాగము మాత్రమే రిసీవరునకు* చెందును. తక్కినవారిభాగములు రిసీవరునకు చెందవు. ఇది ప్రధానసూత్రము(1).

తండ్రి లేక కర్త యిన్సాల్వెంటు అయినయెడల ?

3 తండ్రి, లేక కర్త (మేనేజింగు మెంబరు) యిన్సాల్వెంటు అయినయెడల వారుమాత్రమే యిన్సాల్వెంట్లుగా భావింపబడుదురు. కుటుంబములోని, కుమారులు, సోదరులు మొదలగు తక్కినమెంబర్లు యిన్సాల్వెంట్లుగా భావింపబడరు.

కర్త ఇన్సాల్వెంటు అయినప్పుడు;—

(1). సమష్టికుటుంబాస్తిలోని కర్తయొక్క భాగమును,

(2). న్యాయమైనయవసరమునకై చేయబడినరుణముల కొరకు మైనరుమెంబర్లతో సహా తక్కినమెంబర్లభాగములను విక్రయించుటకు కర్తకు కలిగియుండు అధికారమును,

రిసీవరునకు సంక్రమించుననియు;

తండ్రి, యిన్సాల్వెంటు అయినప్పుడు:—

(1). తండ్రికి సమష్టికుటుంబాస్తిలో నుండు భాగమును,

---

* ప్రెసిడెన్సీ యిన్సాల్వెన్సీ ఆక్టులో ఆఫీషియల్ అస్సైనీ అనియు, ప్రొవిన్షియల్ ఇన్సాల్వెన్సీ ఆక్టులో అఫీషియల్ రిసీవరు అనియు పిలువబడియెడి యుద్యోగస్తుని ఈగ్రంథమున రిసీవరు అని వ్రాయుచున్నాము. ఇన్సాల్వెంటు యొక్క ఆస్తులను స్వాధీనముచేసికొని అమ్మించియు బాకీలను వసూలుచేసియు ఇన్సాల్వెంటు యొక్క వ్యవహారములను ఈయన చూచుచుండును.

(1). 42 క 248=26 ఇం. కే 886; 73 ఇం. కే (లా 281.

(2) సమష్టికుటుంబావసరముకొరకు చేయబడినరుణములకును, అశాస్త్రీయములును, దుష్ప్రవర్తనకొరకు చేయబడినవియును కానటువంటి తనసొంతరుణములకును, మైనరులు సహకుమారులందఱికిని సమష్టికుటుంబాస్తిలోనుండుభాగములను విక్రయించుటకు తండ్రికిగలయధికారమును,

రిసీవరునకు సంక్రమించుననియు; హైకోర్టులలో చాలతీర్పులైనవి. కొన్నితీర్పులలో అధికారమనగా కుమారులభాగములే సంక్రమించునని చెప్పియున్నారు(1). కొన్నితీర్పులలో, తండ్రి యినాల్వెంటు అయినప్పుడు ఆరుణములకు కుటుంబాస్తిలోని కుమారులహక్కు బయిండుకాదని చెప్పియున్నారు(2).

ముందు చెప్పబోవు ప్రి. కౌ. తీర్మానమువలన ఈతీర్పులలోనుండుఅంశములలో చాలమార్పుకలుగుటచే ఈతీర్పులతో పనియుండదని వాటినిగూర్చియును వాటిలోని భేదములనుగూర్చియు నిట విశేషముగా ప్రస్తావించుట అనవసరమని విడిచిపెట్టబడినది.

సత్యనారాయణ కేసులో ప్రి కౌ. వారితీర్పు.

4 పైనచెప్పబడిన 3 వ పేరాలోనితీర్పులను మరికొన్ని తీర్పులను కూలంకషముగా విచారించి 1925 సంవత్సరములో ప్రి కౌ. వారు, పైతీర్పులలోని యభిప్రాయము విశ్వసించక ఇన్సాల్వెన్సీఆక్టులోని సెక్షనులనుబట్టి :—

(1). 19 మ 74; 21 బొం 205; 26 మ 214; 18 ఇం. కే (క) 753; 7 బొం 438; 64 ఇం. కే (అ) 976; 68 ఇం. కే (మ) 898; 80 ఇం. కే (మ) 108; 83 ఇం. కే (చ) 196; 84 ఇం. కే (అ) 790; 85 ఇం. కే (పా) 88; 69 ఇం. కే (అ. ఫు. బెం.) 486; 82 ఇం. కే (మ) 438; 85 ఇం కే (మ) 479.

(2). 69 ఇం. కే (లా) 729; 49 ఇం. కే (పా) 848; 46 మ 54; 5 పా 76.

(i) సమష్టికుటుంబకర్తయైనను, తండ్రియైనను, ఇన్సాల్వెంటు అయినప్పుడు, వారికి సమష్టికుటుంబాస్తిలోగల అవిభక్తభాగముమాత్రమే రిసీవరునకు చెందుననియు,

(ii) కర్తకుగాని, తండ్రికిగాని సమష్టికుటుంబాస్తిలోని యితరమెంబరులభాగములపైని కలిగియుండు అధికారమును రాజధానిపట్టణముల యిన్సాల్వెన్సీఆక్టుయొక్క 52 వ సెక్షనునుబట్టి రిసీవరు ఉపయోగపర్చుకొనవచ్చుననియు,

(iii) ఇట్లు చెప్పుటవలన కర్తగాని, తండ్రిగాని, ఇన్సాల్వెంటు అయినతోడనే వారిభాగములవలె తక్కినవారిభాగములు కూడ రిసీవరునకుసంక్రమించుననిచెప్పవలనుపడదనియు, తీర్మానించినారు(1).

ఈతీర్పువలన అన్నివిషయములును నిర్ధారణకాలేదు.

(1). న్యాయమైనరుణములకు కుమారులభాగములను రిసీవరువిక్రయించవచ్చునా ? లేనిచో తండ్రికికలదనెడియాయధికారమును రిసీవరు ఎప్పుడెట్లు వినియోగించుకొనవలయును ?

(2). ఈతీర్పువలన అదివరకున్న అ ఫు బెం. తీర్పుమొదలగునవి యన్నియు రద్దుఅయినట్లెంచవలయునా ?

ఈమొదలగు సంశయములు బయలుదేరినవి.

5. ఈవిషయమై మదాసుహైకోర్టువారు ఒకఫుల్ బెంచి కేసులో తండ్రి యిన్సాల్వెంటు అయినప్పుడు, కుమారులభాగములు రిసీవరునకు సంక్రమించవనియు, కుమారులభాగములను విక్రయించుటకు హిందూలా ననుసరించి తండ్రికిగల యధికారము ప్రెసిడెన్సీటౌన్సుఇన్సాల్వెంటు ఆక్టుయొక్క 17, 52 (2) సెక్షనులప్రకారమును,

ప్రి. కౌ. వారి తీర్పుదరిమిలాను హైకోర్టుతీర్పులు

(1). 1925 (ప్రి.కౌ.) 18.

ప్రొవిన్షియల్ ఇన్‌సాల్వెన్సీ ఆక్టుయొక్క 2 డి, 28 సెక్షనులప్రకారము ఇన్సాల్వెంటుయొక్క ఆస్తియగుననియు, అందుచే, ఆయధికారముమాత్రము రిసీవరునకు సంక్రమించుననియు తీర్మానించినారు(1). లాహోరు, అలహాబాదు, పాట్నా హైకోర్టులు, ఆప్రకారమే అభిప్రాయపడినారు(2). కాని దరిమిలాను అలహాబాదు హైకోర్టువారొక కేసులో ప్రి. కౌ. వారితీర్పువలన తమకోర్టుయొక్క పూర్వపుకేసులు రద్దుపడినట్లెంచరాదనియు, తండ్రి యిన్సాల్వెంటుకాగానే కుమారులభాగములతో సహా కుటుంబాస్తియంతయును రిసీవరునకు సంక్రమించుననియు తీర్మానించినారు(3). కాని యీదరిమిలా కేసులో అంతకుపూర్వపు కేసుసందర్భములు ఆలోచింపబడలేదు.

ఎట్లయినను మదరాసు ఫుల్‌బెంచివారిఅభిప్రాయముప్రకారమే యిప్పుడు సర్వత్ర అమలు జరుపబడుచున్నది.

ప్రి. కౌ. వారితీర్పును, దానినిబట్టి కొన్ని హైకోర్టుతీర్పులును ప్రెసిడెన్సీటౌన్సుయిన్సాల్వెన్సీ ఆక్టుక్రింద యివ్వబడినను సమష్టికుటుంబకర్త, తండ్రి, వీరలతో సంబంధించిన యీవిషయమునందు రెండు ఆక్టులకును భేదములేదనియును ప్రి. టౌ. యి. ఆక్టుక్రిందయివ్వబడిన తీర్పులు, రెండవయాక్టునకుగూడ వర్తించుననియును తీర్మానించినారు(4).

కుమారులభాగములు సంక్రమించుటకును, ఆభాగములను విక్రయించు అధికారము సంక్రమించుటకును భేదమున్నది. భాగములే

---

(1). 97 ఇం. కే 825; 50 మ 135.

(2). 89 ఇం. కే 1022; 7 లా 376; 5 పా 476; 92 ఇం. కే 309 (అ); 1931 అ 162 (ఫు. బెం;) 100 ఇం. కే (లా) 110; 102 ఇం. కే (మ) 266.

(3). 91 ఇం. కే (అ) 176; 87 ఇం. కే (నా) 957.

(4). 97 ఇం. కే (ఫు.బెం.ను.) 825.

సంక్రమించునన్నప్పుడు, ఆరుణములు న్యాయములైనవగునా! కాదా! యనిపరిశీలించుట కవకాశముండదు. అధికారముమాత్రమే సంక్రమించునన్నప్పుడు, ఆరుణములస్వభావమును గూర్చి ఆక్షేపించుటకు కుమారులకు హక్కు ఉండును.

6 తండ్రి, యిన్సాల్వెంటు అయినప్పుడు, కుమారులయొక్క భాగములను విక్రయించుటయందు తండ్రికి ఉండెడియధికారము రిసీవరునందు సంక్రమించునని పైనవ్రాసినవిషయములను బట్టి తేలుచున్నది. అయితే కొన్నిసందర్భములలో అట్టియధికారము రిసీవరునందు సంక్రమించదు. ఆ సందర్భము లేవియో ఈదిగువ విమర్శింపబడును.

కుమారులభాగములను విక్రయించెడియధికారము రిసీవరునకు ఏసందర్భములలో లేకుండపోవును?

(i) తండ్రి, సదరురుణములను దుర్వ్యవర్తనకొరకు చేసినప్పుడును మరియు ఆరుణములు అశాస్త్రీయములైనప్పుడును ఆరుణములు కుమారులను బాధింపవు. కావున ఆరుణములకు కుమారులభాగములను విక్రయించుటకు తండ్రికి అధికారము ఉండదు. తండ్రికి లేకపోవుటచే రిసీవరునకును ఉండదు.

(ii) తండ్రి, యిన్సాల్వెంటుగా డిక్లేరుఅగుటకుపూర్వము తండ్రిపైనిపొందిన డిక్రీనిబట్టి సమష్టికుటుంబాస్తిని జప్తుచేయించినప్పుడును, డిక్రీనిపొందుటకుపూర్వమే తాఁడజప్తు చేయించినప్పుడును, ఆయాస్తిని ఎవరును విక్రయించకూడదని కోర్టువారిచే ఆజ్ఞాపింపబడియుండుటచే కుమారులభాగములను ఆ సందర్భములో తండ్రి విక్రయింపజాలడు. కావున అట్టిసందర్భములో రిసీవరుకూడ కుమారులభాగములను విక్రయింపజాలడు. కుమారులమీాద ప్రత్యేకముగా దావాచేసి కోర్టువారు

డిక్రీ యివ్వకపూర్వము కుమారులభాగములను తోడజప్తు చేయించిన కేసులలోను, డిక్రీ అయినపిమ్మట వారిభాగములను జప్తు చేయించిన కేసులలోనుకూడ ఇట్లే కుమారులభాగములను రిసీవరు విక్రయింపజాలడు. తండ్రిమీదను కుమారునిమీదను జాయింటుగా దావాచేసిగాని డిక్రిని పొందిగాని సమష్టికుటుంబాస్తిని తోడజప్తుగాని జప్తుగాని చేయించిన పిమ్మట తండ్రి యిన్సాల్వెంటు అయ్యెనేని, తండ్రిభాగము రిసీవరునందు సంక్రమించుటచే దానిని విడిచిపెట్టి కుమారుల భాగములమీద ఆటాచిమెంటు వారంటుఅమలుజరుపవచ్చును(1).

(iii) తండ్రీ యిన్సాల్వెంటు అగుటకుపూర్వముగాని దరిమిలానుగాని కుమారులు విభాగముకొరకు దావా తెచ్చినయెడల దావా తేదీనే విభాగస్థితి యేర్పడును. కావునను విభాగస్థితి యేర్పడినపిమ్మట కుమారులభాగములను తండ్రి విక్రయింపజాలడు కావునను రిసీవరుకూడ కుమారులు విభాగముకొరకు దావా తెచ్చినపిమ్మట కుమారులభాగములను విక్రయింపజాలడు. అయితే ఆవిభాగపుదావాలో రిసీవరుకూడ పార్టీగానుండునుగనుక కుమారులను బయిండుచేయునట్టి తండ్రియప్పులకు తగినయేర్పాటులను చేయుమని రిసీవరు కోరవచ్చును. లేదా ఇన్సాల్వెన్సీకోర్టులో పిటీషనుమూలముగా రిసీవరు కుమారులభాగములపైని తండ్రియప్పులకు అమలు జరుపుటకు అనుజ్ఞనిమ్మని కోరవచ్చును. తమకిష్టమున్నచో ఇన్సాల్వెన్సీకోర్టువారు కుమారులకు సమ్మనుచేసి తండ్రిచేసిన యప్పులస్వభావమునుగూర్చి విమర్శించి, కుమారులభాగము

(1). 89 ఇం. కే (బొం) 196; 180 ఇం. కే (మ) 479; 111 ఇం. కే (మ) 505; 130 ఇం. కే (మ) 479.

లను రిసీవరు అమ్మవచ్చునో లేదో నిర్ణయింపవచ్చును. లేదా రిసీవరు రుణదాతలతరఫున కుమారులమీద తండ్రియప్పులకు దావాచేసి డిక్రీనిపొంది కోర్టుతో వేలము వేయించవచ్చును. ఇంతియేగాని కుమారులు విభాగపుదావాను తెచ్చినపిమ్మట వారివిభాగములను రిసీవరు ప్రత్యేకముగా విక్రయింపకూడదు. కుమారులు విభాగపుదావా దాఖలుచేయక పూర్వము రిసీవరు కుమారులకు సమ్మనుచేసి తండ్రియప్పుల స్వభావమునుగూర్చి విచారణచేసి వారిభాగములు సదరురుణములకు బాధ్యతయగునది లేనిది నిర్ణయింపుమని ఇన్సాల్వెన్సీ కోర్టును కోరవచ్చును కాని విభాగపుదావా దాఖలైనపిమ్మట రిసీవరు కుమారులకు సమ్మనుచేసి, అట్టి విచారణచేసి, నిర్ణయించుట కధికారము లేదు(1). కుమారుల విభాగపుదావాను ఇన్సాల్వెన్సీవ్యవహారము ఫయిసలగునరకును ఆపుచేయుటకు ఇన్సాల్వెన్సీకోర్టున కధికారము లేదు(2). తండ్రిచేసినయప్పులకు కుమారుల భాగములు బయిండు అగునా? కాదా? యనుప్రశ్నను విమర్శించి తీర్మానించుటకు రిసీవరునకుగాని ఇన్సాల్వెన్సీకోర్టునకు గాని అధికారమున్నదా? లేదా? యను విషయము సంశయాస్పదముగా నున్నది. అట్టియధికారము కలదని కొన్నితీర్పులలో వ్రాయబడినదిగాని కుమారులు తమంతటతాము ఇన్సాల్వెన్సీకోర్టునకు వచ్చినచో ఆప్రశ్నను ఆకోర్టువారు విమర్శించవచ్చునుగాని కుమారులను సమ్మనుచేసి ఆప్రశ్నను విమర్శించుటకు రిసీవరునకుగాని ఇన్సాల్వెన్సీకోర్టునకుగాని అధికారములేదని మ. హై. వారి

(1). 112 ఇం. కే (మ.పు.బెం.) 541; 114 ఇం. కే (మ) 225.

(2). 188 ఇం. కే (మ) 225.

ఆఖరుతీర్పులో తీర్మానింపబడినది(1). ఆవిషయమునుగూర్చి రిసీవరు విభాగపుదావాను తెచ్చి అందులో తేల్చుకొనవలసి యుండును.

7. తండ్రియును కుమారులును సమిష్టిగానుండగా తండ్రి యిన్సాల్వెంటు అయినయెడల, కుటుంబాస్తి యంతయును తండ్రి స్వాధీనమునందున్నట్లే యెంచబడును. కావున రిసీవరు ఆయాస్తినంతను స్వాధీనముచేసికొని, తండ్రి యొక్క రుణములు కుమారులను బయిండుచేయు స్వభావముగలవైనయెడల, కుమారులభాగములను విక్రయించునట్టి యధికారము తండ్రికి కలదుకావున రిసీవరు కుటుంబముయొక్క ఆస్తినంతను విక్రయింపవచ్చునని అ. హై. వారు తీర్మానించినారు(2).

కుమారులభాగములపై రిసీవరునకుగల యధికారమెట్లుఅమలుజరుపబడవలయును.

ఆస్తి తండ్రిస్వాధీనమందుండక కుమారుల స్వాధీనమందుండె నేని, తండ్రియవిభక్తభాగమును మాత్రమే రిసీవరు విక్రయింపవచ్చును. కాని కుమారులభాగములను వారిస్వాధీనమునుండి తొలగించి రిసీవరు స్వాధీనము చేసికొనకూడదు. కుమారులభాగములు తండ్రి చేసినరుణములకు బయిండుఅయినప్పుడు ఆభాగములను మామూలు రీతిగా చర్యలుజరిపి జప్తుచేసి, విక్రయించవలసియుండునేగాని బలవంతముగా రిసీవరు స్వాధీనముచేసికొనకూడదు(3).

---

(1). 59 ఇం. కే 782; 92 ఇం. కే (మ) 249; 112 ఇం. కే (మ) 541; 118 ఇం. కే (మ) 506; 131 ఇం కే (మ) 481; 128 ఇం. కే (మ) 225.

(2). 1931 అ 59; 1931 అ 162 (పు.బెం.); 47 అ 262.

(3). 137 ఇం. కే (అ) 785; 128 ఇం. కే (లా) 286, 61;

తండ్రి యిన్సాల్వెంటుఅయినయెడల, మైనరుమెంబర్లతోసహా కుమారులభాగములమీద శిస్తులను వసూలుచేసి తండ్రియొక్క న్యాయములైనబాకీలను తీర్చుటకు రిసీవరునకు హక్కుకలదు(1).

విభాగములో తండ్రిరుణములకు తగినయేర్పాట్లు చేయని యెడల కుమారులకు వచ్చినభాగములపైని తండ్రియప్పులకుగాను వేరుగ దావాచేయునక్కర లేకుండ రిసీవరు జప్తుచేసి వేలంవేయించ వచ్చును(2).

తండ్రియొక్కయు, కుమారులయొక్కయు, భాగములను రిసీవరు విక్రయించినప్పుడు, క్రయదారు, ఇన్సాల్వెన్సీఅక్టుయొక్క 4 వ సెక్షనుప్రకారముగా ఆయాస్తిని స్వాధీనముచేసికొనజాలడు కోర్టులో దావాతెచ్చి ఆయాస్తిని స్వాధీనము చేసికొనవలసియుండును(3).

8. పైని 5, 6, 7 పేరాలలో వ్రాయబడిన యంశములు ప్రత్యేకముగా తండ్రి, కుమారులనుగూర్చి వ్రాసినను, అవి సమష్టి కుటుంబకర్తకు కూడ అన్వయించును. ఋణముల స్వభావములో మాత్రము కొంచెము భేదమున్నది. సమష్టికుటుంబకర్త చేసినరుణములకు తక్కిన మెంబర్లభాగములు బయిండుఅగుటకు అవి, సమష్టికుటుంబముయొక్క న్యాయములైన యవసరములకొరకు చేయబడినవై యుండవలయును. తండ్రిరుణములు అశాస్త్రీయములును దుర్వ్యవర్తనకొరకు చేయబడినవి కాకపోయినచో సమష్టికుటుంబముకొరకే కాకుండ తనసొంతముకొరకు చేసినను అవియన్నియును కుమారులభాగములపైని

కర్తకును తండ్రికిని గలభేదము.

(1). 189 ఇం. కే (మ) 888.

(2) 1931 అ. (పు. బొం.) 512.

(3). 51 మ 567.

బయింపు అగును. ఇంతియేభేదముగాని తక్కినవిషయములలో తండ్రికిని కర్తకును భేదము లేదని గ్రహింపవలయును.

కుటుంబవర్తకమునకు అప్పులను చేసి కర్త యిన్సాల్వెంటు అయినయెడల, అట్టిరుణములకు మైనర్లభాగములతో సహా కుటుంబాస్తిని విక్రయించుటకు కర్తకధికారము కలదు. కావున ఆయధికారము రిసీవరునకును సంక్రమించును(1).

9. కర్తగాని, తండ్రిగాని, యిన్సాల్వెంటు అయినచో, యితర మెంబర్లయొక్క లేక కుమారులయొక్క భాగములను విక్రయించుటకు వారికిగల అధికారము కూడ రిసీవరునకు సంక్రమించునని పైని వ్రాయబడినది. ఆ యధికారమును రిసీవరు ఉపయోగించకుండగనే యిన్సాల్వెంటు చనిపోయినచో ఆయధికారము రిసీవరునకు పోవునా? అను విషయము ఆలోచింపబడి, ప్రావిన్షియల్ యిన్సాల్వెన్సీ అక్టుయొక్క 17 వ శెక్షనుప్రకారము ఇన్సాల్వెంటు చనిపోయినను ఆయధికారము రిసీవరునుండి తొలగిపోదని తీర్మానింపబడినది(2). ఇన్సాల్వెంటు చనిపోయినప్పుడు, అదివరకు విభాగము కాకపోయినను, చనిపోయినవానిభాగము రిసీవరునందే యుండునుగాని మృతశేషత్వధర్మముచే కుటుంబమెంబర్లలో లీనము కానేరదు(3).

(ఇన్సాల్వెంటు చనిపోయినచో, రిసీవరుయొక్క అధికారము పోవునా?)

(1). 114 ఇం. కే (మ) 345.

(2). 97 ఇం. కే (మ. ఫు. బెం.) 825; 185 ఇం. కే (లా) 217; 4 లా. లా. జ. 262; 7 బొం 438.

(3). 7 బొం 438.

10. తండ్రిచేసిన రుణములకు తండ్రియొక్క స్వార్జితమును, సమష్టికుటుంబాస్తియును మాత్రమే బాధ్యతకలవి యగును కాని, కుమారులసొంతయాస్తిపైని గాని, కుమారులమీాద గాని బాధ్యత యుండదు అందుచే, తండ్రిచేసిన రుణములకు కుమారులు ఇన్సాల్వెంట్లుకాజాలరు(1).

ఇతరవిషయములు.

ఇన్సాల్వెంటు అగుటకు పూర్వము సమష్టికుటుంబాస్తిలాలోచీగా వినియోగముచేసినయెడల దానిని రిసీవరు రద్దుచేయింపవచ్చును(2).

Note:—ఇన్సాల్వెన్సీవిషయములను పూర్ణముగా తెలుపుట కీగ్రంథముద్దేశింపబడలేదు. కావున ఆవిషయమునుగూర్చి ఈ ప్రకరణమున సంపూర్ణముగా వివరింపబడలేదు. అందుచే తక్కిన విషయములకు ఆయాక్టులనగ్రాలు చూడవలయును.

---

(1). 61 మ. లా. జ. 518.

(2). 35 ఇం. కే (మ) 918.

# పదియవ ప్రకరణము.

## సంసృష్టి—(Re-union.)

1. ఒకసారి విభాగమైనపిదప, ఆమొంబర్లందరును గాని, అందు కొందరు గాని, మరల సమష్టిగా నుండుటకేర్పరచుకొనిరేని అది సంసృష్టి యనబడును అట్లేర్పరచుకొనినవారు సంసృష్టులనబడుదురు. సమష్టికుటుంబమొంబర్లకు ఎట్టి హక్కుబాధ్యతలు, ధర్మములు ఉండునో అవి అన్నియు సంసృష్టులకు వర్తింపవు. అందు కొన్ని మాత్రమే వర్తించును. సంసృష్టికి ప్రధానలక్షణము అదివరకు విభాగమయియుండుటయును, మరల సమష్టిగా నుండుటయు నైయున్నది. సంసృష్టులయొక్క కుమారులు తండ్రులతో కలసియున్నంతమాత్రమున సంసృష్టులు కారు.

సంసృష్టి యన నేమి?

2. సంసృష్టివిషయమున స్మృతివచనము లివి:—

సంసృష్టివిషయమున స్మృతివచనములు.

"సంసృష్టినస్తు సంసృష్టీ సోదరస్యతు సోదరః।
దద్యా దపహరే చ్చాంశం జాతస్యచ మృతస్యచ॥
అన్యోదర్యస్తు సంసృష్టీ నాన్యోదర్యోధనం హరేత్
అసంసృష్ట్యపి చా దద్యాత్సంసృష్టో నాన్యమాతృజః॥

విభాగానంతరము తిరిగి విభక్తునితో కూడాచేరినవాడు చనిపోయినయెడల, అతని భాగమును అతనికి పుట్టినవానికి సంసృష్టిని పొందినవాడీయవలయును. సోదరులలో ఏకోదరుని యంశమును ఏకోదరుడు తీసికొనవలయును. భిన్నోదరుడు సంసృష్టి అయినయెడల, చనిపోయినవాని ధనమును భిన్నోదరుడు తీసికొనకూడదు. సంసృష్టి కాకపోయినను ఏకోదరుడే ఆభాగమును గ్రహింపవలయును. సంసృష్టుడయినను భిన్నోదరుడు తీసికొనరాదు. యాజ్ఞ్యవల్క్యస్మృతి.

విభక్తో యః పునః పిత్రా భ్రాత్రా వైకత్రసంస్థితః
పితృవ్యేణాథవా ప్రీత్యా స తత్సంసృష్ట ఉచ్యతే॥

ఎవడు విభక్తుడై ప్రీతిచే మరల, తండ్రితోడను సోదరులతోడను లేక పితృవ్యునితోడను కలిసియుండునో వాడు సంసృష్టుడని చెప్పబడును. బృహస్పతి.

విభక్తం ధనం పునర్మిశ్రీకృతం సంసృష్టం- తదస్యాస్తీతి సంసృష్టీ-సంసృష్టత్వం చ న యేన కేనాపి—కింతు పిత్రా భ్రాత్రా పితృవ్యేణ వా- యథాహ బృహస్పతిః—విభక్తో యః పునః పిత్రా భ్రాత్రా వైకత్ర సంస్థితః। పితృవ్యేణాథవా ప్రీత్యా స తు సంసృష్ట ఉచ్యతే॥ ఇతి—తస్య సంసృష్టినో మృతస్యాంశం భాగం విభాగకాలే అవిజ్ఞాతగర్భాయాం భార్యాయా ముత్పన్నస్య పుత్రస్య సంసృష్టీ దద్యాత్పుత్రాభావే సంసృష్ట్యేవాపహరేద్గృహ్ణీయాన్న పత్న్యాదిః- సంసృష్టినస్తు సంసృష్టీత్యస్యాపవాదమాహ-సోదరస్య తు సోదరః, సంసృష్టినస్సంసృష్టీ త్యనువర్తతే అతశ్చ సోదరస్య సంసృష్టినో మృతస్యాంశం సోదర సంసృష్టీ సంసృష్టానుజాతస్య సుతస్య దద్యాత్తదభావేఽపహరే దితి పూర్వేణ సంబంధః—ఏవంచ సోదరస్యాసోదరస్యచ సంసర్గే సోదరస్య సంసృష్టినో ధనంసోదరఏవ సంసృష్టీ గృహ్ణాతి- న భిన్నోదరసంసృష్ట్యపీతి పూర్వోక్తస్యాపవాదః॥

తా॥ పుత్రులు లేనివాడు మృతుడైనచో వానిధనమును భార్య మొదలగువారు గ్రహింపవలయు నన్నదానికపవాదమును జెప్పుచున్నాడు. విభాగమైనపిమ్మట నావిభాగించుకొన్న ద్రవ్యమును మరల గలుపుకొని యొకటిగా నాపురుషులుండువారు సంసృష్టు లనబడుదురు. ఈసంసర్గము తండ్రితోడను భ్రాతతోడను పితృవ్యునితోడను గూడునేకాని తక్కినవారితోగూడదు. అట్లు బృహస్పతి వచన

విభాగించుకొన్న ద్రవ్యమును మరల గలుపుకొన్నవారి విషయము.

మున్నది. అట్టి సంసృష్టియైనవాఁడు మృతుఁడైనపిమ్మట విభాగముచేసికొనునట్టిసమయమం దతనిభార్య గర్భిణియని తెలియకయుండినపిమ్మట గొడుకును గన్నపక్షమందా కొడుకున కతనితండ్రిభాగ మియ్యవలయును. లేనిపక్షమందు సంసృష్టియే గ్రహింపవలయును. కాని వానిభార్య కీయఁబని లేదు. సోదరులును భిన్నోదరులును సంసృష్టులైయున్నపక్షమందు వారిలో మృతుఁడైనవానియంశమును వానిసోదరుఁడు గ్రహించి పూర్వోక్తప్రకార మతనిభార్య గర్భిణియైయుండి కొడుకును గన్నపక్షమం దాకొడుకున కీయవలయును. లేనిపక్షమం దాసోదరుఁడే గ్రహింపవలయును. కాని భిన్నోదరభ్రాత సంసృష్టియైయున్నను వాఁడు గ్రహింపఁగూడదు.

ఇదానీం సంసృష్టి న్యపుత్రే స్వర్యాతే సంసృష్టినో భిన్నోదరస్య సోదరస్య వా సంసృష్టిన స్సద్భావే కస్య ధనగ్రహణ మితి వివక్షాయాం ద్వయో ర్విభజ్యగ్రహణె కారణ మాహ॥ అన్యోదర్య ఇతి॥ అన్యోదర్య స్సపత్నీభ్రాతా సంసృష్టీ ధనంహరే న్నపునర న్యోదర్యో ధనం హరేదసంసృష్టీ. అనే నాన్వయవ్యతిరేకాభ్యా మన్యోదర్యస్య సంసృష్టిత్వం ధనగ్రహణే కారణ ముక్తం. అసంసృష్టీ త్యేత దుత్తరేణాపి సంబధ్యతే అతశ్చాసంసృష్ట్యపి సంసృష్టినో ధన మాదదీత కోసా విత్యత ఆహ- సంసృష్ట ఏకోదరసంసృష్ట స్సోదర ఇతియావత్. అనే నాసంసృష్టస్యాపి సోదరస్య ధనగ్రహణే సోదరత్వం కారణ ముక్తం—సంసృష్ట ఇత్యుత్తరేణాపి సంబధ్యతే—తత్రచ సంసృష్ట స్సంసృష్టీత్యర్థః। నాన్యమాతృజః। అత్రైవకారాధ్యాహారేణ వ్యాఖ్యానం కార్యం—సంసృష్టోప్యన్యమాతృజఏవ సంసృష్టినో ధనం నాదదీతేతి-ఏవం చాసంసృష్ట్యపి చాదద్యాదిత్యపి శబ్దశ్రవణా త్సంసృష్టో నాన్యమాతృజ ఏవే త్యవధారణనియమా దసంసృష్టసోదరస్య. సంసృష్టభిన్నోదరస్యచ విభజ్య గ్రహణం కర్తవ్య మిత్యుక్తం భవతి-ద్వయోరపి

ధనగ్రహణకారణస్యైకైకస్య సద్భావా దేతదేవ సృష్టీకృతం మనునా-విభక్తా స్సహ దేవంతో విభజేరన్ పునర్య దీతి సంసృష్టవిభాగం ప్రక్రమ్య—ఏషాం జ్యేష్ఠః కనిష్ఠో వా హీ యేతాంశప్రదానతః। మ్రియే తాన్యతరో వాపి తస్య భాగో న లుప్యతే॥ సోదర్యా విభజేయు స్తం వాపి తస్య భాగో నలుప్యతే - సోదర్యా విభజే యు స్తంసమేత్య సహితా స్సమం భ్రాతరో యేచ సంసృష్టా భగిన్యశ్చ సనాభయ ఇతి వద త్తెషాం భ్రాతౄణాం సంసృష్టినాం మధ్యే జ్యేష్ఠో వా కనిష్ఠో వా మధ్యమో వాంశప్రదానతోం శప్రదానే, సార్వవిభక్తిక స్తసిః— విభాగకాల ఇతియావత్ । హీయేత తస్యాంశాద్భ్రశ్యేత ఆశ్రమాంతర పరిగ్రహేణ బ్రహ్మహత్యాదినా వా మ్రియేత వా తస్య భాగో నలుప్యతే—అతః పృథగుద్ధరణీయో నసంసృష్టిన ఏవ గృహ్ణీయు రిత్యర్థః- తస్యో ద్ధృతస్య వినియోగమాహ—సోదర్యావిభజేయు స్త మితి— తముద్ధృతభాగం సోదర్యా స్సహోదరా అసంసృష్టా అపి సమేత్య దేశాంతరగతా అపి సమాగత్య సహితా స్సంభూయ సమమన్యూనాధి కభావేన—యేచ భ్రాతరోభిన్నోదరా స్సంసృష్టా స్తేచ సనాభయో భగిన్యశ్చ విభజేయు స్సమం విభజ్య గృహ్ణీయు రితి స్పష్టార్థః॥

తా॥ సంసృష్టియైనవాడు పుత్రులు లేక మృతుడైనపక్షమందు మాఱుతల్లికొడుకు సంసృష్టిగాను సహోదరుడు సంసృష్టిగాకను యుండిరేని, వా రతనిద్రవ్యమును సరిగా బంచుకొ నవలయుననుటకు గారణమును జెప్పుచున్నాడు. మాఱుతల్లికొడుకు సంసృష్టియైనపక్షమందు భ్రాతృధనమును బొందును. గాని లేనిపక్షమందు పొందడు- ఏకోదరుడు సంసృష్టిగాకున్నను ధనమును బొందును. ఇట్లుచెప్పుటవలన భిన్నోదరునకు ధనము వచ్చుటకు సంసర్గము కారణమనియు, సోదరునకు సోదరత్వమే ధన

సంసృష్టియైయున్న భిన్నోదరుడును సంసృష్టిగాకయున్న సోదరుడును సమభాగులగుదురు.

గ్రహణకారణమనియు నేర్పడుచున్నది. సంసృష్టియైయున్న భిన్నోదరుడు తానుమాత్రమే ధనమును బొందగూడదు. ఇట్లు చెప్పుటవలన నొకని కొకనికి ధనగ్రహణకారణ మొకటొకటి యున్నదిగనుక సంసృష్టియైన భిన్నోదరుడును సంసృష్టిగానియేకోదరుడును సమముగా బంచుకొనవలయునని యేర్పడుచున్నది. ఈయంశము మనుస్మృతియందలి సంసృష్టివిభాగప్రకరణమందు తేటపడుగా జెప్పబడియున్నది అదియెట్లనిన—సంసృష్టులైనభ్రాతలలో జ్యేష్ఠుడుగాని మధ్యముడుగాని విభాగకాలమందు ఆశ్రమాంతరప్రాప్తికారణముచేతగాని బ్రహ్మహత్యాది పాతకములచేతగాని భాగమునకనర్హులై పోయినను, మృతులైనను వానిభాగమును సముదాయద్రవ్యమునుండి యెత్తి యతనిసోదరభ్రాతలును సంసృష్టులగు భిన్నోదరభ్రాతలును సహోదరులైనభగినులును సమముగా బంచుకొనవలయును. కాని సంసృష్టులగు భిన్నోదరులుమాత్రమే గ్రహింపగూడదు ఇది పుత్రపత్న్యాదులు లేనివానివిషయమని మనుస్మృతివ్యాఖ్యానమందు దెలుపబడియున్నది.

ఎవరు సంసృష్టి కావచ్చును?

3. తండ్రియును-కుమారులును; సోదరులును; పితృవ్యులును-సోదరపుత్రులును; వీరు సంసృష్టిచేసికొనుట కర్హులని బృహస్పతిస్మృతి వలన స్పష్టమగుచున్నది కాని యాజ్ఞ్యవల్క్యస్మృతియందు సంసృష్టి ఎవరితో చేయవచ్చునో నిర్ణయింపబడ లేదు. అయితే, యాజ్ఞ్యవల్క్యస్మృతికి వ్యాఖ్యానము చేయుచు మితాక్షరిలో విజ్ఞానేశ్వరుడు, బృహస్పతిస్మృతి నుదాహరించుచు పైనవ్రాసినవారుతప్ప తక్కినవారు సంసృష్టి కనర్హులని నిర్ణయించినాడు- స్మృతిచంద్రికలోను, దాయభాగములోను, మితాక్షరియభిప్రాయము నంగీకరించినారు మయూఖ, వీరమిత్రోదయ వివాదచింతామణికారులు మితాక్షరినంగీకరింపక బృహస్పతిస్మృతిలో ఉదాహరణకొరకు "పిత్రా, భ్రాత్రా, పితృవ్యేణ" అని వ్రాసి

నాడేకాని, తక్కినవారితో సంసృష్టికూడదని నిషేధించలేదనియు అందుచే మొదటివిభాగము చేసికొనినవారు, వారిలో వారికి ఎట్టిసంబంధమున్నను సంసృష్టికావచ్చుననియు అభిప్రాయపడినారు. ఈయభిప్రాయానుసారముగా ఎవరితోనైనను సంసృష్టి చేసికొనవచ్చునని కొన్నితీర్పులున్నవి(1). కాని, మదరాసు, కలకత్తా, పట్నా, లాహోరు, హైకోర్టులు తండ్రి, సోదరుడు, పితృవ్యుడు వీరలతోతప్ప తక్కినవారితో సంసృష్టిలేదని తీర్మానించిరికావున అదియే మన కనుసరణీయము(2).

మొదట విభాగముచేసికొనిన మెంబర్లకే సంసృష్టి కలదుకాని ఆవిభాగములో చేరనివారు సంసృష్టి చేసికొనరాదు(3).

సంసృష్టికి అన్యోన్యప్రేమ, ఐకమత్యమునే కారణముగాని వంశపారంపర్యత్వము, ఆస్తిసంపాదనము ప్రధానకారణము కాదు. అందుచేతనే సంసృష్టునియాస్తి ఆతనియనంతర మెవరికి చెందవలయు ననువిషయమున, మామూలు వారసత్వములో ఒక్కింతభేదమును గనపరచినారు.

4. హిందూకుటుంబము సమష్టికుటుంబమని భావన యున్నట్లే ఒకమారు విభాగమైనపిదప వారు విభక్తులనియే భావనచేయవలయునుకాని, సంసృష్టులని భావన చేయకూడదు. సంసృష్టులని యెవరు వాదించెదరో వారిమీదనే రుజువుభార ముండును. వారే ఆవిషయమును స్పష్టముగా రుజువుచేయవలయును. సంసృష్టి యెచ్చటనో అరుదు

సంసృష్టిజరిగినదని రుజువుచేయు టెట్లు ?

(1). 3 బొం. హై. 8 69; 4 బొం. హై. 8 166.

(2). 1929 పా 848; 1927 మ 1118; 62 ఇం. కే (పా) 883; 1929 పా 858; 1928 లా 147; 1924 పా 647; 50 క 768; 19 క 684; 58 క 571;

(3). 30 క 725; 35 క 721; 14 ఇం. కే. 237.

గా జరుగుచుండును కాని, సామాన్యముగా జరుగదు. అందుచే సంసృష్టివిషయమున సాక్ష్యము బలముగా నుండవలయును(1). మొదటి విభాగమునాడు రిజస్టరుఅయిన పారీఖత్తు ఉన్నప్పుడు, సంసృష్టి అయినట్లు, రిజస్టరుకాని కాగితముద్వారా రుజువుచేయరాదు(2).

సంసృష్టిఅయినట్లు రుజువుచేయుటకు పార్టీలనడుమ యగ్రిమెంటు ఉండవలయును. అగ్రిమెంటు అనగా వ్రాతపూర్వకమైనది కాదు. వ్రాతపూర్వకమున్నచో అది రిజస్టరు కాబడవలయును. వాగ్రూపకమైనయగ్రిమెంటు ఉన్నట్లు రుజువు కావలయును(3). ఆరుజువు ఎట్లుచేయవలయుననగా సంసృష్టులు అదివరకు విభాగము వలన కలిగినవిభాగస్థితిని మార్చుకొని మరల సమష్టిస్థితిలో నుండుటకు యేర్పరచుకొనిరని రుజువుచేయవలయును(4). అందుచేతనే మైనరునకు యగ్రిమెంటుచేసికొనుట కర్తతలేదు కావున మైనరుతో సంసృష్టి లేదని తీర్మానించినారు(5). విభక్తులైనమెంబర్లు తిరిగి కలసి వర్తకము చేయుట, భోజనము, దేవతాపూజ, కలసిచేయుట, గవర్నమెంటుపన్నులను కలపి చెల్లించుట, కలసిబదుళ్లుతెచ్చుట, కలసిదస్తావేజులనువ్రాయుట, వివాహాదివ్యయములను కలసిచేయుట, ఇవి చేసి

---

(1). 1927 మ 793; 1928 ప్రి. కౌ. 136; 1928 మ 1064; 1929 పా 358; 30 క (ప్రి. కౌ.) 725; 1929 అ 545; 23 ఇం. లా (మ) 824.

(2). 117 ఇం. లా. (మ) 113.

(3). 1929 అ 148; 60 ఇం. లా. 696; 1925 ప్రి. కౌ. 93;

(4). 30 క 725 (ప్రి. కౌ) 738; 74 ఇం. లా (ప్రి. కౌ.) 462; 46 ఇం. లా (పా) 529; 1927 మ 793

(5). 30 క 725.

నంతమాత్రమున సంసృష్టి అయినట్లు రుజువుచేయుటకు తగిననిదర్శ
నములుకావు(1).

5. విభక్తులైనవారు మరల సంసృష్టి యగుచో, విభాగమునకు పూర్వమున్నస్థితిలోనేయుందురు. కాని వారసత్వముువిషయమునమాత్రము విభక్తులుకాని సమష్టిమెంబర్లకును సంసృష్టులకును భేదమున్నది.

సంసృష్టివలన గలుగుఫలితమేమి?

సంసృష్టులకు మృతశేషత్వధర్మము వర్తించునా వర్తించదా అనువిషయము విచారణీయము. కలకత్తా మదరాసు హైకోర్టులు సంసృష్టులలో వారిలో వారికి మృతశేషత్వధర్మము (Law of survivorship) వర్తించునని కొన్నికేసులలో తీర్మానించియున్నారు(2). కాని, సంసృష్టులలో నొకడు చనిపోయినప్పుడు, వాని యాస్తికి సంసృష్టియైన భిన్నోదరభ్రాతయును, విభక్తుడైన ఏకోదర సోదరుడును సమానవారసులుగా పరిగణింపబడుచుండుట మొదలగు కొన్నికారణములవలన మృతశేషత్వధర్మము వర్తింపదనియు, స్మృతులకు పొరబాటుగా అర్థముతీయుటవలన అట్లు తీర్మానములైనవనియును పండిత గులాప్‌చంద్రసర్కారుశాస్త్రిగారును, దిన్షాఫర్దుంజీముల్లాగారును, తమహిందూలాగ్రంథములలో నుడివియున్నారు.

సంసృష్టులలో నొకడుచనిపోయినచో వానియాస్తికి వారసత్వమీక్రిందివిధమున వచ్చును.

---

(1). 46 ఇం. కే (పా) 529; 15 వీ. ఠ. 442; 7 వీ. ఠ. 85; 47 ఇం. కే (మ) 716; 1928 అ 640; 1928 మ 1064; 121 ఇం. కే (నా) 662; 12 క వీ. నో 687; 37 క 708; 86 ఇం. కే 122; 48 మ 254; 60 ఇం. కే (లా) 696; 68 ఇం. కే (ప్రి.కౌ.) 838; 1 లా. వీ. 877.

(2). 19 మ. లా. జ. 719, 723; 17 క 33; 20 వీ. ఠ. 197.

(1) పుత్రుడు (2) పౌత్రుడు (3) ప్రపౌత్రుడు (4) సంసృష్టులైన ఏకోదరసోదరుడు (5) సంసృష్టులైన భిన్నోదరసోదరుడును విభక్తులైయున్న ఏకోదరసోదరుడును కలసి సమానవారసులగుదురు. ఒకరు లేకపోయినచో తక్కినవారు మొత్తమున కంతకును వారసులు. (6) సంసృష్టయైనతల్లి (7) సంసృష్టుడైనతండ్రి (8) సంసృష్టుడైన ఏయితరకుటుంబమెంబరైనను (9) సంసృష్టుడుకానట్టి భిన్నోదరసోదరుడు (10) సంసృష్టకానట్టితల్లి (11) సంసృష్టుడుకానట్టితండ్రి (12) భార్య (13) కుమార్తె (14) దౌహిత్రుడు (15) సోదరి. పిమ్మట, వారసత్వము, మామూలుగానే సపిండులు సమానోదకులు బంధువులు మొదలగువారికి సంక్రమించును. బొంబాయి హైకోర్టువారు విభక్తుడైనకుమారునికంటె సంసృష్టుడైనకుమారుడు సన్నిహితవారసు అగునని భేదమును చూపియున్నారు(1) స్మృతిచంద్రికకర్త వారసత్వవిషయములో పైవచెప్పిన వరుసక్రమమును అంగీకరించుటలేదు ఆయన స్త్రీలకు భాగము నంగీకరించినవాడుకాడు కావున సంసృష్టయైన తల్లిని అంగీకరింపడు. ఆయన వరుసక్రమ మిది. (1) పుత్రుడు (2) పౌత్రుడు (3) ప్రపౌత్రుడు (4) సంసృష్టుడైన ఏకోదరసోదరుడు (5) విభక్తుడైన యేకోదరసోదరుడు (6) సంసృష్టులైన భిన్నోదరసోదరుడు (7) సంసృష్టుడైనతండ్రి లేక పితృవ్యుడు (8) విభక్తుడైన భిన్నోదరసోదరుడు (9) తండ్రి (10) తల్లి (11) సత్ప్రవర్తనగల భార్య (12) సోదరి (13) సపిండులు (14) సమానోదకులు (15) బంధువులు.

ఈ వారసత్వ మిట్లు మారిపోవుటనుగూర్చియును మృతశేషత్వధర్మమునుగూర్చియును "వారసత్వము" అనుగ్రంథములో విపులముగా చర్చింపబడునవి.

సమాప్తము.

---

(1). 22 బొం 101; See also 33 మ 377.

అమ్మకముకకు సిద్ధముగా నున్న ది-కొలదిప్రతులుమాత్రమే గలవు.

# మదరాసుసహకారసంఘములఆక్టు.

## క్రొత్తది.

Madras Co-operative Societies Act.

**200** పేజీలు. చక్కని క్యాలికో బైండు.

**1932** వ సంవత్సరములో నూతనముగా మదరాసు గవర్న మెంటువారిచే, చేయబడిన సహకార సంఘముల ఆక్టు అంతయు చక్కని తెలుంగు భాషలోనికి తర్జుమా చేయబడి ప్రతి సెక్షనునకును హైకోర్టుతీర్పులు వుదాహరణ లిచ్చుచు విపుల వ్యాఖ్యానము వ్రాయ బడెను. ఇంగ్లీషు ఆక్టుకూడ యిందు చేర్చబడెను.

ఇంతటనుంచి కో-ఆపరేటివ్ సొసైటీ లన్నియు యీఆక్టునను సరించియే తమ వ్యవహారము లన్నియు జరుపుకొనుచుండవలసి యున్నది.

ఈ ఆక్టులో 66 సెక్షనులు కలవు. ప్రాతఆక్టునకును క్రొత్త ఆక్టునకును గల భేదములను గూర్చి యిందు పీఠికలో విపులముగా వ్రాయబడెను.

" 1932 వ సంవత్సరం మదరాసు లోకలుబోర్డు ఆక్టు" ను తెలుగులోనికి భాషాంతరీకరించిన చాగంటి శేషయ్యగారు యీ ఆక్టు అనువదించిరి.

ప్రతి కో-ఆపరేటివ్ సొసైటీ ఆఫీసునకును యీగ్రంథము నిత్యమును రిఫరెన్సు నిమిత్తం కావలసినదే!

## వెల పోస్టేజీగాక రు 1-8-0 లు మాత్రమే.

# లోకలుబోర్డు,

## మాసపత్రిక.

ఇందు, పంచాయతీలకును, కో-ఆపరేటీవు సొసైటీలకును సంబంధించిన వ్యాసములు మొదలగునవి ప్రకటింపబడుచుండును.

లోకలుబోర్డులు, పంచాయతీలతో సంబంధించిన గవర్నమెంటు ఆర్డర్లు, సరిక్యులర్లు, హైకోర్టు తీర్పులు, యితరవ్యాసములు, ప్రకటింపబడుచున్నవి.

సహకారసంఘములకు సంబంధించిన నిబంధనలు ఆర్డరులు ఇతరవ్యాసములు కూడ ఇందు ప్రకటింపబడుచుండును. సొసైటీలకు సంబంధించిన రూల్సు అన్నియు యిందు తర్జుమా చేయబడి ప్రకటింపబడును హైకోర్టుతీర్పులు కూడ పొందుపరుపబడును. సొసైటీల ఆక్టులోను, రూల్సులోను, లోకలుబోర్డు ఆక్టులోను, వాటి రూల్సులోను యేయేనిమార్పులు వచ్చినయెడల వాటిని తెలుగులోనికి తర్జుమా చేసి వ్యాఖ్యానముతో ప్రకటించుచుండుము. ఇందు వ్యవహారవిషయములతో సంబంధించినసమోనాలు కూడ యివ్వబడుచుండును. ఇది సొసైటీలకును పంచాయతీలకును అత్యంతోపకారియై పరిపాలనయందు యెంతయో సహాయముచేయును. దీనిసహాయమున లోకలు బోర్డు పరిపాలనయందు లోపములు లేకుండగను, సర్‌చార్జి మొదలగువానికి లోనుగాకుండగను చేసికొనవచ్చును.

## చందా సంవత్సరమునకు 3 రూపాయలు.

"మేనేజరు"

వలయువారు:—

లోకలుబోర్డు పత్రికా కార్యాలయము,

కపిలేశ్వరపురం.

తూర్పు గోదావరిజిల్లా, అని వ్రాయవలయును.

# మావద్ద వెలకుదొరకు గ్రంథములు.

అన్నియు క్యాలికో బైండు చేయబడినవి.

1. మదరాసు లోకలుబోర్డు ఆక్టు మొదటిసంపుటము. రు 4—0—0
   (ప్రస్తుత ముద్రణలోనున్నది)
2. మదరాసు లోకలుబోర్డుల ఆక్టు రెండవ సంపుటము
   (నిబంధనలు) 2—0—0
3. మదరాసు సహకారసంఘముల ఆక్టు (క్రొత్తది) 1—8—0
4. రేఖాగణితము (Geometry) 2—0—0
5. లోకలుబోర్డు మాసపత్రిక సం॥ చందా 3—0—0
6. లోకలుబోర్డు పత్రిక మొదటిసంపుటము. 3—4—0

వలయువారు:—

మేనేజరు.

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము,



కపిలేశ్వరపురము.

తూర్పుగోదావరిజిల్లా,

అని వ్రాయవలయును